# శ్రీమద్రామాయణ కల్పవృక్షము

## యుద్ధ కాండము



విశ్వనాథ సత్యనారాయణ



This Book is Published with the financial assistance of

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

under their Scheme aid to publish relegious books.

# ఒక్కమాట

విశ్వనాథ సత్యనారాయణగారు 1895 సెప్టెంబరు 10న (అనగా మన్మథ నామ సంవత్సర భాద్రపద బహుళ షష్ఠి) కృష్ణాజిల్లా నందమూరు గ్రామంలో జన్మించారు.

1976 అక్టోబరు 18న (అనగా నలనామ సంవత్సర ఆశ్వయుజ బహుళ దశమి) పరమపదించారు. హరిత సగోత్రీకుడైన వీరి తండ్రి శోభనాద్రిగారు, తల్లి పార్వతమ్మగారు.

ఈ కల్పవృక్ష రచన 1932 ప్రాంతాలలో ప్రారంభింపబడింది. 1944లో నాటి ముక్త్యాల జమీందారుగారి ద్రవ్య సహాయంతో బాలకాండ ప్రథమ ముద్రణ అయింది. 1944 ప్రాంతాలలోనే అయోధ్యకాండ కూడా పూర్తయింది. దానిని కూడా ముక్త్యాల వారే ముద్రింపించారని వినికిడి. 1950 ప్రాంతాలలో అరణ్య, కిష్కింధకాండలు పూర్తి అయినాయి. వాటిని ఎలాగో అలాగ విశ్వనాథవారే ముద్రింపించుకో గలిగారు.

1950 నుంచి 1962 వరకు సుందర, యుద్ధకాండల రచన సాగింది. సుందరకాండ తొలిముద్రణ 1956. యుద్ధకాండ తొలిముద్రణ 1962 నవంబరు. ఇవికూడా విశ్వనాథవారు స్వయంగా ముద్రించినవే. 1970లో ఈ మహాకావ్యానికి భారతీయ జ్ఞానపీఠం వారి లక్షరూపాయల బహుమతి లభించింది.

1976లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు, విద్యామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావుగార్ల కృషి వలన ఐదవ ముద్రణకు ప్రభుత్వ సహాయం కొంత లభించింది. అప్పుడు విశ్వనాథవారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థాన కవి.

ఐదవ ముద్రణ ప్రతులు అయిపోయి చాలాకాలం అయింది. ఎంతో మంది సహృదయులు రామాయణ కల్పవృక్షం ప్రతులు కావాలి, కావాలి అని అడుగుతున్నప్పటికీ- పెరుగుతున్న ధరలకి తట్టుకోలేక ఇంత పెద్ద కావ్యాన్ని ముద్రించటానికి పూనుకోలేక పోయాము.

మా నాయనగారైన విశ్వనాథ సత్యనారాయణగారిచే "తొలుతటి జమస్ను లందరి చెలిమికాదు"గా వర్ణింపబడిన (భ్రష్టయోగి-ఖండకావ్య సంపుటి- అంకిత పద్యాలు) శ్రీ జువ్వాడి గౌతమరావుగారు ఇంతలో మాకు అండగా నిలిచారు. మరి కొంతమంది సహృదయ వదాన్యులు ద్రవ్యసంపత్తి నందించారు. వారి సహాయ సంపత్తులతో ఈ ఆరవ ముద్రణను ఆంధ్రపాఠకలోకం ముందుంచగలు గుతున్నాము. వారి పేర్లు గ్రంథముచివర ముద్రింపబడి ఉన్నవి. వారికి మేము సర్వదా కృతజ్ఞులము. వీరంతా కలిసి మాకు కల్పవృక్ష ముద్రణకు కావలసినదాని కంటే కొంత ఎక్కువే అందించారు. ఆ మిగిలినదానితో ఒక పద్యకావ్యసంపు టము, ఒక నవల కూడా అందించే ప్రయత్నం చేస్తున్నాము.

ఇది కంప్యూటర్ సాయంతో చేయబడిన ఆఫ్‌సెట్ ముద్రణ. దీనిలో సాధ్య మైనంత వరకు ముద్రాస్ఖాలిత్యాలు లేకుండావే జాగ్రత్తపడ్డాము. ఏవైనా కొన్ని ఉంటే వాటిని వచ్చే ముద్రణలో తప్పక సవరిస్తాము. పూర్వపు ముద్రణలలో లేని, ఈ ముద్రణలోఉన్న విశేషం విషయసూచిక.

రామాయణ కల్పవృక్షంపై ఇంతవరకు దాదాపు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని విశ్వ విద్యాలయాలలోను M.Philలు Ph.D.లు ఎన్నో జరిగాయి. ఇంకా అనేకం జరు గుతున్నాయి. వాటిలో కొన్ని ముద్రణ కూడా అయినాయి.

విశ్వనాథ పావనిశాస్త్రి

# ఈ గ్రంథము ఆరవ ముద్రణకు ద్రవ్యసహాయము చేసిన దాతలు

| | | |
|---|---|---|
| శ్రీ కందుకూరి శివానందమూర్తిగారు, (భీమునిపట్నము) వారిశిష్యులు | | 15,000-00 |
| * శ్రీ బి.వి.ఎస్.ఎస్. మణిగారు | మద్రాసు | 18,000-00 |

కీ. శే. జువ్వాడి చొక్కారావుగారి జ్ఞాపకార్థము

| | | |
|---|---|---|
| శ్రీ జువ్వాడి గౌతమరావుగారు | కరీంనగరము | 12,000-00 |
| శ్రీ జువ్వాడి రామేశ్వరరావుగారు | కరీంనగరము | 8,000-00 |
| శ్రీ జువ్వాడి రఘునాథరావుగారు M.D. | నిజామాబాదు | 20,000-00 |

కీ. శే. జువ్వాడి వరదరావుగారి జ్ఞాపకార్థము

| | | |
|---|---|---|
| శ్రీ జువ్వాడి హనుమంతరావుగారు | కరీంనగరము | 5,000-00 |
| శ్రీ జువ్వాడి రామచంద్రరావుగారు | కరీంనగరము | 5,000-00 |
| శ్రీ జువ్వాడి మదనమోహనరావుగారు | వరంగల్లు | 5,000-00 |

కీ. శే. జువ్వాడి తిరుమలరావుగారి జ్ఞాపకార్థము

| | | |
|---|---|---|
| శ్రీ జువ్వాడి మధుసూదనరావుగారు | కరీంనగరము | 4,000-00 |
| శ్రీ వెలచాల కొండలరావుగారు | కరీంనగరము | 4,000-00 |
| శ్రీ చీటి అయోధ్యరామరావుగారు | కరీంనగరము | 4,000-00 |
| శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | కరీంనగరము | 2,500-00 |
| శ్రీ నేదునూరి బాబూరావుగారు | కరీంనగరము | 2,400-00 |
| శ్రీ నేదునూరి మనోహరరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ నిమ్మగడ్డ రామమోహనరావుగారు | కరీంనగరము | 1,116-00 |
| శ్రీ జి. రంగాచారిగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ చీటి ముత్యంరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ ఎస్. జగన్మోహనరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీమతి మంగాదేవిగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ సిరికొండ ప్రభాకరరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ నూకలమఱ్ఱి గంగయాచారిగారు | కరీంనగరము | 2,000-00 |
| శ్రీ గంద్ర నారాయణరావుగారు | హైదరాబాదు | 1,000-00 |
| శ్రీ ఆర్. మాధవరావుగారు | హైదరాబాదు | 1,000-00 |
| శ్రీ తులా ప్రభాకరరావుగారు | హైదరాబాదు | 1,000-00 |
| శ్రీ సిరికొండ వేంకటరావుగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ ఎ. రామరాజుగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ అవటపల్లి రాధాకృష్ణమూర్తిగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ సి.హెచ్. రామచంద్రరావుగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ డి. చంద్రారెడ్డిగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ ఉప్పల వేంకటేశముగారు | సిద్దిపేట | 1,000-00 |

| | | |
|---|---|---|
| శ్రీ బి. రవీందర్ గారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ టి. పద్మనాభంగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ పొన్నాల తిరుమలరెడ్డిగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ కె. చంద్రశేఖరరావుగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ బి. రాజారెడ్డిగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ కోవెల సంపత్కుమారాచార్యగారు | వరంగల్లు | 4,000-00 |
| శ్రీ అనుమాండ్ల భూమయ్యగారు | వరంగల్లు | 1,000-00 |
| శ్రీ జి. అప్పయ్యశాస్త్రిగారు | ఖమ్మం | 1,000-00 |
| శ్రీ జనమంచి కామేశ్వరరావుగారు | రాజమండ్రి | 4,000-00 |
| శ్రీ సత్తి చంద్రారెడ్డిగారు | రాజమండ్రి | 4,000-00 |
| శ్రీ సిరిపురం పరదేశిగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ ఎఱ్ఱాప్రగడ రామకృష్ణగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ కుతపా వేంకటేశ్వరరావుగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ పెదపాటి సత్యనారాయణగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ బేతవోలు రామబ్రహ్మంగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ కత్తి నాగార్జునశ్రీ గారు | చిల్లంగి | 1,000-00 |
| శ్రీమతి జి. పుల్లమాంబగారు | గుంటూరు | 558-00 |
| * శ్రీమతి భద్రమ్మ శ్రీ మల్లినరామచంద్రరావు దంపతులు | తణుకు | 4,000-00 |
| * శ్రీమతి విజయ శ్రీ చిట్టూరిబాపినీడు దంపతులు | తణుకు | 4,000-00 |
| * శ్రీమతి యశోదాదేవి శ్రీ కరటూరు సూర్యారావుదంపతులు | బెంగుళూరు | 4,000-00 |
| * శ్రీమతి రంగనాయకమ్మ సకలానరసింహులుచెట్టిచారిటీస్ | బెంగుళూరు | 4,000-00 |
| * శ్రీ ఎం. రుక్మాంగదనాయుడుగారు | బెంగుళూరు | 1,000-00 |
| * శ్రీ ఎన్. రాజారెడ్డిగారు | బెంగుళూరు | 1,000-00 |

*కీ.శే. సీతామహాలక్ష్మి, తంగిరాల వెంకటసుబ్బావధానులుగార్ల (తణుకు) జ్ఞాపకార్థము*

| | | |
|---|---|---|
| * శ్రీ తంగిరాల సోదరులు : సోమయాజులు, వేంకటసుబ్బారావు, భాస్కరరావు, కృష్ణమూర్తిగార్లు | | 2,000-00 |
| శ్రీ తుమ్మపూడి కోటేశ్వరరావుగారు | అనంతపురం | 1,500-00 |
| శ్రీ శలాక రఘునాథశర్మగారు | అనంతపురం | 516-00 |
| శ్రీ ముక్తినూతల గురునాథరావుగారు | విజయవాడ | 4,000-00 |

** వీరు సుందరకాండ (2000 కాపీలు) ముద్రణకై ప్రత్యేకముగా సమర్పించిరి.*

# విషయ సూచిక

(అంకెలు పద్య సంఖ్యను సూచించును)

ఖరసుతుడైన మకరాక్షుని యాగమనము, రామునిచే తద్వధ 303- ఇంద్రజిత్తు మాయాసీతను వానరవీరుల సమక్షమున వధించుట, నిస్తబ్ధమైన సర్వవానరసైన్యము 368 - విభీషణుడు ఇంద్రజిత్తు మాయను విశదీకరించి నికుంభిలా క్రతురహస్యమును జెప్పుట 377 - నికుంభిలాక్రతుభంగమునకై కపిసేనలతో లక్ష్మణ, హనుమద్విభీషణుల గమనము 384- ఇంద్రజిల్లక్ష్మణుల ఘోరయుద్ధము 400 - ఇంద్రజిద్వధ, రావణుని దుఃఖకోపములు 409.

## నిస్సంశయఖండము- పుటలు 137-180

సీతాహననభావముతో నున్న రావణుని సుపార్శ్వుడు వారించుట 12 - రావణుని మూలబలము చేసిన వానరసంహారము 28 - మహాభయముతో రామునాశ్రయించిన కపిసైన్యము 43- రాముని గంధర్వాస్త్ర ప్రయోగము, దైత్యసేనా వినాశము 51 - వానరసేనయందు రావణుడు కల్పించిన మహా సంక్షోభము 99- సుగ్రీవుని చేతిలో విరూపాక్ష మహోదరుల మరణము 102- అంగదునిచే మహాపార్శ్వుని వధ 154 - రామునిపై కేగిన రావణుడు, శ్రీరామచంద్రదర్శనము 191- రామరావణ యుద్ధము 201 - లక్ష్మణుని పై రావణుని శక్తి ప్రయోగము, లక్ష్మణుని మూర్ఛ 235 - కోపించిన రాముని చూచిన రావణుని పలాయనము 247 - హనుమంతుడు ఓషధీ పర్వతము తెచ్చుట, లక్ష్మణుడు లేచుట 266 - యుద్ధమునకై రావణుని పునఃప్రవేశము 278- మాతలిఇంద్రప్రేషితమైన రథము తెచ్చుట, రాముని రథారోహణము 286 - రామరావణ యుద్ధము 292 - రాముని ధాటికాగలేక సారథి రావణుని రథమును యుద్ధభూమి నుండి తొలగించుట 336- రామునికి అగస్త్యునిచే ఆదిత్య హృదయ మంత్ర ప్రదానము 351 - యుద్ధభూమికి రావణుని పునరాగమనము, రామరావణ యుద్ధము 358- తరిగిన కొలది మొలచిన రావణుని తలలు 381- బ్రహ్మాస్త్ర ప్రయోగమునకై మాతలి సూచన 387- బ్రహ్మాస్త్ర ప్రయోగము, రావణ సంహారము 389.

## ఉపసంహరణ ఖండము - పుటలు 181-226

విభీషణుని విలాపము 6 - మండోదరి దుఃఖము 33- రాముని యాజ్ఞపై ఆంజనేయుని సీతాదర్శనము 89- రాముని పంపున విభీషణుని సీతాదేవిని రాముని సన్నిధికి తోడ్కొని వచ్చుట 112- రాముని యెదలో నుబికిన కోపము 122 - రాముని కఠినోక్తులు 127- చితిపేర్చుటకై సీతలక్ష్మణుని కోరుట, రామునికి సమాధానము 145 - సీతాదేవి యగ్నిప్రవేశము 180 - రాముని నిజస్వరూపమును దేవత లుపన్యసించుట 184- అగ్నిజ్వాలల యందు విభక్తముగా సీతాదేవి దర్శనము, కపిరాక్షసుల సంభ్రాంతి 196 - సీతను రామునికి సమర్పించిన అగ్నిదేవుడు 200 - పుష్పకముపై అయోధ్యకై పయనము 249 - కిష్కింధా ప్రవేశము 259 - పంచవటి, పర్ణశాలలోనికి ప్రవేశించి బయటికి వచ్చిన సీతాదేవి 271 - అత్రి ఆశ్రమ ప్రవేశము 275 - మార్గమును వర్ణించుచు రాముడు సీతాదేవిని చిత్రచిత్రముగా పిలిచి అనునయించుట 285 - భగీరథాశ్రమము 306 - రాముని పంపున హనుమంతుడు భరతుని వద్దకు పోవుట 315 - శ్రవణ సుఖముగా ఆంజనేయుని మాటలువిన్న భరతుడు 325 - భరద్వాజాశ్రమమునకు భరతునితో కూడి తల్లుల రాక 351 - సీతారాములకు నమస్కరించిన భరత భిక్షువు 360 - అయోధ్యాగమనము 381 - శ్రీరామ పట్టాభిషేకము 400 - జానకీదేవిచే హనుమంతునికి తనకంఠహార ప్రదానము, జనుల జయజయారావము 407 - రామరాజ్యము 409- మంగళ మహాశ్రీ 422.

# సంశయఖండము

క. శ్రీకనకకాంతి వక్షా! ప్రాకటరాజత శుభాంగ! బ్రహ్మపదార్థ
వ్యాకృతభూతతనూ! హంసాకారా! పరమహంస! హర! విశ్వేశా! 1

శా. యాదోజంతుచయంబు భీతిమెయిఁ జుట్టాగోడ నిర్మించెనా!
లే దాస్కారము దేవతావితతి రాలేదంట కీ గోడపై
నేదో పూర్వయుగాల సంస్మృతి భయం బీదైత్యు లోగుండెలోఁ
బాదుల్ కట్టుక కూరుచున్న యది యీ ప్రాకారరూపంబునన్. 2

శా. గోలాంగూలబలంబు దూఁకఁగలదున్ గోటం దువాళించుచున్
హేలాలంఘన మాచరింపఁగలదున్ హేరాళమై వార్నిధిన్
రాలే రా యుగ మన్నచోఁ గపిభుజా ప్రశ్నంబు రావచ్చునున్
జాలన్ గారణకార్యయుగ్మము యదృచ్ఛాబంధ సంబంధమై

ఉ. తోఁకలమీఁద నిల్చి యతిదూరము చూచుచు నున్నయట్టి ద
ర్వీకరరాజిచేత నతిభీకరమైన యనంతకోటి వ
ల్మీకములట్లు దైత్యుని యళిందమునం గనిపించె వానరా
నీకిని దా వనాంత ధరణీగత నిస్తరుకృత్తధారుణిన్. 4

ఉ. లే వరదంబులుం గరులు లేవు మహాయుధరాజి లేదు సే
నావలి యెత్తి వచ్చినది హాస్యరసాంబుధి ఫేనపంక్తినా
నావల దైత్యు లీ పృతన నారసి భీతి వహించు హేతువుం
గావలె, నింత హాస్యరసకంధియు రౌద్రరసాబ్ధియై చనెన్. 5

గీ. పృతనాసమాచారమతి రావణుని చేత శుకసారణులు రాక్షసులు నొకిద్ద
ఱంపింపఁబడి, వానరానీకినిన్ వానరాకాగముల నాడు చరయుచుండ
వడి విభీషణుఁడు గుర్తిడి రాఘవపదాబ్జ పీఠమందున సమర్పింపఁబడిన
మందహాసుఁడు రామచందిరుం డిద్దఱ వంచితాత్మ్మల విడిపించినంత

గీ. నరుగుదెంచి రాక్షసరాజు నవసరంబు వేచి కనిపించికొని ప్రశ్నవీక్షణంబు
పొలుచు దైత్యేశు ముందర మోకరించి యాడి రీగతి వారు బద్ధాంజలులయి. 6

క. ఒకపూఁట పట్టలే దది సకల మహాదితిజలోక సమ్రాట్టా! వా
రికి మమ్ము గుర్తుపట్టుట యకటా! జల్లింపబడితి మసురులుగాఁగన్. 7

చ. అది యొక సేనకాదు సకలావని భూధరవార్ధి వానరుల్
గుదులుగవచ్చి యేర్పడిన కూటమి, వేరికి వారె వానరుల్
పది పదివందలా వివిధ వానరజాతులు, వారిలక్షణా
లొదుగవు వీరియందు నెదియో యొక జాతిని బోలిపోవఁగన్. 8

సీ. ఆ సేనలోపల నా యనీకినిపతి వారెవ్వరనఁ జమూపతులు పృతన
దుముదారులకుఁ జూప దుముదారులును వాహినీనాథులకును గాన్పించి రంత

గణనాథు లందు లెక్కకు రాకపోయిన గుల్మనాథుల కంటికొనల వదును
సేనాముఖేశులలోనఁ దొందరఁజేసి పత్తీశులును వారు వారు తొలఁగ
గీ. బట్టబయలైన మమ్మును బట్టికొంచుఁజెలఁగి మోకాళ్ళపోట్లు మోచేతిపోట్లు
గాఁగ గడబట్టు ప్రాణాలు కలుగు మమ్ము శ్రీ విభీషణు లచట రక్షించినారు.

చ. మరి పరిదీనమూర్తి యొక మానవుముందర మమ్ముఁజూపి యి
ద్దఱ మము, వీరలిద్దఱును దైత్యకులేశ్వరు గూఢచారు లీ
యిరువుర కొక్కశిక్ష విధియింపుమునా నహి తోఁక నిల్చు నే
డ్తెఱఁ గనులందుఁబొల్చెనొక రీనియుఁ గన్పొమ భోగిభోగమై. 10

చ. గజగజలాడిపోయితిమి కన్గొని యాతని నంతలోన నీ
రజరిపువోలెఁ జల్లవడి రాముఁడు మమ్మును గొంచుఁబోయి బే
రజములు లేక యెల్ల వివరంబులు వీరికిఁ జెప్పుడంచు న
క్కజముగ దైత్యరా జెఱుఁగుగావుత మాతనిభావియంచనెన్. 11

ఆ. అతఁడు యుద్ధవేళ నతి భీకరుండును హనుమ వట్టియవ్వ డమితసాధు
వొక్కఁ డొక్క డగ్గి పుక్కిలించుచుండి రందుఁ గపులు వేలు వందలగుచు.

వ. అచట యోగ్యవేళాశ్రవులిద్దఱే, హనుమయు శ్రీరాముండును, తక్కిన యందఱు
నిత్యప్రళయమూర్తులని సేనాసర్వవార్తలాడి పతత్పక్ష్ముఁడైన దైత్యనాయకుని
నుండి వెనుక వెనుకగా నడచి వారు నిర్గమించిన. 13

క. అది రవ్వయొ మాణిక్యమొ మొదలిడి చిఱుబింబమట్లు పుల్లప్రాచీ
మృదుఫాలలంబి తరణియుఁ బొదలించిన యెఱ్ఱుపునఁగు పూసెఁ గడలికిన్. 14

సీ. రవ్వల వెలుఁగులు రావణుం డావేళ ప్రాతస్సమాయాతపవనవీచి
కా సమీహను సౌధకర్ణికోపరిభాగ సింహముఖాసనాసీనుఁడైన
మాణిక్యకాంతులు క్ష్మాసుతాపతి కోట్ల బహిరవనీధరోపరితలాన
సౌధకర్ణికయెత్తు సమమైనయెడ ససుగ్రీవుండు నాదృతగ్రావుఁడైన
గీ. అసురయురమున సుగ్రీవు నాననమున మిలమిలల్ ధగధగలుగా మెఱిసినంత
నొకరొకరుచూచుకొనిరిపర్యుత్సుకులయి యొకరొకరివంక జరత్ప్రత్యూషమతులు.

ఉ. రావణుఁ జూచినంతఁ గపిరాజున కాతని దుష్టచేష్టితం
బావిరిపొంగఁ గ్రాఁగు జలమట్లుగఁ జిత్తము పొంగులెత్తి క్రో
ధావిలదృష్టి నాదనుజు నారయుచుండియె రాముతోడ న
న్నా! విగతాసువున్ దనుజునాతనిఁ జూచితె యంచు నాడుచున్. 16

చ. అనుకొనకుండ దూఁకి చనె నంబరమార్గమునన్ సురారియుం
డిన భవనాగ్రదేశ, మశనింబలె నాతనిముందు వ్రాలి గో
ళ్ళను మొగముల్ విదల్చుచుఁ దలల్ పదిక్రొమ్ముదులూడలాగి ఱొ
మ్ము నుదరఁదాచె, హారగతముల్ రవకాంతులు బీరువోవఁగన్. 17

చ. అరయ హఠాత్సమాగతము నందున నిప్పెఱపొందు నొక్క డ
బ్బురమును బొందఁడొక్కరుఁడు, పూర్ణమహస్కుఁడు దైవతారిని
వ్వెఱ తొలిచార జాఱఁ, గపివీరుని వింశతి ఘోరబాహుపం
జరమున సింహశాబకము చాడ్పునఁ గ్రిక్కిఱియించె దట్టుఁడై. 18

చ. అది యొకచిత్రమౌ కెలస మామృగరాజు సపంజరంబుగాఁ
గదలి వియత్పదంబుచనెఁ, గ్రమ్మఱి తద్భువనోపరిప్రపా
తదశను బట్టువీడి కపిదానవు లిద్దఱు బాహుయుద్ధసం
పద మెఱయంగ, నయ్యసుర మై వ్రణముల్ కపిమై మహోశనుల్. 19

క. తుద కొక్క తన్ను దన్నుచుఁ గదలి కపీశ్వరుఁడు వచ్చె గగనాధ్వమునన్
సొదఁ గణగణలాడెన యుర్వదికనుల ననింధనాగ్నివలె ౼వణుఁడున్. 20

గీ. ఎక్కు పెట్టిన ధనువున నెక్కుడించి రాఘవుం డనంగీకృతప్రమదసూక్ష్మ
భావములుతోఁప సుగ్రీవుఁబలికెనిట్లు ఇంక నీకిట్టి సాహస మెపుడు వలదు. 21

క. మన మైత్రిభావమున కీ పనివలెనా? ప్లవంగ రాజ్యపతి యీగతి చే
యనురాద! యనినఁ గపిపతి, కనులందునఁ జిన్నతనముగా నిట్లనియెన్. 22

చ. దురితపుఁ గొండ యా దనుజు తోఁచినయంతట నీయుషస్సునం
దురువడిఁ బొంగులై పొడుచుచుండిన హృద్గత తీవ్రకోపని
ర్ఝరమును నేను బట్టుకొనఁ జాలకపోయితినంచు నాడ, సం
బరమున సూర్యుఁడుం బయికిబైకి వియత్తున నేగె నంతటన్. 23

వ. అంత మహాసేనవోని సముద్రంబునకును సముద్రంబు వోని మహాసేనకును నడుమనున్న శ్రీరామచంద్రమూర్తి పశ్చిమ సంధ్యోపాసనాంతమున నొక్క శిలాతలంబున నాసీనుండై సంజ యెఱ్ఱదనమ్ములు చివళ్ళనదిమిన సాగరవీచీకాంతిపరిణత రాజ హంస కుడికరిటిమలపుల మెలపులుగాఁ జూచి. 24

చ. ఎదకును గంటివెల్గునకు నించిన మూరితి గొన్నయించకున్
బదనగు జానకీవిరహవహ్నికి నెఱ్ఱదనాలసంజకున్
సుదతికి సీత కేమియగు చుట్టరికంబు లెసంగునో మదిం
గుదిగొని రామచంద్రుఁడును గోరిక తా నడుగన్ మరాళమున్. 25

చ. కడపటిసంజయెఱ్ఱనలు క్రమ్మిన క్రుమ్మిన వింతవెల్గువై
కడలికరళ్ళలోన నెసకంబున నేటికి నీదుచున్నదో
విడివిడి హంస మెల్లరఘువీరుని కన్గొసలం దువాళియై
బడలి శయించు నవ్విరహభావము మేల్కొలుపన్ సమర్థమై. 26

మ. బరువౌ కాలములోని యే తెలివి శోభాపూర్ణమై పశ్చిమాం
బరసంధ్యాశబలాభిరామమయి శ్యామస్వర్ణ పీతాంశు సం
భరితాంభోమహనీయరాశివయి హేమశ్రీ గరుచ్ఛ్రీ ప్రభా
హర హంసాకృతి గోచరించుటకు నేత్రాపాంగలీనాంగమై. 27

చ. ముడిచిన ఱెక్కయై నిలువఁ బోలిక శంఖముతోడ సూటిగాఁ
గడలిపయిం బ్రమాణమును గట్టిన ముమ్మొనవాలు వీచిన
ట్లొడుపునఁ బల్లటీ ల్గొన మహోదధి కార్మొయిళుల్ విదల్చిన
ట్లొడయఁడు సర్వహంసలకునొప్పె దృగంచల విద్యుదాకృతిన్. 28

శా. ముక్కున్ ఱెక్కలతోడి తెల్లనగు నిప్పంబోలెనౌ హంస మి
న్నెక్కున్, గంటికి సూటిగాఁదిరుగు, వార్ధీంద్రాంబు వీచీతతిం
జుక్కల్ చుక్కలుగాఁగఁ గాల విదలించున్, మూఁదలించున్ దిశా
స్రక్కాంతుల్ విలసజ్జపాంశుక గరుచ్ఛన్నార్ద్రి చంద్రాంశువై. 29

శా. లంకాపట్టణ దీర్ఘికావిహరణాలంకారమో! హంస, మీ
నాంకప్రాణహరానలోజ్జ్వల శిఖాహంకార సౌందర్య రే
ఖాంకంబై కనిపించుచున్న యది యాహా! మిశ్రభావంబుగా
సంకేతింపగ వచ్చునో రఘుకులస్వచ్ఛేందు దేవేరికిన్. 30

వ. రఘుకుల రాజహంసమగు శ్రీరామచంద్రున కీ కనిపించు రాజ హంసము తన వియోగభావనాజనిత వాంఛాస్వరూపమో, తన కన్ను చెదరుటయో, యథార్థ మైన హంసయో, బహిరాకృతి కలదియో, యేమియుఁదెలియక తెలియమియం దొక విలక్షణానుభవలాలన కలిమి నిట్లనియె. 31

శా. స్వామీ! హంసకులావతంసమ! ధరాజాతావియోగ వ్యథన్
నామై యెంత కృశించెనో కనవె, సంధ్యాకాల నాట్యక్రియా
సామీచీన్య మనోజ్ఞ పాదయుగళీ సంలగ్న హేమచ్ఛవీ!
ప్రేమన్ నిల్చి యొకింత నా మనవి దారింబూని పాలింపవే! 32

గీ. కపివృషాకపి భూకన్యకాప్రవృత్తి తెలిసికొనివచ్చి కడచెను నెలకుఁబైని
నయ్యశోకవనంబున యందుఁ గలదొ శోకవనమున జొచ్చెనో సుదతి యెఱుఁగ.

మ. అనుపృత్పద్మదళాంతవర్తివిని హంసాధ్యక్ష! తచ్ఛుభ్ర మా
నససంచారివి, పోవఁగాఁదగవె మింటం, గంటఁ గన్నీరు వె
క్కసమై జార్చుచు నుండియుండు జనకక్ష్మాజాత, నే నింత వా
ర్ధి, సతింగూఱిచి దాటివచ్చుటయుగాఁ దెల్పంగదే చానకున్. 34

గీ. పొడుచుకొనివచ్చు బాణము పోల్కిగాఁగ ముక్కుదీపింప మిక్కిలియెక్కుపెట్టు
శార్ఙమొ పినాకమో నాగఁజూచినట్టి ఱెక్కదోయిగ మింటఁ జరింపఁబోవె. 35

ఉ. తామర లన్న నీవలపుదారికి దారియుఁ దెన్నులేదు, పొం
దామర యామెమోము, తెలితామర యాయమకన్నుదోయి, చెం
దామర యామె కేలుగవ, తామరలన్ మఱలన్ జయించుఁ గాం
తామరవాహినీ వికచతామమరసంబులు నామె కన్‌జిగుల్. 36

ఉ. విప్పెసలారు మోముపయి వేలుపువాహిని యెత్తియొందు బొ
ట్టొప్పగ స్నానమున్ సలిపి యొద్దున నట్టిటు తిర్గుచున్ జరీ
కుప్పడమంచు ధోవతిని గొంగులువారఁగ నారఁబట్టు నే
గొప్పద్విజుండ వొక్కొయిటకుం జనుదెంచితి మత్సఖుండవై. 36

చ. తనయెఱడాలుచేత జలదంబులయంచులు ముద్రింతబులై
చన నిరువైపులందు మలుసంజయినుం డరుణాభిరామమో
హన వదనుండుగాఁ జనినయట్టులు వచ్చితి వెందునుండి నా
జనకజ కొక్కవార్త హరుసంబు ఘటిల్లగఁ జెప్పివెట్టవే. 38

ఉ. బంగరునీరువోలిన కృపారసమున్ బయినుండి క్రిందికిం
బొంగులువారి జారిపడిపోవు తెఱంగున తెక్కలంచులం
దుంగరముల్ ఘటించికొనియున్నది యీభవదీయరూప మా
ర్తిం గొనియున్నవారి నరుదెండని పిల్చుచు నున్న వైఖరిన్. 39

శా. కార్యార్థిం గలిపించి చెప్పదు ననంగాఁ గాదు, మున్నెప్పుడో
భార్యాయుక్తముగాగ నిన్ బరిచరింపం గన్నయట్లొప్పెదున్
మర్యాదాప్రియమైన నాయెడఁద హంసా! యెప్పుడేనీ హిమా
హార్యప్రాంతమునుండి యేగుచు నయోధ్యాప్రాంతమందాగితే. 40

చ. ఎఱ మలుసంజవెల్గు లవి యెక్కిన మై సగమైన నీవ యి
ద్దఱివలెఁగానిపింతువుగదా యట్మైఁ బ్రియురాలుక్రుమ్మెనాన్
గరితకు వార్త పుచ్చుటకుఁగాని భవాదృశుఁగంటయన్న న
బ్బురమునకంటె నబ్బురము పొందిన సంగతి రాజహంసమా! 41

మ. వలనొప్పన్ దుదిఱెక్కమల్పులుగ నీపైనుండి యేతెంచుగా
లులు కర్పూరపరీమళాంబువులలో లోలంబులై వచ్చున
ట్టులు మైతాఁకెడువేళ గుప్పు మను, గండూషించితో యట్టి నీ
ళ్ళులు లేదా యభిషేక మార్చితివొ స్వర్లోకాగురుస్రోతసిన్. 42

క. ఓయయ్య హంసరాజా! డాయఁగవచ్చిన వశిష్ఠుఁడవు కావుగదా!
నాయెదలో నొక మధురిమ యాయన డగ్గరిన యప్పు డైనట్లయ్యెన్. 43

శా. నాకాఠిన్యము నామె మెత్తనయు నో నాళీకనాళాద! యీ
నీకున్ నీవు వశిష్ఠుఁడైన యెడలన్ నిక్కంబెఱుంగంగనో
నే కాదా, జలరాశి సేనఁగొని నా యీ రాక వాక్రువ్వనో
లేకున్నన్ సతి యేమి యౌనో మఱిరాలేదంచు నీపాటికిన్. 44

ఉ. ఇమ్ముగఁ జూడలేదు నిను నెప్పుడు వే డిగినావొ యంతరి
క్షమ్మునుండి చూచు నిముసంబునఁ దోచితి బొండుమల్లిపు
ష్పమ్మన నొక్కఁడే తొలుతఁజూచిన తెక్కవిదిర్చి తంతలో
ముమ్మరమౌచుఁ దెల్లవిసెపూ విడఁజారిన రేకవోలికన్. 45

చ. నగసుతవంటి జానకికి నాథుఁడనయ్యును భూమిజాత హం
సగమనయంచు నేను ననఁజాలను నిన్నును జూచినంత, హం
సగమనయాత్మలక్షణ వశంవదవృత్తి నటంచు నెంచెదన్
దొగరులకంజిగుల్ గలుగు తొయ్యలి నాదగు వార్తచెప్పవే! 46

ఉ. ఈ జగదేకమోహన మహేశ్వరసుందరరూప మెంత యు
త్తేజితభావనాపటిమఁ దెచ్చితి వబ్బురమయ్యె, నేత్రనీ
రాజనభూతమైనది, ధరాసుతకంటెకి శాంతితేవె! యు
ద్వేజితమయ్యెఁ దన్నయనదీప్తి మృషామృగదర్శనంబుచే. 47

శా. నిన్నేతాదృశ శుభ్రహంసము గనన్ నీరేజపత్రాక్షి సం
పన్నంబుల్ గుణరాశి చెప్పటకునున్ వా క్కాడకుండెన్ సుధా
స్విన్నాకారుని నిన్నుఁగాంచి ప్రమద శ్రీ పొందుటో! యీ సమా
సన్నంబైచను దుఃఖసంగతిఁ బ్రియాసందేశమున్ విన్నటో! 48

మ. సగముల్ వెన్నెల లార సాగరతటీసౌందర్యతాత్పర్య మొ
ప్పగ వాహ్యాళి చరింప వచ్చితివొ! యీ వార్తాహరత్వంబు నేఁ
దగిలింపన్ బెకలించుకోకుము, కృపాతాత్పర్య మేపార మె
చ్చుగ నెవ్వాఁడిల వేళ కక్కఱకు వచ్చున్ వాఁడె చుట్టంబగున్.

ఉ. పోలగ నీకు నాదరము పుట్టగ శ్రీమిథిలాపురీంద్రభూ
పాలురగేహసంతతిని భామిని పేరిమి యాడుబిడ్డయం
చా లలనామణిం గుఱిచి యాడెద, నాడెద లోన బ్రహ్మవి
ద్భీలముచేతనే నను వశీకృతునిం బొనరించుకొన్నదిన్. 50

ఉ. సఖ్యము లోకమందునను సాప్తపదీన మటందు, రార్తిమ
త్ప్రఖ్యుని నన్ను స్వీకృతికిఁ బట్టుము స్వాకృతి యోగ్యమైనటుల్
ముఖ్యముగాఁగ నొక్కటియె పోయి వచింపవలెన్ మదాగతిన్
లేఖ్యముగాఁగ బంపునది లేదొక పెద్దగ వేఱయేమియున్. 51

ఉ. సొగెను వెన్నెలల్ రుచి విశాలము లార్ద్రిసుధా ప్రవాహముల్
భోగి మహేంద్రమౌళి మణిపుంజ వినిర్గతకాంతిపుంజముల్
మూఁగిన గాంగవారి చిఱుబోదెలు చేలకు మళ్ళినట్లు హం
సీ గరుదంత చాలన విచిత్రములౌ సుషమా పరంపరల్. 52

ఉ. రింగులుగాఁగ హంస విహరించెను మింటను బల్లటీలుగా
బంగరుపూలు తాపినది పళ్లెము వెండిది త్రిప్పినట్లుగా

నింగికి గ్రొత్తయందమును నింపుచుఁ బోయినయంత మేరయున్
గంగయుఁ గ్రొత్తపాయ యొసకంబుగఁ దీయుచు నుర్వ్వెలెత్తుచున్.

గీ. దూరమునకు నేదైన, నాకారమునను స్వల్పమై కానిపించు, హంస ప్రభుండు
దూరసామీప్యముల కొక్కతీరుగాఁగ నవఘళించె నేకాకారమగుచు నెదకు. 54

ఉ. నిక్కపు వెండిచేఁతయును నిర్మితచంచువు కెంపుముక్కయున్
ఱెక్కలపైడిపూఁత యమరించిన చొక్కపు హంసబొమ్మ తా
నొక్కఁడు ప్రాణవంతమయి యుప్పరమందున నేగుచుండె న
మ్మక్క యటంచుఁ జూచిరి మహాసురసౌధగతల్ లతాతనుల్. 55

శా. ఆవేళన్ దశకంధరుండు నిజసౌధాగ్రంబునన్ వార్ధి వీ
చీ వాయుప్రియభావనామతి తటస్థించెన్ గపీశాన దం
ష్ట్రా విష్వఙ్నఖఘాత సంగత శరీరస్వల్ప బాధాపనో
దావిర్భూతమనస్కుఁడౌచుఁ గృతసంధ్యాశ్రీజపాంతంబునన్. 56

ఉ. మిక్కిలి యెత్తు స్వీయమగుమేడ తదగ్రమునందు నిల్చినన్
తక్కువ యెత్తులోఁగలుగు దారలమేడల మీది కామినుల్
చిత్తములందు వ్యగ్రతను జెందుచు నేదియొ చూచుచున్న వా
రత్తఱి ముందుఁ దోచిరి మహాసురధారుణి చక్రవర్తికిన్. 57

మ. చెలువల్ చూచుచునున్న యక్కెలనజూచెన్ మింట హంసన్ సము
జ్జ్వల చంద్రాతపవాహినీసువిలసత్ స్వచ్ఛారవిందంబునాన్
జలజాతాన్వయ రాఘవేశ్వర తపస్సాఫల్య సంజాత మం
జుల పూర్ణామృతకుంభ మాకసమునం జూపట్టునా నత్తఱిన్. 58

చ. నలువుగఁ బైడికట్టుగల నాఁగలి వెండిదిపూని సన్నమి
న్నుల నువుచేను దున్నుకొనునో యను వెన్నెలకాఁపునాగ, ము
క్కలుగను నేలగడ్డ విఱుగన్ దెలిమన్ను వెలారినట్లు మ
బ్బులపొర లొప్పగా గగనభూమిని హంస చరింపనయ్యెడిన్. 59

చ. మునుకొని యాకసంబనెడి బూడిదగుమ్మడిపాదు దిక్కులం
దునఁ గొనసాగి పూ వదలెనో పువురేక తుదళ్ళఁ దేంట్లు నె
ఱ్ఱని మధువల్ల ఱెక్కలను బ్రామగ వ్రాలి చరించుచుండగా
ననఁగను హంస మింటనడయాడగ దైత్యమహేంద్రుఁ డుగ్రతన్.

గీ. సురవిరోధి నిదానించి చూచి చూచి యవునుగాదని మది నిర్ణయంబు లేక
కేవలము కోపగుణసమాకృష్టుఁ డగుచు దానిలోనమ్మఁజాలక తన్నుఁదాను. 61

ఉ. యత్నముచేతఁ బ్రాంతభవనాగ్రవిహారిణి నొక్కకామినీ
రత్నముఁ దర్జనిం బిలచి రాజతహంస మఱెందునుండి యీ
నూత్నపు రాకనా నది కనుంగొని వానరరాట్చ్ఛమూదిశన్
రత్నకరాంగుళీయక భరంబుగఁ దర్జనివంచి చూపినన్. 62

శా. ఈర్ష్యాక్రోధవశంవదుం డసురలోకేశుండు సోపానముల్
వర్ష్యంభోదము లీల డిగ్గి చని దేవాగారమున్ బ్రహ్మబ్ర
హ్మర్ష్యంతస్స్థితు వానిఁ గానకయ మూర్ధాకంప మేపార సా
మర్ష్యాస్యంబున కోపనిర్మితసభామధ్యంబునం దేగఁగాన్. 63

వ. రావణుండును నిముస మందుఁ గూర్చుండి తద్గృహద్వార సగర్వ్యుండును మహా మాయావియు నైన విద్యున్మాలివంక రెండు నిమేషము లేకాగ్రదృష్టితోఁ జూచి యేదో నిర్ణయించుకొని వానితో నేను సీతాదర్శనమునకై పోవుచున్నాను. రామలక్ష్మణులిద్దఱును వధింపఁబడిరి. వారి శిరస్సులును వారి ధనుస్సులును దీసికొని రమ్మని యశోకవనం బేగి, యచట ముఖంబంతయు నిరవధి కానందభ రితంబుగాఁ జేసికొని వేత్రహస్తుని వేత్రంబుగైగొని దానిని దక్షిణకక్షయందుంచి ప్రాలి వ్యత్యస్తపాదుండు సీతతో నిట్లనియె. 64

శా. సీతా! నీకొకమాట చెప్పుటకు వచ్చెన్ రావణుండంబుజ
స్ఫీతాంతచ్ఛవిమద్భ్రశాంత! సుషమాదిబ్బోక వారాన్నిధీ!
పాతివ్రత్యహిమాచలా! జటి, భవద్భర్తాత్రిఖ్యుఁ డీసాగర
స్రోతోమార్గము లెల్ల దాఁటి కపివీరుల్ తాను నేతెంచెనే. 65

ఉ. కోఁతులు వేలు లక్షలును గోట్లును రా, నిట నిప్పుపెట్టి నా
కోఁతియు దోడవచ్చెఁజుమి, గోఁతియటంచును జూపి విడ్చితిన్
దూతయటన్న వ్యాజ మిడి తోఁకొని రావలె వానినంచుఁ దా
నాతనిఁదెచ్చెనే దలచినట్లుగ దైవము మెచ్చునట్లుగన్.

ఉ. కోఁతుల తోఁకపట్టుకొని గోలగ నీపతి వార్ధి యీఁది యా
కోఁతులతోడ నాదయిన కోటను ముట్టడివేసెనే సతీ!
యీ తెలివేమి చెప్పవలె! నక్కట తామర తూండ్లతోడ మై
పోతర మేచు మత్తగజమున్ గొన నెంచిన తెల్వి జానకీ! 67

ఉ. కోఁతులు తాండవింతు మనుకొంచును వేసెను గుప్పిగంతులం
బ్రీతిని బొంది మా యసురవీరులు నవ్వుచుఁ జూచుచుండగాఁ
గోఁతులు రాలు రువ్వి రది గొప్పమహాహవ మన్నయట్లుగన్
బ్రీతిగ నట్లె వారి బులిపించిరి దైత్యులు యుద్ధమట్లుగాన్. 68

ఉ. కోఁతుల పేశి యుస్తి పరుగుంబలెఁ జేదయి యుప్పుకారముల్
చేతను షడ్రసంబులను జేదొకఁడౌ గద రుచ్యమంచు ద
ర్పీతతి వడ్డనన్ జెరిగెఁ బెట్టిన మాంసపు టూరగాయ ని
ర్ఘాతము పుట్టె వానరనికాయమునందున రాముపేరుగన్. 69

మ. అకటా! దానికి నేమిలే, విమలపద్మాంతస్స్థ మారందబిం
దుకసంతానమనోజ్ఞ బాష్పజలబిందూ! లేళ్ళ వేటాడఁజె

క్కఁక బాణంబులు కానఁద్రుంచికొని పోఁగాలమ్ముకాకేమి పా
తికవీరుం డిటఁ గోట లగ్గలకు నెత్తెన్ వచ్చి దుర్బుద్ధియై. 70

ఉ. కోడిగమైనటుల్ పొగడికోలగు నాదగు పెద్దబిడ్డయు
న్నా డతడింద్రజిత్తతని నామము, వాఁడు మహేంద్రునాజి వే
టాడెను, దిక్కుచూపిన బలారిని రెక్కలుగట్టి బిండికిం
గాడిని గట్టి తోలెఁ గుడిగాఁ గొరడా నిడి మోము చిట్లగన్. 71

మ. తనయెత్తున్ దివిషద్విరోధుల ద్విషత్స్వంతాన మెత్తుం గనుం
గొనకే యేమిది యెత్తివచ్చుట మఱిం గోతుల్ బలం బెన్న నా
కును నీభర్తయటంచు జాలి మది గల్గుం గల్గదా? యింద్రజి
త్తున కేమున్నది? యుద్ధరంగముల మృత్యుక్రూరుఁడా వీరుఁడై.

ఉ. కేళి మహాహవంబనినఁ గేవల మాతనియందె నిక్కమౌ
గోళము లాటబంతులుగ గూటు వియత్తునయందు సర్వ పా
తాళభుజంగరాజు లరుదారగ వానికి నస్త్రసంతతుల్
గేలికి నైరి, నీ మఱఁదికిం బతికిన్ దుది వచ్చినంతటన్. 73

వ. మహానాగాస్త్రముల వారిని దీర్ఘనిద్రపుచ్చి యేమనవలె నని, విద్యున్మాలి వంకఁగాంచి, యవి తెచ్చి చూపింపు మనిన నతఁడు మాయానిర్మితములు రక్తప్లావితములు తచ్ఛిరశ్శర శరాసనములు తెచ్చి సీత ముందిడిన నామె యావులించి సద్యోమూర్ఛితయయి కొంతసేపటికిఁ దెలివితెచ్చుకొని యొడ ల్కదలించి.74

క. ఇది యొక సంవత్సరమైనది నా కీ మాయక్రమ్మునాళ్ళులు మొదలై
మది కదియించుక యెంతగ విదలించినఁ దిరిగి దిరిగి విరియించుకొనెన్ 75

మ. ఇది మాయాపరికల్పితం బవున, వాఁడెవ్వాడు తానింద్రజి
త్పదవాచ్యుండు రఘుప్రవీరుల ధనుర్బాణంబులం బుచ్చికో?
నిది ముల్లోకము బూదికాదుగద, వాఁడెవ్వాఁడు క్రొవ్విడియౌ
ప్రదరంబుల్ పరగించి రాఘవుల నీ ప్రాంతానికిం దేరఁగా. 76

ఉ. నేరను దీని నమ్మఁగను, నీ రిగురంగను లేద, యగ్గి చ
ల్లారద, గాలి యాగద, మహాసురసంతతి ప్రాణవంత, మిం
పారెడు నాదు ప్రాణములు నాడెడు, శ్రీరఘుపుంగవుల్ మహా
వీరుల కిద్ది వట్టి కలిపించిన యాపద వేఱ యెట్లగున్. 77

క. అయ్యో! నా కన్నీరిది ముయ్యేఱునకైన నెండిపోవుట కలదున్
ప్రయ్యం ద్రవ్విన సగరుల గొయ్యి యయిన నిగిరి యావిగొని మిన్నరుగున్.78

శా. అగ్రంబందున బంధువుల్ నిలచినట్లై తోచినన్ సీత, వృ
క్షాగ్రంబందున తెక్కలార్చికొని హంసాధ్యక్షుఁ డేతెంచి వి

ష్వగ్రాగాక్షుల జానకీముఖదిదృక్షాపూర్తిఁ గూర్చుండె, శ్రీ
దృగ్గమ్యాంశువు లారఁ గాంచెను ధరిత్రీజాత హంసాధిపున్. 79

గీ. కూడిమున్న హనుమ కూర్చున్న చోటనే కోరి హంస వచ్చి కూరుచుండె
హంసఁ గాంచినంత నవనీజ గుండెలో నమృతకుల్య యుబ్బినట్లు తోచె. 80

మ. తనమో మద్దమునందు దోచెనన మోదంబెంత! తానంచునెం
చిన యే వస్తువొ చెట్టుకొమ్మవయి తోచెన్నా మహానంద మొ
ప్పెను, వృక్షంబున హంసనాయకుఁడు కన్పింపన్ ధరాజాత మె
చ్చిన చిత్తాబ్జము వందరేకులను విచ్చెన్ మాధుబిందుచ్యుతిన్.

మ. విమలంబౌ పరిమోదమై నుదురుపై వ్రేలాడు రత్నంబు ర
త్నముక్రిందం దనచిత్కళంబొలుచు ముక్తామూర్తియై తాన్ రఘూ
త్తముడౌ ఫాలమనోజ్ఞ కాంతికి సహాధ్యాయంబుగాఁ బొల్చు చి
త్తముతోఁ జానకి పొల్చె హంసచరితోద్యన్మాత్మచైతన్యయై.

మ. జనకక్ష్మాపతికూఁతు చిత్తమున హంసంగాంచుచో, హంస వ
చ్చెను శ్రీరాఘువువద్దనుండి యని తెచ్చెన్ వార్తయంచూహతో
చెను భావంబున, నూహతో సరిగదోచెన్ సర్వవార్తా నిరూ
పణముల్ మోహనశబ్ద సంఘటన సంబంధామృతాసారమై. 83

ఉ. నూతన పారిజాతకతనూ! కపిరాజ చమూసమేతుఁడై
బ్రాతిగసాగరాంబు పరివాహ సమూహముదాఁటి వచ్చితిన్
క్రోఁతులు కారు వీ రసురకోటి మహాసునవాంగణాతిథి
వ్రాతఫణుల్ పరాక్రమ పరాభవ దత్యయకాలవార్నిధుల్. 84

ఉ. ఓ గరితా! పరాక్రమ పయోనిధి వానరరాజు దక్షిణా
సాగరలంఘనోన్నత విశాల పరాక్రమ వారిరాశి క
ల్పాగము వచ్చి నీ దయిన వార్తను దెచ్చెను, నేను వచ్చితిన్
సాగసుఁడైన రక్కసుని ప్రాణములందునఁ గూరుచుండితిన్. 85

ఉ. ఓ మెలఁతా! త్రివిక్రమమహో మహిమాన్వితుఁడైన యట్టి శా
ఖామృగవీరసంచయశిఖా పరిదీప్తుడు వాయుసూతి చూ
డామణి యిచ్చెఁ గన్నులకడారపు వెల్గులతోడ వచ్చితిన్
క్షేమముకోలుపోవఁగ మషీకృతబుద్ధికి దైత్యవృద్ధికిన్. 86

ఉ. ఓ జనకక్షమాపతిక్రతూర్వి సముద్భవమైనరత్నమా!
భ్రాజిత కల్పభూజుఁ డపరాజితతేజుఁడు వాఁడు బాష్పధా
రాజితవార్ధి నీ యసుభరంబగు దుస్థితి చెప్పె, వచ్చితిన్
దేజము వెన్కపట్టినయదిన్ సకలాసురవీరకోటికిన్. 87

ఉ. ఈ విరహాగ్ని చేతఁ గృశియించిన దేహముతోడ వచ్చితిన్
ద్రోవయలేని సీదయినదుఃఖము ముందర నా వియోగ బా
ధావచనంబు లాడుటయుఁ దప్పని దోసము, నేను వచ్చితిన్
ద్రోవయు విచ్చికొన్నయది దుఃఖపుఁగాలము పోయెనే సఖీ! 88

చ. తడఁబడి దొంగసొమ్ము మఱి దాఁచగనేరక చేయిజారి పో
యెడుతఱి దుర్జనుండు తనకెట్లును దక్కదు, సొంతదారుడున్
జెడుగతిఁ బాడుపెట్టుటకుఁజేయుఁ బ్రయత్నములన్, హృషీకముల్
కడుకొని బిగ్గపట్టుకొనఁగావలె నుగ్గము కట్టినట్లుగన్. 89

గీ. అపుడు కపిరాజవరమేశుఁ డిపుడుహంస ప్రాపణము గాంచఁగ బరస్పర ప్రవృత్తి
ఇంతశుభహేతువుండునటే లతాంగి కపివృషాకపు లటునిటుఁ గాంచియుంట.

వ. అంత విద్యున్మాలికృతమాయాశిరశ్శరశరాసనములు నియతవేళాతీతంబుగాఁ బెట్టి నచోటునం దంతర్ధానంబు పొందుట రావణుండును జూచెను.సీతయుఁ గాంచెను. మఱియు రావణుండు వికావిక నగి యిట్లనియె. 91

శా. మాయంబొల్చెను మాయమయ్యెనుమరి న్మస్తంబులున్ విండ్లునున్
దోయేజాంచిత చారువక్త్రసుషమాధూః కంపితాకేకరా!
నీ యచ్చోటిది ప్రేమలోఁతు తెలియన్ నేఁజేసితిన్ నిశ్చయం
బాయెన్ దానిస్వరూప మంత తనుమధ్యా! ప్రేమరథ్యామతీ! 92

చ. నిజముగఁ బ్రేమ వానియెడ నీకును గల్గెనయేని, కృత్తమై
గజిబిజియైన వానిదగు కంఠము మస్తము చూచి మాయయో
నిజమొ యటన్న యూహయు జనించునో చూచినయంతఁ బ్రాణముల్
విజయముచేయుఁగాక సురవీథులకున్ మధురాంగమంజరీ! 93

మ. తొలుతన్ మూర్ఛనుగన్న హేతువునఁ జేతోవీథి నవ్వానిపైఁ
గలదంచెంచితిఁ గొంతప్రేమ, మఱలం గైకొన్న తెల్విన్ ధరా
తలజీవావలి శేషభోగపరిభోక్తల్ ప్రాణమున్ దేహవీ
థుల మళ్ళించఁదలంతు రాస్యవిజితేందూ! స్పష్టమైపొల్చెడిన్. 94

శా. ఈ మాత్రంబగు భోగవాంఛ కలదేనీ యుద్ధరంగంబునన్
రాముం జంపెద నీవు నావశమునన్ రా, నాత్మలో నున్న నీ
కామక్లిన్నము జీవలక్షణపరిష్కారంబు పర్యాప్తమౌ
రాముం జంపెదు నిశ్చయంబు సుఖధారాబుద్ధిఁగల్పించుచున్. 95

ఉ. మానసమందు లజ్జవడి క్ష్మాసుతచూచెను హంసదిక్కునన్
జానకిలో నదొక్క నిముసంబున గాఢసమాధిపొల్చినన్
దా నల యీశ్వరేశ్వరియుఁ దాను సనాతని యంచుఁ దోచినన్
జానికిదేవి క్రీఁబెదవి చాయలఁ జిర్నగ వంకురించినన్. 96

ఉ. ఆ చిఱునవ్వు నవ్వినయట్టులులే దతిలోక మోహనం
బై చెలువారు మోహనత యన్న దలౌకికమై సురారిదృ
గ్గోచులు మందగించినవి, గుండియ యాగినయట్టులై త్రియా
మా చర సార్వభౌమునకు మానస మంతయుఁ గోపమై చనెన్. 97

ఉ. అంతకు నైన కారణము హంసగఁ దోచెను వానిబ్బుద్ధికిన్
బ్రాంత కుజాగ్రశాఖపయి వ్రాలిన హంసము నెంచి దుఃఖిత
స్వాంతుఁడు కోపవంతుఁడును బట్టఁగరాని నిగూఢభక్తిసం
క్రాంతిబహిఃక్రుధాపరిసరంబుగ నూహ పొనర్చె నీగతిన్. 98

ఆ. తనకుఁబోలెఁ దలలు తఱిగియిచ్చినవాఁడు సృష్టి మొదలుమొదలు చివరిదాఁక
కానరాఁడు తన్నుఁగాదని యెవనినో తన్నుఁబోలు జోగి నెన్నుకొనియె. 99

ఆ. అయినవారి కేమొ యాకులయందునఁ గానివారికైనఁ గంచములను
ఇంటిలోనఁ దించు నింటివాసంబుల లెక్కపెట్టు నట్టి లెక్కగాఁగ.

శా. ప్రాగల్భ్యం బెసలార రత్నమువలెన్ రాజోపచారంబుగా
సాగింపన్, సుఖమొప్పగా ననుభవించన్ లేక మిన్నేగె, బై
రాగిం బోలుచుఁ దొంటిలక్షణము మారంబోద, బంగారమున్
మైఁగప్పన్ దొడుగంచు లోపలి శిలామాలిన్య మెం దేగెడిన్. 101

గీ. మఱియు నేమియెఱుంగని మాదిరిగనె యరిగికూర్చుండుఁ బూజాగృహంబునందు
తలతఱిగియీయఁ దలఁక డుత్తమము లింగకాయ బెల్లముకొట్టినరాయివోలె. 102

శా. నాకంబెన్ మునుపైన భక్తుఁడటె యీ నాళీకబంధ్వన్వయుం
డాఁకొన్నాడు శివుండు దంపతులమధ్యన్ వార్త లందింపంగా
క్ష్మాకన్యాపతి యింతదాఁకను బహిశ్శత్రుండె యీనాఁటి కిం
దాఁకన్ వచ్చినయంతఁ గన్పడియె నంతశ్శత్రుతాస్థానమై. 103

వ. అర్పఁబడి నిర్గతధూమంబులైన కాగడాలవలె నిర్గతనిద్రములైన కన్నులతో రావ
ణుండు నిశయంతయుఁ గడపి స్నానంబుచేసి శివ పూజచేసి యున్నంత నెలనాళ్ళ
క్రింద హనుమంతునిచే వధింపఁ బడిన తనకొడు కక్షనికుమారుండైదేండ్ల వానిని
వానితల్లి చంకనెత్తికొని వచ్చి వానిచేతిలోని రాజతహంసంబు మామగారి కిప్పించి.

గీ. నిన్నఁ బిల్లవాఁడు నిభృతక్రియుండయి పూజయింటిలోనఁ బోయి తెచ్చెఁ
తాతగారు కోపధారియంచుం జెప్పె తిరిగి యిమ్మనంగఁ దెచ్చె ననియె. 105

మ. తనప్రాణంబులు లేచివచ్చినవి దైత్యస్వామికిన్ ముద్దుమ
న్మని వే చంకను గొంచుఁ జుంబనవిధామత్తుండు తా హంస ని
చ్చెను గ్రీడామయమైన వస్తువుగ నా చిన్నారి పొన్నారికిన్
మనుమండున్ దన తాత ముద్దిడుకొనెన్ మత్తాననార్ధాక్షుడై. 106

వ. అంత లంకాకోట్టప్రాకార మధ్యస్థితము స్తంభాకృతియు మహోన్నతంబు నయిన పర్వతంబు నధిరోహించి రావణుండు దుర్గ దక్షిణ పశ్చిమ ప్రాగ్దిశలయందుఁ దిలకించి కనుచూపుమేర దాటేఁయున్న వానరసేనం గాంచి ప్రక్కనున్న సారణునితో నీసేన పరిమాణం బెంత యనిన సారణుఁడు శతసహస్రములశతము కోటి, కోటిసహస్రములశతకము బృందము, తచ్ఛతము మహోబృంధము, మహో బృంద సహస్రశతకము పద్మము, తచ్ఛతము మహోపద్మము, తచ్ఛతము ఖర్వము, తచ్ఛతము మహోఖర్వము, తచ్ఛతము సముద్రము, మఱల సముద్రసహస్రశతము ఓఘము, మఱల నాలెక్కనే మహౌఘము, కోటిసహస్రశతశంఖములు ఒక మహోశంఖసహస్రము, బృందశతము మహోబృందసహస్రము పద్మశతము మహోపద్మసహస్రము ఖర్వశతము సముద్రశతము నొక్క మహోఘము, ఇట్టికోటి మహోఘము లీసేన యనిన రావణుండు. 107

చ. తెఱచినయట్టు లుత్తరపుదిక్కున వారిధి యెంతయుండెనో
తెఱచినయట్లు దక్షిణపు దిక్కున వాహిని యంతయుండెఁబో
విఱుచుకుతిన్ననైనఁ కపివీరుల నెందరు తిందురాశరుల్
పఱచుకయుండె నంత కపివాహిని చంపను రానియట్లుగా. 108

మ. తనరన్ దివ్యమహోస్త్రసంతతుల చేతన్ దీని దగ్ధంబు చే
సినఁ గాఁ కీ కపిసేన సేనయుగ నిర్జింపంగ సాధ్యంబు గా
దని రక్షఃపతి సారణుంగని దురూహంబైన యీ లెక్కవా
రినిగా కిందున లెక్క పెట్టఁగలవారిం జెప్పుమా నావుడున్. 109

మధ్యాక్కఱలు.
మందారుణచ్ఛవిమత్తమాలక మహిజంబు నెడమఁ
గ్రింద నొక్కరుఁడు కూర్చుండి, కెలన వంగి యొకండు, వారు
మైందుండు ద్వివిదుఁ డిద్దఱును, మఱియు బ్రహ్మప్రాప్తవరులు
నిందురేఖామృతప్రాశు లెసఁగు శౌర్యేందిరాఖనులు. 110

అమర నాయిద్దఱ ప్రక్క నాసీనులై యున్నవారు
సుముఖుండు నసుముఖుం డనియు శూరు లక్షోభ్యవిక్రములు
యమసుతుల్ వారు దుర్దాంతమైన కోపావర్తమతులు
యముఁడు వారికిని దోడాచు నాడెదు ననవరతమ్ము. 111

పెద్దగుమ్మము నెట్టయెదుటి భీషణ విగ్రహుఁ డతఁడు
మద్దినా నిలచినవాడు మహితనామమున నీలుండు
తద్ద కట్టుక చేతులు మినుదాఁటు సత్త్వము గలవాఁడు
గద్దింపుతో శత్రుకోటి కాలాగగా నీనివాఁడు. 112

అంగదుఁ డా ప్రక్కనిల్చినట్టి తాలాభదేహుండు
చుంగులా జూలును గోల్పుచువ్వ మైసొబగును నింగి

ముంగిఁబెట్టిన కంబముంబోని పొడుగరి యతఁడు
సంగత కీశసేనాప్రచాలన సర్వాధిపతియు. 113

అక్కటా! వాలి తనూజుఁ డాతఁ డహంకారమూర్తి
యుక్కివుండును వాలి ముక్కునుండి తా నూడిపడె ననఁ
బొక్కక నాలుగు సంద్రములందు మున్కలువెట్ట
నొక్కజామునఁ జాలువాడు నుగ్రబాహుఁడు నిర్భయుండు. 114

నెక్కొని పినతండ్రిమీఁద నిక్కిన నెయ్యమ్ముకాక
చిక్కని శ్రీరాముమేని చెలువు వశీకృతికాద
దక్కియుండదు గాదె కీశధాత్రి దరణిసూనునకు
నొక్కఁడు వాఁడు దిక్కుల మహోగ్రుఁడంహోదళనుండు. 115

అరఁగా నాతని కెడము నందున్న యాతఁడే నలుఁడు
ధారుణీధ్రములు తత్కరముఁతాఁకినం దప్పలై పోవు
నీరధిపైఁ దేలు సేతు నిర్మితినిపుణుఁ డాతండు
కోలుపోవు బరువు గిరులు కూల్పఁగా ఘోరశత్రువుల. 116

కుముదుఁ డన్నాతఁ డా కెలన గోమతీకూలంబులందు
నమరు సంకోచనపర్వతాగ్ర మహారణ్యసమితి
నమరు వానరజాతి రాజు నాపర్వతారణ్యములును
భ్రమదనేకానేకపముల పట్టు దుర్బాగమ్యంపుగట్టు. 117

కుముదుఁడు పదివేల యేన్గుగున్నల గుంపుగాఁ గట్టి
యమరంగ నీడ్వఁగా గలిగినంత బాహాబలాంభోధి
కమరిన నల్లని మొగము కనులగ్నిఖండముల్ కోపి
యముఁ డెట్టయెదురుగా నిల్చునట్టుండు నాతనిఁ గనిన. 118

కెరలి వింజము సహ్యకృష్ణగిరులను గ్రీడించు ఘోర
తర వానరానీకినికి నతండు నేతయుఁ, బేరు రంభు
డురుతర బాహుశాలియు భుజోర్వీధరోపత్యకాభుఁ
డరయ లంకాపురీదాహ మగ్నులా నక్షులవాఁడు. 119

చెవులు మాటికి బూరటిల్ల జేసెడుఁ జిన్నవిచేయు
నవుర పెన్మత్తుచే నెల్లయప్పుడు నావులించెడిని
తవులగ సాల్వేయపర్వతంబు నిత్యనివాసభూమి
యవువాఁడు శరభుఁ డన్వాడు హరిలోక హర్యక్షమూర్తి. 120

బలిసి విహారులన్ యూథప్రశ్రేణి వాని నిచ్చలును
గొలుచుచుందురు లయకాలఘోరాంతకులు వారుగాని
కలఁచును శరభుండు కుంభకర్ణునిగతి రిపుల
మెలఁకువ నిచ్చలు కలఁడు మృత్యువు మేల్కొన్నయట్లు. 121

మిన్నులందున శ్రావణమున మేఘమ్ము మిగిలినయట్టి
తెన్నున నాకృతిచేత దీప్తవర్ధిత గర్జచేతఁ
గన్నాకు పనసుఁ డన్వాఁడు గంధోగ్ర గజరాజమూర్తి
మన్నిడు పారియాత్రగిరి మాద్యద్భ్రమత్కపితతికి. 122

అల తోఁచు వినతుఁడు కడలియంతటి యతి బలశాలి
యల క్రోధనుండును గవయుఁ డాప్రక్కనాప్రక్కవారు
నలసి యుందఱు నొక్కకోటకై యెత్త ననవసరంబు
బలి యొక్కఁడొక్కఁడు చాలు వాఁడును వాఁడును వాఁడు. 123

హరుఁడును ధూమ్రుండు నన్న యట్టివా రా ఋక్షపతులు
గిరులు చైతన్యమ్ముతాల్చు క్రీడాప్రకృష్ట దోర్బలులు
పరగించుమీ దృష్టి తేనెపట్టులు పట్టె నాకసము
ధర వ్రాలునన్నట్లు ఋక్షతతి సముద్రమువోలెఁ దోచు. 124

జటిలుఁడా ధూమ్రునకు ననుజాతుఁడా జాంబవంతుండు
కటిక బలమువాఁడు కృతయుగంబునఁ గడగిన యసుర
ఘటలయు సురబలములయు కయ్యాన ఘటలపై గిరులు
ఘటియించి చంపినవాఁడు కదల దుగ్రమహాహవముల. 125

అతని జయింపనురాద యతనిని హరియింపరాద
జతనుగాఁ దప్పకపోకఁ స్వప్రాణ సంత్రాణపథము
అతని మోఁకాట మున్నొక్కయద్రి ముల్లై తూరి విరిగె
గతి మందగించె, నిప్పటికి గగనచంక్రమణంబు సేయు. 126

మును వామనుఁడు మేను పెంచి ముల్లోకములు నాక్రమింప
ననిచి యాతఁడు మూఁడు చేసిన ప్రదక్షిణములుగాఁ దిరిగె
నని చెప్పెదురు, మించివచ్చినప్పుడే యాతఁడు కదలు
నని, వాఁడు కదలిన నచటి కచ్చట నాఱిపోవుటయె. 127

అతల నున్న కీశచము వారయు మతఁడు దంభుండు
పేతపక్షునివోలె సతము విహరించు వియదగ్రమందు
భూతలంబునయందుఁ దిరుగఁబోవఁడు పురుహూతసఖుఁడు
యాత మాయాతమ్ము నిరత మతనికి నాకలోకమ్ము. 128

ఎన్ని వేని నదేపనిగ వీక్షింతొ యావు దైత్యేశ
సన్నాదుఁ డనువాఁడు చండదోశ్శాలి దుశ్శీలి
మిన్నున ధర యోజనంబుమేర గ్రుమ్మిన యొక్కయంగఁ
యన్నిర్భరాతివేగునకు నద్భుతాహవదోహలునకు 129

ఒక్క గంధర్వికి నగ్ని కుదయించె నురుబాహు వితఁడు
దిక్కుంభికుంభాగ్ర నఖవిదీర్ణ మౌక్తికవిలోచనుఁడు

మొక్కలుం డీతనితోడఁ బొడిచి గెల్చుకొనందు శక్రుఁ
డక్కడ దేవదానవమహాయుద్ధ మప్పటివాఁడు.

క్రోధనుండును బ్రమాధియును గొప గవాక్షుండు ముప్వురును
ప్రోధమ్ము లెత్తి మిన్నెల్ల మూర్కొనుపోలిక గలర
సాధువిక్రము లొక్కఁ డొకడు చండకీశపృతనాపతులు
సాధింప వచ్చి రిట జలజాప్తవంశవధువు కొఱకు.

ఆయన కేసరి శాంతమైనట్టి యాకార మెంత
యాయెనో పైకిని లోననంత వీరావేశమూర్తి
యాయన హనుమంతు తండ్రి, హనుమంతుఁ డన మన యూర
వే యగ్గిమంటలు పెట్టి విరియించి వెళ్లినవాఁడు.

ఆయన రాజ్యమైనట్టి యద్రియందతి శాంతిపరులు
శ్రీయుతుల్ మౌనిరాజి నివసింతురు సిద్ధులు వ్రతులు
నాయెడ శంబసాదనసమాఖ్య దైత్యస్వామి యగడు
చేయగా నీయన బూదిచేసెను జెట్టను వాని.

శతవలి యనువాఁడు కీశశతకోటిసైన్యాగ్రయాయి
వితతసూర్యోపాసనా నవీనధీవిభవ దోశ్శాలి
అతనిది యుత్తరపర్వతాగ్ర మహారణ్యసమితి
సతతవాసము సేన యన నుషర్బుధోచ్చలశిఖాపటలి. 1

ఉ. కోరిన స్వర్గ దేశమును గూఁకటిప్రేళ్ళను బెల్లంగింపగా
నేరుతు రీ కపిప్రతతి నేరరు పైష్ణవభావభావులై
వీరులు వీరలందరు త్రివిష్టపసఖ్యులు లంకముంగిటం
జేరిరి నీకృతం బగుచుఁ జెందిన మృత్యువు కోరునట్లుగన్. 1

ఉ. కుశలులు గాఁగ ప్రాల్పొడుపుకొండలమధ్యను దక్షిణోత్తరా
దిశలయు మధ్యమన్ నిఖిలదేశములందలి కీశరాజిక
ర్కశులయి సూర్యసూతి కరిగాపులు తా నికఁ సూర్యసూతి క
ర్కశతమ బాహుసంగతపరాక్రమ మేమని చెప్పవచ్చునో. 1

గీ.అతని కన్యాయ్యనిమనితోచినపుడు వానియొడలు వానికిఁదెలియద యుగ్రమూ
అపుడతని వేఁడు చేసెడునదియులేదు అతడుచిరజీవి పరమరామాభిమాని. 1

గీ. ఇంద తొకయెత్తు, తానొక్కఁ డింటిగుట్టు లంకకుం జేటఁటన్న దీలాగనఁ
బలముచే బుద్ధిబలముచే బ్రబలుఁడై విభీషణుఁడు వారిదిక్కునఁ బేర్చినాడు.

సీ. ఓమహారాజ! యాసౌమిత్రివంక నిదానించి పరికించినాను గాని
యతని స్వరూపంబె యవగతి కాలేద వ్యర్థంబుగా మాటలాడఁ డొకఁడు
కనులతో వెలిఁజూచుఁ గరవాలములు వేయి ధగధగలాడిన పగిది నుండు
కనులులోన మలంచుఁ గాలాహి లొకవేయి పడగలు ముడిచిన పగిది నుండు

గీ. నాతఁ డన్నగారి కస్త్రశస్త్రములందు ప్రేలెఁ డట్టు నిట్టు వెలయునంద్రు
ఒక్కసారి నన్ను నూఁగి కన్గొనినాఁడు నాకు మేన నహాలు ప్రాఁకినట్లు. 139

వ. తక్కినవార లిద్దఱు హనూమంతుఁడును రామచంద్రుఁడు నని యూరకుండిన రావణుండు సారణునిఁ బంపించి కపిసేనాపతులయు సేనలయు నాలోచనం బడి. 140

చ. గెలుచుట యెట్లునుం గృతయుగీనుల దుర్ఘటకార్య మౌన గా
సిలి వధియించు టెట్లు చిరజీవుల వారిని, వారి గడ్డుపో
రుల నలయించి దూరముగఁ ద్రోలను వచ్చున యింతసేన లం
కలఁబడి యేమిమేయుఁ బయిఁగాలిన డొక్కలనావటిల్లెడున్. 141

శా. గడ్డుల్ క్రోఁతులు వచ్చె ముట్టడికి లంకాకోట్టనుండె యుద
న్వడ్డిండీరము మేయునో నదుల శైవాలంబు ఖాదించునో
చెడ్డన్ యుద్ధమునందు రాఘవులు, దాసేరుల్ కపిశ్రేణి యీ
గడ్డంబట్టుక ప్రేలుచుండునొకొ రక్షశ్రేణిఖాద్యంబులై. 142

చ. పరమశివుండు వీనికయి భామకు మాటను జేర్చు టేలొకో
యరయ నితండు మానిసియొ యంతకుమించి యెవండొ యౌనొ ని
ర్భరము తపంబు చేసెనొ పురాబహుజన్మములందుఁ జంద్రశే
ఖరుని గుఱించి, యట్లయినఁ గానలు రాడు నిరీశ్వరత్వమై. 143

ఉ. ఇంద్రజి మాయయుద్ధమున నిద్దఱి నిద్దుర ముంప తేవటన్
సాంద్రనవారుణప్రభలు సాగిన తూరుపువేళ వానరుల్
సంద్రమునందు దూఁకెదరొ చత్తురొ కట్టినవంతెనం బడిన్
మంద్రవినిస్వనంబులను మ్రందెదరో వెఱియొడ్డు చేరకన్. 144

ఉ. నావని నేను బోయి రఘునాయక నీయెలనాగఁ దెచ్చితిన్
నాపొరపాటు సైపుమనినన్ రఘువంశనవామృతాంశుచూ
డావరముండు నన్నును గటాక్షమునం గనునంట, లేనిచో
నావయి యగ్గి యంపరలు నాటెడు వాటెడుగడ్డిపోలికన్. 145

మ. తనపేరన్ గపిలోకమంతయును దగ్ధంబైన నీ కట్టువం
తెన తానొక్క పతాకగా నిలుచు కీర్తిస్ఫోరకం బైనటుల్
వనితల్ లేరె జగాన వేరొకరు? తావచ్చెన్ మహాసేన, వ
చ్చిన యీసేన కపుల్, నృపుల్ వినినచో సిగ్గాటయుం దోచదో.

మ. ఎవఁడో భార్యను దొంగిలించిచనె, వాఁడెవ్వాఁడొఁ మూర్ఖుండుకా
క వనీచారిచమూసమేతుఁడు మహాకంధిన్ శిలాబంధనో
గ్రవిధిన్ జూన గ్రహింప వచ్చెడిని, వర్షం బన్యగేహస్థితన్
నవలాఁ గైకొనిపోయి యుంచికొను నింటన్ గంటఁగన్నీరుగా. 147

మ. అతఁడీ రావణు గెల్చినా డనెడి కీర్త్యాశాసమానన్నదు
ర్మతి యా హైహయుఁజంపె భార్గవుఁడు, నారామున్ మఱీరాముఁడూ
ర్జితుఁడై యుద్ధముకాని యుద్ధమున గెల్చెన్, హైహయుండైనదో
ర్గతి నన్మించెను, వీఁడుమించునను నౌరా! లెక్కగాడెంతయున్.

ఉ. హైహయుఁడైన యర్జునుని యంతిపురంబున నొక్కచిత్రమౌ
మోహముచేతఁ గట్టుబడిపోయితి నాయతి లేక బుద్ధిలో
బాహుబలంబుచేతఁ గొఱవడ్డటు వాడుకపుట్టె, దానికై
యీ హరిసేన తెచ్చికొనె సీతఁడు, వాడుకమాట మోసమై. 149

చ. పరగ నెవండొ నేన భగవంతుడఁ బుట్టితి నంచుఁ జెప్ప, న
బ్బురముగ నెందఱో చెదలుపుట్ట సదా భజనల్ పొనర్చుచుం
దురు, దురుపాధి వానికిని దోచును దా భగవంతుఁ డైనటుల్
హరహర! లోకమెంత తనయంతటఁ దాఁ గికురించుకోనగున్. 150

చ. తనకును దిక్కలేక యవతారము తాల్చునటో హరింపఁగా
దనుజుల, నేనుగా మొదలిద్వారమునందలి యున్నగుబ్బలం
దునఁ బెను చంద్రహాసమున దూసిన, పాసిన చెక్కసందులం
గనుగొని గోచిగాండ్రు భయకంపితు లైనది యేమియైనదో! 151

ఉ. మొల్లముగాఁగ నౌ విజయముంబలెఁc గోఁతులుచేరి యూరిలో
నల్లరి చేయుఁగాన జతురంతకవాటములందుఁ గావుగా
మల్లడిలేమి చూచికొని మానవనాయక బాలకద్వయిుం
గిల్లినఁ దేలిపోవు నిది గేలిగ ముట్టడికాని ముట్టడై. 152

వ. అంత రావణుండు మంత్రులతో మంత్రంబు నెఱపి తనకోట యొక్క ప్రాగ్ద్వా
రంబునఁ బ్రహస్తుని దక్షిణద్వారంబున మహా పార్శ్వమహోదరులను బశ్చిమ
ద్వారంబున మహామాయావియు లంకానగర సర్వవీరకార్య భారవాహియునైన
యింద్రజిత్తును రక్షకులుగా నియమించి. 153

క. ఉత్తరమున నే నున్నా నత్తాపసి కలఁడు, సాగరావలిత పృష
న్నృత్తాయః కింకిణిరవ మత్తత కలదంచు ధైర్యమందరగిరియై. 154

క. ఈ మూఁగిన కపిసైన్యం బాముకొనిన యొక్క పగటియాహవముది, రే
పేమో మోముల గోముల రాముల సోములను రాహు గ్రమ్మినయదియున్.

వ. అంత విభీషణసచివసమానీత లంకానగరకోట్ట చతుర్ద్వార దృఢపరిరక్షానిబంధశ్రవ
ణసంజాతధాటీ సమాటీకనావ్యగ్రబుద్ధి యయిన శ్రీరామచంద్రుండు తానుగాక
ముప్వురిం దనంత వారిని నీలాంగదహనూమంతులను బ్రాగ్దక్షిణ పశ్చిమ ద్వార
భేదన చమూసమూహపతులుగా నిర్ణయించి. 156

క. ఉత్తరమున నే నున్నా నత్తరుణీహర్త గలఁడ యంబుధి నురువుల్
మిత్తివెలికి నువ్వులగమి పొత్తులు పొత్తులుగ మింటఁబోవుత మంచున్. 157

ఉ. చిత్తజు పూవుపొత్తులను జిక్కిన మేనున దైత్యబాణపుం
బొత్తులనెంచి యూరకయు పొంగిన మేనున ధర్మరూపమౌ
చిత్తముతోడ రాఘవుఁడు శ్రీమహితాకృతి, దైత్యపాలికిం
బుత్త మటంచు నెంచెఁ గపిపుంగవు నంగదు రాయబారిగన్. 158

శా. తత్కాలాన సమంత్రియై సభను దైత్యస్వామి తీర్పంగనై
సీత్కారంబున మింటినుండి దిగి కొంచెమ్మైన దూరాన బా
హూత్కోచుండయి యంగదుండుచని వారొక్కండు నొక్కండు చం
చత్కోపానను లై కనుంగొన నుదంచన్మూర్తియై యిట్లనెన్.

క. దైతేయేశ్వర! రఘుపతి దూతను, నానామ మంగదుఁడు రఘుపతియున్
నీతోఁజెప్పగ సంగర నీతి ననుసరించి పంచె నీదెస నన్నున్. 160

ఉ. దొంగతనంబుగా నిటకు దొయ్యలిఁ దెచ్చిన నీకు—నెంచగా
సంగరనీతిపద్ధతికిఁ జాలినయోగ్యత లేదుగాని యీ
ముంగిలి నిల్చి దుర్గమును ముట్టడి వేసిన నాకు యుద్ధనీ
తిం గొని నీకుఁ గార్యపుగతిన్ వచియించుట ధర్మమైచనున్.

మ. ఎగచెన్ నన్నును, నావిభీషణునికై యిచ్చెన్ ధరారాజ్య, మన్
బెగడుం బొందుచుఁ గర్మసాగుతతి నీ ప్రేతంబు దుఃఖింపకుం
డగ నాలింపుము, దైత్యరాజ్యరమసానాథ్యంబు తానొందుఁ బొం
దుగ ధర్మాభిరతిన్ విభీషణునియందున్ మద్వచఃక్షప్తిచే. 162

శా. త్వాదృగ్దుర్జనశేఖరుండు హితముం బాలింపఁడట్లయ్యు వ్యా
పాదింపంగ సపుత్రబాంధవముగానై నిన్ను నేతెంచి నే
నీదృఙ్నీతిపథంబు సేయమియుఁ గాదే నిట్టులై సేఁత మ
ర్యాదామార్గములందు రక్షణము సేయన్ ధర్మమైయొప్పటన్. 163

ఉ. ఇప్పుడు వచ్చి నీదుసతి నిచ్చెద నన్ను క్షమింపు మంచునుం
జెప్పిన నేను బోరు విరచించక ముట్టడి నెత్తివేసి పో
నొప్పుదు నంచుఁ జెప్పుటయుఁ నూరక చెప్పుట, నీవు రావు, రా
నప్పుడు రావటం చెఱిఁగి యాడుట యూరక నాల్కయాడుటే.

క. దైవాధీనము విజయము, దైవం బన వేఱలేదు ధర్మము న్యాయం
బేవో పూజలఁదనిసెడి దైవం బొక ధర్మబుద్ధి తాల్పించుటకై. 165

మ. ఇవి రామోక్తులు, నింతదూరముగ నే నేతెంచి యేమైనఁ జె
ప్పవలెన్, వాయుసుతుండు నాగురువు చెప్పం జేయఁగా నేర్పనీ
యవివేకంబున కబ్బురం బొదవు దైత్యా! తల్లికిం దండ్రికిన్
వ్యవధానంబు ఘటించినాఁడవుగదయ్యా యొక్క యేడాదిగన్.

ఉ. కాదని నీ వెఱుంగు దనగల్గిన లక్షణ ముండె నీకు మం
డోదరివంటి దేవికి ననుంగుమగండవు, భర్తృసువ్రతా
పాదకలక్షణంబులను బ్రత్యహముంగనుచుండి నేర వన్
వాదన నెట్లు చేయవలెఁ బండితుఁడై మొఱకైన యట్లుగన్. 167

ఉ. నీవలనన్ విభీషణుఁడు నిర్గతుఁడై రఘురాముఁ జేరె సు
గ్రీవుఁడు నన్నగారిని హరించెను, రెండును లోకదృష్టికిన్
గావలమైన పాపములుగాఁ గనిపించును గాని ప్రాపకం
బై వెలయున్ రఘూత్తముఁడటన్నది తా నఘహారియౌఁజుమీ.

ఉ. నీ వది చేసినా వనుచు నీ విది చేసితటంచు గొప్ప కా
నీ, వెస నేగుదెంచిన కపీంద్రులయందు నొకండొకండు నీ
ప్రేవులు తీసికొంచు మెడ ప్రేలను వేసికొనంగలండుసూ
రావణ! నే నెఱుంగ రఘురాముఁ డదేటికొ యింతసేయుటల్.

ఆ. వినుచురావణుండు వీనితండ్రిని జంప వాఁడు నాకు సాధ్యపడనె లేదు.
వానిబదులు వీని వధియింతు నంచును నతనిఁ జంప భటుల కాజ్ఞయిచ్చె.170

ఉ.క్రచ్చఱ నంగదుండు భయకంపితుఁడైనటు వారిఁ బట్టుకో
నిచ్చి సభా బహిష్పథము నీడిచి యంత వియత్ప్రదేశవే
గోచ్చలదాత్మదేహుఁడయి యుప్పరమందున వారికంఠముల్
వ్రచ్చి ధరన్ బడన్ విసరి వార్షుకఘోరవలాహకక్రియన్. 171

ఆ. ఉఱిమి నేనెవండ నోరి పంక్తిగళా! కపీశ్వరుండు వాలి యింద్రసుతుఁడు
నీ వెఱింగినట్లె నిర్భరబలశాలి యతని యాత్మజుండ నది యెఱుఁగవా? 172

మ. అరరే! నేనెవడన్ బలాధికబలుండౌ వాలిసూనుండఁ, దా
నరరే! నేనెవఁడన్ మరుత్సుతజవుండౌ హన్మ శిష్యుండ, న
న్నరర బంధింపఁ దలంతు వీవు నొక తన్నుందన్ని ప్రాసాదశే
ఖరమున్ గూల్తును నీదుమస్తకమునుంగా రాముబాణంబుచే. 173

వ. అంత హిమధవళశిఖరంబైన ప్రాసాదశేఖరంబు ఫెళఫెళార్భటులతో నేలఁ గూలినఁ దదుద్ధూత మహాధూళిపరిపూరిత వింశతి నేత్రంబులు వింశతిహస్తంబుల నులుముకొంచున్న రావణున కిట్లు వినిపించె. 174

ఆ. హనుమబదులు నేను యరుదెంచియుండిన వార్ధిదాఁటి తల్లి వార్తఁదెలియ
నేమి యయ్యెడిదియొ యింతకీ నెలనాళ్ళు నాయువుండె రాక్షసావళికిని. 175

ఆ. ఎఱ్ఱవడిన కనుల యెఱుపులు శమియించి మెఱుము లాగి శైత్యమృదునవీన
విరచితోపచారవిధులచే రావణు కనులు మఱలఁ జూపు గనినయంత. 176

సీ. సింహసంహతులు గర్జించినయట్టులు పెద్దపులుల్ బొబ్బపెట్టినట్లు
భల్లూకములు దిశల్ పగుల దగ్గినయట్లు చిఱుతలు గురగురల్ సేసినట్లు

ఇబ్బందిగాంద్రు నెల్లెత్తి యేడ్చినయట్లు పెను సివంగులనవ్వు పేర్చినట్లు
ఘోణిసంతానంబు ఘుర్ఘురించినయట్లు వాహద్విషంబులు పనవినట్లు
గీ. కపిమహావాహినీ మహోగ్రస్వనములు వీరసంరావరూపముల్ వెడలి నంత
నాకసము బీటులిచ్చిన నసురదారవిస్తృతహృదంతరంబులు బీటు లీయ. 177

శా. సౌధాగ్రంబున నేగి రావణు డుదంచద్వానరానీకినీ
వీధ్క్రోధమహోర్చి రుజ్జ్వల శిఖావీచీప్రతానైకసం
బాధంబై చను నాకసంబు గని, తత్ప్రక్ష్వేడనాభీలలం
ఘాధూస్సంయత మాకసంబు గని ధీగత్యూహధారామతిన్. 178

క. సోదరవధపర్యాప్తం బీ దుష్కపిసేనకాద యిచ్చట లంకన్
బా దగలఁ గ్రుమ్మివిడిచెడుఁ గాదన నీ సేన నెట్లుగా మాయింపన్. 179

చ. ఇటఁ గల రాక్షసాళికి బదింతలు నిర్వదియింతలున్ సము
త్కటకపిసేన, యిందుఁగల కాయలు దుంపలు నాకులెల్ల ని
ష్కటములు వృక్షసస్యములు కూఁకటి వ్రేళ్ళులఁ బెల్లగించు, న
వ్వటికి నిశాటకోటి తినుపాటికి వార్నిధినుర్వు దక్కెడున్. 180

మ. మరి సుగ్రీవుడు నంగదుండును హనూమంతుండునున్ వారు దా
శరథుల్ చచ్చినయంతటన్ మగిడి స్వేచ్ఛావృత్తులై యేల పో
దురు చంపందగినట్టి వారలును గాదున్ వారుసైతమ్ము నా
రిరిగా నెంచను జేసె శూర్పణఖ, మారీచోక్తి సత్యంబగున్. 181

గీ. ఏడుగడియలు బ్రహ్మాస్త్ర మెవనిఁబట్టు వాని మెడఁ గోయవలయు నావట్టునందు
నాతనిది వజ్రకాయమై యతనిగళము కత్తివాదరఁ దెగనిది కాను వచ్చు. 182

ఉ. ఇంతకు రామలక్ష్మణులు నెట్టిరో సంగర మాడకుండ వృ
త్తాంతము లేమియుం దెలియ వప్పుడు దుర్ఘట మైనయట్టి వృ
త్తాంత మెఱింగియున్ ఫలమునం దది చాలదటంచు నవ్వి యీ
యింతటి చిక్కు కూర్పు వెలయించిన వారిజనాభు మెచ్చుచున్.

చ. తన దగు పట్టణం బరసి దానవసంతతి యిన్నియేండ్లుగాఁ
దనదగు బాహువిక్రమపతాకము నీడన యెన్ని యెన్ని దు
ర్జనతలు సంతరించి, రవిసాగెను సాగిన యన్నినాళ్ళు నం
చును దలపోసె రావణుఁడు సూర్యనవాంశుపరీతదేహుఁడై. 184

శా. సూర్యుండప్పుడు నూత్ననూత్నమహిమాంశుల్ చేర్చికొంచుండె,ధీ
ధుర్యుండై రఘురామచంద్రుఁడును జేతోవీథి ధ్యానక్రియా
పర్యాప్తం బగు బుద్ధి సర్వవిజయప్రాప్త్యగ్రసంకల్పతన్
సూర్యోపాస్తి యొనర్చుచుండెన యగస్త్యుం డెద్ది శాసించెనో.

ఉ. నా డుదయంబునందు రఘునాథుఁడు స్నానము చేసియుండగాఁ
బోఁడిమి గుంభసంభవుఁడు పొల్చి రఘూద్వహ! దైత్యశిక్షకై

పాడి ఘటిల్ల సూర్యుని నుపాసన చేయుగనా నటంచుఁ దా
నాడినయట్లుగా రఘుకులాంబుధిచంద్రుడు ధ్యానమగ్నుఁడై. 186

మ. ఉదయాహార్యదరీ నిరంతరతమో వ్యూహచ్ఛటాసంఛిదా
ఛిదురక్రూరగభస్తి సంచయ మహోభీషాజ్జ్వలత్సారథీ!
మృదురాజీవ జగత్ప్రబోధనకళా మృష్టోదయత్సర్వలో
క దరోన్మీలక శక్తిగర్భ మధురాగ్నాయీ మహోవారిధీ! 187

ఉ. ఎక్కడ నీవు తోచెదవొ యేర్పడుచున్నది నువ్వె యద్ది ప్రా
గ్దిక్కుగ, బంచనయ్యెఁ బెరదిక్కులునుం దదపేక్షఁజేసి, నీ
వొక్కఁడు సర్వదేశమతి కూతగ నిల్చితికాక భావనా
స్పృక్కమనీయబుద్ధి నిబిరీసహరిత్ప్రవిభాగ హేతువై. 188

మ. అరయన్ లిప్త నిమేషమున్ గడియయున్ యామ మ్మహస్సున్ విభా
వరి మాసంబును నేడునున్ యుగము కల్పం బీ మహాకాలని
ర్భర నిర్మాణ నిరంతసంచరణధారా జ్యోతిరాకారకా!
ధరణీ స్వర్గ భుజంగనామక జగద్రాజీవకోన్మేషణా! 189

మ. అనయం బూరక వేదవాక్కు వసురుద్రాదిత్యలోకంబులం
చును వైరాజములంచు స్వర్గములటంచుం జెప్పనే కాని పే
రునకున్ మానవకర్మ సంచయ సమారూఢంబు లాయెల్ల వృ
త్తి ననేకంబుల యుష్మదీయములు జ్యోతిర్మండలీక్లప్తముల్. 190

మ. తత మోంకారవినిర్గత ప్రథమవాక్యం బగ్నిమీళే పురో
హిత మన్నట్టిది సర్వకర్మచయమున్ హేలాజగత్ప్రాణనో
ద్ధతమున్ సర్వనియామకంబయిన విద్యుద్వహ్ని వీవై యనా
రత మీదృక్పరిణామపేశల వికారానేక మూర్త్యంతరా! 191

మ. గతినిశ్చాయకులైన ద్రష్టలు కృతఘ్నుఘ్నాయ దేవాయ య
న్మతికిన్ నీవొకరుండ యర్హుడని ఛందోవీథిఁ బాలింతు రే
కృతముం జింపనురాద సర్వకృత మర్పింపంబడెన్ నీ మహో
కృతిఁ దీవ్రార్చిరభీషు భీషణపరిక్రీడాకడారచ్ఛవీ! 192

చ. ఋతువులుగాగ నీవు వెలయించిన నీ కిరణాల పేర్మి య
ద్భుతము మనోహరంబును ప్రభూతమహస్కము, సర్వదేవతా
తతియును నీవ, నీ వెలుఁగుతాలువు లీ పదునాల్గు లోకముల్
ఋతమున కీ వొకండవ సుమీ యవలంబము సర్వభాస్కరా!

ఉ. నీయుదరంబులో నిలచినిద్దురవోవఁడు శంఖి చక్రి నా
రాయణమూర్తి సొంగదుడు హరి కిరీటి గదాధరుండు నా
రాయణుఁ డంట యూరకయు, యగ్నులనుండి జనించె వారి నీ
వాయతనంబ వగ్నులకు నంబులకున్ గగనానిలాకృతీ. 194

శా. అంచున్ భావనసేయు రామునకు, దాదాత్మ్యప్రకర్షంబు సి
ద్ధించెన్ శ్రీపతితో వికుంఠపురవీథీ గారుడాశ్మప్రభో
దంచత్సౌధ సభానిషణ్ణుఁడు జగత్సంతాన రక్షాకృపా
సించద్వారిదమూర్తితో విహగరాట్సేవాధురావంతుతో. 195

వ. అంత నాతాదాత్మ్యవిశేషానుభూతి శ్రీరామచంద్రునకు విలక్షణంబుగా భాసించె. తాను రామచంద్రుడు రామచంద్రుఁడే, మఱల శ్రీమన్నారాయణుండు, తా నున్న లోకంబులు జ్యోతిర్మయంబులా! మహిమవచ్ఛబ్దస్ఫురితంబులా! స్వమహిమోద్గారి శబ్దంబులా యన్నట్లుండ. 196

ఉ. దేవతలై రమామదవతీవ్రతతీ మధుకృత్కుమారకా!
దైవతలోకకార్యచరితవ్రత! నిత్యదశావతారధా
రావిదితాఖిలోత్తమపురాణకథాకమనీయమూర్తి! లో
కావలికంటకాపనయనా! రఘువంశమణిప్రదీపకా! 197

వ. అని స్తోత్రంబులు నెఱపుచుండ శార్ఙ్గం బిట్లనియె. 198

శా. నీచే మన్నన మిక్కిలింగలిగెఁ బో నీరేజపత్రేక్షణా!
ప్రాచీనంబు పినాకసామ్యము గడింపంగల్గె నాకిప్డు తో
డై చక్రంబు స్మరింప నీదు మునుముందై నన్ను మున్నీదు బా
హాచాతుర్యముఖంబు గాంచు రఘురామా! జానకీనాయకా! 199

వ. మఱియు నొక్కయజ్ఞంబులోని మ్రుగ్గు ప్రాణవంతమై లేచినట్లు నొక మహో మంత్రాక్షరంబులు వికారమ్ము గాంచి రూపంబు పొందినట్లు కనిపించిన గరుడి యిట్లనియె. 200

శా. ఱెక్కెఁకం గొనఁజాలెఁ బో మఘవుఁడున్ శ్రీనాథ! నీదౌ కృపా
స్పృక్కాంతిచ్ఛదఁ జేసి నాదుదెస మత్పృష్ఠాన నీకాలిగో
ర్నొక్కుం గన్గొని మింటనున్న యఱచంద్రుం డల్పవున్ లజ్జచే
నక్కున్ ధూర్జటిమౌళినున్న తనకన్నన్ నొక్కు శోభించుటన్.

శా. నిన్ను న్నన్ విడిగాఁదలంపకు ప్రభూ! నీయందు నన్నున్ సమా
సన్నుంగా నిరతంబు నెంచు మినవంశస్వచ్ఛహైమద్యుతీ!
నన్నున్ సంస్మరియించినంత నెదలోనన్ వారివాహోలపై
మిన్నుంగోసలఁ గొంచు నీవలచు నేమే శ్వేతు నా మేల్పఖా. 202

ఉ. అంత సమాధినుండి బహిరాగమనంబయి లిప్తలోన వి
క్రాంతి వహించియున్న కపిరాజులు తోఁకల నిల్చుచున్ ద్వారా
వంతులు కోటముట్టడికి స్వామియనుజ్ఞఁ బ్రతీక్షచేయు సం
భ్రాంతిని గల్గు రాఘవుఁడు బంధురముష్టినిబద్ధదృష్టియై. 203

శా. కోటిం గూర్చిన యల్లెత్రాడుగను గైకోలస్త్రకం బందునన్
జ్యాటంకారము చేసె రాముఁడు దిశాసంతాన తంతన్యమా

నాటద్ఘోరరవాభిసర్పణముగా నానాత్రి[illegible]
బీటుల్ విచ్చిన కర్ణరంధ్రములుగా భీతిల్లి రంతస్స్థలన్. 204

చ. ఇది తొలిసారి రాఘవకులేశుడు సాగర మీతలన్ ధురా
వదమున వింటిలస్తకము వంచియు వంచక యల్లెత్రాడునం
గదలిక ప్రక్కగాఁ జెదరగా నొక నేరువుమీటు మీటఁ గ్ర
క్కదలిన రావముల్ వియదగారవిభేదనమై చరించుటన్. 205

చ. ఇవియును నల్లెత్రాట నుదయించిన మ్రోఁతలొ సాగరంబులో
నవిసిన నీటివెళ్ళలు వియద్విధురంబుగ లేచి పెద్ద యు
ద్భవ మయినట్టి ఘోరనినదంబులొ? వానరలోకకంఠసం
భవమృగరాజరావములొ? బ్రద్దలుగాఁగ దిశాళి విచ్చెడున్. 206

ఉ. నా డెపుడో సముద్రమథనంబు దశాళలు విచ్చిపోవఁగా
పేడులు రేగగా గగనభిత్తిక భీకరఘోరగర్జన
క్రీడ తరంగరంగములు రింగులు రింగులు వార మ్రోగెఁబో
నే డిదియేమి యే మథన నెక్కొనె దిక్కులుస్రుక్కిపోవఁగన్. 207

ఆ. వరగ బుద్ధియందు ప్రత్యగ్రమై యున్న శార్ఙకంఠరవము సంతరించి
మృదుల రీతి వీణ మీటినయట్లుగా నార్చె రామచంద్రుఁ డల్లెత్రాడు. 208

మ. అరయన్ మున్నెఱుఁగంగ నగ్రజు ధనుర్జ్యానిస్వనంబుల్ దిశాం
బర నానాఙు విభేదనోద్ధురవినిస్వానంబు సౌమిత్రి, యా
వరమోద్యన్నవరావమున్ విని ప్రభుప్రావీణ్యధారానిరం
తరనూత్నత్వమునందుఁ గాంచె దశకంఠచ్ఛేదనారంభమున్. 209

చ. బిరబిర ముందు సాగెను గపివ్రజ మాశరుకోటవైపునన్
విరిసిన తెక్కలై గరుడి వింటఁ జరించినయట్లుగాఁగ, దా
శరథియు వ్యూహశీర్షమున జ్యారవ సంతతమూర్తియై సము
ద్ధురగమనుండు లక్ష్మణునితో మునుసాగెను సూర్యసూతితో. 210

శా. తత్సేనావినతాతనూభవగరుత్సాకారనిర్మాణ మం
చత్సౌధాగ్రము నెక్కి చూచి దితివంశస్వామి కల్లంతలో
వ్యాత్సంతోషములోఁ గొఱంత సమకూరెన్ స్వీయమౌ సేన స
ర్పత్సర్పాకృతిమ న్నిరంతర వినిర్మాణంబు సిద్ధంబుగాన్. 211

వ. వెంబడి నతండు సేనాపతులఁ బిలిచి ప్రహస్తమహాపార్శ్వ మహాకాయులను మేఘనాదుని తత్తన్నియమిత ద్వారరక్షణమునన్ నియోగించి రథగజతురగపదాతిచమూ సర్వసన్నాహంబుసేసి తానుత్తర ద్వారంబుకడ నుండి. 212

శా. మ్రోయింపించెను భేరికాతతులు మ్రార్మ్రోయన్ దిశాసంహతుల్
వేయింపించెను గోటకొమ్ములపయిన్ విస్ఫార ఢక్కాతతిన్

వాయింపించెను వాద్యసంతతి రణప్రారంభణోత్సాహిగా
భూయోభూయ ఉదీర్ణ వీరనినదాంభోధారవిశ్లిష్టిగా. 213

ఉ. చుట్టు నగడ్త లేనియెడఁ జొచ్చిన క్రోఁతులఁ జొచ్చినట్లుగా
మట్టును బెట్టవచ్చును ప్రమాణము మాలిన తాలత్రోపుచే
నిట్టె యగడ్తలో దుమికి యీదెడు క్రోఁతులమీద నశ్మముల్
నెట్టగ లక్ష్యశుద్ధి హవణించ దటంచుఁ దలంప రాక్షసుల్. 214

ఉ. కాని యెడందల న్నడుమగా నొకభావము తాండవించుచున్
దానవు లల్లెత్రాటినినదంబు లుదారమనోజ్ఞగీతి కా
స్వానముబోలె వచ్చుచును ప్రాణములందునఁ దేలిపోవున
ట్లైనను యుద్ధయత్నములయందు రమింతుర యైదురెట్లుగన్. 215

చ. రఘువరు జ్యానినాదమధురధ్వనులన్ వినుచుం గపివ్రజం
బఘుతతిముక్త నిర్మలత ప్రాణులవోలిక నచ్ఛశౌర్యభా
వఘనమనోవినోద తనుబంధురయష్టులు పోవుచున్ మహో
వఘనగిరీంద్రముల్ జ్వలితవహ్నులు దీపితదైవతాకృతుల్. 216

వ. వానరసైన్యంబు ప్రాకారముచేరి శ్రీరామచంద్రధనుష్టంకారంబు విరామంబు గాంచినంత నుభయపక్షంబులు స్వభావంబు పొంది వీ రగడిత నీదను వారు తాలు దొర్లించను వీరు కోటగోడ నెగం బ్రాకను వారు దీర్ఘకాష్ఠంబులతో బల్లెములతోఁ ద్రోయను గపి సేనకు సాధ్యంబుగాక. 217

శా. గోలాంగూలమహేశ్వరుల్ గగనదిక్కూటంబులన్ లంఘనా
హేలాస్పృత్వరులైనవా ర్వరిఖలో నీదంగ నేలంచుఁ దా
మాలోచించి వియత్పదం బెగిరి కుడ్యంబందునం జేరి యు
ద్వేలుల్ వారును వీరు ఘోరసమరావిర్భూత రోషోగ్రులై. 218

చ. ప్రచుర గదాసికుంతముల రాక్షససంతతియున్, శిలాతరు
ప్రచయముచేత వానరులు, వారిని వీరిని వీరు వారు ను
త్కచులయి తాఁకుచున్ దనువిఘట్టనలం బొనరించుచుం గచా
కచి నఖదంష్ట్రలన్ విద్రువగా నతిభీషణమై చెలంగఁగా. 219

శా. ప్రాకారాగ్రమునందు నీ జరుగు ఘోరంబైన పో రూరిలో
దాఁకం జేరకయుండునట్లు దనుజుల్ దర్పోద్ధతుల్ సాయుధుల్
నైకాస్కందనదక్షులున్ నిలిచి రుద్యల్లోహకుడ్యంబు లెం
దాఁకన్ మింటనువచ్చు వానరులమింటందాఁకగా నేర్పరుల్. 220

ఉ. గోడలపైన నొక్కొకరి గుంజుచు రుంజుచుఁ ద్రోయుచున్ మఱిం
గాడగనేయుచున్ బెనఁగఁగా దుదియంచుననుండి క్రిందికిన్

గోడిగఁద్రోయుచున్ మఱియు గోళ్ళలరక్కుచు గోడనొక్కుచున్
వాడిగఁజూచుచున్ భ్రుకుటిబద్ధముగాఁగ సధూమవహ్నినాన్.

సీ. లంఘించుటకు లేదు లాఘవంబున వెన్క దుముకుటకును లేదు, తూగి యెగిరి
దిగుట కెడములేదు, దెప్పరమై రాలు రవ్వలు చెట్లు నుగ్రములు లేవు
కడు విహారాహవకౌశలంబున సమావిర్భూతి పచరింప వెసులు లేదు
గోళ్ళతో రక్కగాఁ గోఱలఁ గండలు తీయఁగా నెంతని తెమలఁగలదు

గీ. మల్లయుద్ధంబు వేఱు నిర్మథనకృతియు వేఱుగా నయి చెడిన కపివ్రజంబు
కుంతఖడ్గాదులకుఁ దాళుకొనను లేక డీల్లవోయిరి గుములయి పల్లటిలిరి. 222

చ. వెనుకను లక్ష్మణుండు కరవిస్తృతచాపవినిర్గతంబుగా
నినిచిన బాణసంతతుల నిర్భరవృత్తిని గోటగోడపై
దనుజులు నీల్గుచుండినను, దైత్యునివెంట మఱొక్కదైత్యుఁడై
కనుకని గోడపై నెడము కల్గదు వేఱొకరుండు నిల్వఁగా. 223

చ. బురుజుల మీదఁ దానవచమూపతు లుగ్రధనుర్వినిర్గతి
స్ఫురణము కల్గగాఁ బరిఖ ముంగలి వానరులం గలంచగా
వెరవరి లక్ష్మణుండు తనవింటికొసన్ వెలలించు నమ్ములన్
బురుజులమీఁది బాణచయమున్ శమియింపఁగఁ జేయుచుండగన్.

మ. ఎవఁడో వానరుఁ డుప్పరం బెగసి తా నేపారి యేదుష్టదా
నవువక్షంబునొ తన్ని వే తిరిగి యంతన్ వచ్చుచో, దూరదా
నవచాపంబుననుండి రివ్వుమని బాణంబొండు తద్దేహమున్
వివృతంబుం బొనరించు దానిఁ గపియున్ విర్చున్ మరొక్కప్పుడున్.

చ ఒక రొక రాక్రమించుచు మహోగ్రులు దానవ వానరుల్ దృశా
వికృతులు గోడయంచునను వీడియు వీడని కాలిపట్టు పా
యక పలురీతులం బెనఁగులాడుచు నిద్దఱు మూటకట్టుగా
నొకనిముసంబులోఁ బడుదు రుగ్రపు నీటియగడ్తలోపలన్. 226

శా. ఆరంభించిన దెవ్వఁడో ప్రథమయామారంభమై ప్రొద్దు వా
టారంజొచ్చినవేళ యయ్యుఁ, గపిసైన్యం బింత ముల్లంత ప్రా
కారంబందున మేర యంచును సమాక్రాంతమ్ము కాకున్న, ను
బ్బారన్ వానరు లెందఱో మడిసి దైన్యంబంత శౌర్యంబుగా.

క. తగినంతమంది దానవులు గళిత దేహులను మాటలో నేముండెన్
తెగిన కపిసేన బ్రదుకుట యగునా యొక కోపతృప్తియన్నదికాకన్. 228

శా. ఎచ్చోమారుతి వార్ధి దూఁకునెడ భూభృద్రాజు భూగర్భముం
జొచ్చెన్ వార్ధిజలంబు పోసికొని యచ్చోఁ బూడ్చి దైత్యవ్రజం
బుచ్చైఃకుడ్యము కట్టి తీవ్రపరిరక్షోద్యోగులై యుండగా
నచ్చోఁ బట్టినపట్టుగాఁ కపిచమూవ్యాపార మేపారగన్. 229

ఉ. అచ్చట విచ్చిపోవలయు నాశరకోట్టము లేదయేని తా
మచ్చటఁ జచ్చిపోవలయు నంతయు వానరసేన యంచు దై
త్యోచ్చయతిప్రయత్నము లహో ఫలమింతయు లేనియట్లుగాఁ
బుచ్చిన యూర్పులేక దితిపుత్రులు ధక్షణ దుర్భరంబుగా. 230

ఉ. అచ్చటి దైత్యసైన్యపతు లాశరరాజునకున్ వచించి రా
గచ్చును సున్నమున్ బిగియగా నయినట్టిది వేళ లేక యీ
క్రొచ్చెడు క్రోఁతిసేన పెనుగుండులు కొండలు రువ్వుచుండగా
వచ్చుట యెప్పుడో తెలియఁ బట్టదటంచును దీననేత్రులై. 231

వ. అహః ప్రమాణం బెంత మిగిలినదని యడిగి దివావేళ యామశేషంబుగా నున్న దని తెలిసికొని రావణుం డుత్సాహమతిమంతుండు రథంబుపై నింద్రజిద్గృహంబు సేరి సమర్థ్యాణంబంది కొడుకుతో నిట్లనియె. 232

చ. బయటికి రండటంచుఁ బరిపంథులు పిల్చిన వెళ్లియుండు మే
రయమునఁ గోటముట్టడికిఁ బ్రారభమాణదురూహ మౌచు ని
ర్భయమయి పొల్చునట్టి కపివాహిని నచ్చట నచ్చటే వధిం
చి యముని మందిరమ్మునకుఁజేరిచి రమ్ము పరాక్రమాంబుధీ. 233

చ. మఱియును నన్నదమ్ములను మానవు లిద్దఱ ఘోరబాణపం
జరములఁ గ్రూరనాగపరిష న్మహిమోగ్రవిషాభిదూషితో
ద్ధురతనుయష్టిమంతులుగఁ దూల్చుము ధారుణి మద్దిదుంగలై
దొరలుచు రాత్రియెప్పటికొ దూసుకపోవ నసుప్రతానముల్. 234

ఉ. అరయ నింతలోపలన యామినియుం జనుదెంచుఁ బ్రొద్దు వా
టారుచు నున్న దాహవమహోమతివై తెఱపించి యుత్తర
ద్వారము వారికిన్ మన కుదారముగా విడియుద్ధమైన సం
ధ్యారుధిరాంశువుల్ సెలఁగు నంబరదిక్తతి పిక్కటిల్లగన్. 235

మ. ఇది నీకుం గొనగోటిమీఁదిపని నీవీ సుంతయున్ జేయ రే
వుదయం బిద్దఱు నేత్రముద్దలుగ మున్నూహించి యవ్వానరుల్
తుదకింతై తమ తెల్వితక్కువకు సంతోషింతు రా కట్టిన
ట్టిది ఆవంతెనఁ బట్టిపోవుచును ధాటీధూత్రపాబుద్ధులై. 236

వ. కవచ శిరోంగుళిత్రాణ శరశరాసన కిరీటమణికుండ లాద్యలంకరణంబులఁ దాన కట్టాయితంబు సేసి కొడుకును. 237

మ. సురువుల్ గ్రక్కెడునట్టి గుఱ్ఱములు మున్నుంగాఁగ మేఘధ్వని
స్ఫురణం బొల్చెడి యంత్రలగ్నకరథంబున్ మేఘనాదుండు ని
ర్భరుఁడై యెక్కి చనంగఁ దండ్రియు ధృశావర్యంతమున్ బోవున
ట్టి రథంబుంగనెఁ బుత్తురి నంపుటకు ధాటీధూత్రపాబుద్ధియై. 238

వ. అంతలో నుత్తరద్వారంబు వివృతంబై దానవచమూ చమూపతులు నిర్ఘాతకపి
సేనా సమూహంబుగా రథంబులు గజము లశ్వంబులు పతాకలు కొమ్ముబూరాలు
తప్పెటలు శంఖంబులుగా సముద్రమువోలె విరిసివచ్చిన నీశాన్యగత నూత్ననిర్మిత
ప్రాకార భాగంబున నున్న కపుల దానవు లొయ్యోయి కపులారా! ప్రాకా
రభేదనవృథాశ్రమం బేల పొండని తోలిన నిరుకక్షులకుఁ దొలుత దొమ్మియై
పిదప ద్వంద్వయుద్ధ మారంభమై. 239

మధ్యాక్కఱలు.

సంపాతి యన్ గపీశ్వరుఁ బ్రజంఘరాక్షసు డెదిరించి
యంపవానను ముంప వానరాధీశుఁ డావాన నైన
రొంపిలో నీదుచుఁ బోయి దోషోగ్రరూక్షులను
దంపనాగలివోలె నసురతండ ముద్ధతుఁడయి దున్నె. 240

మఱియు బ్రజంఘుడు వాన మానక మలయించుచుండఁ
దొరగక సంపాతి బొట్టు తుడవక దున్నపై వాన
కురిసినయట్టులు పోయి కూడి రక్షోపీరుబండి
యిరు సూడఁదీసిన నొరిగి నిట్టట్టు లెగిరె దానవుఁడు. 241

చ. ఉరుభుజశాలినన్ గరువ మొప్పెడు దైత్యుడు జంబుమాలి, తా
నెఱఁగి యెఱంగి దూరమున నేగెడు మారుతిఁగాంచి వానిపైఁ
బరగఁగఁ జేసెఁదీవ్రమగు బాణపరంపర, వాయుసూతి య
బ్బురముగ వానిఁగాంచి మఱిపోవఁగఁ జొచ్చె నిరాదరంబుగన్.

ఉ. వంచనచేసె దూతుఁడయి వచ్చి ప్రహాస్యముగాఁగ గొంప లం
టించుటకాదు యుద్ధము నటించుటకాదు యథార్థమైన పో
రంచును జంబుమాలి రథ మాతనివెంబడిఁదోలి నిప్పుము
ట్టించినయట్లు నమ్మ నిగిడించిన మారుతి కక్కసించుచున్. 243

ఆ. బండి బండిగాఁగ బైకెత్తి సారథి యశ్వములును రథియు నడ్డయిరుసు
పోలు కాడి తడక పొడిగాఁగ నేలను వేసి చమరె హనుమ త్రాసకముగ. 244

మధ్యాక్కఱ.

ప్రతపనుం డన్నట్టి పెద్దరక్కసి ప్రబలుఁడై నలుని
వెతపెట్టి కారించె బాణవితతిఁ గ్రుమ్మిన మేను గాఁగ
మతి మండి వానిపై దూఁకి మఱియును మఱి గోళ్ళ రక్కి
యతని కన్నులు పీకె నలుఁడు నతఁడు హాహాకృతుల్ సేయ. 245

ఉ. ఆవిలకోపుఁడై ప్రఘసు డన్వెనురక్కసి దీర్ఘదీర్ఘ బా
హావివృతత్వమున్ గ్రహణ మాస్యబిలంబునఁ గ్రుక్కి కొండగాఁ
దీవర మూనఁ గ్రోతులకు దెప్పరమైనను వానిఁజూచి సు
గ్రీవుఁడు నొక్కి వానిదగు గ్రీవము చంపెను వాని నుగ్రుఁడై. 246

వ. అగ్నికేతువు రశ్మికేతువు సుప్తఘ్నుఁడు యజ్ఞకోపుఁడన్న నల్వురుదైత్యులు నాల్గువైపుల నుండి శ్రీరామచంద్రునిఁ దాఁకి యతని సంహరించి దైత్య రాజుదయపొందవలెనని నిశితతీవ్రబాణములు పరగింప రాముండు నొక్కసారి నలుదిక్కులఁ బ్రసరింపించిన నాల్గు బాణములతో వారిని సంహరించె. 247

మ. అది దూరంబుననుండి కన్గొనియె దైత్యాధీశుసూనుండు స
మ్మదనేత్రంబుల మేఘనాదుఁడును రామస్వామి విల్నేరు పొ
ప్పిదమై కంటఁ దళుక్కుమం చనగ నివ్వీరుండు చాలున్ గ్రుధా
ప్రౌఢుఁడై యీగతి లంకపై విడువగానంచుం దలంచెన్మదిన్.

ఆ. అల తళుక్కుమనుట యాతని విద్దియ నేర్పు యతని మేనికూర్పు తెలియ నాడుచున్న యుద్ధ మది త్యజింపనురామి యింద్రజిత్తు మనసు నేమరించె.249

మధ్యాక్కఱలు.
మైందుండు వజ్రముష్టి యను మత్తుండు మహితరాక్షసుఁడు
కంది యన్యోన్యంబు ముష్టిఘాతముల్గా యుద్ధమాడ
మైందుని నొక తన్ను తన్నె మత్తిల్లుమాట దానవుఁడు
మైందుండు వానిని బట్టి మస్తంబు మలయించి చంపె. 250

నిగిడి నికుంభుఁ డన్వాఁడు నీలుని నీలాంజనోగ్ర
నగనిభదేహునిఁ దీవ్రనారాచనద్ధాంగుఁజేసి
నగి యిట్టులనె నోరియోరి నల్లని నల్లని కోతి
యెగచుచున్నది నీదు మేన నెఱ్ఱని యెఱ్ఱని నెత్రు. 251

కోఁతులు రాజ్యాలు పోర్లు కోటలకున్ ముట్టడులును
చేతులు గోళ్ళులు కాళ్ళు శితశరాక్షీణ సంతతులు
మీ తెర్వి యేమిరా యంచు మేలమ్ము మెలచి నికుంభుఁ
డాతతాయితనంబు నీలునందు దుష్టాకృతి చూచి. 252

మఱిమఱి బాణముల్ పుచ్చె మత్తిల్లి మతిలేని యసుర
విఱుచుక పడినట్టి కొండ విధమున విరిసి నీలుండు
పరువెత్తి యాతనిబండిపైఁబడి బండిముక్కలుగ
విఱిచి చక్రముతోడ వాని విద్ధు నుర్వీగతుఁజేసె. 253

అశనిప్రభుం డన్నయట్టి యసుర యాహవమత్తవృత్తి
విశిఖప్రతానంబు చేసి ద్వివిదుని విద్ధాంగుఁజేయ
యశనిఘోరాకృతి ద్వివిదుఁ డతితరమైనట్టి పర్వ
త శిఖరముం బుచ్చి వానిగర్వంబు తఱుఁగఁగాఁజేసె. 254

క. ఒగి మాయాసకలాగమాంబునిధి విద్యున్మాలియున్ బండి ము
న్నగ యుద్ధార్థము వచ్చుచుండిన సుషేణుంగాంచి యోకోఁతి! నీ

పొగరుం దించెద నంచుఁ జిక్కనిశరంబుల్ వాని మైనింపఁ దా
నుగఁ గ్రోధారుణఘూర్ణితాక్షుడు సుషేణుం డుగ్రరుద్రాకృతిన్. 25

మ. ఒనరన్ గొండ నొకండు పైవిసరి విద్యున్మాలిబండిన్ తునా
తునకల్ సేసినఁ బ్రక్కగా దుమికి విద్యున్మాలియున్, లాఘవం
బునఁ దోర్త్రోఁ బరగించెఁ బెల్లుగ శరంబుల్ నెత్తురుంగాల్వ ముం
చినయట్లయ్యె సుషేణుదేహమునుబూాచెన్ బెద్దతంగేడునాన్. 25

మ. తిరుగన్ వేఱొక పెద్దకొండ గొని యుద్వృత్తిన్ సుషేణుండు తీ
వర మేపారగ వానిపై విసరబోవన్ వాడు నీలోపలన్
శరమున్ వజ్రసమంబు నాటెఁ గపివక్షంబందు నాబాణమున్
సరకున్ సేయక వానరుండు శిలతోఁ జంపెన్ సురారాతినిన్. 25

ఉ. ఎంచఁగఁ జిత్ర మీజగతి నిట్లుగఁ జేతు రఘుంబు నిట్ల సి
ద్ధించు ఫలంబు కొందఱకు దెప్పరమై రఘురామసోదరో
దంచితమస్తకంబులు ధరాత్మజనుం గికురింప నిన్నఁ జూ
పించెను వాఁడు, వానితల పిప్పిగ నయ్యెను నేడు వెంటనే. 25

ఉ. ఎంచగ దూరమం దరుగు నింద్రజి నింద్రజి వాఁడె యంచు జూ
పించెను మారుతాత్మజుఁడు భీషణమూర్తికి వాలిసూతికిన్
వంచిన బ్రహ్మమంత్రమున బంధితుఁ జేసెను పావమాని వీఁ
డంచును కోప మంగదున కాతఁడు నింద్రజి పైకి దూఁకుచో.

ఉ. ఆతని నాపఁ జూచెఁ బవనాత్మజుఁ డాతనితోడ నేలయం
చాతనిఁ జూపుమం చడిగి తందుకుఁ జూపితి నన్నమాటలో
నాతఁడు మారుతాత్మజుని యాడిన మాటలు లెక్కసేయకన్
ధౌతవిచిత్రదంతముల తళ్కుల నింద్రజిఁ జేరి యిట్లనెన్. 26

మ. అరరే మద్గురు నంజనీసుతుని బ్రహ్మాస్త్రంబు సంధించి య
బ్బురమేఁపారగఁ గట్టివేసితివటే భూమీజ దర్శింప సా
గరమున్ దూఁకి రమేశుదూతయయి రాఁగా నేడు నాపైన నా
శరముందూయుమురా మరేమియొనరించంజాతునో నిన్నిటన్.

క. అని వాని బండిగుఱ్ఱములను గళ్ళెములందుఁ ద్రాళ్ళులన్ లాగుచు ని
ల్చిన నింద్రజి నవ్వుచు మఱి వినిపింపుము నీదు పేరు విందు ననంగన్. 262

మ. పదిగొంతుల్ గుఱువెట్ట నుప్పజలముల్ పాథోధు లేడింట దో
ర్మదవృత్తిం గుదియించి పట్టికొనుచుం ద్రావించెనే వీరుఁడై
యది యావీరుని పే రెఱుంగుదువ, నే నా వీరు సూనుండ దు
ర్మదుఁడై యట్టులసేత యెవ్వఁడనిరా మాహేశ్వరున్ మారుతిన్.

గీ. ఇంద్రజియు బిల్ల కాకికి నేమి తెలియు రయ్య యుండేలు దెబ్బని యంతవాని
కొడుకవైయింతగాఁజెప్పికొనుటతగున వగ్గములువీడినిలుమంచుఁ బలుకుచుండ. 264

చ. వెలయుచు సూర్యరశ్ములును విద్రుమకాంతులు చిందులాడగా
జలనిధినీర మెల్లఁ గపిసైన్యముగాఁ గనిపించి దానవా
వలికిని గుండెలన్ బెదురు వచ్చెను వెచ్చనినెత్తు రొప్పి దై
త్యుల మనిపించినంతఁ బరితోషము చెందిరి యుద్ధబుద్ధులై. 265

చ. చినిగిన ప్రేవులై చన నశించినయట్టి ధ్వాశరీరమున్
దిని పెనుకాలమ న్నసురి నెత్తురు త్రావిన నోట నావులిం
చిన దన నొప్పె రోదసి, నిశీథిని వచ్చిన దానిదైన మ
త్తును వదలించు టెట్టులనొ తోచదు తూచదు వెల్గులేకయున్.

ఉ. నల్లనిబావుటా లసురనాథు లవన్నియు నెత్తుకాంతి సం
ధిల్లగఁ గావివన్నె హవణించిన వానరకోటి యాత్మసై
న్యోల్లసనం బటంచు మఱియున్ దితిజాతుల తీవ్రమౌ శరా
వేల్లితదేహులై తెలిసి వెక్కసపాటు భజింతు రెంతయున్. 267

చ. రణమున వానరుల్ విసురురా ల్వెనుమాంసపుముద్ద లంచుఁ జీ
క్కణమతులైన రాక్షసులు ఘట్టితదేహు లెఱుంగునంతలోఁ
గణతలు తాఁకి ప్రాణములు కాలునిపట్టణ వీధు లేగునో
ధణధణ మ్రోఁతలై హరిశతారనిపాతము లట్టు లేచునో. 268

క. ఒక దూసిన కరవాలము లరి నఱుకకయుండ నెత్తురై కనిపింపన్
సురరిపులును శుభశకున స్ఫురణంబుల ముద్దుకొంచుఁ జొత్తురు పోరన్.

ఉ. శ్రీ రఘురామచంద్రుని శరీర మదేదియొ పుణ్యవృక్ష శా
ఖారుచిరాంశుకోన్నతశిఖాక కిసాలయగుచ్ఛమట్టు లిం
పారినఁ జూచుచయ్యుభయపక్షములున్ మధురభ్రమోహ ధా
రారసితాత్ములై తెలియరాక నిమేషము తల్లడిల్లుచున్. 270

మ. తనయన్నన్ గని లక్ష్మణుం డతని సౌందర్యంబు తా నింతక
న్నను ము న్నింతగఁ గన్నులం దలరియున్న ట్లింతయున్ లేక వి
చ్చిన వైకుంఠకవాటతోరణ సుమశ్రీమంజుకింజల్కరం
జనఁ దాక్రొత్తగవచ్చెస్వామి యనుచున్ సంభ్రాంతుఁడై చొక్కగన్.

మధ్యాక్కఱలు.

ఏ గదచేత మున్ను రిపు లెందఱొ యెందఱొ చచ్చి
రో గదన్ దానిని విసరె రోషనిరూఢి నింద్రజియు
వేగియై యంగదుమీదఁ విసరిన విస్ఫారగదయు
నే గిరినైనఁ జేసెడిన యింతలు నింతముక్కలుగ. 272

అంగదుఁ డా దెబ్బనుదిని యడుగొక్కఁడైనఁ గదల్చ
డంగారకములు కణకణలాడిన ట్లక్షులు తోఁచఁ

బొంగి యింద్రజి బండిమీఁదఁ బోయి యబ్బురపాటు కలుగ
నింగికి నెత్తి యాడించి నేలపై నిడివిగా విసరె.

చ. రథము మఱల్లె యశ్వములు రావణి చక్రయుగంబు పోలు నె
రథియును నున్న దున్నటుల రాణవహించెను పెద్దమల్లుఁ డు
త్పథమున వేఱ మల్లు విద్రువన్ గిరికేలుగ మింట నొప్పి వే
బృథివికి డిగ్గినట్లు కనిపించిన మాయగఁ దోచె నెంతయున్.

చ. అలయక యన్ని వేళలను నన్నిస్థలంబుల నిండి యుండఁగా
వలయున వెల్గు, వెల్గుల స్వభావము నట్టిద, దానిశక్తిలోఁ
దొలఁగుట నిండుటన్నయది తోచని వస్తువదేదొ, పంచపం
చలఁ బడి యద్దువచ్చినఁ బ్రసారము లేమియె చిత్రమయ్యెడిన్

ఉ. అక్కట! యెచ్చటం బడిన నచ్చట నుండగనైన వెల్గు లా
యెక్కడినుండియో మఱియు నెచ్చటికో చనుదెంచు టేమి?
యొక్కఁడు దానికడ్డమయి యుండఁగ జాలుటయేమి? చీఁకటు
పిక్కటిలంగ నైనదగు బెట్ట యిదేటికి లోకమందునన్.

ఉ. ఆవెలుఁగుల్ సమస్తమునయందున నుండఁగ మున్ను చీఁకటుఁ
త్రోవలుకొట్టి దవ్వులకుఁ దోలెను గావలె వెల్గురేకలన్
గైవస మాచరించిగొని కానలు కొండలు వెన్కపీటగాఁ
గావలు డేగుదెంచి యెసకంబుగ నెంతయునైన జేసెడిన్.

ఉ. చీఁకటి లేనివస్తు విది చెన్నుగ నుండుట యెట్లు గల్గెనో
వేఁకటి తాల్చి యేజనని, బిడ్డను దీనిని గాని కన్నదో!
వాఁకిలిలేని యేగుహను వచ్చిన తత్ప్రథమావతారమో!
తేఁకువ సూదివోలె నరుదేరఁగ దబ్బన మోచుఁ దేలఁగా.

శా. అసూర్యుండును బెద్దమోహమున ఛాయాదేవిఁ బెండ్లాముగాఁ
జేసెన్ దానికిఁ బుట్టినట్టి ప్రజ యాచీఁకట్లునుం గావలెన్
మోసంబై చనుదెంచు చీఁకటుల నిర్మూలింపఁగా నేరఁడుం
జేసేతన్ దుదికేమొ చీఁకటులు కాఁజేసెన్ నిశారాజ్యమున్.

ఉ. పేరిమికొన్న భార్య కనిపింపకయున్ గనిపింపఁజేసికో
నేరిమి వృక్షసంతతిని నిర్మితి చేసెను, దాని వెంట నా
నారచనల్ గడంగె లలనామణి సంతతి చీఁకటుల్ నిరా
కారముగా జనించె గిరికందరమందరహస్స్థలంబులన్.

ఉ. వానిమొగం బెఱుంగఁడు దివాపతి యాయమ యట్లు వచ్చుఁ
దానిటు లేగి తప్పికొను, దైత్యులతోఁ బెనుచెల్మి, యొక్క ఘ
రానికి వీఁడు కాదనఁగరాదు, సమూలముగా వధింపఁగాఁ
బూనఁడ, యింటిలోపలను బోరు లతాంగియుఁ దోడునీడయై.

మ. తనకున్ ఛాయకుఁ గల్గె నీ దురుసుసంతానంబునాన్ ఛాయతో
నినుఁ డేనాడును సంగమించినది లేనేలేదు, యాఛాయఁ జూ
చినచోఁ జూచునొ చూడఁడో కుటిల మీ చిత్రంపుసంతానమం
దుననిర్మూలముచేయు కోపమును బొందుం బొందఁ డాదేవుఁడున్.

చ. అతని పరోక్షమం దుదయమందెను, స్వామిపరోక్షమందె యీ
జతనములెల్ల నంధతమసప్రతిమూర్తి యితండు సేయు, వి
ద్రుతమతి సూర్యదేవుని విరోధులతోఁగయికల్పు స్వామి వం
చితుఁబొనరింప దానవుల చేఁతలయందున సాయమయ్యెడున్.

చ. తనదగు జన్మ సంశయగతం బగు వేనికి, నట్టివాని జీ
వన మిటులుండు, నెప్పుడును బ్రహ్మవిరోధి యతండు, సత్పదా
ర్థ నిరతభావదూషణపరాక్రమబుద్ధి, మఱిం గుజాతియై
చని తనజన్మ హేతువగు జాతికి నిత్యపరోక్షశత్రువై. 284

చ. మెరవడి నట్టి చీఁకటి సమీపమురాఁగని మేఘనాదుఁడు
ద్దురతరహాస చంక్రమణధూర్వహుఁ డంగదుమీఁది కేగె ని
ర్భరమతి వానరాళియువరాజు క్రుధాపరిదీప్తవహ్నిజ
ర్జరితశిఖాకలాపవిధురక్రియ బాహులు తాండవింపఁగా. 285

ఉ. ఆతని బండిపైకిఁ జని యశ్వచతుష్టయకంఠముల్ ధురా
స్థితిగ ఫెళ్ళునన్ విఱిచి సింహమువోలిక దూఁకి సారథిన్
వే తలఁ బూని వాఁడు పలవింప మెడన్ మలయించి త్రిప్పి ని
ర్ఘాతిగ వాని నేలపయిఁ దూలిచి బండిని మింటికెత్తుచున్. 286

గీ. కడఁగియూగించిపడవైచి కాలఁజమరియూఁగి ముక్కలుముక్కలుగాఁగఁజేసెఁ
బరమలాఘవుఁడయిన రావణియునంత మింటికెగిరి యచ్చటఁజంక్రమించుచుండె.

ఉ. ఇంద్రజి కిట్లుగా జరుగు టెన్నడు లేనిది దైత్యసైన్యముల్
సాంద్రఘృణాసమర్పిత దృశాపరివిహ్వలు లౌచుఁ జూడగాఁ
దంద్రమతుల్ కపుల్ ప్రహసితప్రమదాననులౌచు నార్చి నం
తం ద్రపమాలి కోపమున దైత్యులు వానరకోటిఁ దాఁకుచో. 288

సీ. శరదాంతర వళక్షజలధరం బొక్కండు దూదిపింజియవోలె దూఁకుచుండ
కోటియోజనదూర కుట్టనోగ్రనిరూపితము తార మిన్కుమిన్కు మనుచుండ
ఒకదిశా దారువు పెకలి పేడెత్తిన మినువన్నెమబ్బొండు మెసలుచుండ
తారకాకాంతి సంధ్యారాగమమతచే నించుమించుగ సంచరించుచుండ
గీ. నిర్మలం బనిపించెడు నింగియందుఁ జూచుచునె వానకాఱు పెచ్చు ననఁ బొల్చు
చిఱుతమబ్బులు పిల్లలఁ జేసినట్లు మూసికొని వచ్చె నాకసమున భృశంబు. 289

ఉ. వింతల చీఁకటుల్ విరిసె విచ్చిన మబ్బుల చేతఁగానివిన్
సంతతతారకాసుషమ సాగఁగనీనివి దగ్గరల్ సమా

క్రాంతము లౌచు నొక్కొక్కకరిఁ గానఁగనీనివి దైత్యమాయ దృ
ష్టాంతములైనవై విరచితాఖిలదిక్ప్రతిషేధభావముల్. 290

మ. మఱియున్ వార్షుకకృష్ణపక్షనిశలన్ మత్తాంబుదానేకముల్
విరియున్ సందులనుండి తారకల యే వెల్గో కడున్ స్వల్పమై
పొగయున్ దృష్టికి నందుచున్నయటులం బోలంగ నీ వింతలౌ
నిరులే వస్తువుకాద సందులని యిందేర్పాటుగా నొప్పఁగన్. 291

ఉ. గాటపుఁ బెల్లుచీఁకటిని గట్టిగఁ గన్నులు మూయఁ గన్బొమల్
మీటిన ఫాలభాగమున మెల్లన తెల్లని వెల్గు తోఁచు, నే
చోటిదియో హృదంతరవిశుద్ధము దర్శనశక్తి యేమొ యా
గాటపుఁ జీకటుల్ వెలికిఁ గానివి లోనికినైనఁ గానివిన్. 292

గీ. వీఁడుకపియంచుఁదెలియక వీఁడుదైత్యుఁడంచు దెలియక వానిపై నంపవాన
నింపగా వానిపై శిలానిచయ మెల్లఁబంపగా, గంటె వెల్గుల పాటు లేక. 293

సీ. నేను విద్యున్మాలినిర మహాకాయుఁడా కొండంత దెబ్బను కొట్టినావు
ఓరి రుండీ నేనురోయి మహాదంష్ట్రుఁడను నంత దెబ్బకొట్టకుము నన్ను
అయ్యొ నీ వా తీవ్రమైన బాణముచేత గుండియ వ్రచ్చితికుటిలదంష్ట్ర
వీఁడెవ్వఁడో కపివీరుండు కావలెఁ దెలియకుండఁగ వచ్చి కలఁచె నన్ను

గీ. నంచు దైతేయసైన్యంబు లటమటించి మునిగి మిన్నందు నాక్రోశముం బొనర్పఁ
గపిచమువు లున్నచోటఁ జీఁకట్లు సుంతవిరిసి కపులల్లనల్లఁ గన్పించుచుండ.

శా. సింహాస్వానవిదీర్ణ దిక్కుహర దాక్షిణ్యేతరాహింక్రియా
బంహిష్ఠోగ్ర పరాక్రమోచ్ఛలిత దుర్వ్యాఘ్రావదూకక్రియా
రంహాల్ దైత్యులు కానిపించు కపివారంబందు నారాచపా
తాంహఃప్రక్రియఁ బొల్చి రాహవనయవ్యాపార దూరీకృతుల్.

చ. వనరుచునున్న వానరులు వచ్చిన బాణపు సూటిగాఁగ దూఁ
కిన మఱి దూఁకినట్టియెడఁ గృత్రిముఁడౌ దనుజాతు బండియే
గనఁబడ దైన స్వీయకపికాండము నిల్చినచోటు కన్పడున్
జనుటకునైన వెన్దిరిగి సాగిన యూహగ సంతసించుచున్. 296

మ. ఎవఁడో మూర్ఖుఁడు దానవుండు రణతీవ్రోద్వేగమున్ బట్టికో
నవు నేర్పేది రథంబు వానరుల మధ్యన్ దోలినన్ సర్వదా
నవసంహారము వానికొక్కనికె సంధానించుఁ గీశవ్రజం
బవురా! చీఁకటిమీదఁ నైన కసితోడై వడ్డిగాఁ దీర్చుచున్ 297

మ. ఒకఃయాశ్చర్యముగాఁగఁ దోచినది దైత్యుల్ చూడఁగాఁజూడ నెం
త కపుల్ బాణము లట్లె గ్రుచ్చికొని మేనన్ వందలున్ వేలు తా

నొకఁడున్ జావఁడు నేలపైఁ బడఁడు తీవ్రోత్సాహియై క్రోధియై
వెకలించున్ శరముల్ గటారమువలెన్ వీచున్ రిపుశ్రేణిపై. 298

క. ఒక దొడ్డిలోనగసితీరక పశువులమంద తోలి ఱాల్లుప్పినటుల్
చకితులయి శరవృలు కామికిఁ గొందఱు కోఁతు లిరులు మేలని దొఱఁగన్.

మ. అకటా! చీఁకటితో నభేదమతులై యాదైత్యులున్, రామభ
ల్లుకముల్ కానల నంధకారమున నాలోకింపఁగా గల్గు వా
డుకయై, దానవసేనఁ జొచ్చి వెనుదండుల్ బెండులంజేయ నూ
రక వీక్షింతురు చీఁకటుల్ తమరిపై రానైన వ్యత్యాసమున్. 300

గీ. బాణములు వాన యగుటనో భల్లుకముల పైనిఁ బనిచేయకుండెను, భల్లుకములు
ముట్టె ముంగాళ్ళలోనిడి చుట్టగాఁగదొరలి చూర్ణంబుసేయ దైత్యులబలంబు.

గీ. అప్రమత్తులై యుండుఁడీ యఖిలకీశచమువులారా! ~~యటంచ~~ మను స్వామి చెప్పె
శింజినీరుతి మేళవించి గళరవము 'బ్రహ్మదత్తవరుండు రావణి' యటంచు.302

శా. మాయాయుద్ధవిశారదుండయి త్రియామావేళ ప్రాపింపఁగా
నీయాంధ్యమ్ము సృజించె వానరభుజాహేలాతిరస్కారిగా
నాయే మిన్ననుండి బాణతతి తా నేతెంచు నా మిన్ను కం
దోయిం గన్పడకుండ ధూర్తరణపాథోరాశి నిర్మాతయై. 303

మ. అనుచుండన్ వినిపించె మిన్నున నమోఘారావమేఘారవం
బున బెంజీఁకటి చీల్చుకొంచు వచనంబుల్ దర్పపాథోనిధుల్
ఘనపంకావిలమైన యేఱునఁ బొరల్గావచ్చు నీటింబలెన్
వినమచ్ఛీర్ష భుజంగదంష్ట్రలఁబడిన్ విచ్చేయు ధారంబలెన్. 304

ఉ. తేలికగాఁగ వారిజలధిం దరియించితి రింద్రజిద్భుజో
ద్వేలపరాక్రమాంబుధికిఁ బెట్టుడు చూతము రాలవంతెనన్
దూలినయట్టి ప్రాణములతోఁ దలమున్కలు పుక్కిలింతలై
తేలగ వేయుచుం గనులు తెట్టెలు కట్టుచుఁ గొండలంచులన్. 305

ఉ. కట్టిన దిండ్ల విండ్ల బెనఁగం జనుదెంచిరి పెద్ద నేర్పుచున్
జుట్టిన పాఁపచుట్టలయి చూడిన బొమ్మలఁ బూఁత తంగెడుల్
కట్టిన కట్లుగా నొడలు కాళ్ళును జేతులు నాడకుండఁగా
బట్టినదారిగా యమునిపట్టణవీధికిఁ జేరవచ్చుచున్. 306

క. కనిపించిన దవ్వునఁ బట్టను వచ్చును రోదసీకటాహమునందున్
వినిపించిన దవ్వునఁ గొట్టను వచ్చును రోదసీ కటాహము పగులన్. 307

చ. వెలుఁగులె లెక్కపెట్టెదరు వెజ్జులు వేల్పులు, నంతకంటె వె
జ్జులయివ మానవుల్ మఱియిరుల్ కనిపింపఁగ నీవి పెందరుల్

తెలియగలేరు, ప్రాణములు తీసెడిచోటులు వానిలోపలన్
మెలఁగగ, లేనిచో వెలుఁగు మేలిమి యెవ్వాడు నున్నదేకదా!

శా. సీతందెచ్చెను తండ్రి, నేనయినచో శ్రీరాఘవుం దెచ్చెదన్
సీతం దెచ్చిన రాఘవుం డిటకువచ్చెం గోపియై చాపియై
సీతాదేవియు రాద రాఘవుని దెచ్చెన్నాఁగఁ దావచ్చినన్
సీతాదేవియుఁ బ్రార్థనావివశదాసీభూతయై యుండెడున్. 309

గీ. అన్నివిద్యలు బ్రాహ్మణులందె లేవు కొన్ని క్షత్రియులందున, గొన్ని దైత్యు
లందునున్నవి తెలియరన్యోన్యమవియు దానవుల గెల్వఁగారాదు మానవులకు.

శా. లీనంబై చను చోటి చీఁకటులపై లేదింతయున్ శక్తి ప్ర
జ్ఞానార్చిః పటల ప్రభావితతి, కజ్ఞానానికిన్ దాని వి
ద్యానైపుణ్యము దానికున్నదియుఁ, దానై కొన్నిచోట్లన్ సమ
స్థానన్ దక్షము, తద్వ్యయంబుప్రళయాంతంబైనచో నొప్పనో.

మ. ఇవిగో కన్పడరాక యిద్దఱ మహోహిక్రూరనారాచర
జ్జువులం గట్టిద నంగుళాంగుళము మైఁజూడింతుఁ గాడింతు మూ
ర్ఛవడన్ రేనడిజామునన్ విడిచిపోఁ బ్రాణంబు లూనంబులై
రవి రేవప్పలఁ దీయ రాఘవశరీరారామ పుష్పంబులన్. 312

గీ. అంత రామచంద్రుఁ డతనిని దనచేతి మీఁదుగా వధింపఁగా దయార్ద్రి
హృదయుఁడగుచు నిర్ణయించెఁజేయనటంచు నంత మింటవచ్చె నంపవాన. 312

సీ. అప్రత్యభిజ్ఞాతమౌ దిశాయాతముల్ శరపరంపరలచే విరిసి విరిసి
అశనిప్రరోహ బాలిశము లరుంతుదంబులు బాణములచేతఁ బొక్కి పొక్కి
ప్రతిభాముషంబు లప్రతిసమాధేయమ్ము లగు పృషత్కములచే నలసి యలసి
అప్రతర్క్యాత్వరాహంకార ఝుంకార పాతిత నారాచపటలిఁ బెటిలి
గీ. ఒడ్డుకొనుచోటఁ గొట్టగాఁబడ్డ మేన తప్పికొనుచోట శరపాత మొప్పు మేన
వీగికొనుచోట ముల్కి క్రువ్వినది మేన రాఘవశరీరములు శరారామమయ్యె.314

సీ. మిన్నువంకను జూచుచున్నఁగానీ కన్ను వ్రాలినమేర బాణాలెగాని
వ్రచ్చుబాణము తీయ వచ్చుఁగానీ వ్రేళ్ళ గ్రుచ్చుచుండిన యంపకోలగాని
తిరుగ బాణమ్ము సంధించుఁగానీ దాని పరగించునెడ యేరుపడదు గాని
తన యమ్ము గొనఁ బ్రయత్నమ్ముగానీ కక్ష భాగతాడనకలాపమ్ము గాని
గీ. కాల్కదుప వీలులేదును గైకదల్ప వీలులేదును పంజరవిధముగాఁగఁ
బంజరంబైనఁగాని లోపలఁజరింప సుంతయెడమున్నయట్లు తోచును నిజంబు.

సీ. పడినప్డు దంభోళిపాతఘాతములయ్యుఁ గలితదంష్ట్రాభుజంగములు చుట్ట
లై చుట్టుకొనెడు బాహాదండములయందు నల గగురా దేహయష్టులందు

కదలనీయవు కాళ్ళు మెదలనీయవు మేను లంతట మంత్రించినట్లు గాఁగ
మెసలనీయవు సుంత మసలనీయ వొకింత నంగముల్ జంత్రించినట్లు గాఁగ
గీ. తనువు లాయయి పక్షపాతంబు వచ్చి యట్లె వెంబేదలయిన సింహములవోలె
నన్నదమ్ములు కదలికయులే విలోచనాంతముల దేవతామూర్తులగుచు నిలువ. 316

ఉ. మున్ను కబంధదానవుఁడు ముట్టినయప్పుడు కూడ ధైర్యపుం
దెన్నున వీగిపోని రణధీరుడు రాముఁడు కన్నులందునం
గ్రన్నన జాలి యూట గొనఁ గన్గొని తమ్ముని, వీఁడొకండు న
న్నున్నెనరూని వెంటబడి నూల్కొనె నీగతియై తగుల్కొనన్.

వ. అనుకొంచు సుషేణ నీలాంగద శరభ వినత జాంబవదృషభులను చుక్కలత్రోవ
వానియిక్క యెక్కడనో త్రొక్కిరమ్మని పలు దిక్కుల వారి నొక్కొక్కనిఁ
బంపిన వారు మిన్నెల్లఁ దిరిగిన వారెగాని, వారి కలచోటు నెఱిఁగినవారు
గాక వాని గ్రుచ్చిన యమ్ములచే నేదువందులవోలెఁ దిరిగివచ్చిన. 318

మ. తన జ్యానిస్వనగీతికారవముచే దైత్యున్ విమోహింపఁజే
యను వాంఛించెను స్వామి, యేమియగుఁ జేయాడంగ రాకుండినన్
దనకుం దమ్మునకున్ దనూయుగమునం దంగేడులై పూచెఁ బూ
చిన తంగేడులు నెఱ్ఱతేనె లొలికించె న్నాఁగఁ గన్పించుచున్.

గీ. ఇంద్రగోపచ్ఛటాసమావృతము లయిన వార్షుకముల నీలానీలపల్లవములు
తరుణనవతమాలారగ్వధముల వోలె నెఱచెడి రఘూద్వహులు శయనించినారు.

క. తా మేనిబాధ వదలఁగ స్వామి సమాధిగతుఁడయ్యె సౌమిత్రికిఁ దా
నేమో తెలియదు రాముని నేమో యేమో తలంచు నేర్పడరాకన్. 321

చ. మరియును బ్రాణముల్ కలవు మానవనాయకు లిద్దఱుం జలిం
పరు, కనులెత్తి చూడరును, బ్రాణము లున్నవసంగ వీలులే
దొరిగి శయించి ధాత్రిపయి నుండిరి, ముక్కున వ్రేళ్ళుపెట్ట నూ
పిరియును నాడునట్లు కనిపించదు వానరు లావటిల్లగన్. 322

వ. అంత నింద్రజిత్తు సర్వకపిసేనాపతులను నరుంతుదములయిన బాణమ్ముల గాడ
నేసి యందఱుం జదికిలఁబడి నిస్సహాయులై యుండగా నమ్ములఁ బరగించు
టాపి మింటనుండి జ్యామహానిస్వానమ్ముతోఁ బాటు వికటాట్టహాసంబు సేసి
యిట్లనియె. 323

క. ఈ కట్లు విప్పవాఁ డీ లోకంబునలేఁడ యింతలో రవిపొడుచుం
గాకుత్స్థులప్రాణంబులు కోకొల్లలు మహిషరాట్కకుత్స్థంబులుగా. 324

శా. ఓహో దానవులార! మీరుడుగుడీ యుద్ధంబు, స్వీయంబులౌ
గేహంబుల్ చని యాత్మయౌవతము కౌఁగిళ్ళందు నిద్రించుఁడీ

మాహాత్మ్యం బఱి మానవద్వయము సస్మద్బాణసంపాత సం
దేహోత్థమ్ముల్ శయనించి రాహవధరిత్రిన్ రక్తపిండంబులై. 325

ఉ. వాసుకితక్షకాదు లహివల్లభు లూర్జితు లస్మదీయ బా
హాశరమూర్తు లుగ్రవిషు లంగములం బిగియించి రిద్దఱన్
బాసిరి తెల్వి యెల్ల గడఁబట్టెను బ్రాణచయంబు, రేపు ప్రా
చీసతి పైటయం దెఱుపు చెక్కును భానుఁడు పైడినొక్కులన్.

సీ. కపిసైన్యమింత చీఁకటి నెత్తినన్ వేసి కొని తెల్లవారించుకొనును దాన
వదఁడా గృహంబులు కదలి యాకపిసేన రే పంబురాశి తరించిపోవు
నన్నదిగద కట్టికొన్నట్టి వంతెన, తెల్వితక్కువఁగ ధాత్రిం గలట్టి
యడవులు గుట్టలు నడ్డకట్టను గట్టి బెకలించుకొన్నారు వెఱ్ఱి మఱల
గీ. బొరియలందున నిద్దురపోవలయును మన్నుతినవలెఁ బోయి, మీ మత్తకాశి
నీసమాజంబు చెక్కిళ్ళనిద్రపొందు బెడఁద వాసెను గ్రోఁతులపిండువలన. 327

వ. అంత దానవు లెల్లరు బండ్లు మళ్ళించుకొని పురప్రవేశంబు సేసి ద్వారం
బులు బంధించుకొని, క్రమ్మిన మాయాంధకారంబు విరిగి పోయి చుక్క
లొక్కొక్కండు తోఁచిన. 328

గీ. మేఘనాదుండు తండ్రిసమీప మేగి జగదసాధ్య మహాకార్యసాధన ప్ర
వీణతాసూచి మంథరవీక్షణములఁ బ్రౌఢశూరతనూముగ్ధ భంగిమముల. 329

మ. శరధారాంతము పెల్లగించితి మనశ్శల్యంబు నీ వింక సు
స్థిరుఁ డౌచున్ దివిషత్సపత్నక ధరిత్రీసార్వభౌముండ వం
బురుహాప్తుం డుదయించుదాఁక శశి యంభోరాశిఁ బొంగించుదాఁ
క రమామూర్తివి యేలుకొమ్ము త్రిజగత్కామాంకుశాకారుఁడై.

క. ఏకట్లు కట్టినాఁడనొ యాకట్లను విప్పఁగలుగు నాతఁడు లేఁడీ
లోకంబందున, రేఁపటి దాఁకన్ గాకుత్స్థు లసుపథాన నిలువరున్. 331

శా. నీచుల్ కోఁతులు పడ్డరాఘవుల పొంబెన్ గొంతుకూర్చుండి నా
రాచంబుల్ పరగింప నేను గనులన్ రక్షించుకొంచుండి దం
ష్ట్రాచంద్రాతపమందు మద్విశిఖధారాధాళధళ్యంబు భీ
వైచిత్ర్యంబు ఘటింప బిక్క మొగముల్ పడ్డారయా! మత్పితా!

గీ. ఎఱిగి యెఱిఁగి నీయూరిపై నెత్తివచ్చి నట్టి బిఱ్ఱులు చెడి మొగమందు వ్రేల
నైనకపిజాతి పెట్టినయట్టివంతెనంబడి యుష్మన్నఁబలాయనముపఠించు. 333

వ. అనిన రావణుండు 'అవునోయి నాయనా! నే నిట్లే యనుకొంటిని. నీ విట్లే
చేసితి' వని కొడుకుం గౌఁగిలించుకొని వదలిపెట్టగా. 334

క. పసిపిల్లవాని పోలిక నిసిరింతలు వార మింట వెగురుచు నేగెన్
మిసిమింతుఁడు కానట్టుల నసురేశసుతుండు వికటహాసనుఁడై. 335

క. నిస్సంశయాత్ముఁడై రక్షస్సమాట్టంత గండసంక్రాంతదృశాం
తస్సంవలితాంశు వమృతభిస్సారి విచిత్ర మూహా వెంపెసలారన్. 336

వ. కాగడాలతో నడపకత్తియలతోఁ జామరగ్రాహిణులతో వర్షధరులతో సువిదపిం
డుతో మైఁజుంగులువారు పట్టు పుట్టములతో ముంజేవ్రాలు రత్నకంకణములతోఁ
దండకడియములతోఁ బది వ్రేళ్ళఁ బచ్చల యుంగరములతో బుస్తీలతోఁ గలిపి
దువ్విన మీసలతో నశోకవనికేగి రత్నాసనాసీనుండై యిట్లనియె. 337

శా. ఓసీ! మైథిలి! నీమఱంది పతియున్ యుద్ధంబు గావించి తీ
వ్రాసువ్రాతమునందునన్ దొలఁచిరే యానందరేఖామతీ!
నీ సాన్నిధ్యము చేరవచ్చితిని సూ నేఁ బ్రేతమూర్తిన్ దిదృ
క్షాసంపాదన చేసికో దితిజవంశస్వామి దేహంబునన్. 338

ఆ. ఓసి పిచ్చిదాన! యుగ్రాహవంబందు నింద్రజిత్తొకండు నిద్దఱికిని
బ్రాణపంచకంబు పట్టించె యమపురి పథము మత్సకల విషక్షపథము. 339

ఆ. తరుణి! చివరిచూపు దక్కించుకోనైన నిపుడు పోయి చూడ నెసఁగు నీకుఁ
జివరి కేనుగాని చెప్పలేదంచును గూరి యెడఁద నెంచికోను వచ్చు. 340

వ. మొన్న నా నెఱపిన మాయా రామలక్ష్మణ శిరోనాటకంబును నమ్మనేర
వయ్యెదవుగాక పుష్పకంబు సిద్ధపఱచితి పోయి చూచి రమ్మని, త్రిజట
యున్నదికదా నీ పక్షముది, దానిని బంపింపుమని త్రిజటను బయలుదేరించి
పంపించి. 341

మ. సుదతీ! యింక నతండె నీకుఁ బతియంచుం గూరుచుంటేనిఁ దా
నది యుండెంగద వానివంటి పతిచే నగ్నిప్రవేశంబు త
ప్పదు, నీకేటికిఁ జావఁగా వలయునే బాలేందుఫాలస్థలీ!
మదకుంభీనస సత్ఫణాసదృశ సమ్యఙ్నాసికాలోచనా! 341

మ. అవి యైరావణకోటి ఘోరఫణిరాజాహంక్రియా సారభూ
త విషాకారక మంత్రనిర్మిత మహాస్త్ర వ్రాత రజ్జుక్రియా
నవబంధంబులు, విప్పికో వవి తనూనాళంబులం దెక్కిన
ట్టి విషం బంతటఁబ్రాణముల్ తొలఁచు బాటీరార్ద్రిగండస్థలీ!

ఆ. అనిన సీత యిట్టునియె నేటికిఁబంపఁద్రిజట సాక్ష్య మేమి తెచ్చుఁ జెపుమ
బాణబద్ధుఁ డగుచుఁ బడియుండవచ్చును రాముఁడట్లు తలచె నేమొ యిపుడు.

క. మున్ను విరాధుఁడు తమ్మున్ మిన్నంటు బుజానఁ గొంచు మెలఁగిన దవ్వై
చన్నాఁడు నన్నుఁ గంచునె యున్నాఁడ య్యసుర బ్రదికియున్నది లేదే! 345

క. కనుకని రాముం డట్లై నను ముల్లోకంబులుండునా? యున్నవి, నీ
యునికియు లేదప్పుడు, నా యునికియు లేదపుడు, బ్రతికియున్నాముగదా! 346

గీ. అంత మన్నించెనేమొ నీయాత్మజాతు నింతదూరముగాఁగ రానిచ్చుటకును
మూఁడులోకమ్ములకుఁబ్రభున్ భుజంగబంధములు కట్టెనను పేరువడనిమాట.

గీ. నీవు తలఁచినదే నీవు నిక్కమంచు నెంచు మప్పటికిని నేమి మించిపోయె?
బూర్వగిరిపైని భానుండు పొడుచులోన బ్రతుకఁబోఁడుగదా చూడవచ్చు నపుడు.

గీ. గగనమందుండి యమ్ములఁ గట్టివేసి చచ్చినా రనుకొని యేల వచ్చె నతఁడు
చచ్చిరో లేదొ దిగిచూచి చక్క నద్ది నిజము చేసుక రాలేదు నీదుకొడుకు.

వ. అనిన రావణుం డీమె యింతది యని నా కేఁడాది తెలియలేదు. అనాడు లక్ష్మణుండు మాట్లాడినట్లు మాటాడుచున్నది. అతనియం దీమెకు గల ప్రత్యయములోఁతునకు సముద్రములు చాలవు, ఎత్తునకుఁ బర్వతములు చాలవు, వేగమునకు నదులు చాలవు. ఇంత ప్రశ్రయము విశ్లథీకరింప శివుఁ డొక్కడే దయచూడవలెనని. 350

ఆ. సంశయాత్ముఁ డగుచు జనుదెంచి నింటికి నాత్మరథపతాక మందుఁ దోచె
ముప్వగముల యులివు మునిగిపోయిన శబ్దమునకుఁ బ్రాణములను బోసినట్లు.

వ. అంతఁ బుష్పకావరూఢయై తిరిగివచ్చిన త్రిజటను గాంచి జానకీ దేవి ప్రాణమ్ము లన్నియుఁ గన్నులలోఁ బెట్టుకొని యుబికి వచ్చు దుఃఖమ్ము గొంతులో నొక్కికొని నెలలతరబడిగాఁ గూర్చున్న వైఖరిమాని ప్రతీక్షాపరమార్థమూర్తి యూరకుండినఁ ద్రిజట యిట్లనియె. 352

ఉ. మేదిని నున్న మానవుల మేనుల నంగుళమైన మేరయున్
లే దరియమ్ము క్రుమ్మనిది లిప్తము కాని దస్పృశ్యయంబునన్
లే దొకయింతయున్ స్మృతి, చలింపవు కాలును జేతు లూరుపున్
లేదు, మొగాలుమాత్ర మమలీకృతపార్వణచంద్రబింబముల్. 353

ఉ. గ్రుచ్చుకయున్న బెట్టిదవుఁగోలలు మేనికి బాధ యుంచునఁ
బుచ్చురు ప్రాణభీతిమెయిఁ బుచ్చిన వచ్చునికంటివెల్గుగా
వెచ్చని యూర్పులన్ మఱియు విచ్చినగుండెలఁ గూరుచుండి లోఁ
జొచ్చిన యాత్మలై కపులు చుట్టును నుండిరి మౌనమూర్తులై.

గీ. కొన్ని కోఁతులు, పండి లోగుంజు వెలుఁగు చిమ్మఁబగిలిన సీతాఫలమ్ము లట్లు
దంతములుబాహిరించి హస్తములయందు నొప్పచెక్కిళ్ళుగాఁగ గూర్చుండినారు.

మ. అనినం జానకి యిట్లుగా ననియె నీయాలాపముల్ విన్న రా
మున కేయాపద లేనియెట్లుగనె యంభోజాక్షి యూహింతు వం
చనిపించున్, నిజమా? యటన్న, నిజమా? యానేను కన్నట్టి చి
క్కనిస్వప్నంబులు వ్యర్థమై చనునటే కాశ్మీరగండస్థలా! 356

వ. నేను లేనపుడు పెద్దతండ్రి నీతో నేమేమి యనెను? నీవేమేమి చెప్పితి వనిన

జానకి  యంతయు నుడువగా, నంతయు నట్టిదియ, నీకుఁ బెరయూహ లెట్లు
వచ్చునని త్రిజటయన, సీత యిట్లను కొంచుండె. 357

చ. ఇదియొక మ్రొక్కు మ్రొక్కెదన, యెవ్వరునెప్పుడుగాని మ్రొక్కన
ట్టిది యిది, నేను సామి పొగబెక్కముపెన్దుముదారు సాకిరై
పొదలఁగఁ బెండ్లియాడితిమి, మోహనరూపుఁడు రాఘవుండు నా
పద యిది దాఁటినన్ త్రిదశవంద్యున కాహుతినౌదు నగ్నికిన్.

వ. నా కీ యూహఁ గలిగించిన రావణుని గురువుగా స్వీకరించి యాతనికి  నమ
స్కరించెద.

మ. హ్రదరూపంబున నేర్పరించి చితి నే నగ్ని ప్రవేశంబు సే
సెద, నీమ్రొక్కు నుమ్రొక్కితిన్ హుతవహా! శ్రీరామచంద్రుండు నా
యెదలో నుండిన దీవ మారమికి నీ వీ కోర్కి పాలించినన్
మదకుంభీనస మూర్తిలక్ష్మణునకున్ మన్నించినం బ్రాణముల్. 360

వ. అట్లు పుష్పకంబు వచ్చుటయుఁ బోవుటయు నం దెవ్వరో  స్త్రీలుండు
టయుఁ గాంచి రావణుని రాణివాసమో, రావణి పెండ్లమో యని సుగ్రీవుండు
దుఃఖంబులో నుండి పొంగివచ్చు కోపంబున నిట్లనియె. 361

ఉ. చేతులుకట్టికొంచు సరసీరుహబంధుసుతుండు నిల్చుచున్
మూతిబిగించి రాఘవు లమోఘశరంబుల నిట్టు లైరటం
చాతతమోదముం గనెడు నాశరసంతతి రాక్షసావలిం
గోతులఁ బూడ్చి పెట్టెదను నొక్కని కొక్కఁడుగాగఁ ద్రవ్వుచున్.

క. వధియించెద రాక్షసులను మధియించెద లంకయెల్ల, మఱి రావణుఁ బె
ట్టి ధరిత్రిఁ గాలరాచెద నధముల, నిల్లలుకఁ బండు వైనదె చెపుమా. 363

శా. ముంగాళ్లన్ విదలించు చశ్మనిచయంబుల్, చేతులాడించుకొం
చుం గిష్కింధకుఁ బోరు వానరులు, రక్షోజాతి ప్రమందించి ర
క్తాంగుల్ లంక యటన్న పేరు వినరానట్లాచరింపంగఁ బో
నుంగా నైనజనంబు పోయెదరు గండూషించుచున్ నెత్తురుల్.

మ. పొగబెక్కెంబగు వేల్పు సాకిరిగ నంభోజాక్షుఁ డీ రాముఁ డం
తగ నాతోడను గట్టె చెల్మియనగా దైతేయదుర్జాతి నే
మిగులంజేయుటకా? యొకొక్కని మహోమృత్యూగ్రవక్త్రాగ్రవ
ర్తిగఁ గల్పించినఁగాని పోఁడిచట సుగ్రీవుం డపగ్రీవుఁడై. 365

క. ఈ హనుమచేత లంకాదాహము చేయించి మఱలఁ దద్వహ్నులలో
నే హరి నాతో దూకునొ యాహరిపతితోడ రాఘవానుగుఁ డౌదున్. 366

ఉ. అంతఁ బ్రచండవేగ చలితాద్భుతవాయుతరంగ సంహతిన్
సంతతధూతవార్నిధి వృషత్పరిషత్ప్రవిచాలనంబునన్

వింతగఁ జూచునట్టి కపివీరుల కన్నులు కందళింపఁగన్
జెంతఁ బరున్న రాఘవుల చిక్కనిముంగురు లల్లలాడఁగన్. 367

క. హనుమంతుఁ డందయుండెను నినిచిన వార్నిధిని దాఁటు నిర్భరుఁ డెవఁడో
యనిపించెఁ బక్షసంహతి వినిధూతపయస్తరంగ విభ్రాంతముగా. 368

శా. తానిట్లై గగనంబునం జన సముద్రంబింత ఘోషించునా
నానెంచెన్ హనుమంతుఁ డంబుధిపృషత్స్నాతాక్షి కోణంబుగా
గానన్‌రాని మహానుభావుఁ డెవఁడో కంపించు నాకాశ నా
నాణుప్రాతము లోనలోన గుడుసుళ్ళై పైన సుళ్లై చనన్. 369

ఉ. ఈదెసనుండి వచ్చునని యెంచఁగరాదు మహాణుసంభ్రమం
బైదరికొన్న యంబుధియు నంబరముం గదలాడిపోవు, సం
పాదిత పక్షమారుతజవంబున వచ్చిన వైనతేయుఁడుం
గాఁదగుఁగాక, యిట్లగుట కల్గవు భౌమములైన వేగముల్. 370

వ. అంత నమ్మహాతేజంబు సన్నిహితం బగుడు నొడళ్ళఁ బాములు ప్రాకుచు
న్నట్లున్న వానరానీకినికిఁ దమానిర్వాణంబు సంఘటిల్లె. శ్రీరామలక్ష్మణుల
దేహంబుల బ్రాణంబులు విరిసె. వ్రణంబు లంతర్హితంబులయ్యె. మేనులఁ
జలనంబు సమకూరె. వారొదిగి శయనింపఁ గపిసైన్యంబులకు మనస్సులలో
మనస్సు లుండె. శ్రీరామచంద్రున కిట్లు వినిపింపం దొడంగె. 371

శా. స్వామీ! వాసుకితక్షకాదిభుజగాంశస్థాను లీ యస్త్రముల్
నా ముం దాగవు త్రోటిపక్షనిహతిన్ నాగాళి భోగాళి పెం
పేమో నిల్వదు మంత్రపూతమగు నా పేరే భుజంగాధిప
గ్రామాభీలవిధూననోగ్రము రమాగ్రై వేయబాహాలతా! 372

గీ. సర్వమంత్రశక్తి సంభవిల్లినచోటు నీవుగాన నన్ను నీవు తలఁచ
సృష్టి మొదట నాకు సిద్ధించిన బలంబు నేడు సంఘటిల్లె నీరజాక్ష. 373

శా. ఈలోకంబులకెల్ల నుత్తరముగా నేపారు వైకుంఠమై
యీలోకంబులకెల్ల దక్షిణముగా నేపారు పాతాళమై
శ్రీలీలామదనాభిరామ తను! ఆక్షీణత్వరాహంక్రియా
హేలాయానము సేయగల్గుదును నే నిచ్చోటి కచ్చోటికిన్. 374

శా. త్వాద్వృక్షిత్యమతుల్ సనాతనబుషుల్ త్రైలోక్య సంపారసం
పాదుల్ సంస్మరియింత్రు, మీస్మరణచేఁ బాలింపఁబడ్డట్టి మే
మాదిశ్రీ మహితాక్ష రాకృతులమై యాకల్ప మీసృష్టి సం
పాదింపం దొరకొంట నీస్మరణచే మన్నాము ప్రాణ్నాయకా! 375

మ. సతతాంతస్తవమున్ బహిర్ముఖముగా సంధించి నీ వక్షరా
కృతి నాదంబు వికార మందగను దచ్ఛీనాదనానాత్వసం

గతి మే మీ గతి తైజసాకృతులమై కాలంబు పాలింతు మూ
ర్జిత మోంకారము నుండి సల్పితివి సృష్టిన్ సర్వక్రత్వాకృతీ! 376

వ. అంత విశ్లథమాన సమాధిద్వితీయదశాగతుం డగుస్వామి కిట్లు వినిపింప నారం
భించె. 377

ఉ. పచ్చని నీదు మైజిగులు ప్రన్నని తేనెలు జాలువారుటో
విచ్చిన తమ్మిపూవయిన విశ్వమునందు బడిన్ బరీమళా
భ్యచ్ఛయమూర్తి లక్ష్మియయి పొల్చిన నీ కుసుమత్వసంపదన్
మెచ్చిన బంభరాళులము మేము, మముం గృపచూడవే హరీ!

ఉ. త్రచ్చిన పాలవెల్లి నరుదారగఁ జిక్కన తేలిపోవగా
ముచ్చిరపోవు మందరము మూలమునందున వీఁపు డిప్పగాఁ
జొచ్చి సముద్ధరించితివయా! తొలినాఁడు సురాళి నెల్లనీ
విచ్చినదైన యా చనవె యిప్పుడు నీనుతివాంఛఁ గొల్పెడున్.

ఉ. అచ్చపుఁ జల్లనౌ కరుణ యారక యూరకయూర దిద్ది గో
ర్వెచ్చని కంటినీరు ప్రసరించిన మా యెదలోని బెట్ట, నీ
పచ్చనిమేని క్రొమ్మెయిలు పట్టిననీడలయందు మాయెదల్
విచ్చగ నీయుమయ్య రఘువీర! జపాకుసుమాభిరామముల్. 380

ఉ. ఎచ్చటొ దవ్వునం దయిన యిచ్చకపుం బలు కర్థమెంచి లోఁ
జొచ్చిన జాలిగుండె యయి చూచెదు, దానవజాతి యెట్టిదో
మచ్చును జల్లి దొంగిలెడు మాయలమారిది, నీవుగాని య
ట్లిచ్చుటఁ జేయకే రఘుకులేశ్వర! భూమిసుతాహృదీశ్వరా! 381

వ. ఇట్లు క్రమ ప్రాప్తరామచంద్రావస్థుఁ డయిన ప్రభువుతో పాటు సౌమిత్రియు
లబ్ధప్రత్యభిజ్ఞానుండయి స్వామి నిలుచుండి యల్లె త్రాడు మ్రోయించిన. 382

శా. లంకాంతఃపురకామినీకుచయుగీ లావణ్య విస్తీర్ణతా
సంకోచంబులు, దైత్యనాయక శ్రవస్సంచారరేఖాసమా
తంకంబుల్, దితిజాతసైనిక మనోధైర్యాద్రికుట్టాకవ
జ్రాంకంబుల్, పతి యల్లెత్రాటి నినదవ్యాహారముల్ పొల్చినన్. 383

గీ. అంత లంకామహానగరాంతరమున నొక్కసారిగాఁ దెలవారె దిక్కెఱుఁగక
యెఱిఁగిజ్యాధ్వనియంచును నెఱుఁగరాకమూఁగలగుచు గుబ్బసలాడిపోయినారు.

గీ. ప్రాచిఁ బడఁద్రోలి నేడుగుఱ్ఱాలముట్టెనరువుతెట్టెల తుంపురుల్ విఱిచెనిరుల
తరణి యరదంపుఁబడగపై విరియుమువ్వలులివ్వలెఁ దోచెఁ బక్షులకలకలంబు.

సీ. పశ్యతోహరణభావసమృద్ధి జలబిందు సంగ్రహణోగ్రకౌశలము లయిన
తపనవేళా సమార్త ప్రాణదానవిభూతి రేఖాగ్రనైపుణము లయిన

జాగ్రదవస్థాప్రసాదన ప్రావీణ్య లలిత రేఖాజటాలమ్ము లయిన
నిత్యమందేహోఖ్యదైత్యమర్దనకళా నఖరాగ్ర లీలారుణంబులయిన
గీ. చంద్రబింబ ప్రసాదనచణము లయిన స్వర్గధామప్రవేశ భాస్వరము లయిన
అఖిలలోక వికాసపర్యాప్త మయిన పద్మ బాంధవ కిరణముల్ బయలుదేరె.386

సీ. నలినకాంతా సమానతగండభాగానఁ జిటిక వేసెనొ నవ్వు చెఱగిపోసె
ముద్దమందారమ్ము బుగ్గపై నొక్కెనో కమిలిపోయినయట్లు కందిపోయె
లలిఁబారిజాతమ్ము గిలిగింత పెట్టెనో తూఁగాడు కొమ్మనే తూలిపోయె
రాదంచుమోటుపరాచిక మాడెనో ముగుదకల్వయుమోముముడుచుకొనియె
గీ. రుద్రజట ముక్తకంచు కారూఢయయ్యె చంద్రకాంతమ్ము చిఱునవ్వు సంతరించె
నొక్కఁ డొకఁడు స్వభావంబు పిక్కటిల్ల నబ్జబంధుని బానిసలైన పూలు. 387

గీ. నిన్న రవితోడఁ బడమటితెన్ను తిరిగి భూమిలోఁ దూఱి పాతాళముఖముగాఁగఁ
దిరిగియుదయించుచుండగాఁదరణి చీల్చిభూమిఁ దావచ్చెనోప్రొద్దుపొడుపుఁ బూవు.

ఆ. వరమపౌరుషంబు ప్రభవ మౌస్థానంబు చండమూర్తి తమ్మిసంగడీఁడు
నొక్క స్త్రీత్వరేఖ యొప్పి గోరంటాకు కూర్చికొనియెనేమొ గోళ్ళయందు.389

మ. తన యుద్యానవనాన రావణుఁడు ప్రాతఃకాలశోభావినూ
తనసౌందర్యముచూచి కోపమున నిద్రాహీనమౌ లోచనా
రుణిమం గన్గొనుచుండ విన్బడియె సక్రోధోగ్రకోలాహల
స్వనముల్ దుర్గకవాటపాటనకళా ప్రారంభసంరంభముల్. 390

వ. మహాకాంతారమ్మునఁ గోటికోటి సింహవ్యాఘ్రభల్లూకవరాహంబులు గర్జాఘుర్ఘు
రంబు లొక్కపెట్ట చేసినట్లు వినిపించిన నిది యేమియని యడిగిన జ్యానిస్వాన
భయంకరులయిన రామలక్ష్మణ పురస్సరంబుగా వానరసైన్యంబు విజృంభించు
చున్నదని విని నిలుచున్నవాఁడు నిలుచున్నట్లు ప్రాన్పడి, తేరి, కొంతసేపటికి
నేకాంతంబున. 391

ఉ. విల్లునఁ జెప్పరానిదియు వెక్కసమై చను నేరు పుండఁగా
జెల్లున, యగ్నివాయుసరసీరుహసూతిముఖాస్త్ర విద్యయుం
జెల్లున, తక్షకాదిపరిషించిత వాంతవిషానలాస్త్ర వి
ద్యోల్లసనంబు తా నెటుల నుండెనొ యాతనివద్దఁ జిత్రమై. 392

శా. ఎన్నో యేండ్లు భుజంగలోకమున భోగీంద్రాళి బంధుత్వమై
కన్నాఁడీ వటుశక్తి యింద్రజి తిరస్కారంబుగా శత్రురా
జి న్నిల్పోవ ననన్యసాధ్యముగ, నీ శ్రీరాముఁ డేరీతిగాఁ
బన్నాగంబులు పన్నె నిట్లు విదలింప న్నాగబంధంబులన్. 393

ఉ. ఆనతచారుతార్కిక మహోవిభవోజ్జ్వల వావదూకతన్
జానకి యట్టులాడినది, సౌర్యుఁ డితండు భుజంగరాజమం

త్రానతబంధముల్ దులిచె నద్భుతమై చన, రెండు రెండు నా
కైనను దాఁచియుంపఁ బడినట్టుల నిట్టలమైన దీక్షతో. 394

చ. మరియును గాననంబులను మందులు మాఁకులు నేర్వవచ్చు నీ
వరమరహస్యముల్ భుజగవల్లభరాజి ముఖోపదిష్టముల్
కఱవగ నెప్ప సాధ్యములు కానివి యాతఁ డెఱింగె నెట్టు లే
వెరవున నెంతకష్టపడి వేల్పులకైనను నేర్వరానివై. 395

మ. జపవంతంబులు కామసంగతదురాచారంబు లింతన్ సహిం
పవు హోమాదిప్రసన్నముల్ మఱి మహామంత్రంబులెల్లన్ స్వయం
భువముల్ కావుగదా రఘూత్తమునితో ముల్లోకముల్ వీనిచే
నవునంచున్ వచియించు మైథిలియు నేమాశ్చర్యముల్ వొల్చెడున్.

శా. ఎన్నెన్నింటికి నెంతయెంత యగునో యీ రాఘవుం డక్కటా
మిన్నాగుం గొనితెచ్చికొంటిని సముస్మీలత్ఫణాసాధువున్
మిన్నే ర్గ్గదఁగిరేకుగాఁ బొదువు సామిం గొల్చి యీరీతిగా
నున్నాఁడన్ మఱి యేమికావలయునోహో యల్ప తేజస్కులై.

శా. మున్నెన్నండు నెఱుంగనట్టిది పరాభూతిన్ సహింపంగ నే
ర్చు న్నిర్వ్యాజపరాక్రమాంబునిధి యౌచున్ మేఘనాదుండు,నే
నన్నన్ జూచుచుఁ జూచు చేపగిది నీపై నీవునై యంచుఁ బొ
మ్మన్నన్ రామునిమీఁదికిన్ దితిజశూరానేకముల్ మెచ్చునో.

ఉ. ఆతఁ డధీతగారుడమహామను వైనను నాగబంధన
వ్రాతము విచ్చికోనయిన వచ్చును వచ్చినఁ దక్కులౌ కరా
ఘాతజముల్ వ్రణంబు లవి కాయము నింతట దేలికిచ్చునా?
చేతమునందు సంశయము చీలదు చీలును మందుమాకులన్. 399

ఉ. వారలలో సుషేణుఁ డనువాఁడు మఱిన్ ఘనవైద్యుఁడంట తా
నేరిచియుండు నోషధు లనేకము లుగ్రవనీనివాసమై
యారయ నెంతగాయముల నార్పునిమేషములోనఁ గొన్ని సం
ధ్యారుణకాంతులన్ గగనమందెఱుపుల్ విఱుగంగఁజొచ్చెడున్.

వ. అట్లాందోళితచిత్తుండై యిదమిత్థమని నిర్ణయింపలేక మాయాయుద్ధ ప్రయో
జనంబు లేదని యెఱింగి వట్టిపరాక్రమంబ కార్యంబని రాఘవుని ప్రచండధాను
ష్కత్వం బెంచుచుండ. 401

ఖం డాం త ము

గీ. ఇద్ది సంశయఖండమ్ము మద్దికాయ లెనయుకన్నులు గల యెద్దు నెక్కుసామి!
శ్రోతయైన ముక్తీలేశు నాతిథేయపరమతం జూడు కైలాసపర్వతమున. 402

ఉ. క్రమ్మినయట్టి నిట్టయిలకమ్మునఁ గ్రుమ్మినయట్టి తేజు లిం
గమ్ముగ నైనయట్టి యెసకమ్మున వెన్నును బట్టి పొల్చు మూ
లమ్మునఁ దోఁకపై నిలుచు లాగునఁ గ్రొమ్మెడ చుట్టగా భుజం
గమ్ముగ నైనతెల్వి కలుగం గరుణింపవె ప్రాణనాయకా! 403

మేఘవిలసితము.

ప్రాంతోన్మీలితపలితసరసిజా క్రాంతాక్షస్ఫుటకరుణరసధునీ!
కాంతోషస్సితకమలనవదృశా కాంతార్ధీకృతిఘటిత తనుఘృణీ! 404

# కుంభకర్ణ ఖండము

క. శ్రీవరమ సూక్ష్మతత్త్వా దీపిత శైలాంతర ప్రతిష్ఠిత విభవా!
కాపురుష నిరాకరణ వ్యాపారశ్లక్ష్ణరూప పరిణామ! శివా! 1

అ. అపుడు రావణుండు నంతఃపురంబేగి పట్టమహిషిఁగాంచి భామినీ జ
గచ్ఛిరోమణీ! జగన్మహైశ్వర్యంబు వింటివటవె నీవు విమలశీల! 2

మ. నరమాత్రుండఁటె కట్టినాఁడు కడలిన్ నాళీకపత్రేక్షణా!
అరరే నమ్మఁగనేరనయ్యెదనుసూ, అస్మత్సుతుం డింద్రజి
త్తురగ క్రూరశరప్రబంధకలిత వ్యూహంబు నిర్మింప స
త్వరుఁడై దానిని విప్పికోఁగలిగెనే వారాశివీచీదృశా! 3

క. నీవేమందు వనంగను మీ వైఖరి మీకె తెలియు మీరున్ మీరున్
రావణుఁడును రాముఁడు మాకా విషయము తెలియదనిన నబ్జాక్షి వగన్. 4

శా. నీ కిష్టమ్మిది కానియట్లెటులుఁగుదున్ నీరేజపత్రేక్షణా!
నీకిష్టమ్మట నెట్లుగాఁ గలుగునే వీరేజపత్రేక్షణా!
నాకున్ రాముఁడు వార్ధిదాఁటె ననినంతన్ గుండెలో బర్వ్యాఁ
జేకొంటైనది భార మెక్కువగఁదోచెన్ దీనితో నంగనా! 5

శా. గుండెల్ తీసిన బంట్లఁ బంపితిని రక్షోవీరులన్ వార్ధిపై
బెండై తేలుచు వచ్చినాయతనిఁ బిప్పింజేసి రమ్మంచు, రా
ముండున్ రాతిరిఁ జచ్చునంచుఁ గనులన్ మోడ్పించు నింతైనలే
కుండం గడ్పితి, వాఁడు చావఁడును నాకున్ జెప్పలున్ వ్రాలెడున్. 6

చ. సుకముగ నిద్రపోవుటకు సుందరి! నీదగు మేడకాక వే
ఱొకయెడ వీలులేదుగదె యొక్కఁడు నొక్కఁడు వచ్చి నాదుప్రా
ణకములు తీసివేసెద రనాథులు, రామునిఁగాని వానరా
ధికతరవీరు నొక్కని వధించితినం చనువారు లేరిటన్. 7

మ. అకటా! వారినిఁజంపనేర్తురని రవ్వంతాశయున్ లేద, యే
లికనై చంపను పోవగానగునె గేలింగాఁగ? నీమేడ నీ
యొకమాత్రంబుగఁ గూర్కిపోయెద, మహాయుద్ధోర్వి నారాము జం
పకయే తప్పదటంచుఁ దోచెడిని, చంపన్ న్యాయమైపొల్చునో! 8

చ. అతితరమైన మూర్ఖత ఖరాదులఁ జంపెను వాని చానఁ దె
చ్చితి, సరిపోయె, నేడుగడచెన్ గడచెం జలరాశి, నేను మె
చ్చితిఁ, జనుదెంచినట్టిఁడు 'ప్రసిద్ధిగ నాయెలనాగ నీవె యూ
ర్జితభుజశౌర్య' యంచదుగఁ జెల్లున, యిప్పటికిచ్చియుందునో! 9

మ. అతఁడుం గొంచెము నిద్రపోవుటకునై యూశించెనా! యవ్యవ
స్థిత చిత్తున్ సుఖనిద్ర పొందునటె? వచ్చీరాని కన్మాత్రలై

యతఁడున్ నిద్దుర పోయినట్లుగను బోనట్లొచు నుండన్ సమ
ర్పితధీవృత్తిఁ జలించె నాహవమహోవృత్తంబె ధారాగతిన్. 10

చ. అపుడు ప్రహస్తుఁడై పొలిచి యాశరనాయక! యింతదవ్వు నే
రుపుఁ బచరించినా వకట! రుద్రుఁడు వచ్చినయట్టి వాఁకిటం
గవులను తెచ్చినావు భయకంపితచిత్తముతోడ నెట్టివే
లుపులును రాని వాఁకిటను, లోఁకువయైరి సమస్తదానవుల్. 11

మ. చెడఁ గొండంతటి నిన్ను గుజ్జుగను జేసెన్ వాఁడుగో! ఆ మను
ష్యుఁడు గోరంతటి వాఁడుకొండయ్యయిపొల్చున్, గామవృత్తంబునే
ర్పడి యీ యాత్రిప్పాట వేఁడొ సజ్జనుఁడ నేర్చెన్, నేఁడు పోలింపఁగా
నొడయం డింద్రియపంచకంబునను గామోహాళిదాసేరుఁడై. 12

శా. ఉప్పు న్నీ యది తించునుంటి మని నీ యుద్ధాలలోఁ జత్తు మో
యప్పా! జీవుఁడు సర్వకాలము గత ప్రాణుండు కానోపఁడీ
యప్పుం బోలిన జీవితంబునకు మా ప్రాణంబు లర్పించి నీ
యప్పుం దీర్చెద మింతఁ దృప్తిపడు, దైత్యానీకినీ ప్రాజితా! 13

గీ. అటు తిరిగి పండుకొన్నవాఁ డటులఁ దిరిగి నిదురలోపలఁ బండుకొనెన్ సురారి
కొంత నిద్దుర స్వప్నమ్ము కొంతగాఁగఁ గలలు జాగ్రత్తకంటె జాగ్రత్తగాఁగ. 14

మ. మరియుం జూడుము నన్ను నీ కరుణ ధూమ్రాక్షుండ నో దానవే
శ్వర! రామున్ వధియింపు మంచు ననుఁ బంపన్ గుండె నా కాడలే
దరయం దానుగ మేఘనాదకృతమాయావాగురం జీల్చె న
బ్బురమై నేనును నాదుసేన దరియంబోఁ బశ్చిమద్వారమున్. 15

చ. అట హనుమంతుఁ డుండె నతఁ డగ్గిని బెట్టెను నాదుకొంపకున్
బటుతరవైర మూనితిని వానిని జంపుద మంచు నేను న
చ్చోటు చన నాదుసైన్యమును శూరులుమెచ్చుచు నేగుచుండగాఁ
దటుకున నంత నారణపథంబునఁ దోచెను దుర్నిమిత్తముల్. 16

సీ. ప్రబ్బికొన్నశరత్తు మబ్బులేని వియత్తు బెబ్బులిరవములై పిడుగులొత్తు
గబ్బినీలహరిత్తు ప్రబ్బి యెఱ్ఱవృషత్తు జబ్బిచ్చి నెత్తురుజడులు మొత్తు
డబ్బాటుగ మరుత్తు నుబ్బించి ధరమృత్తు దుబ్బులు దుబ్బులై దుమ్ము లెత్తు
నబ్బని శశభృత్తు నుబ్బిరానిసరి త్తుదన్వత్తు గిరియెత్తు తరఁగ లెత్తు

గీ. నుర్వి చలిచేతనుం బోలె నూగుఁగవులు నేర్పినట్లుగ గంతుల నెగడుఁ జెట్లు
బ్రదికిరావింటికంచును బ్రకృతి యంతచెప్పఁగా నాకు వినుటకుఁ జెవులులేవు.

మ. పృతనావర్తుల పెక్కుమంది గృహముల్ వీఁ డల్లనా డగ్నిసా
త్కృతముల్ సేసెను వాని కొక్కొకనికిం గీశవ్రజంబన్న ను
ద్గతకోపంబునఁ గన్పడ న్నమలి మ్రింగం జూచునట్లుండె ద
ర్పితులై వారికిఁ గోఁతిమాంస మనినన్ మృద్వీకమాధ్వీకమై. 18

సీ. కమలు కోఁతులఁ జక్కిలములుగా నమలుచు దాపుకోఁతుల నెత్రు త్రావువార
అనదకోతులగుంపు నాపోశనముచేసి చిలుకు ప్రాణాహుతుల్ చేయువారు
క్రోఁతుల నొక చోటఁ గుప్పలుగాఁ జేసి నులిమి కంకులు కొట్టి నూర్చువార
జయమహాకాళికే జయయంచు బలిసిన హరిజాతివేటల నరకువారు
గీ. నైన దానవసేనచే, నేనుఁగుగమి బడి పొరలినట్టి పెద్దచిట్టడవి వోలె
నైన వానరసేనచే నగ్ను లొలుకఁ జూచిచూచి మారుతి కోప మేచి యేచి. 19

శా. పెల్చన్ దాఁచును రాచెడున్ జమరెడున్ బీడించు గాడించు నే
లు ల్చిందించును నెత్రు, పేరెములువారున్ జాలు దొర్లించు బం
డ ల్చెట్లున్ విసరున్ మెడల్ కొరికి కండల్త్రియు అక్కున్ విద
ల్పు ల్చెర్లాటలు వానిముందు దనుజుల్ పూనూకయై కూఁకలై. 20

క. ఓయయ్య దానవేశ్వర! నా యంతట                యొకఁ డైనన్
నాయేయు వాదరమ్ముల పాయని జడి దున్నపోతు పై వర్షముగా. 21

క. నాడులలో నెత్తురుడికి బాడిదగాఁ జెక్కునట్టి బాణంబులనే
గాడించితి వానితనువు గేడించుచు వాఁడు పెద్దగిరి గొని వేసెన్. 22
గీ. వానిసూటియు వాఁడును బగిలిపోను నారథము గుఱ్ఱములును చూర్ణమ్ములయ్యె
నేను సులువుగఁ దప్పికొన్నాను గాని లేకపోయిన నిదియైన లేకపోదు. 22

చ. ఒడుపునఁ బ్రక్కదాటుకొని యుజ్జ్వలమౌ గద మృత్యుజిహ్వలా
బొడుపులు గల్గినట్టిదియు మువ్వల గంటల నార్చునట్టిదిన్
విడివడి మున్ను నాకముల వేల్పుల మారిమసంగినట్టిదిన్
విడిచితి వానిఱొమ్ముపయి విచ్చిన చిమ్మనఁ గ్రోవినెత్రుగా. 24

క. తాళుకొనఁగ నద్ది మహాకాళుఁడు కావలయు, నిజముగా వాఁడు మహా
కాళుఁడు, వేఱొక గిరి నా మౌళి విసరునట్లు నాకు మనసునఁ దోచెన్. 25

వ. నాకు దెలియ దిందు వచ్చితిని, నీతోఁ జెప్పచుంటి నన రావణుండు పెడ
వైపు తిరిగి పండుకొనియె. 26

శా. నన్నుంజూడవె వజ్రదంష్ట్రుఁడ సమున్నత్యుజ్జ్వల ద్దంష్ట్రుఁడన్
నన్నున్ రామునిఁ జంపుమంచు నని యన్నా డంతఁ తేడంచు నేఁ
జన్నన్ నన్నును బోవ నిచ్చిరె భుజాచండాలు రావానరుల్
దున్నల్ ఖడ్గమృగంబు లేనుఁగులు పందుల్ వ్యాఘ్రముల్ సింహముల్. 27

శా. వీలుం జాలును లేని దేహము తనాబీముండకొ ద్దుండెనే
యోలిన్ వాలి యటంచుఁ జెప్పెదరు, నిన్నాగించి యేడా సము
ద్రాలన్ మల్చుచు ముంచు చుప్పజలముల్ త్రావించెనం చందురా
వాలిన్ మించినవాఁడు వానికొడుకబ్బా! యంగదాఖ్యుండగున్. 28

క. అన్నట్టుగ మఱచితి నా మొన్న నెదో రాయబారముగ వచ్చి యొకే
తన్నుం దన్నిన గోపుర మన్నది విఱుచుకొనిపడియె నవనీస్థలిపై. 29

గీ. వాఁడు నను నిల్వనిచ్చెనా వానితోనె యాడినట్టి యుద్ధం బెల్ల నాడుటయ్యె వానిఁదప్పించుకొని పోవవలయునన్న నతఁడడుగు నన్ను గదలనీయఁడు గదయ్య.

శా. నా సేనల్ మఱి యెట్లు చేయునని కన్నా నప్పుడ ప్డిట్టుల
ట్లానన్నంబగు చిన్నపోరులను దైత్యశ్రేణి కీశాళికా
యాసంబౌ గతిఁ జేయఁ జాలరును, వా రావానరుల్ దీవ్రబా
హాసంపన్నులు దీప్తతేజులును నుగ్రాకారులున్ బోరులన్. 31

క. మనమేమో రాక్షసులము మనకున్ రాక్షసులుగాఁగఁ మసలెదరు కపుల్
దనుజుఁ డన్నశబ్దార్థము తనదైచను భయదశక్తి తఱిగినయట్లుల్. 32

క. మన మేయు బాణసంతతి పనిచేయదు వారిపైని వారేమో రు
వ్విన ఱాలు చెట్లు కత్తులు మనలంజంపుఁ బరమాధమము యుద్ధంబై. 33

మ. అవు నభ్యాసము చేసి కత్తులు కటా ర్లాస్కందనక్షోణిలో
నవురా! వాడెడు విద్య నేర్చినది దైత్యశ్రేణి, యీ యాయుధ
ప్రవరంబుల్ మననుండి లాగికొని యభ్యాసంబు లేకుండ వా
రు వెసన్ వాడెడు నేర్పు చూచినను విద్రోహంబగున్ విద్యకున్. 34

ఉ. ఇంతగ నేను జెప్పటయు నేలనఁ జచ్చినయట్టి దానవుల్
చెంతల నున్నవౌ గదలచేఁ బరిఘంబులచేఁ గటార్లచే
వింతగఁజేసెఁ బోరు కపివీరుఁడు వాయుతనూజుఁ డెంతయో
దొంతరలైన బాణములతోఁగుల కాతని మే నెడారిగన్. 35

శా. నాకున్ జ్ఞప్తియు లేదు ఆ విసరెనో నా పైని ఖడ్గంబునన్
నా కంఠంబునయందు వేసెనొ యెటైనన్ నిన్నుఁ గన్నానయా!
నాకస్త్రీపరిభోగమంజులతనూ! నాళికనేత్రాసుమ
శ్రీ కోదండ! నతాంగపర్వమధురాకృత్యుజ్జ్వలత్సేవధీ! 36

గీ. కదలి రావణుండు కనుమూఁత మెలకుఁవ వీర లింత యింత వీరు లగుచు హనుమచేత సరియె నంగదుచేఁగూడ మడిసి రేమి రామమహిమ యంచు. 37

మ. అనుకొంచుండఁగఁ గూరుకై మఱల నంతంతన్ మఱిన్వచ్చి ని
ల్చెను వేఁబొక్కఁ డకంపనుం డనఁగ నక్షిస్విన్నరూపంబుతోఁ
గనుఁగొంచుం దశకంధరుం డితఁడునుం గాయంబునం బాసెఁబో
యనుకొంచుండఁగ దీననేత్రుఁడయి వాఁడాలోచనావంతమై. 38

శా. రామున్ లక్ష్మణుఁ జంపవచ్చును సుమీ రక్షోజగన్నాయకా!
సామీరిన్ గెలువంగరా దురుభుజాసంవర్తకాలుండు వాఁ
డేమై వాని సమాశ్రయించెదరు కీశేశుల్ మఱిన్ వాఁడు తీ
వ్రామిత్రాసుభుజంగమంబు మఱి బాహాశేషభోగీంద్రుడున్. 39

గీ. అతనితో యుద్ధమాడుటయనియలేదు చఱచుటయు దానితోపైరిచచ్చుటయును నింతలో నెక్క యేనుఁగు నింతలోన నింతలోఁ గాంచ మేరుగిరీంద్రమంత. 40



శా. నేనుం బోయితి నా మహోగ్రశరపంక్తిన్ గోఁతులం గోతులం
దే నిక్కంబుగఁబూడ్చి పెట్టితిని గుండేళ్ళట్లు దూపిల్ల రో
షానన్ మున్ను త్రిమార్గగాజలము శస్త్రశ్రేణి నెద్దాన ర
క్తానన్ ముంచితి వానిచేతఁ గపికాంతారమ్ము మండించితిన్. 41

క. కాళ్ళులఁ గైకొని చీల్చుచు ఫెళ్లున వెన్నెముకలందు విఱుచుచు, వేదలన్
మళ్ళించి త్రిప్పుచును గుగ్గిళ్ళంబలె నమలినారు కీశుల దైత్యుల్.

గీ. నలుఁడు కుముదుండు మఱియు మైందద్వివిదులు
వికలితము కపిసైన్య మాదుకొనినారు
కీశులకు దానవులు నెంతచేసినారొ
చెలఁగి వారును మన కంత చేసినారు. 43

గీ. అకట! యఱికాలిమంట నెత్తికిని వచ్చె నాకు సౌసల్వ్యూరిం జేసినాను చూడు
రొండినిం జేతు లిడికొని రోదనముల నొంటిచే నేల నాన్చుకొం చుఱికినారు.

మ. అకటా! పోయి యటుల్ రఘూత్తముల సంహారంబుగావించు కో
రికయున్ విచ్చుచు నున్న క్రోఁతిచమువుం గ్రీడాగతిన్ సోదెలో
నికి రాకుండగఁ జేయు వాంఛయును నిర్ణీతంబు కానట్టి వే
ళకు వార్నల్వురు తోడితెచ్చిరట హేలాధూర్జటిన్ మారుతిన్. 45

క. అది యేమిచేసెనో తెలియదు మద్భావము భవత్పదాశ్రిత మగుటన్
గదలి యిట వచ్చె జీవుం డదీనుఁడును దీనుఁడగుచు నావేదింపన్. 46

శా. ఛీ! యీనిద్దుర యేమి నిద్దురని యెంచెన్ లేచి కూర్చుండె దై
తేయప్రాజిత ఱెప్పలొత్తి కనులుం దేర్చెన్ మొగు డ్వంత దృ
ష్ట్యాయత్తంబగు భావమం దొకరుఁడై యాగ్నీధ్రుఁడై యొప్పెను
శ్రీయోగ్యాననుఁ డుగ్రతేజుఁడును దాక్షిణ్యప్రభానేత్రుఁడున్. 47

చ. అతఁడు ప్రహస్తుఁడం చెఱిఁగె నాశరనాథుఁడు వానికన్నులన్
హుతములుగాఁగ నున్నయవి యూహలు పూర్వులయందుఁబోలె స్ప
ష్టత మఱి వీనిమేనున నెసంగదు కన్నుల నంతకంటె స్ప
ష్టత గనిపింపఁజొచ్చినది సంస్కృతియొండు పొకాల్చునట్లుగన్. 48

గీ. ఇట్లు భాసించె రావణు హృదయమందు నతఁ డెదిం జెప్పకయ చెప్పినట్లుగాఁగ
నక్షిదీధితి భావ మన్యోన్య మంత యల్లుకొనియుంట సృష్టిరహస్య మేమొ! 49

క. నాకొడుకుల జంపించితి నీకొడుకగు నక్షతోడ, నేటికి నన్నా
యే కోతియొ నీలుండట నాకున్ మరణంబు దనుజనాథా! చేసెన్. 50

ఉ. రామునిచేతిలో మృతియు రాఁదగనంతటి ఘోరపాప మే
నేమి యొనర్చినాఁడ నది యెప్పుడు నీకును నమ్మకైతి ల

క్ష్మీమహితాకృతిన్ సతిని మేదినికన్యక తే నధర్మమం
చామెయిఁ జెప్పియుంటి నదియప్పుడు కావలె దానవేశ్వరా! 51

శా. తానై దానవమంత్రి యూరితియు నంతర్ధానముం బొందఁగా
లేనవ్వే దశకంధరుండు తలఁచెన్, లీనాఘదుర్జీవులై
యేనోల్లక్షణ మిట్టిదం చెఱుఁగ రా యీ ప్రాణు లాచారధా
రానిష్ఠాతులు జ్ఞానహీనులు గృతారంభుల్ సమస్తంబునన్. 52

గీ. తమకుఁగలిగినవగు నాపదలకు మొఱకు తెగమతెవ్వరో హేతువులుగఁ దలంచు
నీ యనంత సంసారమం దెట్టిజీవి యెట్టి కర్మను జేసెనో యెవ్వఁ డెఱుఁగు?

గీ. మేలుకొన్నంతలోన నమేయమైన కోపము సముద్భవించె రక్షోవిభునకుఁ
దెరపడునులోకమునకు నిద్రించుతఱిఁ దెరవడియె మేలుకొన్నంత రావణునకు.

క. నే నిదురపోవు వేళను దానవవీరులను జంపెఁ దానొక మొనగాఁ
డై నిదుర మేలుకొంటిన యీ నరమాత్రుం డెవండొ యెఱిఁగెద నింకన్.

మ. ఎలనాగన్ గొనివచ్చినంతఁ దరమే యీచేఁత? లక్షోపల
క్షలు కాంతల్; శిలలన్ బిగించి కడలిన్ సర్వాసురాసువ్రజం
బులు వైవస్వతుమందిరంబునకుఁ బంపున్, సృష్టిఁ దానొక్కఁడే
విలు పట్టంగలవాఁడు, హేమధరణీభృచ్చాపుఁ డేమయ్యెడున్. 56

మ. అలుపంపున్ సురవైరి నాయకులపై నాకోఁతి యాకోఁతి రా
ళ్లులురువ్వన్ సరియా? దశాస్యుఁడు ద్విషల్లుంటాకుఁ డేతెంచుఁ దా
నొలికించుం గపిజాతినెత్తురులు వట్టూరించుచ బారాణికా
ళ్ళులతోడన్ విజయేందిరారమణి చాళ్ళుంగాఁ బ్రచారించెనాన్. 57

శా. ఉగ్రాకారుఁడు నొచు మారుతిని దోర్యుద్ధంబునన్ గాఢము
ష్టిగ్రంధి స్ఫుటఘాతపాతముగ మూర్ఛిల్లంగ సైరించెదన్
సుగ్రీవుండును గోళ్ళ ఆక్కి చనియెన్ శూరుండు మద్బాహుపా
శగ్రైవేయుని నన్నగారిఁ గనుగో సాగింతు యామ్యాశకున్. 58

ఉ. ఒట్టుగ రామలక్ష్మణుల నొక్కని బిట్టుగ మట్టిసెజ్జపైఁ
బెట్టక కోటకుం దిరిగి వీఁ డరుదేరఁడు రావణుండు, నే
డిట్టలమైన కోపము దహించెడు, నే ననిపించకుండగాఁ
బెట్టిన వింటికొప్పు విడిపించను నేడు రణాంగంబునన్. 59

శా. నాకున్ మండుచునున్న దీ కడిఁదిమంటల్ వానరానీకినీ
శోకాధాననిదానముల్ పరిణమించున్ జ్వాలలై మాలలై
నా కీదృక్ప్రళయ క్రుధానలశిఖానద్ధంబు చిత్తంబు కా
దే కొంచెమ్మును బూర్వమెప్పుడును, దారేమౌదురో? రాఘవుల్. 60

క. నే నొచు నెత్తిపోవుదుఁ గానీ పరులెత్తిరాక కలుగదు లంకా
శ్రీనిభృతకోట్టమందున దీనికిఁ దుదిచూచెదన మతిప్రౌఢిగతిన్. 61

ఉ. ఎంచి సురారిలోక పరమేశ్వరుఁ డెక్కిన బండి నిప్పు జ
ల్లించిన భగ్గుభగ్గున జ్వలించెడు నిప్పుల నూకతోడ ని
ర్మించిన యట్లు సూర్యకర మిశ్రణ మోర్వక యాకసంబు ము
ట్టించెడునట్టి వేఁడిమి కడిందిగ డిందిన దిక్కులై చనన్. 62

ఉ. కట్టిన నాలుగశ్వముల కర్ణములంబడి నాసలంబడిన్
బుట్టిన జ్వాల లంతములఁ బొల్చిన ధూమము లంధకారముల్
చుట్టిన చుట్టలై నెగసి చూపఱ కన్నుల మిన్ను లంటుకొ
న్నట్టులఁ జేరరాని భయదాకృతి బెట్టిద మౌచుఁ బొల్చుచున్. 63

ఉ. సారసబంధుకాంతి పరిసర్పణ దర్పిత హేమరత్న కే
యూరములుం గిరీటము మహోన్నతవక్షము మీఁది వర్మమున్
హారిచిరత్నకుండలము లందగ కంకణహారసంతతుల్
ఘోరమహాగ్నివంశ మదిగో చనుదెంచు నటన్నయట్టులన్. 64

ఉ. మండిత శోణరత్నచయ మంజులదీధితి లంబమానకో
దండము లస్త్రకచ్ఛవివితాన నిరంత శరాభివర్షణో
ద్దండహోభ్రమప్రదము దర్పిత బాహువివర్తన క్రియా
చండము భూవియత్పరిలస ద్విషువత్పరిణామమో యనన్. 65

చ. అరదముమీఁద నిల్చిన మహాయుధసంతతి వేల్పువీటిగో
పురములు తూలఁగొట్టిన ప్రభూతశితంబులు నుగ్రముల్ ద్విష
త్పురములు కొల్లపుచ్చికొను ధూర్వహతాభయదంబు లల్ల ము
ప్పురములు కాల్చుసామివగు బొమ్మలరంగులచేఁ బ్రచండముల్. 66

చ. విలులితవార్ధి ఘోషములు భేరులు ఘోర పిశాచరావ కా
హళములునున్ లయాంబుద మహారవఘోరములైన దుందుభుల్
కలితసురారిలోక పరికల్పిత దేశి విదారి భీషణా
విలవిధురస్వరాకులిత విస్ఫుటగీతము లాలపింపఁగాన్. 67

ఉ. వేలుపువీటియంగడుల వెట్టిన చూఱలు వేల్పుకామినీ
జాలము నీలువుల్ తొలఁచు చంక్రమణోగ్రదురంతకామముల్
తూలిచినట్టి మౌనుల క్రతు వ్రతముల్ బిరుదాళిఁ గట్టి గీ
తాలు లిఖించి బట్టులు ప్రతాపకథాకథనంబు చేయఁగన్. 68

చ. వికృతములైన యానముల వీఱిడిత్రిప్పుట లైన చేతులన్
గొకిబికి పొన్నుకఱ్ఱలను గుత్తులు వ్రేలుచునున్న మువ్వలున్
జకితముగాఁ గదల్చుచు హసాదులు చెప్ప చసాధుదానవుల్
వికృతము లైనయట్టి రణవేషము లూనుచు ముందుసాగఁగన్. 69

చ. పురపురలాడు నయ్యరదపుంబడగన్ హరినీలరత్న ని
ర్భరతరవర్ణ నిర్మితిధురా పరిభాసిత గర్దభాకృతి
స్ఫురణము తన్ముఖోద్గిర దపూర్వ మహాగ్నిశిఖాజటాలమై
మెఱపు ఘటించెడున్ గగనవీథుల దవ్వునఁ జూచువారికిన్. 70

చ. తనయెదయందు నాగరకతాపరిహీణ మసాధుశీలమున్
తనదగు సంఘలక్షణము దైత్యము నీమము లేనియట్టిదిన్
ధనము ప్రభుత్వముం గలిగి దర్పితమై చను జాతి యుద్ధవే
శను సయుతంబు మిశ్రమగు లక్షణవంతముగాఁ గనంబడున్. 71

క. ఒక్కొక్కఁడు దిక్కుంభి యస్పృక్కంధులు వాఱంజేయు సేనాపతులై
రక్కసు లరిగిరి యెనిమిది దిక్కుల యధిపతుల చేవ దించినబంటుల్. 72

చ. ప్రళయము గాఁగనై సబడబాగ్నిగ వెన్క పయోధి నుండి రా
వలసినయట్టి యుప్పెన నవంబు పురస్థము దుర్గసీమలో
వెలువడి వచ్చుచుంటఁ గని వీరుఁడు రాముఁ డనంతదోరనా
విలమతి పృచ్ఛసేసెను విభీషణుఁ దద్వివరం బెఱుంగఁగన్. 73

శ్యేని.

మాద్యదుగ్రదంతి మండలీపతి త్వోద్యదుగ్రమూర్తి యుగ్రదంతిపృ
ష్ఠద్యురత్న మౌచు సాగు నగ్ని బంధుద్యుతి న్నకంపనుండు రాఘవా! 74

పెద్దకోఱ లొప్ప భీమచాపుఁడై యెద్దువోలెఁ గన్ను లింతలింతలై
హద్దులేనివీరుఁ డాతఁడే సుమీ చిద్దరిద్రుఁ డింద్రజిత్తు రాఘవా! 75

మ్రోయరాని వర్మముం ధరించి చాం పేయకేతు వొప్ప వీరమౌళిదు
ర్జేయవిక్రముండు శ్రీధృతిన్ మహా కాయుఁడెంతయున్ మగండు రాఘవా! 76

చక్షురుగ్రతామ్రచండకాంతియై పక్షిరాజువోలె బద్ధవేగుడైఁ
దీక్ష దూఁకి వచ్చుఁదీవ్రమూర్తియై రూక్షుడౌ మహోదరుండు రాఘవా! 77

రుండజాలలగ్నరూక్షశూలుఁడు ద్దండప్రాసఖడ్గధారి ఘంటికా
చండనాదయానజాల్మఁడై త్రిశీ ర్షుండు వాఁడె పాలసుండు రాఘవా! 78

చేతికత్తితో నిశీధినీచ్ఛటా ధూతకేశపాళి దుష్టపన్నగీ
కేతనుండు బాహుకేళిఁ గేరుఁబో యాతనిన్ నిశుంభుఁ డంద్రు రాఘవా! 79

శూరతాపయోధి శూలహస్తుఁడై ఘోరమౌ పిశాచకోటినేతయై
పాఱుదెంచువాఁడు వహ్నినేత్రుఁడై క్రూరుఁడౌ నరాంతకుండు రాఘవా! 80

వ. మహాగ్నిరథంబున నున్న నీలాంజనగిరి రాక్షసాధిపుం డని విభీషణుండు పేర్కొన
శ్రీరామచంద్రుడు. 81

శా. ఓహో వ్రేఁగగుచుండెఁ గన్నులకు దైత్యోర్వీమహేశానుఁ డా
దేహం బుగ్రమయూఖతీవ్రకర దీధిత్యంతరశ్యామవ

ర్ణోహోగాఢవివర్తమై చనియెనో! యీ తేజు మున్నెప్పు నా
యూహం దట్టగఁబోనియంత బరువై యొప్పారు విప్పారుచున్. 82

గీ. హనుమ యితనిఁగూర్చి యాశ్చర్యపడె నన్న నబ్బురంబె కొల్పునందుఁగాంచి
శైవరౌద్రదీప్తిసంయోగ మొలసిన యట్లు తోఁచు నాహవార్థి యగుట. 83

చ. కన్నుల కింతబిట్టుగను గన్పడు నీతనిమూర్తి యింతతే
జున్నది యింతచేవకల దుర్విని శక్తిగలాఁడు కోర్కులం
దున్నెడు మంటిత్రోవఁబడి, తూలునె? లేదటె మింటిత్రోవ? నే
నెన్నకమున్నె వింటివయి కేగెడు మత్కరమో విభీషణా! 84

మ. అనుచుండన్ దశకంధరుండు తనసైన్యంబున్ విభాగించి పెం
పెనయన్ దుర్గకవాటరక్షణకునై యేర్పాటు గావించి దై
త్యనికాయంబును నాల్గుపాయలుగఁ గీశాధీశసైన్యంబుపై
ననిచెన్ దానుగ నేతయై నడిమిపాయన్ భీకరాకారుఁడై. 85

క. ఇప్పటికిఁ దెలివివచ్చెను విప్పినమతి నని సకలకపిజగత్పతి క
న్విప్పుల మంటలు గాంచుచు నప్పటికిని గ్రోధరంజితాస్యం డగుచున్. 86

క. క్రమ్మెడు కంచెలమంటలఁ గొమ్మలతో మోది యార్పుకొన్నట్టు నవ్వృ
క్షమ్మయి చను పార్శ్వమహీధ్రమ్మున శృంగమ్ము విసరె దానవుమీఁదన్ 87

ఉ. వచ్చెడు కొండకొమ్ము శితభల్లములన్ జిద్రుపల్ ఘటించి లో
గ్రుచ్చు ప్రహస్తు చంపె నను కోపపు హాలహలంబుపైఁ శిఖల్
విచ్చునటుల్ నిగిడ్చిన శిలీముఖసంతతి ఱొమ్ముగాడఁగా
బుచ్చెను మూర్ఛపుచ్చె హరిపుంగవుఁ డంతట నేలపైఁబడెన్. 88

వ. ఇట్టి తమ ప్రభుపాటు చూచి మేనులపెంచి గవయుండును, గవాక్షుండును, సుదంష్ట్రుండును, ఋషభుండును, జ్యోతిముఖుండును కొండకొమ్ములు పెకల్చి రావణునిం దాకిన. 89

క. వక్రంబును తీవ్రంబు నతిక్రాంతాకాశమైన దీప్తాగ్ని శిఖా
చక్రంబు వోలెఁ దిరుగుచు సక్రోధుఁడు రావణుండు చండాకృతియై. 90

క. గుడుసులు పడియెడు నట్టులు కడుకొని కాల్సేతు లాడగా నేర్పని యు
ట్లుడిగిన కనుకాంతులుగాఁ బడవేసెను వారి భల్లభల్లంబునకున్. 91

క. అంతట హాహాకార నిరంతరముఖమైన వానరానీకిని రా
మాంతికముఁజొచ్చె దిక్కని యంతట నదియొకఁడె భద్రమగుచో టనఁగన్.

సీ. రఘుకులస్వామి దీర్ఘభుజా విలంబమానోగ్ర ధనుర్లస్తకోపరిగత
వామహస్తుండుగా, సౌమిత్రి వీక్షించి తొంగలి ఱెప్పల దోయిలించి
యన్న! యెంతకును బర్యాప్తుండ వీవాడు దితిజాతు నన్ను వధింపనిమ్ము
నా రాఘవుం డనె నాకారి బహ్వస్త్ర కోవిదుండును భుజాకుంఠబలుఁడు

గీ. కంట వింట రెంటఁ గడుజాగరూకతఁ మెలఁగవలయు నన సుమిత్రిబిడ్డ
యసురతోడి కలని కాయత్తపడుచుండె నచటఁగీశసైన్య మటమటింప. 93

గీ. అటులఁ గపిలోకపతియు సైన్యాధిపతులు దనుజబాణ విదారిత తనువు లగుచు
బడలు పడిపోవఁ గనుచుండి పావమాని పరమక్రోధాగ్ని మయమైన భావమూని.

గీ. యముడు పండ్లుబిగించిన యట్లుగాఁగఁ బిడికిలింబూని దానవోర్వీశుకడకుఁ
బోయి కన్నులనింగలంబులు కురియుచుననియె గ్రీష్మాంత మేఘగర్జాభముగను.

ఉ. ఆవిధి నీ లలాటమునయందునఁ గోఁతులపిండుచేతిలోఁ
జావును వ్రాసె వేల్పుగమి చాలదు, గారుడయక్షరాడ్భుజం
గావలి చాలదిప్డు కను మస్మదమోఘము ముష్టిఘాతమై
నీవిట నావులించెదవు నెత్తురు గ్రక్కుచుఁ జావు ముందరన్. 96

మ. అనినన్ రావణుఁ డేది గ్రుద్దుము త్వదీయంబైన దోశ్శక్తి చూ
తుననన్ మారుతి క్రొత్తచూచెదవు నాదోశ్శక్తి నీబిడ్డ య
క్షుని శీర్షంబది రెండుగాఁ బగిలె నాగ్రుద్దుంబడిన్నాఁగ రా
వణు దుఃఖస్మృతి వాయుతాడితము కోపజ్వాల మిన్నంటగా. 97

చ. అమరిచి యాంజనేయుని మహోచలసానుతలంబువోని వ
క్షముపయిఁ జాచిగ్రుద్దెను నిశాచరనాథుఁ డనంతవేగుఁడై
భ్రమయుచు డిల్లవోయి నిలువంగను జాలక యాంజనేయుఁడున్
దెమలిచికొంచు వేగపరిధీకృతఘోర మహాశనిం బలెన్. 98

ఉ. గ్రుద్దెను వక్షమం దసురకోటి దిగాలుపడన్ దశాస్యుఁడా
పద్దశ నందినట్లు కనుపట్టగ, రావణుఁ డంతఁ బ్రాణముల్
దద్దరిలంగ ధాత్రిఁబడుదానికి సిద్ధముగాఁగనై యసుల్
తద్దయుఁ జిక్కఁబట్టుకొని తా ననియెం బవమానసూనుతో. 99

చ. అగు నతివిక్రమంబు కల వన్నుమారుతి, యేమివిక్రమం
బొగి మఱియింకనుం బ్రదికియుంటివి నీవన, రావణుండు పె
ద్దగ నొకయూర్పు తీసికొని తాబలమంతయుఁ దెచ్చుకొంచు పై
చ్చుగ ధృఢముష్టితోఁ బవనసూనుని ఱొమ్మునయందు ఁబొడ్చినన్. 100

గీ. తట్టుకొనలేక మారుతిధరణియందుబడియెస్మృతితప్పి యంత రావణుఁడు మఱల
విల్లు నమ్ములు గొని కపివీరులందు శరపరంపర నిగుడింప దొరకొనంగ. 101

ఉ. కోపముచేత నుబ్బఁ గనుగ్రుడ్డులు వానరలోకసర్వసే
నాపతి యగ్నిసూనుఁడు ఘనంబుగ నార్చుచు నీలుఁ డంత యా
క్షేపముచేసె నొక్క గిరిశృంగము రావణుమీఁద వాఁడు సం
క్షేపము చేసి దానిని విశీర్ణముగా శితభల్లసంతతిన్. 102

క. శరపంజరకుడ్యంబులు విరియించుచు నిరకటానఁ బెట్టెను నీలున్
గిరిశృంగమ్ములు తరువులు వెరికి విసరునట్టిసేఁత పీల్పడకుండన్. 103

ఆ. మఱియుఁ దాఁకుచోట మండించుబాణాలు వేసి యతనినెంతొ వేధపెట్టెఁ
గోపి యాతఁడును సమాపన్నకామరూపంబుతోడ మింటిపైఁ జరించి. 104

మ. దితిసుతుబండికిం బడగ తీర్చిన యష్టినిఁ జేరికొంచుఁ బా
లితపటు వేగుఁడౌచుఁ గుదిలించుచు నుండె రథంబు తూల వి
స్మితులయి చూచుచుండ స్మృతిచెందిన హన్మ గవాక్షముఖ్యవీ
రతతియు సజ్యకార్ముకులు రాముఁడు లక్ష్మణుఁ డబ్బురంపడన్. 105

చ. కణకణలాడు నిప్పు లవు కన్నుల నుప్పరమందుఁ జూచి రా
వణుఁ డనెఁ గామరూపవినిబద్ధము లాఘవలంఘనోత్థనై
పుణి యది యల్పశక్తి తుదిపొందిన విద్దియగాదు ని న్నద
క్షిణముగ దించెదన్ ధరణికిన్ బ్రదుకో మఱిచావొ చూచుకో. 106

క. అని ఆగ్నేయము మంత్రము నినిచినబాణమునఁగొట్టె నీలుని వాఁడుం
దనతండ్రిమహిమచేతను తన మహిమను జావలేదు ధాత్రిం బడియెన్. 107

శా. సౌమిత్రిం గనె రావణుం డెదుర దీక్షానిశ్చలభ్రూలతా
స్థేమున్ హేమధరాధరాభతనునిన్ దీవ్యజ్జటాజూటరే
ఖాముక్తాహిఫణాగ్ర నీలమణిసంకాశ ప్రభావంతునిన్
ధీమల్లోకశిరస్థహీరమణి పందీప్తేందునేత్రచ్ఛవిన్. 108

క. మారీచుఁడు చెప్పినదియు మారీచునిగూర్చి యితఁడు మాటాడినదిన్
వే రావణు నెదఁ దిరిగెను తా రామునిరక్ష యింత తార్క్యాణముగన్. 109

చ. విరహముచేత రాముఁడటవీస్థలి చావని సేవ చేసి వా
నరపతియుం బరాక్రమసనాథుఁడు మారుతియొక్కయున్ సుహృ
త్త్వరమణచేసి యింతపగ పట్టెను వీఁ డది యెందుచేతనో
తరుణిని సైతమున్ విడిచి తా వనసీమకు వచ్చు టెందుకో. 110

మ. అనుకొంచుం దివిజారిలోకపతి యిట్లన్నాడు సౌమిత్రితో
నినుఁగంటె న్నినుగంటిఁ జంపెదనుసూ నిన్నున్ మదీయాస్త్రసం
జనితాగ్నిచ్ఛట మండబెట్టెదను నీ సౌమిత్ర్యమున్ నాశముం
బొనరింతున్ మఱిరాముఁడంతట వృథాభూషాభుఁడౌ ధాత్రికిన్. 111

వ. అనిన లక్ష్మణుండు. 112

ఉ. దిగ్వ్యవహార మయ్యె భవదీయపరాక్రమముం బ్రశస్తియున్
వాగ్వ్యయ మేల చేసికొన బాణము లున్నవి చాపముండె స
మ్యగ్వ్యయసాయ మొక్కఁడు శతాధికమౌను బరాక్రమోక్తికిన్
వాగ్వ్యతిరేక మైనదియు వాగ్విదు లెల్లరు మెచ్చునట్టిదిన్. 113

 మ. అనినన్ దైత్యకులాధినేత పటునానాస్త్రంబులున్ శస్త్రముల్
నినిచెన్ లక్ష్మణుదిక్కు, లక్ష్మణుఁడు వానిన్ ఛిన్నభిన్నంబులం
బొనరించెన్, మఱి యాతఁ డల్పములతోఁ బోడంచు దేవారి పు
చ్చెను బాణంబు విధాతృదత్తము సునాసీరీయవజ్రాభమున్. 114

గీ. విద్ధుఁడై లక్ష్మణుండంతవిహ్వలించి యొక్కనిముసంబులో నిల్వఁద్రొక్కి కొంచు
దైత్యపతిచేతిలోపలిధనువు రెండుముక్కలుగఁగొట్టె దెసలందు మోదికొనఁగ. 115

క. వేఱొకచాపమ్ము మఱియు వేఱొకచాపమ్ము మఱియు వేఱొకచాపం
బారావణుండు కొనుటయు నీరామునితమ్ముచే నికృత్త మగుటయున్. 116

క. వడి నిల్వబెట్టి కొట్టిన వడువునఁ గోదండహీను బాణంబులతో
నెడపెడఁ దాడించెను మఱి యుడుగక శిక్షించినట్టు లొకదోషి నహో. 117

గీ. ఇంతకోపమ్ము వచ్చిన దింతకోప మనుచు రాలేదనుచు లేద యసురపతికి
వీనిఁ జంపనె వలయు దర్వీకరాభుఁ గాటుపై గాటు వేసెడుగాదె యనుచు.

చ. అపుడు స్వయంభుదత్తము మహాశనికల్పము సర్వదేవతా
రిపువు హుతాశనాంశునిబిరీసము ధూర్జరమైనదిన్ మహో
స్త్రపుఁ బదనైనశక్తిని భరంబగుదాని నిగిడ్చె రాము త
మ్ముపయిఁ, బ్రవేగవంతము నమోఘము పూర్వమహాహవంబులన్. 119

ఉ. పత్రిగతిన్ శరత్రితయవారిత మయ్యు నధృష్య మౌచు సౌ
మిత్రిని దాఁకె శక్తి విషమించిన చేతనశక్తిగా మహో
పత్రప నంది చేతనము వాసి ధరం బడె నంతలోన సౌ
మిత్రియు వైష్ణవంబు తన మిక్కిలి తేజము సంస్మరించుచున్. 120

మ. కపిసైన్యంబు విభీతి నందగను రక్షస్సైన్య మానంద భ
క్తిపరంబై మునివృత్తి నుండఁ గడఁకన్ గీర్ణాలకుండౌచు న
స్రపలోకేశుఁడు బండినుండి దిగుచున్ సౌమిత్రినిం జేరి నే
లపయిం బడ్డతనిం గ్రహించుకొని లీలం గొంచుఁబో నెంచుచున్. 121

ఉ. చేతులనెత్తబోయి తనచేవయుఁ జాలమి తోఁచి బిగ్గగా
నాతని లేవనెత్తుటకు యత్నము చేసి సమస్త దేహని
ర్యాతము స్వేదమై కనులయం దరుణత్వము గల్గ నార్చులై
యాతనిఁ గొంచుఁబో వలయునన్న మహాశ పరత్యజించకన్. 122

ఉ. దూరము నుండి రావణుని దుర్వ్యవసాయము నెల్ల గాంచుచున్
మారుతి చేరదూఁకి పవమాని జవంబుగ దైత్యరాజు వి
స్ఫారతరోరువక్షమును బంధురముష్టిని వ్రేయగా నవ
స్మారము పొందె రావణుడు మాసినమాయని తెల్వియై చనన్. 123

క. కనులు కనుపించుచున్నవి, మనసును మఱియాడుచుండె మఱి చేతులు కా ళ్ళును కదలవు తలయాడదు కనుఱెప్పలు మూఁతపడవు కడు దైత్యునకున్.

చ. అనిలసుతుండు లక్ష్మణు భుజాగ్రమునందునఁ జేర్చికొంచుఁ బో
వను గని పంక్తికంధరుఁడు భావమునందున వీనియొక్క చా
లినతనమేమి? యే నితని లేవగనెత్తనటంచు నెంచుచో
ననిలతనూజుఁడాతని రయంబునఁ జేరిచె రాముసన్నిధిన్. 125

గీ. అంతలోన నమూర్ఛుఁడై యసురరాజు రూక్షమతియయిచని రథారూఢుఁ డగుచు విల్లు నమ్ములు గొని కపివీరచయము పరవతోల నారంభించెఁ బట్టువిడక. 126

గీ. మూర్ఛ నందిన తమ్మునిమోము చూచి అర్దితంబైన కీశసైన్యంబు చూచి తన స్వరూపంబు దైత్యరాజునకుఁ దెలియఁ జేయ వాంఛించె రాఘవశేఖరుండు.

వ. కోదండియై బయలుదేరుచుండ హనుమంతుం డిట్లనియె. 128

ఉ. సన్నని యూఁకలొప్ప మృదుసంస్తరణంబుగ నొప్పవైనతే
యోన్నత పృష్ఠదేశమిదియున్ మఱి నాభుజపీఠి రోమరా
జిన్నునుపై యెసంగు నృపశేఖర! నీ విచటున్ భజించి దై
త్యు న్నిలువంగ నెంచుము సమోన్నతదేశ శరప్రవర్షివై. 129

ఉ. నీ రథమైన నన్నెవఁడు నేమి పతాకల కాడిపోలులన్
నేరఁడు భగ్నముం బఱుప నీవుగ నా బుజమందు నెక్కవే!
నీరథమేన సారథియు నేన యనంగను స్వామి, మారుతి
శ్రీరుచిమద్భుజం బధివసించె నిమిత్త శుభోహవంతుఁడై. 130

గీ. నాఁడుతొలినాఁడు సుగ్రీవుతోడిచెలిమి యితనిబుజమెక్కియే నిర్వహించి కొనియె నేఁడు తొలిసారి రావణుతోడి కలను నితని బుజమెక్కియే నిర్వహింపనెంచి.

చ. ప్రకటిత బాహువేగమున రాముఁడు చేసిన వింటిత్రాఁటిమ్రోఁ
తకు నకుతోభయం బగుచుఁ దత్కపిసైన్యములెల్ల నిల్చి వె
న్కకు మఱలెన్, మహోదితిజకాండము నంతటనిల్చె, రాక్షసుల్
వికల మనస్కులై రవము వించు నిలంబడి రెల్లచోటులన్. 132

వ. అంత హనూమంతుఁడు శ్రీరామచంద్రుని దైత్యేశ్వరపురః ప్రదేశంబునకుఁ దేగా రాముం డిట్లనియె. 133

పద్మనాభము.

ఔరా! మహారాక్షసా నీవు నాకెంత యూ నప్రియంబున్ బొనర్పంగనైతో
ధీరుండవై నిల్చు తప్పించుకో నీకుఁ దెర్వింత లేదింత త్రైలోక్యమందున్. 134

వారింపఁగా లేరుసారాంబుచూడుండు వైశ్వానరుండుం బయోజాత గర్భుం
డౌరార నానుండి మోక్షంబుపొందఁగ నన్యంబుగా వేఱలేదన్మ నీకున్. 135

ఎవ్వానిశక్తిం బ్రయోగించి చంపంగ నీరీతి సంకల్పముం జేసినావో
అవ్వాఁడు నీదారపుత్త్రాది సంహార మక్రూరుఁడై సేయఁగానౌను సుమ్మీ. 136

అవ్వాఁడు రక్షశ్చమూశ్రీ పదిన్నాలుగా వేల్తపోవంతము న్నిర్దహించెన్
గ్రావ్వాడి నారాచపుంఖాంతమందున్ గరుత్తీవ్రదుర్ధర్ష వేగాంత మందున్. 137

చ. అది యొక దుష్టమైన వ్యవహారము వేఁడపకార మందునో
పదిఁబదిగాఁగ నీవలన వాఁడును గోపము నంది నీదు దు
ర్మదకృతి యుగ్గడించెడిని, మాటయుఁ బల్కను లేక నీవు దు
ర్హృదుఁడయి యక్కటా! మరియు నెంతువు కీడుపొనర్చుటేమదిన్. 138

చ. ఎగుడుదిగుళ్ళుగా నగున పొచ్చును తగ్గు రథంబు ధాత్రియెం
చగఁ బవమానసూనుని భుజాస్థితుఁడై చన రామమూర్తి సుం
తగ నగు నక్కొ అంతచనె దైత్యుఁడు కోపమునంది పొన్మ బి
ట్టుగఁ బ్రహరించె నిప్పులు కదుంగడు మండెడునట్టి యమ్ములన్. 139

మ. తొడలందున్ మొగమందు బాహువులయందున్ వక్షమందుం గడుం
గడు మండించెడు నంపవాదరలఁ దత్కాయంబు వేధించె దై
త్యుఁడు తా బండిగనైన మారుతి పయిం దూకంగ లేకుండ, నె
క్కుడు వారింపను లేక, బాధపడియెం గ్రోధంబు దీపింపఁగన్. 140

చ. అదియును జిత్రమౌ చలనమై చన రాముని యూహవెంట నౌ
ప్పిదముగఁ జంక్రమించుచుఁ గపిప్రభుఁ డాసురరాజుబండి మూ
లదెసల సంచరింపగను లాఘవమొప్పగఁ రామచంద్రుఁడున్
గదలిచె నమ్ములన్ దివిజకాండ విరోధి రథంబునందునన్. 141

చ. అదివర కెన్నడుందెలియనట్టి విచిత్ర శరప్రయోగ మౌ
చు దితిజరాజు బండిదెసఁ జూచెను, బాణము వెంట బాణముం
గదురఁగ బండి ఘూర్ణిలెడుఁ, గంపము నొందెడుఁ దాకినట్టిచో
టది విరియున్, మహాభవనమందున నిట్టిక లూడునట్లుగన్. 142

చ. కడువడి రామమూర్తి రథకారుని శిల్పరహస్యవేత్తయో
కెడపుచు బండిమేకులు బిగించినచోటులు ప్రీలఁగొట్టెడున్
జడుఁడయి కూరుచుండె రథసారథి ధాత్రిపయిం దురంగముల్
మెడలకు నుచ్చుపోసికొని మేదినియందున విహ్వలింపఁగన్. 143

శా. ఛిన్నాత్మీయరథుండు తా నెచట నాసీనుండౌ దైత్యేంద్రుఁ డా
సన్నం దోచకయున్న రావణుని వక్షస్సీమయందేసె ను
త్పన్నంబైన ధరాధరేంద్ర వినిపాతంబైన వేగంబుతో
డ న్నారాచ మొకండు రాఘవుఁడు క్రీడామూర్తియై పొల్చుచున్. 144

మ. తనవక్షంబున బాణము న్నినిచెఁ గోదండంబు ఛిన్నంబు చే
సెన యీ రెండును యౌగపద్యముగఁ జేసెన్ బాణమొక్కండు ను

గ్రనగేంద్రాభముగాఁగ రెండవది ఖడ్గప్రౌఢధారంబుగాఁ
గ నెటుల్ చేసెనొ చిత్రమైనయది రక్షస్స్వామి చిత్తంబునన్. 145

ఉ. ఇంద్రుని వజ్రపాతమయి యింత యెఱుంగదు ఱొమ్ము, స్వీయశ
క్తిం ద్రపయయ్యె దైత్యపతికిం, ధను వింక నొకండు లేని య
ట్లుం ద్రసరేణుభూతమయి లోఁగె రథస్థ మహాయుధంబులున్
స్వేంద్రియముల్ వశంబఱె నగేంద్రము ఱెక్కలు పాసినట్టుగన్. 146

ఉ. వాని కిరీటమంత ధరపైఁ బడనేసెను రామమూర్తి ఘం
టానినదంబుతోడ మకుటంబు ధరం దొరఁగన్ మణివ్రజం
బూనిన గూళ్ళులం దురలి యుర్విని సూర్యునివెల్గు కాల్వ ల
గ్గానతధారలై పడియకట్టినయట్లుగఁ గానిపింపఁగన్. 147

చ. ఒక దిశిబొమ్మనా నిలచియుండెను దానవచక్రవర్తి సూ
ర్యకులుఁడు రామచంద్రుఁడు కటాక్షసుధాప్రసరంబుగాగ వి
వ్వకనుల పావమాని మెయిఁబూనిన బాణపు గంట్లు చూచి వీ
తకలుషభావుఁడై యనియె దానవనాథునిమోము చూచుచున్. 148

ఉ. ఇంటికి బొమ్ము డస్సితివి యెంతయు మారుతి ముష్టిఘాతమై
వింత శరాళి లక్ష్మణునివిన్ నినుఁ గాఱియవెట్టె నౌర! యా
వెంటనె నేను గొట్టితిని వెక్కసమైనది నీకుఁ, బోయి యా
గంటుల మందు వేసికొని క్రమ్మఱ రానగు సేదదేఱుచున్. 149

చ. అటనట డస్సి నాకడకు నాహవమాడఁగ రాకు మెప్పు, మి
క్కుటముగ నింతవాఁడ ననుకొంచును యుద్ధము చేయఁబోకు, దోః
పటుతరశక్తి యస్త్రముల పట్టును ధారణచేసి రమ్ము, నెం
తటిరిపుశక్తి యెప్పుడును దక్కువ సేయఁగ రా దెఱుంగకన్. 150

వ. నాకుం బనియున్నది, కీశేశ్వరుల మేనుల నీవుగ్రుచ్చిన నారాచంబులు పెకలింపం
చను సౌమిత్రిని సేదదేర్చను వలయుఁ బొమ్మని శ్రీరాముం డాంజనేయునితోఁ
దిరిగిపోగా, రావణుండు. 151

గీ. ఎట్లుఁ దన పురిలోనికి నేఁగవలయు నెట్లు తన పురిలోనికి నేఁగవలయు
పాదచారియై యర్థశవంబువోలె నిపుడు తన పురిలోనికి నేఁగవలయు. 152

మ. తనవంకం బెను లజ్జచేఁగనఁగ దైత్యశ్రేణి దూరంబునన్
తనవంకం బెనుభీతిచేఁ గనఁగ దైత్యశ్రేణి దూరంబునన్
మనుజుం డొక్కఁడు కోతిపై నిలచి యీ మాద్రిం బొనర్పంగ రా
వణుఁడై తానుగఁ బాదచారియయి పోవన్ స్వీయరాజ్యంబునన్. 153

ఉ. రావణుఁ డేగుచుండ నసురవ్రజ మొక్కఁడొకండు భీతిమైఁ
గ్రేవల కేగి నిల్చిరి పురీగత రాజపథాంతరంబునన్

రావణుఁడేగియేగి తన రాజమహాభవనంబులోన లో
రా వలదంచు నెవ్వరిని రాజితపీఠమున న్నిషణ్ణుఁడై. 154

చ. మకుటమె తీసెనో మఱియు మస్తకమే తొలగించెనేమొ? మ
స్తకమును దీసినం దిరిగి తానెటు వచ్చును గేహసీమకుం
జికిలి మెఱుంగుబుద్ధి యతసీకుమాభుఁడు వాఁడు చేసెఁ బూ
నికఁ దలయుండి లేనటుల, నేర్పనిపించనియట్టి నేర్పుతో. 155

ఉ. ఈగతిఁ జేయఁగల్గెనన నెంతగఁ జూచినఁ జాపవిద్యలో
భాగముకాద పూర్వప్రతిభామతి కాని, సమస్తచాప వి
ద్యాగురుఁడట్లు తాను, పరమాల్పుఁడ నైనటు నేను, పైకి ధ
ర్మాగతి, యింతకంటె నవమానము సేయుట యెట్లుశత్రువున్. 156

ఉ. మానిసు లల్పశక్తులని మానితిఁ గోరఁగ వారినుండియున్
రానటులన్ మృతిన్, మృతియు రానగుచున్నది వారినుండియే
తానుగఁ దాత తండ్రి యవుదానికి దానికి నద్దియే మఱిన్
నే నఖిలాధికుం డగుట నిక్కము కోరఁడు సృష్టికర్తయై. 157

శా. నాసేవించు శివుండుకాని శివుఁడున్నాఁడొక్కఁ డచ్చంపుఁ దే
జై సంవ్యాప్తజగత్త్రయంబుగను వాఁడల్పీయసుండై సునా
యాసంబొప్ప మహీయసుండగున తానా తేజు వ్యాపించదే
లా సన్నంబగునట్టి మానిసులయం దా నిండు కన్పింపఁగన్. 158

చ. మరియును నెంత తేజయిన మానవదేహ ముపాధి స్వల్పమై
పరగిన దానిఁ దెచ్చికొను స్వల్పపులక్షణమెట్లు పోవు? సా
గరమున వంతెనన్ నిలుప గడ్డితినెన్ మఱి వారివీరియ
క్కఱఁగనియెన్ బళీ! కపులుకాక మరొక్కరు లేనియక్కఱన్. 159

చ. ఇతఁడును నన్నుఁగాని హరియింపను సృష్టిని జేసెనేనియున్
దితిజు లనేకులుండి రతితీవ్రభుజాపరిణద్ధతేజు లీ
యతఁడును మొన్న నింద్రజి మహోహిశరంబులచేతఁ గాలి త
క్కు తెలివి చచ్చినాడ యనుకొంటిమిగాదె యదెట్లొ తప్పెనన్. 160

శా. నన్నుంగాని యతండు చంపుననుకొన్నన్ నాకు విశ్వాస మ
న్న న్నువ్వంతగఁ గల్గినన్ బలము కానన్ రాద లోనెంచుకొ
న్న న్నేనప్పుడు డస్సిపోయితిని నానాస్త్రంబులున్ బుద్ధిలో
న న్నిల్పవగ రాకపోయినవి తన్నవ్యక్రియాశ్చర్యమై. 161

చ. మరియును జాపవిద్యను సమానులె యుద్ధఱటన్న మాటతోఁ
బొరపడినాఁడ, వానిఁ బొలివుచ్చితి నీతఁడు సాధ్యుడన్న గ
ర్వరమను బొంది యించుక పరాకుగ నుంటిని, దానిచేత నా
దొర పయిచేయి యైనయది, దోసమునా యది వానిశక్తిగా. 162

ఉ. మారుతిమీఁది కోపమున మానితి రాముని, వానిపై శరా
సారము నింపితిన్ గపికిఁ జాలదటంచును విక్రమింపరా
నేరఁడటంచు నింక నతనిన్ మదినెంచన, వానితమ్ము దో
స్సార మెఱింగితిన్ మిగులఁజాలఁడ యీతఁడు నంచు నెంచుచున్. 163

చ. అమరఁగఁ జాపవిద్యఁగలయట్టి మెఱుంగులు చూచుచున్ వినో
దము గనుచుంటి, నాతఁడును దానిని స్వీయధనుః కళాప్రభా
వ మనుచు నెంచెఁగావలయు, వాఁడది శౌర్యమటంచు నెంచెనో
భ్రమసితి నేను, నద్దియవురా! యవమానముగాఁగ మాఱెఁబో. 164

చ. వెరవఱి వేఁడుగాని పరవీరుని యుద్ధము నేర్పు చూచి ని
వ్వెఱఁ గను వాఁడొకండగు నవీరుఁ డనాహవయోగ్యుఁ, డట్టి దు
శ్చరితుఁడు వేఱ చూపఁగల సాహస మింతయుఁబాటి లేదు త
క్క్రొరుఁ డధముండు తాన యధికుండగు నొచితి నేరకుండినన్. 165

శా. శక్తిన్ దమ్ముని మూర్ఛపుచ్చెనని దీక్షన్ గ్రోధియై వచ్చె నా
సక్తిన్ బంటు బుజంబునెక్కి మఱిక్షన్ వానిఁ దాడింపను
ద్రిక్తుండయ్యె నతండు శత్రుమతి యుద్రేకంబు పొందింప కీ
యుక్తిన్ వాఁడు నడంగి యున్నపుడె నీవూహింప నౌఁ దద్వ్యథన్. 166

క. మనచే నపకృతి పొందిన మనుజుఁడు తొలిసారి యురిసి మనమీఁదికి వ
చ్చిన యప్పటి జిగి, సమయము చనినకొలఁది పలుచఁబడును సాహస మురలున్.

మ. ఇవి నాచేసిన రెండుదోసములు పోనీ! యింకనేన్ వానిలా
ఘవముం గన్గొని యబ్బురంపడుట కల్గంబోద యేనాటికిన్
బవరంబుల్ మఱియింక నెన్నిగలవో వాఁడున్ తగన్నేన్ ధను
ర్వ్యవసాయంబునఁ బట్టి చూచికొనఁగా నైనట్టి వాక్కొక్కరిన్. 168

గీ. ఒక్కయాప్రశ్న యట్టులేయున్న దితఁడునన్వధించుటకా యటన్నదియదింత
సంశయగ్రస్తమైన దాసంశయంబు వీఁడు సమసిన నావిర్భవింపఁబోద. 169

చ. అలుపపు జంతువుల్ మనుజులం చనుకొన్నది నేను, వారలన్
వెలియిడి కోరినట్టిదియు నే, నితరుల్ గల రుగ్రరాక్షసుల్
చలమున వారిచే నితనిఁ జరిపఁగఁ జేసిన సంశయంబుగా
నిలచియ పోవు సంశయము, నీరజగర్భుని తెల్వి తెల్విగా. 170

చ. మా కెటువంటిదైన యవమానము చేసెనొ వాఁడు, వానికిం
జేకొని దానికిన్ మిగిలి చేయఁగనౌ నవమాన, ముగ్రదో
శ్శీకుని సర్వవేళల నరిందము పూర్వమహోహవోగ్రచం
డాకృతిఁ బంపఁగావలయు నాతనిపై విధి యాటకట్టఁగన్. 171

మ. అకటా! నాపరు వెల్లఁబోయినది రాజ్యంబందునన్ రాజధా
నికిఁ నేఁ గాల్నడ వచ్చునట్టి పగిదిన్ నిర్మించె, నాపైని ము
క్తకిరీటంబుగ, నే ప్రతిక్రియయు యోగ్యంబేయగున్ జువ్వె వా
నికిఁ, గాళ్సేతులుకట్టి బొమ్మవలె వానిన్ వీధులం ద్రిప్పగన్. 172

ఉ. కొండలతెక్క లింద్రుఁడయి కొట్టిన నాతని తెక్క లీభుజా
చండుఁడు కొట్టె వాఁడొకఁడు చాలును ముజ్జగమున్ గ్రసింప, వాఁ
డుండఁగ నాకు నేమిభయ మున్నది? చాపము గీప మంచు నో
ర్వం డొక పంటిక్రిందకును రాఁడితఁడూరక మ్రింగుచుండఁగన్. 173

గీ. నీవు కొట్టెడి వాఁడవు నీవు కొట్టు చుండు వాతండునుం దినుచున్న వాఁడు
తినుచునుండున యమ్ములేదును ధనుస్సు లేదు కొండలు విసరుట లేదు పైన.

మ. అతనిం బోలిన యట్టి యబ్బురము లే దాకల్పకల్పంబు నూ
ర్జితుఁడౌ నాతఁడు పుట్టినప్పటి కథావృత్తాంతమున్ లోకవి
స్మితికిన్ హేతువు వాఁడొకండె దితిజశ్రీమూలభూతుండు వే
ని తరం బాతనిఁజంపఁగా? మొదట వానిం గెల్చుటే లేదనన్. 175

చ. సదమలపంచభూత పరిషన్మయమై చను సృష్టి సాగుచో
మొదలివికారమై చనిన పూర్ణగుణంబు లొకండొకండు తా
నదియదియే ప్రపూర్ణముగ నందె శరీరుల బాహుశక్తి సం
పద సకలంబునుం బడసె వానినిఁ గొండనుబోని మేనితో. 176

క. పిడుగులు పడుచున్నను వాఁ డిడియఁడు గిరిరాజమైన నిడియునుబో యా
తఁడు యుద్ధము చేయఁడు వంతిడి శత్రుల మొదలువెట్టి తినుచుండుటయే.

ఉ. ఆతఁడు పుట్టినంతనె మహాక్షుధచే సురయక్షదైత్యులం
జేతులఁ బూని దంతములఁ జీలిచి యూరక మ్రింగుచుండగా
భూతలమందునన్ వెలితి పుట్టిన యెందున కందుఁ బట్టయై
భీతిని జీవకోటి చని విన్నపమున్ పొనరింప బ్రహ్మకున్. 178

శా. స్వామీ! యేమిదితెచ్చిపెట్టితివి మా జన్మంబులున్ మృత్యువుల్
గా ముందేదియొ వెన్కనేదియొ యెఱుంగన్ నేర మన్నన్ దయా
శ్రీమంతుం డయి బ్రహ్మ వానిఁ బిలిపించెన్ వచ్చె నాతండు మ
ధ్యేమార్గంబున విన్నవించు జనులం దించున్ బుభుక్షావిధిన్. 179

శా. బమ్మంగాంచుచుఁ గుంభకర్ణుఁడును ఝుంభజ్జిహ్వా సారింపఁగా
గ్రమ్మెన్ భీతి పయోజయోనికి మనఃకంజాతమందున్ నిమే
షమ్మం దాటకయుండ నాతని శపించంబూని వా చించికొం
చు మ్మోఘేతరమైన నిద్ర కనుమంచు న్మాటలై వచ్చినన్. 180

ఉ. తా నొక పెద్దకొండవలె ధాత్రిపయిం బడి వాఁడు నిద్రపో
గా నిగిడించు నూరుపుల గాలులఁ దూలుచు సత్యలోకపుం
గోనలు తారుమారయినఁ గోపముచే విసువంది బ్రహ్మయున్
వీనిని గొంచుఁబొం డనియె వీఁడెటుపుట్టె నటంచుఁ దీవ్రుఁడై. 181

క. అడుగడుగున మోసెడి వార్పడిపోవఁగ వేయిమంది పట్టుకరాఁగాఁ
గడిపించి సత్యలోకపు గడపను తెచ్చితిమి వానిఁ గ్రమ్మఱ నిటకున్. 182

మ. పృథివీభూతములెల్ల ము న్నిలువఁగా వీల్లేని వానిన్ మహో
యుధమున్ గాఁగను జూచినాఁడను భుజాయుక్తిం ద్రిలోకీజయ
ప్రథ వాంఛించిన నేను నాకు మితిమీఱన్ వీఁడుగా నెంచుచుం
ప్రథితంబై చనుభక్తి నవ్విధిని సంప్రార్థించితిన్ దీనుఁడై. 183

చ. బ్రతికినయంతకాలమును బంధురనిద్రను గూరియున్నచో
బ్రతుకను నేల? దానికిని ఆాయియ మేలగుఁగాదె! బ్రహ్మసం
తతియయి ఆాయియై మనుట న్యాయమె? నీకృప, యింతపట్టుని
ర్గతమయి సృష్టి నీవెఱుఁగకన్ బహిరాగత మైన దున్నదే. 184

చ. ఒకనికిఁ బట్టరాని తెలివుండును వేదములన్ స్మరించు, వే
ఱొకనికిఁ బట్టరాని బలముండును లోకములం జయించు, నిం
కొకనికిఁ బట్టరానిక్షుధ యుండును భూతములం గ్రహించు నీ
కొకని కనాదియౌ ప్రభుతయున్నది సృష్టినిఁ జేతులోకముల్. 185

క. ఈతం డెవ్వం డనఁగ విధాత్రుని మనుమం డితండు దైత్యుఁడొ శిలయో?
యీతం డెవ్వం డనఁగ విధాత్రునిమనుమం డితండు దైత్యుఁడు శిలయున్.

చ. సరసిజగర్భుఁ డిట్లనియెఁ జాలున యేమనె దీవు జంతువుల్
మరియును వృద్ధిపొందెడు ప్రమాణము మీఱిన తిండి తిన్న చో
జరుగుట యెట్లు లోకము, లసాధుభుక్షువు వాఁడు నన్ను నే
బిరబిర చూచుచు న్నమిలివేయఁగ నెంచెనుగాదె యత్తఱిన్. 187

మ. తొడి బంధుత్వము నింతకట్టుక నిరుద్యోగంబుగా నింటిలో
నిడి పోషించెద నన్న, గుండిగను నీ వెన్నాళ్ళు పూరింతు? వాఁ
డడుఁగన్ లేదను మొక్కసారి, యకటా! యర్థాశనాయాప్రచం
డుఁడు నిన్నే గ్రసియించు, ధర్మమది నిండున్ బంధుతాసాధువై. 188

ఉ. ఊఁగి జగంబులం దినుచునుండిన వాఁడును వానిపోషణన్
సాగిన నీవు, రెండును నిజంబుగ నొక్కటియే గదా, బుభు
క్షాగతి నాతఁ డూరక జగంబులు మ్రింగును, వానిపోషణం
గాఁగలదేమి? నీకును, జగంబులు వెట్టెదు త్రవ్విపోయుచున్. 189

ఉ. తమ్ముఁడటన్న యీమమత తాల్పకుమన్నను, నేను తాత! గే
హమ్మున నున్న ముద్దును నిరంతము తమ్మునిగాఁగఁ జూచుకొం
చు మ్మనుమన్నఁ జేతనగు చుట్టరికమ్మున నేమి చెప్పనొఁ
గ్రమ్మిన నైజలక్షణముగాక మనఃకృతదోషమున్నదే? 190

మ. సిలుగౌ నిక్కము వాని నిచ్చలును పోషింపంగ, నీ వన్నయ
ట్టులు లోకక్షతి చేయఁగా వలసియుండున్, నేను నద్దాన నీ
పలుకై వచ్చిన దానిలోని నిజముం భావించిన ట్లొప్ప నా
పలుకున్ ముద్దునుచేసి నట్టిదగు నప్పాటం గటాక్షింపవే. 191

శా. ఏ రెన్నాళ్ళులొ వాఁడు మేలుకొనఁగా నేడాదికిం జేయవే
యా రెన్నాళ్ళులు రెండుసార్లుగను జేయన్ మాకు సంతోషమౌ
నా రెన్నాళ్ళులు వాని కెప్ప డశనాయాపూర్తి కావించెదన్
మా రాజ్యంబున నందఱుందినెడివౌ మాంసాదులన్ బెట్టుచున్. 192

క. వాని బుభుక్షార్థము లోకానికి నొక సేగి లేనిగతిఁ జేసెద వా
గ్దానము, నను మన్నింపవె తా ననుజుం డన్నవాఁడు తా నున్నటులన్. 193

మ. అనినన్ బ్రహ్మయు నవ్వుఁగొంచుచు సరేయన్నాడు క్రొన్నవ్వుతో
దనుజాధీశుఁడు కుంభకర్ణుఁడు తనంతన్ మేలుకొన్నన్ సరే
పని యేదైనను కల్గి మేలుకొలుపన్ వాంఛింతు మేనిన్ మరే
మననౌ నాపనిలోన నుండిన యసాధ్యత్వంబు సాధ్యత్వమున్. 194

చ. నెలలునుమూఁడు దాఁటకయ నిక్కముమేల్కొను టే యసాధ్యమౌ
నెలలవి మూఁడుదాఁటినను నిర్భరశక్తిని మేలుకొల్ప నౌ
నెలలును బూర్తి కానగుచు నిండఁగఁ బోయెడు నేళఁ గొద్దిలో
పల దితిజేంద్రు మేలుకొలుపన్ సులభంబగుఁ గొంతమేరకున్. 195

చ. సహజముగాఁగ మేల్కనిన శౌర్యము వానిది సర్వలోకదు
స్సహమగు, వాని మేల్కొలుపశౌర్యము కొంచెముతగ్గు నాఁ బయో
రుహభవుఁడన్నయట్లు లెవరో యని, రయ్యది నేనెఱుంగ, ధూ
ర్వహమగు వానిశక్తికి రవంత కొఱంత దురంతమే మగున్. 196

క. నెలయైనను మిగులద ఱూర్నెలలను, సగమైన లేద నెలలోపల, నా
ర్నెలలందునఁ దొమ్మిదిదినములు మిగిలిన మాత్ర మునిగిపోయెనె చెపుమా!

చ. నిలచి తనంత తానుగను నిద్దుర మేల్కొనుదాఁక నాగఁగా
దలచిన, వాఁడు చేసిన విధంబది తొమ్మిదినాళ్ళు గుండెలో
పల భరియించుటెట్లు? పగపట్టుక యిట్టులె ప్రొద్దుక్రుంకులో
పల నతఁడేమి చేసె నది వానికిఁ జేయక శౌర్యమున్నదే? 198

ఉ. తొమ్మిదినాళ్ళు తక్కువగ దుష్టుఁడు రాముఁడు నన్ను నమ్మలం
గ్రుమ్మఁగ నేలకల్గినది? క్రూరులు రాక్షసు లింక లేరటే
యిమ్మగ నేగి వాని వధియించెడి వారలు? కుంభకర్ణునిం
బొమ్మన నేటికిన్ నిదురపోయెడివానిని లేప నేటికిన్. 199

గీ. నూటయెన్బది నాళ్ళలో నూటడెబ్బ దొకటి గడచినయది యది యొక్క కొఱఁత
యగునె? శంకించునది మన సన్న దినుసుకాక, నిశ్చయమని లేని లేకి దినుసు.

మ. ఒకడేప్రశ్న యతండు నాయురమునం దొక్కమ్ము నాటెన్, నిర
స్తకుభృద్భారము నట్టి దైన శరవర్షం బాగుచున్ లెక్కసే
యక యవ్వానినిఁ బోయి పట్టుకొని బాహోత్కృష్టి తన్మార్దదే
శకమాంసాస్థిని వ్రక్కలించఁగల డా చండోగ్రదోశ్శక్తిచే. 201

చ. దిగధిపు లందఱుం గలసి దీప్తమహాస్త్రము లేయుచుండగా
నగభిదమోఘవజ్రము ఘనంబుగ నెత్తిన మొత్తుచుండఁగా
ఖగచరవీరులందఱును గత్తులఁ గ్రుమ్ముచు నుండ నేకధా
రగఁ జని లెక్క సేయ కమరావతి గోపుర మూడఁ దన్నెఁగా. 202

శా. క్షుభ్యన్నీలము వారిరాశినిపతత్సుగ్రీవ మాశాచల
ద్బిభ్యద్వాయుసుతంబు విహ్వలదసు వ్రీడార్ద్రవల్లక్ష్మణం
బభ్యామర్దిత సర్వఋక్షకపిసైన్యంబున్ విలోకించి దో
రభ్యాశంబుగ మోర మోదికొనుచున్ రాముండునుం జచ్చెడున్. 203

వ. ఇట్లు నిశ్చయించి మిగిలినమంత్రులను బిలిపించి వారితో రాముని దుర్నయమును
దనయౌదాసీన్యముగా నిరూపించి కుంభకర్ణుని యప్రత్యార్యత్వము ప్రాస్తావిక
ముగా నుగ్గడించి, యతనినిద్ర లేపుట వారిచే ననిపించి, వారియొత్తిడికిఁ దా
నంగీకరించినట్లు నటించి వారిని దత్కార్యమున నియోగించిన. 204

సీ. కొండంత మాంస మ్మకూపార మంత మద్యంబును వెస సమాయత్తపఱచి
కుంభకర్ణుని నిద్ర కూరినదగు గుహా ముఖమునఁ జేరి తన్ముఖవినిర్గ
తంబైన గాలిచేఁ దాడితదేహులై పాదస్థలన మంది పార్శ్వగముల
నినుపకమ్ముల నూని యేగి లోనికి వాని తలవైపునందు భద్రముగ నిలచి

గీ. పటహములు ప్రాసశూలముల్ పట్టిసములు గర్ద భాశ్వగజంబులు కాహళములు
కడఁగినెమ్మదినెమ్మదిగాఁగ నొక్కఁడొకఁడు లోనికిఁజేర్పించి యుత్సుకులయి.

ప్రహరణ కలిత.

పటుతరగదలన్ బహుళపరిఘలన్ బటువు గుదియలన్ బలుగు బరిసెలన్
పటపట భటులున్ బడలి పొలిచినన్ నిటలపు ముడియున్ నిగుడ దతనికిన్.

తుటుము పదనుకత్తులను గురిసినన్ చటుల నిశిత ప్రాసములు విసరినన్
నటదనలపు బాణములు సుడిసినన్ నిటలపు ముడియున్ నిగుడ దతనికిన్ 207

రటదశనిమహోర్భటిమదుదితదు ర్ఘటపటుతరముద్గరము లద్రువఁగన్
జటిల పటువరశ్వధము లడచినన్ నిటలవు ముడియున్ నిగుడ దతనికిన్. 208

అశ్వగతి.

భాసురశూలవినర్తిత బంధుర కర్ణనటత్
రాసభఘోరవిరావతురంగమ దుర్భరహే
షాసముదీర్ణరవంబు లెసంగిన నిశ్వసనో
చ్ఛ్వాసములందు సమానత పాయుటె కన్పడకన్. 209

గజవిలసితము.

జేగురుభూతి యొప్ప సివమెసఁగి సురల యూ
రేగిన ఘంట లొప్ప నిభసమితి పరవఁగన్
జోగిన కన్నుమూత సురరిపువు తెరవఁడే
యీఁగలు వ్రాలినట్లయిన కరము విసరఁడున్. 210

క్రోవులఁ జిమ్మ నీళ్ళు కుటిలదశనఖనన
గ్రావముగాఁగఁ గ్రుమ్మ కరచరణయుగములన్
జేఁవగఁ ద్రొక్కి త్రొక్కి సిల్గువఱచి చనినన్
గ్రీవ కదల్చ డొత్తిగిలఁడు కదలడు ధరన్. 211

తిరకపోట్ల ఘీంకృతి చటులము గిరిదెసల్
గీరెడు వప్రకేళికృత నఱుము చఱుమఁగన్
మారణదుష్టచంక్రమణరమణ మసల ని
ద్రారతి నుంతగాఁ గదలి కనులు తెరవకే. 212

క. నన్నేల నిదుర లేపెద రన్నాకముబాధ మున్నె యణఁగినదికదా
యన్నాఁడు, మఱల నిద్దుర కన్నాఁ డసురేశ్వరుండు కన్నులముంపై. 213

గీ. ఉన్న చీఁకటి యుండక యొక్క దివ్వె వచ్చి వెంబడి నారిన వగిది వాని
కలుగుమెలఁకువ పదిమడుంగులుగఁబోయి యంతటను బునఃపాకప్రయత్నమయ్యె.

నర్కుటము.

మునుకొని వేయికాహళల మ్రోఁతలు సేసిరిపో
కనుకని వందఢక్క లధికంబుగ వేసిరిపో
వెనుకొని వేలువందలును భేరులు మ్రోసిరిపో
కనుగొన నుంతలాభమును కల్గగ యూగిరిపో. 215

తురగము.

తవిలి శ్రవణములను ముఖములను తార్చి మండెడు శూలముల్
జవనవితతి ఖరసముదయ ముఖజాతభీషణరావమై
చెవుడు వడఁగ దెస లఖిలము పరిశీర్ణ చలద్వియత్
భవమగు ప్రతిరవము గుహ నిలుచుపాటి లేక విదీర్ణమై. 216

అశ్వలలిత.

ఇరుదెసలందు రజ్జువులు కట్టి యిట్టటుల లాగునట్టి వెరపై
తురగచయంబు ఘోరఖరరాజి తోలఁగను ద్రొళ్లువ్రీలి చనినన్
ఖరతురగంబులు గ్రమముగ నేగిగాఢముగ గోడలందుఁ దునుఁగన్
తిరిగి సురారిబాహువులుగాని దేహమునుగాని సుంతచెడదున్. 217

కరిబృంహితము.

గ్రావనిభములు దంతినిచయము క్రమ్మి యురమునఁ గ్రుమ్మినన్
త్రోవ యెఱుఁగక వానివెనుచెవి రూక్షముగ రొదచేసినన్
మావులును ఖరదంతులును పెనుమార్గమో యన నేగినన్
దేవరిపుమెయి వాని కిసుమును దెల్వి కలుగకయుండినన్. 218

ద్విపద.

సీసంబు కరిగించి చెవులలోఁ బోసి ప్రాసనంతతి గ్రుచ్చి పండగాఁ గాల్చి
మీసముల్ పటుకార్ల మెలచి లాగించి రోసముల్ మివులంగ రూక్షదానవులు.

వ. గత్యంతరములేక తీవ్రక్షురంబులు ముక్కులలోఁ జొనిపిన నతఁడు చేతుల విద లించి మఱల నట్లేచేయఁ దీవ్రక్షతంబుల లేచి కూర్చుండి వారినాహరింపఁబోగా మాంసమద్యంబు లందించి యతఁడు తృప్తివడి ప్రశాంతుడై ప్రసన్నుఁడైన. 220

ఉ. సమ్ముఖమందుఁ జేరి భయసంగతవృత్తిఁ బునఃపునఃప్రణా
మమ్ములు చేయుచున్ దితిజమండలనాయక! యన్న వారు, తా
నమ్మహనీయమూర్తి నను నంగద లేపితిరేల యన్న వా
రిమ్ముగ రావణాజ్ఞ వచియించిరి సాధువులైన మాటలన్. 221

వ. అంతఁగుంభకర్ణుడు తన్ను మేల్కొలుప వచ్చిన రాక్షస భటులను గజాశ్వాదుల నందఱిని బంపించి తనమంత్రులైన యూపాక్షమహోదరులతో నిట్లనియె. 222

శా. రాముం డెవ్వడు లక్ష్మణుండు నెవఁడొరా! మానిసుల్ కాని సు
త్రాముండున్ యముఁడంచుఁ గారుగద, పారావార మెట్లీది నా
రీ మీ యందఱ కింత భీ కలుగఁగా నెట్లాచరింపంగ నై
రే మా రామున కింతమానుషము? దైత్యేంద్రుండె కంపింపగా. 223

చ. మన దితిజాతసంతతికి మానవజాతికి భేద మున్న దా
మనుజులు స్వీయధారుణీరమాపరితృప్తులు, సత్యధర్మపా
లనపరమార్థచేతసు, లిలాసకలార్థరమానుభోగవాం
ఛను మన ముందు, మేటికిని సాధువు రాఘవుఁ డెత్తివచ్చెనో? 224

గీ. అంతవఱకైన సర్వరామాయణంబు తెలియఁజెప్పిరి మంత్రులు దితిజపతికిఁ
గుంభకర్ణుఁ డాలోచనాఘూర్ణి తాక్షుడెల్ల విషయంబు నూహించి యిట్టు లనియె.

చ. కృతమతి నేను నాల్నెలల క్రిందట మేల్కొనినప్డు వింటి భూ
సుతఁ గొనితెచ్చెనంచు, నది శూరుఁడు రామునకున్ వలీముఖ

ప్రతతికి మైత్రి కల్గుటయు, రామునిపంపునఁ గోఁతి, రాక్షసుల్
కుతలపడంగ నగ్గి దరికొల్పుట రెండును రెండు చిత్రముల్. 226

గీ. ఆూళ్ళు లవి తేలెనా సాగరంబుపైన రావణుని గుండె ప్రస్సెనా! రామశరము
తాఁకి, యెయ్యదియింద్రుశతారమునకుచెక్కు చెదరదొ, యయ్యది చిత్రమనుము.

ఉ. రావణుఁ గెల్వఁగా వలయు రాముఁడు, చిత్రము, వాలిఁజంపి సు
గ్రీవునితోడ నేస్త మమరించుకొనెన్ మతి కందరాదు, సు
గ్రీవుఁడు చూచినన్ సకలకీశధరాపతి, యాంజనేయ సు
గ్రీవులు మంత్రి రాజు, నెవరిం బయికెత్తుటయో యెఱుంగకన్. 228

క. ఈమారుతి కెవ రధికమొ రాముఁడొ సుగ్రీవుఁడో ధురామతి రాముం
డేమి మదిఁ గోరి యీాతనితో మైత్రింగట్టె? సుంత తోఁచదు నాకున్. 229

చ. ఒకఁడొకఁడున్ విచిత్రముగ నున్నది వంకరటింక రేడుతా
ళ్ళకు నొకయమ్మ, నంతటి బలంబు కలానికిఁ గీశరాజు వా
లికి నొకయమ్మ, ప్రోదినికి లేఖపపాతికి నాగు దైత్యగుం
డెకు నొకయమ్మ, తద్విశిఖనిర్భరభావ మచింత్య మయ్యెడున్. 230

వ. అనుచు నమ్మంత్రులను మీరు పొండు నే నింతలో వత్తునని మహారాజుతోఁ
జెప్పుడని, వారినిఁ బంపించి, కృతస్నానుఁడై రాజదర్శనయోగ్యవేషధారణంబు
సేయుచు. 231

మధ్యాక్కఱలు.

నూటయెన్బదియేండ్లు జరుగ నూలుకొనున్ నాకు నొక్క
యేటి మేల్కనుట బ్రహ్మవచియించె, నిదేటిజీవితము?
చేటు మేల్కనియున్నయంతసేపు కుక్షింభరిత్వంబె
పాటిగా నిహపరలోకపాలనాభావంబె లేదు. 232

కొండంత యీాదేహ మేలొకో మేలుకో లేని మేను
గండఁడొ దశకంఠు నండగా నుండగా నేమొ మేను
ఖండ మీ జాగ్రత్త పాయగా నీయఁగా లేదు రావ
ణుం డందుచేతఁ దద్రక్షనుం జేయనుంగాక లేదా. 233

కళలు రెండే కల్గువానిఁ గల్హారకాంతునిఁ దాల్చుఁ
దలపై నుమాజాని నాకుఁ దనరారుఁ దగ రెండునాళ్ళ
తెలివి యేఁడాదికిఁ బోల్కి తెచ్చినఁ దెచ్చుఁ బాలింప
వెలుఁగు లెచ్చుట నున్నఁ బ్రోవువెట్టెడు విభుఁ డేల తేఁడు? 234

కసటైన పనికాక మఱలఁ గలిగెడి కంఠముల్ కోసి
యొసఁగుట యని వందయేనియును నాదు నొక్క కంఠమ్ము
పసిగావు, నీవలెఁగాక సర్వంకషమ్ముగా సర్వ
మనువులు, నైవేద్య మల్పమైన భయ మ్మేల కాదు! 235

శివునియంతటివాఁడు కాక శివధనుశ్ఛేత్త యెట్లగును
శివుని శిష్యునిదైన వింటిచేవ వంచించుట యెట్లు
అవురయ్య కంఠముల్ తెగినయప్పుడు ప్రాణముల్ పోవు
నవి తెగి ప్రాణముల్ పోనియపుడు భయం బేల వలయు? 236

చిత్తమున విభీషణుండు చెడ్డ మంచిని నేర్పరించుఁ
దత్తరంపడి వాఁడు నేఁగెఁ దరణి సంతానంబు చేర
హత్తుఁ గొందఱకు భవిష్యదర్థంబు లాత్మయందు
చిత్తమ్ము శాంతమై మఱి సుశీలమ్ము చెందువారలకు. 237

బుజమునయందుండి కత్తి పూనుచుఁ బూన్చుట యెట్లు
బుజము ఖండింపంగ, నేమిబుజ మది భూభృన్నిభంబు
రజనిచరుండు వాఁడా విరాధుండు గ్రావసన్నిభుఁడు
గజిబిజిగాగఁ నాలో సగంబైన గలఁ డనుకొందు. 238

వ. సతారాచంద్రసూర్యంబు సప్రత్యంతపర్వతంబు నీలాంజనగిరి కదలుచున్న దనఁ
గుంభకర్ణుండు లంకాపట్టణధాత్రి దద్దరిల్లగా రాజభవనంబు చేరి రావణునిచేతఁ
బ్రత్యుద్యాతుండయి సౌదర్యంబు నెఱపఁబడిన తరువాత రాజిట్లనియె. 239

క. నిను లేపవలసి వచ్చెను మనలంకాపురికి నిపుడు మసలినయది యొ
క్కనివలన మనుజువలనను ఘన మాపత్తి, సకపిప్రకాండుని వలనన్. 240

శా. నూల్కొ బాధయు నీకుఁ గల్గుననుకొందున్ నే నెదో యుండగా
నల్కన్ గైకొని యంపకత్తు యొకఁడాహా! నాయెదం దూసెఁబో
కీల్కొ నెక్కువ బాధగా మనసునం గీశవ్రజం బన్న కా
కుల్కాసెన్ దెలవారె నంచు మదిఁ గాకుత్స్థుండు భావించెనో. 241

చ. ఒకరొకరున్ శరప్రతతి యుద్ధములాడెడు వేళ నంతె, దా
నికిఁ బనిలేదు, వానికిని నిక్కది యెంత? ధరిత్రిఁ గూల్చెనా
మకుటము, దైత్యశూరజనమండలి కంతకు సిగ్గు గూర్చు దా
నికి, మఱి వానిప్రాణములు నిండుగ దీసెడు నట్టిదానికిన్. 242

ఉ. ఆ పని కీవొకండవు సమర్థుఁడ వింకొకరుండు లేఁడు సం
క్షేపముగాఁగ మంత్రులును జెప్పియయుందు రిదంతయున్ మదా
జ్ఞాపరిబద్ధబుద్ధివయి చండము శూలము తాల్చి పొమ్ము ని
న్నోపెడువాఁడు మింటిపయి నున్నది లే దిట నున్నె మంటిపై. 243

క. అపాపిఁ జంపి తినకుము చూపఱు వెఱఁగంద తేపు సూర్యోదయమౌ
లోపున వానిశవంబును జూపింపుము నాకు నయనసుందరశవమున్. 244

శా. ఏ మాలోచన చేయుచుంటి వన, నాదేమున్న? దేమైన నీ
రాముం డిచ్చటి కేల రావలయు? సుత్రామున్ జయింపంగ స్వ

ర్థామం బందలి సర్వభోగములు హస్తప్రాప్తముల్ గాఁగ, స్వ
ర్ధామశ్రీ కధికంబు లే దనుచు వేదంబుల్ ప్రశంసింపఁగన్. 245

చ. సచివులతోడఁ జెప్పవలె సఖ్యము వైరము వారిమాటలం
దుచితముఁగామి బియ్యమును నూఁకయు నట్టుల నేర్పరించి యం
దుచితము చేయఁగావలయు నుర్విపుఁ, డాతని రాజ్యలక్ష్మి కూ
రుచుఁ బ్రియురాలునౌ, సమనురోపితుఁ జేయు రహస్సుఖంబులన్. 246

చ. మఱియును జీవులందఱు ప్రమాణము కల్గియ యుందు రన్నిటం
దెఱలకు మించి యొక్కనికిఁ బెద్దయుఁ గల్గెనయేని శక్తి యే
డ్తెఱ నది యంతలో నపరిధీకృత మంచని యెంచరాద, యే
మఱకయ దాని కుండిన ప్రమాణము దానికి నుండు నెప్పుడున్. 247

ఉ. అట్టులుకాక నాల్గు పురుషార్థములై చను నాల్గుగుఱ్ఱముల్
కట్టిన బండియున్ సమముగాఁ జన యాత్ర సుఖంబుగా నగున్
కట్టిన గుఱ్ఱ మొక్కఁ డధికంబుగ నేగిన దారి వీడి యే
చెట్టునఁ దాఁకునో? శిలనుజెందునొ? గర్తమునందు జాఱునో. 248

చ. తెలిసిన యాగమార్థములు తెల్వికి నీతికిఁగాక యింతగాఁ
దెలిసితి నన్న గర్వమును దెచ్చిన దానికి నైన నేమియౌఁ
దెలివియు వేఱలేదు తనతీర్చిన తీరువు, చేయు సేఁతయే
తెలివి యటన్న శాస్త్రములఁ దేలికవుచ్చుటయే యగుంగదా! 249

ఉ. ప్రెగ్గడలందు రెండయిన రీతులు కల్గు, నొకండు తేనిలో
ముగ్గిన చెట్టకోర్కులకు ముంతపొగన్ ఘటియించు, వేఱొకం
డగ్గిని దవ్వు ద్రోసి యిదియైనను సేవ్యమటంచుఁ జెప్పు, నే
ప్రెగ్గడ మాటలందుఁ బృథివీపతి దుర్మతి మొగ్గుసూపెడున్. 250

ఉ. నేరము పంచభూతముల నిల్చిన చేతనతాస్వరూప మా
కార విశేషభేదములు కాంచుట కల్గును గాని, యాంతర
స్ఫార వివేకలక్షణము చాల మెఱుంగఁగ, మూర్తి పెద్దదై
పారము చిన్న, పెద్దదయి పారము మూరితి చిన్నగాఁ జనున్. 251

మ. తన యుత్తాలగుణంబు సత్ఫలముపొందన్ రాక యుండంగఁ బె
ల్చన కల్పించును బ్రహ్మ, యొక్కఁడు రిరంసాబుద్ధి జీవుండు పో
వును వ్యామోహము వెంబడిం దనకుఁగాఁబోనైన మేల్త్రోవ నెం
చనునైనం గనకుండ నక్కట! యధస్తాదధ్వముం బట్టుచున్. 252

చ. అన దశకంధరుండు తన యక్షులఁ దీవ్రత గోచరింప ని
ట్లనియెను నిద్రలేపు టదియన్నను నిన్నును నాకు మంచిచె
ప్పను నిరతంబు మేల్కనెడు వారలు ధారుణియందు లేరటం
చనుకొనెదన్ మహాగమ సదాధ్యయనం బొనరించు పండితుల్. 253

శా. నీముం దాగడు నీరజాసనుఁడు నీ నిద్రాజడత్వంబు లే
కా మైఁ వేదము లాగమాళి నిరతాభ్యాసంబు కావింప నం
చేమో యిట్టులఁజేసె నెప్పుడును నీ వీ మెట్ట వేదాంతముల్
నాముందాడవు, నిద్రలోఁ గఱచి తన్నా! యెన్ని శాస్త్రంబులన్. 254

శా. ఆ రెన్నాళ్ళు మెలంకువన్ విధిని సంప్రార్థించి తేకున్నచో
నౌరా! దేహము దిండిలేక యెపుడో యానిద్రలో నిద్రలో
నే రాజీవహితాత్మజాతునిపురం బేగం బ్రయాణించి యుం
దా రమ్యానుభవంబు లేనటుల నేనైఁ సేఁత తప్పైనదో! 255

ఉ. తద్దయు నీకు నున్నవికదా మఱి తొమ్మిదినాళ్ళు లింక బ
ల్నిద్దురమత్తు తా వదలలే దది నీకును బోయి నిద్రపో!
మొద్దు విధంబునన్ నిదురపోవుచునుండఁగ వాఁడు వచ్చి యా
మొద్దును గాళ్ళు చేతులును ముక్కలు ముక్కలుగాఁగ వ్రేల్చెదున్. 256

గీ. వానిఁ జంపఁగలిగి వానిని జంపక వానిచేత నిదురలోనఁ జత్తె
యేమి చెప్పఁజొచ్చి దింతటి నీతులు గోయి యొద్దునందుఁ గూరుచుండి. 257

ఉ. నన్నెదిరించి వాఁడు చనినా డొకఁ డట్టులె నీవు నైనచోఁ
జన్ననుబో వికుంఠమున సందడి గల్గఁ మీకుఁగాని తా
నన్నరునందుఁ బ్రేమ గురునందుఁ దిరస్కృతి యేమి చెప్పనౌ
నన్నను నేను మీబ్రదుకునంతయు భోగమయంబు చేసితిన్. 258

చ. అణువులు కుంభకర్ణుఁ డెవఁడన్న విభీషణుఁ డెవ్వఁడన్న రా
వణు ననుజన్ము లన్నదియె, వ్యక్తిత లేదది మీకు, నేను కా
రణముగ సర్వమీ దితిజరాజ్యము కల్గెను, మత్కృతంబు మీ
గుణజనిత ప్రభావమిదిగో కను దానిఫలంబు సర్వమున్. 259

గీ. గునిసి కుండెఁడు నీళ్ళులు క్రుమ్మరించి నట్టు లయ్యెను రావణు నగ్రవీథిఁ
గనుల నీర్త్రోసికొని కుంభకర్ణుఁడనియె రావణుండు దృశాసమార్ద్రముగఁ జూడ:

చ. వెరవరిమాట చెప్పటది వేఱును, శత్రువుతోడి సంగతిన్
వెర వఱి చేయబోవుటది వేఱును, నేనునుగాని ప్రేష్యుఁడై
దొరకు హితంబు సెప్ప టది దూష్యమెయైనను దమ్ముఁడైన యి
త్తఱి చనవూని చెప్పితిని దానికి నింతగఁ గోపగింతురే? 261

ఉ. నీవయి నెత్తివచ్చిన మనీషి రఘూద్వహుఁ డల్ల తండ్రిదౌ
నావలుకాదరించుచు సమాగతుఁడయ్యె వనాంతవీథికిన్,
నీవయి సర్వజీవితము నిల్చిన నేనును గాని యున్నవౌ
నీవలు కాదరించుచు మనీషను దద్వ్యధ మాచరించెదన్. 262

చ. అతఁడు విభీషణుండు కల నాడెడు నేరుపు లేనివాఁడు ధీ
చ్యుతుఁ డయి రామునిన్ శరణు చొచ్చెను నాదగు చేతిలో నసు
చ్యుతుఁడగునేని రాఘవుడు చూడుము వాని జనుర్విభూతి క
ర్మతతి యెఱుంగదౌ జనపరంపర భావన యిట్లె చేసెడున్. 263

చ. ఇటుల ననాదిధర్మ మగునేని మఱిం బితృవాక్యపాలనం
బటు లధికంబుగా నగున యగ్రజు వాక్యము పాలనంబు చే
యుట యది నేను చేసెదన, యుద్ధమునం దెవ రోడిపోదురో?
యటమటయౌ సహస్రసమ లాఁకలి నాయది దీని కాఁగునే? 264

ఉ. మండితబుద్ధి తండ్రిదగు మాటకుఁ గానకు వచ్చె, భార్య వి
ప్రుం డొకఁడౌచు నెత్తికొనిపోయిన నింకొకచానఁ దేను నే
రండఁటె, యెత్తివచ్చె రఘురాముని నెత్తు రదెంత తియ్యఁగా
నుండునో? త్రావగా వదన మూరుచునున్నదిరాక్షసేశ్వరా! 265

శా. నాశూలంబును వేయిపుట్లు యిను మన్నా! తూఁచి చేయించినా
నా శూరుండగు రాము మేని బరు వన్నా! పుట్టెఁడే నుండునా?
నాశూలంబును బాఱవేసి యతని న్నా చేతులం బిండి నీ
ధీశూలం బగు వాని నీదుకడకుం దెత్తుం గటాక్షింపవే. 266

మ. అనినన్ రావణుఁ డంతఁ దమ్ముని యథార్థాలాపముల్ వించుఁ బూ
నిన సంతోసము చేతఁ గన్ను గొనలన్ నిండారి ప్రేమంబు వా
నిని యుద్ధార్థము వేషధారణము పూనింపంగ మాటాడు లో
నన తన్మంత్రి మహోదరుండనియెఁ గంఠవ్యగ్రభీభావుఁడై. 267

శా. గండూషించిన యగ్గి నీటి జలముల్ గాఁ బుష్కలావర్తగా
భుండయ్యుం దొర కుంభకర్ణుఁ డొకఁడై యుద్ధానికింబోఁడు బ్ర
హ్మాండం బంతటి శూరుపైకి మఱి తోడై నేనుగా నాకుఁ దో
డుండన్ దక్కినమువ్వురున్ సచివు లీయుద్ధానికిం బోవలెన్. 268

క. ఆరాము నట్టు లుంచిన యౌరా! యాక్రోఁతు లేమి యల్పులె? చాలున్
మారుతి యొకండె దురమున వారిని మా చూచికోను వదలఁగవచ్చున్. 269

చ. తనపితృభక్తియే యెఱుఁగుఁ దానయి యాతఁడు మాయెడందలన్
నిలచిన రాజభక్తియును నేర్చు నెఱుంగఁగ నేడు, కుంభక
ర్ణునియెదలోన నన్న దెస నూల్కొనుభక్తియు నేఁడెఱుంగు, ల
క్ష్మణుదెసఁ బక్షపాత మది మానఁగఁజాలెనయేని రాముఁడున్. 270

గీ. నిండు చెలిమిని గుంభకర్ణుండు పలికె మీరు నాతోడ నేటికి మిత్రులార!
దారపుత్త్రులు గలిగినవారు మీరు మఱియు నే నేకరథుఁడను మహితబలుఁడ.

సీ. నాకున్న నిద్రయు నా యన్నగారన్న నాకున్న భక్తియు నన్నుఁదొలఁచెఁ
గాకున్న స్వర్గమో లేకున్న ధాత్రియో కడుసమాయత్త మయ్యెడిది నాకు
నా హృదంతర ముమానాథుండు పాలించు నా దేహ మలుపాల నర్థపడదు
నా రామమూర్తి నారాయణుం డైనచో నతనివిల్లును శార్ఙ్గమైన యెడల
గీ. మనము భయపడవలయు, సంశయమె యున్న
నన్నుఁ బంపఁడు సుమి దైత్యనాయకుండు
సర్వకాల జాగ్రద్భావ సంయుతుండు
ననుజభావ మర్యాదారహస్యవేత్త. 272

గీ. అతఁడాతండెయైనచో నమరమీరు నను ననుసరించినను బ్రయోజనము లేద
యాతఁ డాతండు కానిచో నమరఁ దోడు చనఁగ నేమియు నా కవసరములేదు.

చ. పొలుపుగ నన్ని యూహలును బుట్టెడు సీమ మనస్సు, సర్వజీ
వులకు మనస్సు నున్నయది, పుట్టెడు నందఱి కన్నియూహలున్
గలిగిన నేమియున్ ఫలము కల్గదు నీవిధి యైన దానికై
వలసిన యూహలే వలయు, వ్యర్థముతక్కిన యెల్లయూహలున్. 274

గీ. నీ పొలమ్ము కాని నేలపైఁ గల సస్య వృద్ధిఁ గూర్చి యూహ యెంతఫలమొ
భూమినాథు కార్యముం గూర్చి ప్రేష్యున కైన యట్టి యూహ యంతఫలము.

ఉ. సేవకుఁ డెప్పుడుం బ్రభువు చేసిన కార్యము వానికంటె నెం
తో వలనొప్పఁ జేసెద ననున్, మఱి సేయనురాదె! త్రిప్పి వీఁ
డావల రాజుగా నయినయప్పుడు, రాజును బ్రేష్యుఁడైన న
ట్లే వచియించు, జీవియిటులే పరధర్మనివిష్టబుద్ధియౌ. 276

చ. కనుక స్వధర్మమై చనిన కార్యము సేయుట యుత్తమంబు, కా
దనినను రాజు సేవకుఁడు నన్నయఁ దమ్ముఁడు తండ్రియున్ సుతుం
డును గలహించుచుం బలమునూల్కొను వాఁడు జయించుచున్ జయిం
చినయతఁ డాచరించినది చెప్పుచు ధర్మమటంచు, నక్కటా! 277

మధ్యాక్కఱలు.
ఆ కుంభకర్ణుఁ డిట్లాడ ననుకొనె నసురేశ్వరుండు
నీకను లెదుటన పెరిగి నీ కాతనింగూర్చి తెలియ
రాక యేమియు లేద యొక్క రాచకార్యము పుట్టినంత
నీకు వానికి నెంతదవ్వు నీది వానిది యూహ వేఱె. 278

నీ వెఱింగినయది వాఁడు నేడు పూనిన మేను దాని
తో వాఁడు నీ వెదుగుటలు తొలినాళ్ళఁ దొలినాళ్ళ వాఁడు

జీవుఁడై యన్యభావములు సేకరించినది నీ వెఱుఁగ
వా వంక నిప్వెఱపోదు వల్లె కాదా యేమి నీవు. 279

వ. అంతట గుంభకర్ణుడు సెలవు తీసికొందునని లేచి స్వగృహంబుచేరి ధగద్ధగా యమానజాంబూనద వర్మంబును, దానిపైనిఁ దాళఫల ప్రమాణమరకతమాణిక్య హారంబులు, సజీవసింహశిరః ప్రమాణంబులై మాణిక్యవదనంబు మరకతనేత్రంబులు కల సింహశీర్ష వత్కంకణంబులు, బంగారపు టవిసెపూల్వోని కుండలంబులు, నవరత్నఖచితమైన మహాకిరీటంబును, చుట్టలు చుట్టికొని పడగవిప్పిన వాసుకివంటి కాలిపెండారంబులును, ధట్టియును, జరీపట్టు ధోవతి యుత్తరీయములును ధరించి, తన ఘుహాశూలంబుచేబూని, ధనుశ్శతపరీణాహమ్ము షట్ఛతధనుస్సముచ్ఛ్రితమైన దేహంబుతో నగరంబు సొచ్చి తన మంత్రులయిన మహోదరుండును ద్విజిహ్వుండును సంహ్రాదియు వితర్దనుఁడును దమ రథంబులమీఁద లంకా దుర్గద్వారంబు వెలువడిపోఁగాఁ దాను దుర్గప్రాకారంబు మీఁదినుండి పాదంబు బయటఁబెట్టి దాఁటి నిలుచున్న. 280

హారనర్తనము.

పర్వతానికి శీర్షముల్ పదబాహుద్వంద్వము కల్గినన్
గర్వితాంబుద ముగ్ర మొక్కఁడు పైఁ బార్శ్వాకలితాకృతిం
బర్వినన్ గనులగ్నులున్ వదనంబున్ సర్పఫణాగతిన్
ధూర్వహం బయి పొల్చినన్ దుర్వికారోద్ధుర మన్నటుల్. 281

దక్షిణేశుఁడు క్రూరుఁడై తను వింతింతై తనరారునాన్
దీక్ష పూనుచుఁ గాళరాత్రి పుమాకారాదృతి వచ్చెనాన్
వీక్షధాగతశక్తియో కృతలోకాస్వాహృతికాంక్షమైఁ
గుక్షి పెంచుక వచ్చెనాన్ గుటిలోగ్రాస్యాకుల నేత్రయై. 282

ధాత్రి నిత్యవిధూతి గుప్తమునో గర్భస్థము ఘోరమో
గోత్రభీకరరూపమున్ గుదిలింపై పొంగుగఁ ద్రోసెనో
కృత్రిమం బగు నాశశక్తి కపిశ్రేణిం గెడపన్ మహో
చిత్రమాకృతి పూనివచ్చెనో ప్రాణాల్ ముచ్చిలు మేనితో. 283

వ. ఆ మహాభయంకరాకృతిఁగాంచి వానర సేనలు దిశాభిద్రవణంబు చేసిరి. వృక్షంబు లధిరోహించిరి. పర్వతంబులెక్కిరి. కొందఱు కెవ్వున నఱచిరి. మఱికొందఱు మూర్ఛపోయిరి. కుంభకర్ణుని కథ విభీషణుండు శ్రీరామచంద్రునితోఁ జెప్పుచుండగావినిన యంగదుండు వారి నోదార్చుచు భయమ్ముతీర్చుచు ధైర్యమ్ము చెప్పుచుఁ బరిహాసము చేయుచు విదలించుచుఁ దాను ముందొచు నిట్లనియె. 284

మధ్యాక్కరలు.

కొండలు వృక్షమ్ము లెక్కకుడు నందుకో వీలు వాఁడు
బండిచక్రమ్ములు కనులు పైని కన్పడును దవ్వునకు

రండు దగ్గఱ కిట్టివాఁడు రాక్షసరాజో మఱేదో
దండిబొమ్మను చేసి యిట్లు తార్చెనో దానవరాజు. 285

శిలలను విసరుఁడు పెద్దచెట్లను జిమ్ముఁడు మఱియు
తెలియు నప్పుడు మీకు వీఁడు దితిజుఁడో దిష్టిబొమ్మో? శి
లలు తాకి కదలక యన్నలా! యున్నలాగైన మీకుఁ
దెలియును బడఁద్రోసి బొమ్మఁ దెరలించి త్రిప్పను వచ్చు. 286

అదిగా నసురుండు చేయునట్టి మాయకు హద్దుపద్దు
లేదుగా మనకిందుఁ గ్రొత్తలేదుగా, లేదుగా భయము
వాదుగా మనమేల తెలిసి పాఱిపోవలయు రక్కసు లె
గాదిగఁ గనుఁగొనుటాదిగా, రువ్వగా ఱాలువ్రాని. 287

కడలినిగట్టి దండెత్తి కదలిన కపిజాతి నేడు
కడలిలోఁబడి చావఁగనుటకంటెను గడుసిగ్గు కలదె
కడలి దాఁటినయప్డు మీలు కపిజాతి గౌరవించినవి
కడలిలోఁ బడినప్డు నేడుకమ్మగాఁ గమ్మగాఁ దినెడు. 288

మ. కపిసేనాపతు లెల్లఁ జూచిరి మహాకాయున్ జగద్భీకరున్
విపులాశాపరిణాహు ఘోరవదనున్ విత్రాసహేతున్ మహో
గ్రపుఁ డీతండు వధింపగాఁ బడునె భూధ్రశ్రేణి వర్షింప వీ
నిపయిన్, వీనికి సేగియుండునె కుజానీకంబు వర్షించియున్. 289

గీ. నిలచియుండిన సాగరానికిని బైని నమవుగా నైనయదియు వంతెనను గట్ట
నిన్ను మ్రింగను వచ్చెడు నీరధికిని వంతెనను గట్ట నెంచు టెవ్వాని కగును?

వ. ఆ మహాపరిణాహవంతునిఁ గాంచి హనుమ యిట్లనుకొనియె. 291

శా. అద్రిప్రోన్నతమూర్తి యీతఁ డెవఁడో యానాటి నిద్రామహా
ముద్రాముద్రిత మైనయట్టి భవనంపుంగేస్తునై యుండెడిన్
నిద్రన్ మేల్కని కీశకాననము మండించున్ మఱిన్ వీఁడునాన్
హృద్రాజీవము చెప్పె నాకిదియు మున్నే నాఁటి క్రొవ్వెన్నెలన్. 292

క. మున్నేటికిఁ బంపించఁడు న న్నొక్కనిఁ గాదయేని నా బుజములపై
నన్నాదమ్ములు వచ్చిన నిన్నాశము లేదుగా! కపీశానులకున్. 293

వ. అంత సమస్త గోలాంగూల జగత్పతి యిట్లు భావించె. 294

ఉ. ఇట్టివి యొండు రెండయిన యెక్కటి యాయుధశక్తి చేతఁ దా
నిట్టులు చేయు రావణుఁడు నీతఁ డొకండును మేఘనాదుఁ డా
దిట్టరి యొక్కఁడున్, సమదధీబలశాలులు కాలుసేతులై
నట్టిది, వీఁడు నిట్టగిరి, యాతఁడు దుర్మనుమంతుఁడున్ మఱిన్. 295

ఉ. వీఁడొకరుండు దుందుభికి వేయిమడుంగులయట్టిఁ డైన యా
మ్రేడితమూర్తి, వీని నెదిరించిన వాలి యదెట్టులుండెడిన్
గోడిగఁబెట్టి వీనిపయిఁ గొండలు కూల్చి ఫలంబులేద, ఆ
కూడలి గుప్పిలై యురము క్రుమ్మిన నంతకుమున్నె లేదునాన్. 296

గీ. పులిని వెన్నాడి రేచుకుక్కలును బ్రదికి యున్న దానిని గొఱుకుక తిన్నయటులఁ
బండ్ల జిద్రువలుగాఁ జేయవలయు వేఱ త్రోవ కనిపించ దీ దురాత్ముని వధింప.

ఉ. వాఁడు విరాధుఁ డొక్కరుఁడు వానిని గత్తులఁగ్రుమ్మ గోతిలో
బూడిచిపెట్ట నయ్యెనఁట పూర్తిగఁ బ్రాణముపోదు వీరికిన్
వాఁడిశరానికో యసికొ వాదర ధైర్యము చాల దింత కొం
డాడఁగనైన వీరలమెడల్ నఱకుంబడ వొక్కదెబ్బకున్. 298

ఉ. అంపపుఁగోతగా శరపరంపర దూసెడు నేర్పుతోడ నై
లింప విరోధి మేనఁ దెమలింపగమై యసువాయువుల్ కటా
క్షింపవలెన్ రఘూత్తముఁడు, చేసిన పాపము లేదు వీఁడు ని
ద్రింపఁగ నెల్లకాలమును, దీరని యీయనుజత్వమున్ వినా. 299

వ. అంత సర్వసేనాపతులును సమావేశమై యిట్లాలోచించిరి. 300

మ. జ్వలదగ్నుల్ చిరజీవులైన కపులున్ శౌర్యాంబుధుల్ దేవతాం
శల జన్మించిన యట్టి వానరులు రక్షస్స్వామి పైకేగి యి
మ్ములఁ జెట్లన్ నఖదంతదారణములన్ ముష్టిప్రఘాతంబులన్
శిలలన్ మొత్తుడు, చేసినన్ మనలమూర్ఛిల్లంగఁ జేయున్ మఱిన్. 301

చ. వెఱలగు కీశవీరులును భీషణమూర్తులు దవ్వనుండియే
దురమును జేయఁగావలయుఁ దూల్చుచు ఆల వియత్పదంబునన్
దిరుగవలెన్ సురారిముఖదేశము పట్టక వెన్కదూఁకి ని
ష్ఠురశిలలన్ మఱిన్ విసరఁజూడుఁడు ముచ్చిలిగుంట మాడునన్. 302

ఉ. చచ్చినవార లొక్కదెసఁ జచ్చుచునుండినఁ జావనట్టి వా
ర్గ్రుచ్చవలెన్ నఖంబులను గ్రూరశిలాతతి దంతసంహతిన్
గచ్చెగ కోటిమందిపడి గాయములం బొనరింప మేనునన్
విచ్చిన గండ్లుగాఁ దుదకు వీఱిడి చచ్చిననైనఁ జచ్చెడున్. 303

శా. అంతన్ వానరసేన దోర్బలమహాహంకార భూభృచ్ఛిఖల్
వంతుల్ వంతులుగాఁగ నాతనిపయిన్ వర్షింపఁ గర్షింపఁ బ
డ్డంతైనం గనరాక వాఁడు జగదాద్యంబైన న్యగ్రోధశా
ఖాంతంబుల్ కదలాడినట్లు కనుచిట్లాలోచనం జేసెడున్. 304

క. ఆఁకలి తాత్కాలికముగ నాకున్ శాంతింపఁజేసె నక్తంచరరా
జీ కపికాండమ్ము బుభుక్షాకాండము గాఁగ నాకు సంకల్పించెన్. 305

ఉ. ఈ కపిజాతిదా నెఱచి యెంతొ యసేవ్యముగాఁగ నై బుభు
క్షాకృతి వారిజాసనుఁడు సల్పెను నాకు విపక్ష లేనిదా
నాఁకలి, క్షుద్రవానరులు నక్కట నాపయి కేలవత్తురో
యీ కపిజాతిఁ దిన్న నొకటే తినకున్నను నొక్కటేకదా! 306

ఉ. ఈపనిచేయు బ్రాహ్మణుఁడు నియ్యది కాదని యున్నదే బుభు
క్షాపతితుండు మాదృశుని సల్పుట యుత్తమమై విచిత్రవే
శాపరిణామమూర్తి కలిలాగున జేయుదు రన్యులక్కటా!
యోపిన ధర్మదేవతను నూపిరిపట్టులఁ బట్టి నొక్కుచున్. 307

ఉ. ఏనునుగాని నీవు రచియించిన కార్యము లెస్సగాదుసూ!
యేనయి పోయి రాఘవకులేశ్వరు పక్షము చేర నందుచేఁ
గాని త్వదీయపక్షమునఁ గయ్యము చేయనటంచుఁ జెప్పినన్
దానయి నన్నుఁ జంపునుగదా! యధికారము లెంతదుష్టముల్. 308

చ. ప్రదరములట్టి శైలశిఖరంబులు రువ్వుచు నున్ననైనమం
గదలనియట్టి దానవునిఁ గన్గొని కీశచమూసమూహ మొ
ప్పిదముగ నిద్దియంతయును వట్టిబిభీషికయంచు నెంచి ఘో
రదృషదనంతరాజి విసరన్ విరమించుచు నిల్చిచూచుచున్. 309

శా. భ్రాంతిన్ వారలు దైత్యనాథుని సమీపక్షోణిఁ బోఁబో ధురా
వంతుం డంగదుఁ డెల్లకీశచమువున్ వారించి, వాఁడెంత దు
శ్చింతుండో తెలియంగరాదుసుమి మీచిత్తంబులన్ వాఁడు మీ
గొంతుల్ వూని కసిక్కునంగొఱుకు నొక్కండొక్కఁడై యార్వగన్. 310

ఉ. రావణుఁడున్ సురేంద్రనగరంబున గుళ్లను గోపురంబులుం
ద్రోవఁగఁజాలె నన్నుఁ బెనుత్రోవలఁజేతులఁగాళ్ళ క్రుమ్మటే
కావలుఁ డీతఁ డీతనికిఁ గాళ్ళులు చేతులవద్ద కక్కటా
పోవుటయేమి? వానిగద వూనిన లక్షసహస్రమృత్యువుల్. 311

క. తొలిదెబ్బ తగులకున్నను మలిదెబ్బయు బాధవెట్టు మానదు వృక్షం
బులు శిలలు విసరమానకుఁ డలఘువు మీచేవ వానికది తెలియనగున్. 312

మ. అనినం గీశులు శైలముల్ కొనుచు వృక్షానీకముల్ గొంచుఁ గ్రు
మ్మిన క్రుమ్ముల్ రఘురాముబాణముల సామీప్యంబుగా వాడిమిన్
దనుజాధీశుఁడు కోపభావమున నేతద్దుష్టకీశాళి న
న్నును ప్రోత్సాహముగా క్షుధాపనయత న్మ్రాల్కొల్పు నంచెంచుచున్. 313

చ. అతని విజృంభమాణ చటులాహవ సంహననంబునం దనూ
చ్యుతులయి కృత్తకంఠులయి యుద్గతబాహుపదోరుమధ్యులై
మతి మతిలేక యాహవమొ మారణమో తెలయంగరాక ప్రా
ణతతిని రామపాదనలినంబులఁ జేర్చుట యొక్కయూహయై. 314

శా. పాదాఘాతములన్ ప్రచండతరదోఃపాతంబులన్ ఘోరదం
ష్ట్రాదర్పోజ్జ్వల పేషణంబుల సహస్రం బొక్కమారైన వ్యా
పాదంబై చను స్థూలశూల విధుతి ప్రారంభవేగంబులం
బాదుల్ వెల్లగిలంగనై కపులు సంభ్రాతు ల్పరిభ్రాంతులున్. 315

ఆ. మింటి కెగిరి యొక్క మేల్నేర్పు గల క్రోఁతి వాని వెనుకపీటి వదలకుండ
గ్రుచ్చుచుండ వాని ముచ్చిలిగుంటను కుంభకర్ణు మెడయుఁ గొండచఱియ. 316

మ. మరియున్ దానవు పృష్ఠదేశమునఁ దన్మంత్రుల్ మహోత్రాణని
ర్భరులై ఖడ్గములన్ మహోగ్రశరధారాశ్రేణి హింసింప, వా
నరులున్ గీశజగద్విరోధి దగు కంఠాగ్రస్థదేశంబు నే
రరు చేరన్ యువరాజు మాటలను వ్యర్థత్వంబు దీపింపఁగన్. 317

క. ఒక లక్షవరాహంబులు నొకవేయి మదేభములును నుగ్రములై యూ
రక గగ్గోలుగఁ జేయఁగ యకటా! యిట్లుండునే రణాంగణ మనఁగన్. 318

చ. వెనుకను వ్రాలుచున్న కపివీరుల నొక్కని వీపుమీఁద బ్రాఁ
కిన క్రిమి నొక్కటిన్ వెనుక కేలుగఁ గైకొని వ్రేళ్ళయొక్క సం
దున నలుపంగ నా జరుగు దూషితమృత్యువుఁగాంచి వానరుల్
కనుచునె మూర్ఛవోయి రిదికన్నది విన్నది కాకయుండగన్. 319

క. వదులును నిర్వదులును ముప్పదులుగ గుప్పిళ్ళుపట్టి వానరచయమున్
గదియించి దవడక్రిందను కదలగ నస్థికల నుమిసి కసకస నమలున్. 320

చ. దవుడల నెత్రుచారికలు దంతములందునఁ గీకసంబులన్
దవిలి యురఃప్రదేశమున ధారలు కట్టుచునున్న నెత్తురుల్
కవిసినవై వసాకలితగంధ విదూషిత కీశలోమఖం
డవృతి సనాథ దేహవదనంబులుగా దనుజుండు పొల్చుచున్. 321

ఉ. ఊరక పెద్దజాతరగ నొప్పెను భీకరశైల రాజి యు
ర్వీరుహరాజి వేసినవి వేసినయట్లుగ నుండెఁ దద్వ్యథ
స్ఫారవిదారి సాగినది సాగినయట్టుల నుండెఁ గీశరా
డ్వీరులు పాలుపోవక నివిష్టవిలోచను లౌచు నుండగా. 322

చ. మణిశిలసన్నిధిం జనిన మాదిరి ఘోరమహాహి భీతులై
ధణధణ వచ్చి మీఁదఁబడు దయ్యము దానవు నోర్వలేక ని
ర్గుణులును నిర్మనస్కులును గుప్తహృదంతశరణ్య భావులై
ప్రణతులుగా నెదుర్కొనిరి రాముని విశ్లథులైన వానరుల్. 323

శా. ఆ ఘోరంబును జూచి మారుతి క్రుధాహంకార హుంకారవా
చా ఘుష్యద్గళభీకరంబుగ వియత్సంభ్రాంతిఁ గాలాంబుదా

మోఘక్లిష్ట మహాశనిప్రచయ దంభోళి ప్రపాతంబు శై
లీఘోరాకృతి ధారపిందు విసరెన్ గ్లేశాతిసంపాదిగా. 324

క. వానిమకుటంబు పగిలెను వానిశిరోదేశ ముగ్రబాధాస్పదమై
వానికొక లిప్త తెలియదు వాని మహోగ్నులగు కనులు బైరుల్క్రమ్మెన్. 325

క. ఇనుమంతలోనఁ దెలిసెన యసురేశుఁడు క్రోధమూర్ఛితాత్మ్ముం డగుచున్
విసరెను గద మారుతియెద విస్ఫుమరవక్షంబు హారిది విద్ధము కాఁగన్. 326

గీ. హనుమ తా నంతలోఁ బెద్దయఱపు నఱచె తన్మహారావసమితి దిగ్దంతికర్ణ
కుహరదేశంబులందునఁ గుద్దలింప కడఁగి నోటను నెత్తురు క్రక్కికొనియె. 327

ఉ. మోదము పొంది యార్చెను విమూఢము రక్కసిపిందు పెల్లు లం
కాదహనప్రతిక్రియయుఁ గల్గెను నేటికి విన్నినాళ్ళ కం
చాఁదట రక్తవాంతియును నంతటిరావము పొల్లువోవు దా
నేదియొ గుండె జబ్బువడి యీతఁడు చచ్చుట తథ్యమం చొగిన్. 328

క. నీలుఁడు చండక్రోధా భీలుఁడు దానవుని కెదురువెడలెను రక్తాం
దోళితనయనుఁడు ముష్టి ప్రాలేయధరాధరేంద్రపటుశిఖరుండై. 329

శా. నీవెవ్వానిని గొట్టితో తెలియునా? నీనాశనప్రక్రియా
భావంబంతయు గుప్పిటం గలుగు దోర్వంతుం బ్రతాడించి తీ
నీ వక్రక్రియ రామచంద్రుఁ డెఱుగన్ నీమాట యేమౌనా? సు
గ్రీవుండింకను నిన్ క్షమించఁడు మహారీఢాక్రుధామూర్తియై. 330

గీ. క్షుత్తు నార్పికొనఁగ క్షుద్రు లేమైను దిందు రధికు లట్లు తిందురొక్కొ?
కోఁతియెఱచి తినరు కోయవాండ్రైనను బట్టి నీవుతిందు బ్రాహ్మణుఁడవు. 331

ఉ. బ్రాహ్మణు లన్నచోనరులె బ్రాహ్మణులందున బ్రాహ్మణుల్ వృథా
జిహ్మమతుల్ సురారులను జెప్పము బ్రాహ్మణులందుదైత్యులున్
బ్రాహ్మణమాత్రులే మఱియు బాహిర మాంతర మన్విత్రోవలన్
బ్రాహ్మణుఁడన్నచో నియమపాలన ముందునకాదె యన్నిటన్. 332

క. మాంసము తిందురు కోఁతుల మాంసము తిందురఁటె పిల్లిమాంసము తినమీ
ధ్వంస మ్మగు బుద్ధికిని జిఘాంసా బుద్ధికిని దినను గా దేది ధరన్. 333

ఉ. కొండలు నగ్నులుం గలిసి కూడిన గుప్పిలి నాది నీయురో
దండములోని వెన్నెముకతండము చేసెదఁ బిప్పిపిప్పిగాఁ
గొండకుఁ గాలుసేతులును కోసెను బ్రాణము పోసెఁ బట్టి ని
ల్చుండఁగఁ బెట్టి యుద్ధమనిచూపెడు రావణుఁడెంతద్రోహియో. 334

క. అని నీలుండును ద్రుతలంఘనచాతురి వానిగుండె కడ కెగిరి వినూ
తనవజ్రపాత మన ముష్టిని వ్రేసెను వానిగుండె చిడిముడి పడఁగన్. 335

ఉ. ఇంతటి సాహసుల్ మఱియు నింతటిధీరులు బుద్ధిమంతులుం
బంతము కల్గువారలును బాహుపరాక్రమశాలు లౌటచే
నింతటి దైన యెత్తుగడ యెత్తెను రాముఁడు, కోఁతు లంచు దు
శ్చింతు లహో యగౌరవము చేయవలెన్ మఱియిట్టివారలన్. 336

క. అనుకొనుచుఁ కుంభకర్ణుఁడు నిను మెత్తును ధైర్యమునకు నీబుద్ధికి నా
కును బుద్ధి చెప్పి యంతటుఁ జనినన్ నేనేమి చేయఁజాలకయుందున్. 337

క. ఇప్పుడు నాకును జేయక తప్పదనుచు దానవుండు తనయఱచేతన్
జప్పట చఱచిన విధమునఁ గప్పెను గపిగుండె నతఁడు క్ష్మామూర్ఛపడన్. 338

ఉ. ఆ పరిభూతిఁ గన్గొనుచు నైదుగురైన వలీముఖేశసే
నాపతులందునన్ మిగులు నల్వురు క్రోధపరీతనేత్రులై
యా పరమాసురేశ్వరుని నెక్కటి కయ్యమునం దెదుర్పలే
మూపునఁ దాఁకఁగావలయు నుమ్మడిగా నని నిశ్చయించుచున్. 339

ఉ. నాలుగుపర్వతంబులు ఘనాఘనధూర్జరముల్ మహీజశా
ఖాలులితానిలంబులను గజ్జెలు మ్రోసెడునట్టి పెన్గదన్
బోలె నురంబు నందునను మూర్ధమునందున రెండు బాహులన్
వ్రీలదు వజ్రపాతముగ వేసిన దానవుమేను బెత్తెదున్. 340

వ. అంత నమ్మహాసురుండు ఋషభ శరభ గవాక్ష గంధమాదనులయిన యాన
ల్వురను నాల్గు గ్రుద్దులతో మూర్ఛపుచ్చి. 341

క. మరియును మఱి పెరిగి మహాసురుఁడును బేరెములు వారుచును గపిరాజిన్
విరియించుచు సురియించుచు హరియించుచు నంజసావిహారము చేసెన్. 342

క. మఱియును మఱి పెరిగి మహాసురుఁడును గనుపులను గొట్టుచుం గపిసేనల్
దరలించుచుఁ దెరలించుచు మరలించుచుఁ జిత్రచిత్రమథనము చేసెన్. 343

ఉ. అంతట నంగదుండు నకటా యిది మారి యెసంగుఁబో వపు
ష్మంతముగాఁగ దీని నిట మానుపఁజాలుదు రిద్దఱే ధను
ష్మంతుఁడు స్వామికాని, హనుమంతుడు వీరుఁడుగాని, యాహనూ
మంతునిఁబోయి వేఁడు బతిమాలును? జేయఁడు లేకయున్నచో. 344

క. ఇంకం గల డొక్క నిరాతంకుం డాపైపు కోటద్వారముకడ నా
వంకఁ గల జాంబవంతుని వంకం జన రసురు లిచట వల్లభుఁడునికిన్. 345

క. అరయ నతఁడు పెకలించిన ధరణీధర శిఖరమొక పదను గలదా భూ
ధరశిఖరమ్ము విసరిన విసరునన్ వానికరము చలచక్రాకృతియై. 346

క. ఇది విష్ణుచక్రమో యనఁ గదలిన భూధరమురాకఁ గాంచిన యసురుల్
మదిభీతి పొంది రాగిరి కదలిక నేయంచు కోయఁగడగునా యంచున్. 347

క. వాలిసుతుని చక్రకజంఘాలము పర్వతము కుంభకర్ణుని తలపై
వ్రాలినదో మఱి కవ్వము వోలిక తిరిగినదో కుదురు వూన్చుకొనినదో. 348

చ. ఇతఁడొకఁ డాంజనేయ సముఁ డించుక తగ్గినఁ దగ్గునంచు సం
ధిత మయినట్టి తగ్గుదల నేరువుమైఁ బరిపూర్తిచేయు నం
చతితరకోప వేగమున నంతకు మించిన బాధచే మహో
ద్ధతుఁడయి చేతి శూలమును నంగదుపై విసరెన్ సురారియున్. 349

క. అది మొత్తిన నేలంబడి చిదియుటయే నెత్రుబొట్టు చిందద యెమ్ముల్
వెదకిన దొరకవు, మఱి యంగదుఁడేమౌ నంచు భీతిఁ గదిసిరి కీశుల్. 350

గీ. తానొకం డాంజనేయుండు తట్టుకొనియె నన్యుఁడెవ్వఁడు దానికి నాఁగ లేఁడు
వాలితనయుండు బహులాఘవమున దానియాగమనమార్గముననుండి యపసరించె.

చ. తెరపి యొకింత యీయ కవధీరితమారుతవేగుఁడై ప్రస్ఫ
త్వరమగు ముష్టిపాతమున దానవుగుండియ తాఁచె నంగదుం
డరయగఁ గుంభకర్ణుఁడు తదాహతి నూహతిరోహితత్వమున్
బొరసి నిమేషమందు స్మృతి పొందిన కోపమహోగ్రభావుఁడై. 352

ఉ. అంగదు బిట్టుగాఁ జఱచె నంగదుఁ డంతట నేల వ్రాలినన్
ముంగల నున్న వానరసమూహము మోహముమాలి చూచి కు
క్షింగల క్షుత్తుతగ్గుటయుఁ జిత్తమునం దలపోసి బుద్ధిలో
నం గల యూహ యింకనయినం బొనరింపఁగ నెంచుచున్ మదిన్. 353

వ. తన ప్రభువునకు నిత్యసమీపవర్తియై యతని నెదిరించుచున్న సర్వ వానరసే
నాపతుల నితఁ డితఁ డని వివరించి చెప్పుచున్న మహోదరుఁడు కుంభకర్ణుని
తాత్పర్యమెఱింగి సుగ్రీవుని నిర్దేశించి చూపఁగా దానవుఁడిట్లనుకొనియె. 354

ఉ. ఆవల నాంజనేయుఁడును నంగదుఁ డిద్దఱు నందగాండ్రు, సు
గ్రీవుఁడు రాచఠీవి కల కీశధరాపతి, పేరుచేత సు
గ్రీవుఁ డటన్న దెంతయదికెన్ మెడ సుందరమున్ దృఢంబు, త
ద్గ్రీవము చూచికాని తులకించద యందము నిర్ణయింపఁగన్. 355

శా. సుగ్రీవుండును గుంభకర్ణుని దెసం జూపించి నీ యీ మహో
పగ్రీవం బయినట్టి క్షుద్రకపిసంబాధాశనాయా వధ
వ్యగ్రత్వంబిది యుద్ధనీతి విదు లెంతైనం బ్రశంసింప దో
రగ్రప్రాంచిత ఘోరశూలకృత మర్యాదానపేతంబుగన్. 356

గీ. పరమరాక్షసుఁడా! నీకు బ్రహ్మదేవుఁడింత మే నిచ్చినందుకు నింతబలము
నిచ్చినందుకు సంతోషమే, మఱింత పిచ్చిక్షుధ యిచ్చినందుకే పెద్దచింత. 357

మ. అని సుగ్రీవుఁడు పెద్ద పర్వత మనంతాకాశవ త్పుల్లపు
ష్పనికాయోజ్జ్వలమున్ సురారిపయిఁ దీవ్రప్రక్రియన్ వైవఁ గి

న్నను, దచ్చెలము వాని గాయపఱుపంగా నైనఁ వానిం గద
ల్పను నైననే మఱి చాలకున్న దన శూలంబూనె దేవారియున్. 358

గీ. కూడి మారుతి తా నోర్చికోఁ గలిగెను కూడి యంగదుఁడును దప్పికోఁ గలిగెన
యోర్చికోఁ దప్పికో రెండు నోదుగకున్న నేమి కావలె సుగ్రీవుఁ డింతలోన?

చ. సురరిపుఁడున్ గపిప్రభువుఁ జూచిన యప్పటి నుండి లోచనాం
బురుహయుగంబు విచ్చి యెదిపుట్టునొ యంచును శ్రద్ధమై నిరం
తరముగఁ జూచు మారుతియు దానవుశూల మదెప్డు సాగె నం
బరమున నీతఁడెప్డు చనె మధ్యమునం గ్రహియించె శూలమున్. 360

క. ఆశూల మరుగు లేమీ! యాశూలము రిపు నడుమ నాగుట యేమీ!
యే శూరుం డింత బల శ్రీ శితవేగములు కలిగి చెలఁగెడు సృష్టిన్. 361

వ. అంత నాంజనేయుం డాశూలంబు మోఁకాటి కాన్చి రెండుగా విఱచి, పడిన సవ్వడి వినిపించనంతదవ్వున సాగరమున నారెండు ముక్కలును విసరి పాఱ వేయగా, జనంబు నివ్వెఱపోయిరి, దుఃఖపడిరి. భయమందిరి. ఆనందముతో గంతులు వేసి రంతఁ గుంభకర్ణుం డిట్లనుకొనియె. 362

క. ఈ శూలముతోఁ గొట్టితి నీశూలముమీఁద గోప మీతనికిం దా
నీ శూలమ్మును విఱిచెను గీశపతికి నింతదొసఁగు కీల్కొనకుండన్. 363

ఉ. గ్రావమొకండు వేరెవరుఁ గైఁబెకలించను బూనరానిదిన్
గేవలలీలగాఁ గొనుచు గీశధరాధిపు నేసి నంత యు
ద్ధావనియందు మూర్ఛపడె నాతఁడు, దానవుఁ డద్ది చూచి సం
భావితబుద్ధి తేనియవమానము తీరినదంచు నెంచుచున్. 364

ఉ. ఈ కలహప్రవర్తన మి దీతనిమూల మితండు లేనిచో
నీ కపిసేన లేదు జలధీశ్వరు కాల్వకుఁ గట్లులేవు తా
నా కపి శూలమున్ విఱుచునాతని కీతఁడు బిట్టుకూర్చు, ద
ర్పాకృతి వీని బాడుదలఁ బట్టుటకన్నను నీతియుండునే? 365

ఉ. ఈతఁడు లేని కీశచము వెత్తుకపోవును లంకనుండి తా
నీతఁడు లేక మారుతి యిలేశుఁడు మాలిన ప్రెగ్గడై చనున్
జేతముమాలి రాఘవుఁడు చేసెడి దేమి? మరుత్సుతుండు తా
నీతనిబంటు మారుతిని నెవ్వఁడు వెట్టెడు నాతఁ డాజ్ఞలన్. 366

గీ. ఇతని విడిపించిఁకో గీశతతి యదెట్లు చేయు మన్నను జేయును సీతమగఁడు
నేమికావలెఁదమకు? మఱెవ్వ రున్ననాల్క గోసికొందురు కొండనాల్క నమ్మి.

వ. అంత కుంభకర్ణుఁడు మూర్ఛితుండయిన సుగ్రీవునిఁ దనమహా బాహాదండమ్ముల నెత్తి ఔమ్మునందిడికొని లంకాదుర్గప్రధాన ద్వారాభిముఖుండై దానవుల జయ జయనినాదమేదురితాకాశం బును జీల్చుకొంచుఁ బోవుచుండ. 368

గీ. కపిచమూపతు లందఱు క్రమ్మియున్న మూర్ఛలందునఁ బడి యద్దు పోవలేరు
మేలుకొనియున్న మారుతి మృదుపిశంగ లోచనంబులు తెఱచుక చూచుచుండె.

చ. తనప్రభువున్ బుజాన నిడి దానవధూర్జటి కొంచుఁబోయెడున్
తన ప్రభువున్ సురారికిని దక్కినఁ దక్కిన కార్యమేమియో?
వినకులసార్వభౌమునకు నిచ్చినమెచ్చిన మాట యేమియోఁ?
దనసచివత్వ మేమియగుఁ దాను ధరాత్మజఁజూచి యేమియో. 370

చ. తనకు బదింతలౌ తనువు తాలిచి యుండెను గుంభకర్ణుఁ డా
తని కధికంబుగాఁ దనువు తాలిచి వానిని సంహరించి తో
డన కపిధారుణీశ్వరుని డక్కఁగఁ గైకొని వచ్చు. నేనియున్
జనులకు విభ్రమం బొదవు సర్వకపుల్ భయభీతు లౌదురున్. 371

చ. ఇవు డితఁ డింతవాఁడయిన నెవ్వఁడు కాఁదగ దెంతవాఁడుగా?
కృపణుల మైన మ మ్మపహరించెడు శత్రులకత్తిపాలుగా
వపువు సురారిపట్టణము పట్టనియంతది తాల్చి యెల్లయు
ద్ధపుఁ బనిఁదీర్ప నెందులకుఁ దా ననుకూలతఁ దాల్చఁడక్కటా! 372

గీ. కపిమహాసేన నొక్కఁడుఁ గాల్కదల్పఁ డెందుకు వృథాప్రయాసమం చిగ్గుకొంచు
నొడలువెంచినవంచినఁ గడుసులభమ యిద్దిమాప్రాణములుతీయు టేల యనుచు.

ఉ. వంచనగాదె రా జొకనివల్ల విముక్తినిఁ బొందె నన్నచోఁ
గొంచెపుబుద్ధులై చనిన కోఁతులు భూతలనాథుఁ బిన్న భా
వించెద రాతఁ డూర్జితుఁడు వేగరి మిక్కిలి యూహశాలి త
ప్పించుకవచ్చు నేమియును భీతిపడం బనిలేద యంచునున్. 374

శా. జీవగ్రాహముగాఁగ దీసికొనివచ్చెం గుంభకర్ణుండు సు
గ్రీవున్ వానరసేన తేనికి సమర్పింపంబడెన్ గాళ్ళపై
నా వైదేశికుఁ డేమియౌఁ దిరిగిపో నా సేతు వుండెంగదా
గ్రావాసేతువు కట్టికొన్నది పొరిం గాళ్ళీడ్చుకొంచున్ మఱిన్. 375

సీ. సురవిరోధి విలాసభరవృషస్యంతికా కబరీపరీమళా కాఙ్క్షితములు
రూక్షదానవ వరారోహామదకవోష్ణ పుల్ల గల్లా భోగరల్లకములు
మహితదేవారాతి మదమత్తకాశినీ ప్రాంచత్పయోధరాస్ఫాలకములు
తరుణ పూర్వామృతాంధశ్శ్మార పాణిగృహీతీ స్మితాంశు సాహిత్యకములు
గీ. నైన చందనమల్లికాసూనములును వచ్చకప్పూర సిరములు బల్లనైన
శీతలజలంబుతో నభిషించినారు నఖిల కపిలోక పతిసమాహర్త నసుర. 376

చ. చెరఁగి కపీంద్రకృత్త పరిశిష్ట విలంబిత దక్షిణాధరా
ధర పరిత స్స్రమంకురిత దర్పిత చందన బాల భూరుహో
వరి పరిసంస్పృశ త్పవనబాలక బాలకషాయగంధ సం
సరణము ప్రాణసంచయము చల్లని త్రోవలయందుఁ దీయఁగన్. 377

ఉ. రావణుఁ డేమొ పంపె దను రామునిఁ జంపు మటంచుఁ దాను సు
గ్రీవునిఁ బట్టితెచ్చెఁ దులకించదు ప్రాణము దైవతారికిన్
శ్రీవిలసత్సుషీమ గిరిశేఖర వాయువు నీటిజల్లు సు
గ్రీవుని మేనుచెంది తులకించెన యాతనివైన ప్రాణముల్. 378

చ. తెలిసెనయంతలోనఁ దనుదెచ్చె నటంచును లంకలోనికిం
దెలిసెను గుర్తుపెట్టుకొని దిక్కులు సాగరఘోష చేత న
వ్వలఁ బగఁబట్టి బుస్సుమని పైకిని లేచెడి త్రాచునాఁగ సం
కులముగఁ కుంభకర్ణుని ముకుం చెవులుం గొనె గావుపట్టుగన్. 379

మధ్యాక్కఱ.
గలగల గిలగిలఁ గుంభకర్ణుండు కడఁగి సుగ్రీవు
బలవంతముగ లాగి నేలఁ బడవైవ వాఁడును నోటఁ
గల ముక్కుతోఁ జేతులందుఁ గల చెవుల్గా నూడి వచ్చె
మలఁగి యసుర నేలఁబెట్టి మట్టగింపఁగ వానిఁ దలఁచె. 380

ఉ. ఏనుగు మట్టగించినటు లీతని చేయఁగఁ నెంచి నేలపై
వానిని బెట్టి హస్తములు వాఁయగఁ బాదము వేయఁగా నెడం
బౌ నిసుమంతకాలమున నందిన సన్నని వీలుచూచి వే
గాన విదల్చి తప్పికొని గంతిడి మిన్నున కేగె వెంబడిన్. 381

ఆ. క్రొత్తనీరు వచ్చి కొట్టుకపోయెను బ్రాతనీ రటన్న పగిదిగాఁగ
ముక్కుచెవులు కొంచుఁ బోయె సుగ్రీవుండు తాను రాము సన్నిధానమునకు.

గీ. కడఁగి స్వామి కుంభకర్ణుని ప్రాణాల కొఱకుఁ గుదువపెట్టుకొన్నయట్లు
ముక్కుచెవులు కొంచుఁబోయె సుగ్రీవుండు తాను రాము సన్నిధానమునకు.

చ. గణుతికి నెక్కనేమి ఘనకార్యము చేసితినంచుఁ బోయి రా
వణునకుఁ గానిపించికొనుఁ బట్టక కోపము కుంభకర్ణుఁడున్
బణ మిడినట్లుగాఁ దనదు ప్రాణము లాహవభూమి కేగి ల
క్ష్మణుఁడెట రాముఁ డెందనుచు మానసమంతయుఁ దన్మయంబుగా. 384

ఉ. పోయిన యంతమేరను గవుల్ మరణింప సహస్రసంఖ్యగాఁ
బోయిన యంతమేరను జమూపతు లాతనిద్రోవ వీడఁగాఁ
బోయిన మేర సూటిగను బోయెను రాముఁడు లక్ష్మణుండు దీ
క్షాయుతి వానిరాకకు నికామప్రతీక్షను జేయుచుండగన్. 385

ఆ. నడచి వచ్చుచ్చున్న నక్తంచరునిఁచూచి లక్ష్మణుండు ధనువు లస్తకంబు
మస్తకంబు సూటి మన్నించి మున్నంచి గాఁగ నేసెఁ దీవ్రకాండచయము. 386

ఆ. నిగిడి లక్ష్మణుండు నిగిడించె శరములు వానగాఁగఁ, జూచి దానవుండు
సరగ ననియెఁ జాలు సామెత చెప్పిన యట్టు లున్న దెఱుఁగ వైతి నన్ను.

చ. హరి హరియించితిం ద్రిదివమందున, మందునకైనఁ గానియ
ట్లరయ దధీచి వెన్నెముక నారినయట్టి వసావిశుష్కతం
దరలగఁ జేసితిన్, దిగిభదంతములన్ మెలివెట్టితిన్, మెడల్
విరిచితి, గంగనీ రిగురఁబెట్టితి, బెట్టితిహాస మొప్పఁగన్. 388

ఉ. గ్రీవమునందు ద్రుంచెద నరిన్ హరినంచును గొంచుఁబోవ సు
గ్రీవుఁడు దొంగఁగా నవసరించుకవచ్చెను వాఁడుగాని నీ
పై వెలయుం గనుంగొనుము వానిని మించిన గ్రీవమో హయ
గ్రీవమొ యేమొ యున్నదిసరే యతఁ డెచ్చటనోయి లక్ష్మణా! 389

మ. మరి నీలుండనువాఁడు నేనను హనూమంతుం బ్రతాడింపఁగా
నరరే! నీదగు నన్నగారికిని గోపావేశ మౌనట్లుగా
నఱచెన్ నిన్నునుగొట్ట నెంతవును? నీ యన్నన్న వాఁడెచ్చటో
మరి చూపింపుము నాకు నే నతనినే మన్నించెదన్ సోదరా! 390

వ. అనిన మందహాససుందరవదనారవిందుండై సౌమిత్రి దూరాన నున్న శ్రీరామ
చంద్రునిఁ జూపించి యదుగో. 391

ఉత్కళిక.
నీలమేఘసుందరుండు నిఖిలదనుజమందరుండు
వాలిఁ గోలతోడ నేసె వానియనుజు నేలుకొఱకు
వానివలన దనుజభీతి, వానియొక్క తమ్ముఁ డేను
వానియందుఁ బ్రధనజయము, వాఁడుగో రఘూత్తముండు. 392

చ. దనుజుఁడు రామచంద్రుఁ గని దానవనాథుఁడు నిన్నుఁ జంపకుం
డను గొనిర మ్మటంచు సెగె నాకును నాజ్ఞను, నాకునిన్నుఁ జూ
చినఁ గడునాఁకలయ్యెడిని చిత్రము, సంధిగ నున్న దిద్దీ, న
న్నును దరిచేరని మ్మిదె కనుంగొను మప్పటి నాదు పోడిమిన్. 393

వ. అని దనుజుండు రామచంద్రుని మీఁద కుఱుకఁబోఁగా శ్రీరాముండు వానియు
రంబున రౌద్రాస్త్రంబునేసినఁ గుంభకర్ణ చక్షుశ్శ్రోత్రో నాసికావదనంబుల నుండి
మహాగ్నిజ్వాల లుదయించి వాఁడొక పెద్ద కాగడావలెఁ గొఱవివలె మండుచుఁ
గపిసేనాసమూహంబును ముట్టించుచు, సురసురఁగాల్చుచుఁ బొగ చూఱించుచు,
మఱియు రామచంద్రునిపైకి రాఁ బ్రయత్నించుచు. 394

క. మిక్కిలి శ్రుతివిరహితముగ నక్కట! బహుదూరవాసనాపేతముగన్
ముక్కులు చెవులును మొదటన చెక్కుదురఁటె యేమి సజ్జు చేర్చితి రామా!

వ. అతండు రామచంద్రుని మీఁదికి రాకుండునట్లు లక్ష్మణాజ్ఞా ప్రవర్తమానమై
యనంతకపు లతని నధిరోహించి యతనిని గదల కుండఁజేయ నతఁడు వారం

దఱను విదలించి మఱియు వచ్చెడివారి నదలించి, వచ్చిన వారిని యమపురికిఁ గదలించి, మఱల మాట మెదరలించి. 396

మ. మరియున్ వృక్షము చాటునుండి ప్రహరింపంగాఁ బనేలేదు స
త్వరతన్ బాహువుమీఁద నెక్కి యసితో వాలింపఁగా నైన య
క్కఱయుం గల్గదు,నే నెవండ? ఖరరక్షశ్శ్రోణికి న్నాకు సాం
పఱ సామ్యంబును బెట్టుకోకుము, నినుం బట్టంగ నేతెంచితిన్. 397

వ. సముద్గరపాణియై సముద్గతరక్తఘోణియై క్రుధాసందహత్ప్రాణియై పేరెములః వాఱుచుఁ బ్రతిక్షణనిరుద్ధరాఘవ సమీపదేశదమనుండగుచు, నిరోధించు కపిసంతానంబుఁ దంతన్యమాన కోపావేశంబున లేశంబును దక్కని మేనులుగాఁ జేయుచు, మ్రానులుగాఁ బాదంబుల కడ్డంబుగాఁబడిన గోలాంగూలంబుల లాంగూలంబులు పూని సాగరంబున విసరివేయుచు. 398

క. మాయాహరిణము చంపఁగ మాయాహరణంబు చేయు మార్గణసమితిన్
దూయంగ వలసివచ్చెను నాయెడ మాయలవి లేవు నారాచోగ్రా! 399

వ. అంత రామచంద్రుండు వాయవ్యాస్త్రంబు సంధించి వాని సముద్గరబాహువు ఖండించిన నాబాహువు కపిసైన్యంబునం బడి వేలమంది కపులను వధించిన, నత డెడమచేత నొక మహాపర్వతంబు రామునిపై విసరిన, రాఘవుండు దాని శకలీకృతంబు చేయఁ దచ్ఛకలతాడితు లయి యసంఖ్యాకులయిన కపిరాక్షసులు మడిసిన. 400

క. నా రాక్షసత్వ మిది నోరూరెడు శార్యోష్ణమైన రుధిరము ద్రావన్
శ్రీరుచిర గుణ సమూహము లూరిన నీ తీయనైన రుధిరము ద్రావన్. 401

వ. మఱియు రామచంద్రుం డైంద్రాస్త్రంబున వాని రెండవచేయి ఖండించినఁ వాఁడు మొండెమై ధాత్రి క్రక్కదలఁ ద్రొక్కుచుఁ బరువులు పెట్టుచుఁ దెరువులుతీయుచు నురువులు క్రక్కుచుఁ బోయినంతమేర నెత్తురు చెఱువులు కట్టించుచు. 402

క. ఇప్పుడు తెలిసిన యది నా కిప్పులుగాకి కపిమూఁక యెందుకొ శరముం
జొప్పింప నెడము కలుగఁగ నప్పా! కైకై పెనంగ నసమర్థుఁడవై. 403

వ. అంత శ్రీరాముండు రెండర్ధ బాణంబుల వాని పాదచ్ఛేదంబు చేయగా నాపాదంబులు సమీపపాదపంబులు విఱుచుచు దొరలిపోయి పోయినంత మేర మేరమీఱిన కపిసంహారంబు సేయఁగా నతండు నేలపైఁబడి దొరలుచు, దొరలుటలోఁ దొడుగీడ్చినట్లు పాపటతోలినట్లు చట్టులాగినట్లు మార్పిడి చేసినట్లు మహా ఘోరంబుగాఁ జేయ, రాఘవుండు నవైంద్రాస్త్రంబున వానిశిరంబు ఖండించిన. 404

క. అదియును రావణు జాంబూనదసౌధము గోపురంబునం బడియెను స
ర్వదనుజ విదర్పలోచన సదుఃఖ దర్శన సభీతి సకలోహముగన్. 405

గీ. పడిన శిరసును గాంచి రావణుండు జీవ సహజదుఃఖమ్ము రాక వెల్బన విషణ్ణ
తయును బొందక నిశ్చేష్టుండయి విగాహితాత్మమాత్రచైతన్యుడై యట్ల నిలచె.

వ. అంత శిరోమాత్రతఃకృత సంపరాయానంతరమ్మున మహోదుఃఖనది కొక్కయొ
డ్డునc జేరి యేకాంతంబున. 407

గీ. రాఘవుండును బుద్ధిపూర్వకముగాcగ గుంభకర్ణుని తల హేమకుంభసహిత
మన్మహాసౌధశిఖరంబుమఱుcగc ద్రోసె నిచటంcబడునట్లుగా నది యెట్లుత్రోసె?

ఉ. అమ్మన దేనినో నఱుక నయ్యది యిష్టమువచ్చినట్టి దే
శమ్మునయందుc బోయి పడుc జిక్కగ నీతల యాతలన్ యధే
చ్ఛమ్ముగc బడ్డదా? మఱియుc జాపకళాగతమౌ విశేషమా?
యిమ్ముగc జాపవిద్యయును నిట్టిదియుండుట యంచు నెట్లగున్. 409

చ. ఇతని భుజాయుగంబు మఱి యాతనికంఠము పాదయుగ్మమున్
శితశర మెంత వేగియును ఛిన్నముచేయద, వేలువత్సరాల్
క్షితి దివి నిట్టికార్యమును జేయcగcజాలcడ యెవ్వcడున్ గ్రియా
తతినియమంబు నిశ్చితము దాcటిన దీ పని యబ్బురంబుగా. 410

మ. కొని యావేల్పుల తామసంబయిన శక్తుల్ పొల్చునస్త్రంబులన్
దనరన్ శైవము వైష్ణవంబయిన యస్త్రవ్రాత మీదృక్క్రియా
చణమౌc బట్టుగc బారమేశ్వరమహాసత్త్వ ప్రధానంబులై
యనయంబున్ బెఱజీవులం దిది యసాధ్యం బెంత యోజించినన్. 411

ఉ. నెక్కొని గాధిరాట్సుతుండు నేర్పెను వీనికిc జెట్టమంత్రముల్
చక్కcగ దానియం దొకటి చాలునొ యీపనికిన్ భృశంబుగన్
నిక్కముగాcగ నట్లయగు? నేరని యాతcడు వేలపోటువాc
డెక్కcడ వీc, డధోక్షజుcడదెక్కడ ధూర్జటి సామ్యసత్త్వుcడై. 412

ఉ. అయమ వీనిc గానలకు నంపినయట్టిది పిన్నతల్లి కై
కేయి ధనుఃకళావిభవకృత్రిమతాపరివేత్రి నేర్పె నే
దో యొకయిట్టిదో కిటుకు నొవ్వcగc బండితలోకవంచనా
ధీయుతి యాతcడే హరి వధించును నన్నను భ్రాంతి కల్గగన్. 413

చ. ఇది విడి కుంభకర్ణు వధియించుట యెంతయు సంశయంబు లే
నిది యగు నైన వానిమరణించుటయున్ వ్యతిరేకలక్షణం
బొదిగిన దైన యాసరసిజోద్భవుమాటను లేద శైవచా
పదళనశక్తిమంతుcడవు బాల్యమునంద మఱింక జెట్టియే. 414

వ. అయ్యో! కుంభకర్ణా! 415

గీ. నామహాయుధంబు నలినసూతి ప్రదత్తమగు చధైర్యదాయి వగుచుc
దమ్ముc డగుచు దుఃఖదాయివి నగుచును జేతులార నిట్లు చేసికొంటి. 416

వ. అని మహోదుఃఖభయసాగర నిమగ్నుఁడై. 417

ఉ. వాయువు నింద్రుఁడాది సురవర్గము వేనిని గెల్వలేరొ సు
ధ్యేయము లౌచు వార లధిదేవతలై చనునట్టి యస్త్రముల్
మాయురె వాని నెప్పగిది మాయఁగఁ జేయను గల్గునో? మఱీ
కాయము, వాఁడు, వాని యధికారము రెండును రెండెయైనటుల్. 418

వ. బ్రహ్మ తాతయని బ్రహ్మాస్త్రము తాత కానేరద. అయ్యో కుంభకర్ణా! నీవు
శస్త్రాస్త్రములు రెంటికి నవధ్యుండ వనుకొంటి నోయి నా తమ్ముఁడా. 419

ఖం డాం త ము

క. ఇది కుంభకర్ణఖండము మదగజదారణ విచిత్రమహిమార్ద్రీ! నీ
యెదఁ గరుణఁ గనుము ముక్త్యాలధరాపతిఁ జంద్రమౌళి లలితసితగుణున్. 420

ఉ. లెంకనటంచు నిన్నుఁ గమలించెడు పాపము చేసినానొ ప
ర్యంకకృతాంబికోరుయుగ! రక్తపుబిందువు రక్తబిందువున్
సంకువులౌచు నీపరమశాంభవనామము లూదకుండ నీ
కింకరు నేటి కిట్టు లుడికింతువు మోసములేని దైవమా! 421

వనమయూరము.
నైక సుకృతాఢ్య పరిణాహ పరిణామ వ్యాకృత మహః పరమ భావమయమూర్తీ!
స్వీకృత శిలాతను నివిష్టసకలాసు వ్యాకలిత చేతన గుణాంబునిధిమూర్తీ! 422



# ఇంద్రజిత్ఖండము

క. శ్రీవైశ్వానరరూపా ధీవిలసదుషర్బుధ సమధికరూపా! కా
లావిష్కృతనిజతత్త్వా! భావస్థిత! భావరూప! ప్రభు! విశ్వేశా!

చ. అమరికగల్గి ధారుణి నిహంబు పరంబును రెండు త్రాసుచం
దమున మెలంగు, దాన నొకదాని సమృద్ధి మఱొక్కదానిఁ జి
త్తమునకు హత్తనీ, దొకఁడు ధారుణి సంపదచేత సర్వనా
శము కనికాని, చిత్తమును సాచి తలంపఁడు సాంపరాయమున్. 1

ఉ. ఆతఁడు కుంభకర్ణుఁడు మదగ్రగజుఁ డాతనిచావు నాకునుం
జేతమునందు నొవ్వెసగఁ జేసె నసృగ్గుణ నైజలక్షణం
బాతని కాయుధంబును మఱంతట నెంతటిబాధ సేయు న
య్యో! తన చుట్టముల్ సచివు లుర్విని బాసిన నొవ్వగుంగదా! 2

చ. పృథివిని జీవికిం దనదు బిడ్డలు తానును ముఖ్య మాత్మజుల్
పృథివిని బాయ వ్యర్థ మనిపించును జీవిత మెల్లయౌవనా
వధి యగు వానికిన్ వయసు వ్రాలుట చాలనివానికిన్ మద
వ్యధితమనస్సు లేని దగు వానికి సంస్కృతికల్గువానికిన్. 3

మ. అనినన్ లక్ష్మణుఁ డట్టి వాఁ డగునటే యారావణుం డన్న నా
తని ధీసంపుటి యట్టిదే యగు, మఱిం త్రైలోక్యముం బుత్రుల
దున నర్పింపఁ దలంచువాఁ, డతనిపుత్త్రుల్ చండశౌర్యాబ్ధులున్
ఘనశస్త్రాస్త్ర విదుల్ త్రయీవిదులు ఋక్షశ్రేష్ఠులాథర్వణుల్. 4

చ. పర మను కాంతజాణ యతిబంధురధీకము, లోకమున్ మఱిన్
మరిఁ దనవైపు లాగికొన మానని యత్నము సేయుచుండుఁ, బె
క్కురిదెస బిట్టు దుఃఖమను గోడకు వెన్క నివాసముండి, బం
ధురమతి నేఁడొకుడ్యమును దూఁకి తనుం గవయంగ నెంచుచున్. 5

గీ. అఖిలజనులు కుడ్యముదాఁక నరుగుదెంచి యాగిపోదురు, పుత్రదుఃఖాభిహతుఁడు
విపరిణతమతి దూఁకునంతపనిచేసి యొక్క మోహానబడి వెన్క దిక్కు తిరుగు.

గీ. అనినసౌమిత్రియంతియేనాయనియెను నన విభీషణుఁడంతియేయనియెమఱి సు
మిత్రబిడ్డ పరంబన్నమెలఁతమాట యేమన, విభీషణుఁడు స్వామియేగతియని.

వ. ఆయనకుఁ ద్రిశిరో నరాంతక దేవాంతక మత్తోన్మత్తప్రభృతులయిన పుత్త్రులు
మహావీరులు కలరు. అతికుంభకర్ణుఁ డతికాయుఁడు కలఁడు. 8

ఉ. ఈ చనినట్టి యుద్ధముల నెవ్వరు చచ్చిరొ రావణాజ్ఞ దో
షాచరులెల్ల వారిఁటకు సాగిరి, వీరు తమంతఁ దాము మే
మై చని సంహరించెద మినాన్వయు నంచని వత్తు రెంత బా
హాచణులో యెఱుంగుము మహాహవ మింకను దీవ్రమయ్యెడున్.

మ. అదిగో దవ్వునఁ గానిపించుఁ గపిసైన్యం బెంత గగ్గోలుగాఁ
గదలుం గ్రక్కదలున్ వియత్పదము నన్ క్ష్మాభృత్తులున్ వృక్షముల్
మెదలున్ బాణపరంపరల్ చెదరు గంభీరోగ్రసమ్మర్దధీ
ప్రదమై తోఁచెడు దిక్కటాహ నిబిడారావప్రచండంబుగన్. 10

సీ. అచట మణిప్రతానాంశు సంతతులతో ముక్కంటివోలిక ముక్కిరీట
ములతోడ ధగధగై దళతళై భూతిపుండ్రములతో స్ఫీతగండచలకుండ
లములతోఁ బటుధనుర్లస్తక జ్యాలగ్న వామదక్షిణహస్తవల్గు మణి న
వాంగుళీయక కాంతి చెంగనాలుగ శర సంధానముం జేసి సర్వవాన
గీ. రులను నెగచుచుఁ గలఁచుచు దొలఁచుచుండి రావణ సుతుండుదివ్యశస్త్రాస్త్రవేది
యగు త్రిశీర్షుండు యుద్ధవేళాగ్నిమూర్తి యార్తిఁ గూర్చుచునుండెఁ గీశావళికిని.

ఉ. కొందల మేల రక్కసులగొంగ వధింతు నటంచు దంఢ్రితో
డం దగఁజెప్పి వచ్చెను, విడందగుఁ బ్రాణములైనఁ గాని తీ
ర్చందగుఁ దంఢ్రిదౌ హృదయశల్యముఁ దీర్పకయుండ నింటికే
గం దగదంచు నిశ్చయముగాఁగ త్రిశీర్షుఁడు పెచ్చురేగెడున్. 12

ఉ. సూటిగఁ బోయి రాము నెగచుంబని సాగకయుండ వానరుల్
కోటులు వచ్చుచుండి రెలగోలుగ వారిని గోలనేయు పెన్
ధాటికి నైనఁగాలము వృథాయగుచున్నది వారిఁ దూల్చుటో
యేటికి నడ్డముంబడిన యేపుగ నున్నది బారబారకున్. 13

ఉ. అంత నరాంతకుండు తనయన్నకు మార్గము సూటిచేయఁగాఁ
గుంతముఁ బ్రాసముం గొనుచు గుఱ్ఱము నెక్కి విజృంభమాణకా
లాంతకమూర్తివోలెఁ గపులందఱుఁ జిందరవందరౌ నటుల్
వింతగ సంహరించుచును విక్రమ ముద్ధురమైన యట్లుగా. 14

సీ. పారిపోయెడువారి పాదముల్ నఱకుచు నిలుచున్న వారల తలలు నఱకి
ఎదిరించువారల యెదుఱొమ్ము లదలించు చెలయించువారి గొంతులను గోసి
దండియౌ వీరుల రెండుగా ఖండించు చలుపంపువారి ముక్కలుగఁ జేసి
అది పోరు శత్రుసంహారంబు కానట్టు లొక కసాయిదుకాణమో యనంగఁ
గీ. జిదిమిచిదిమి చేటనుబోసి చెఱిగిచెఱిగిమఱిగిమఱిగి మిగులఁగ్రాగివిఱిగి విఱిగి
తాలుతప్పల వోలికఁ బాలవోలెఁ జూచి చూడని యట్లుగాఁ గ్రాఁచెఁ గపుల. 15

మ. ఒక రక్షోదళమర్దనాత్మకసముద్యోగంబునం బొల్చు వా
నికి సుగ్రీవుడు వాలిసూతికిని వానింజూపి, వీఁడో నరాం
తకుఁ డీనాటికిఁబ్రాస మొందుగొని, కన్నావే మఱిన్ వానరాం
తకుఁడయ్యెన్ జుమి చూడువానిపని, యన్నన్ వాలిపుత్త్రుండునున్.

గీ. వాని కెదురేగి యేమిరా! బక్కదైన కోఁతిగమి నూచకోఁతగాఁ గోయుచుంటి
ప్రాసమదియేది విసరునాపై నవంగ దానినంగదుపై నరాంతకుఁడువిసరె. 17

క. అది ముక్కముక్క లయ్యెను గదిసిన కోపమున వాఁడు కడుఁ బిడికిట నం
గదు తలపై గ్రుద్దిన నంగదు శీర్షము పగిలి నెత్రు కాల్వలు కట్టెన్. 18

చ. స్మృతిచెడి యంతలోఁ దెలిసి శీర్షము నొక్కుచు వామహస్తసం
గతముగ వానిపై దుమికి గాఢతమంబుగ వాని ఱొమ్మునన్
క్షితిధర మొండు దూఁకెననఁ జేర్చెను దక్షిణహస్తపాతమున్
క్షితిఁబడి చచ్చె రాక్షసుఁడు చేరల నెత్తురులోలిఁ గ్రక్కుచున్.

వ. అంతఁ బరమాశ్వంబులు కట్టిన రథంబున సచాపుఁడైన త్రిశిరుండును
బర్వతోపమానమైన మత్తానేకపారూఢుండై పరిఘహస్తుండైన మహోదరుండును
మత్తద్విపాకృతియై పరిఘంబుపూని దేవాంతకుండును నరాంతక వధజనితక్రో
ధులై యొక్కపెట్ట యంగదుం దాఁకిన. 20

మధ్యాక్కఱలు.
దేవాంతకుని మీఁద నొక్కక్షితిరుహంబు తీవ్రంబుగాఁగ
నా వాలితనయుండు విసర, నమ్ముల నది త్రిశిరుండు
తా వేయిముక్కలు చేయఁ దనరారి తారేయుఁ డంత
వే వానఁ గురిపించె వేనవేలు పృథ్వీరుహంబులను. 21

ఆ వాన వెలిపించెఁ ద్రిశిరుఁ డంత దేవాంతకుం డురిసి
వే వచ్చిన, మహోదరుండు వేవచ్చి వేగ నిద్దఱును
నా వాలిసుతుఁ బరిఘద్వయంబుతో నదుమ వక్షమున
గావికన్నుల నంగదుండు క్షమయు గ్రక్కదల లంఘించి. 22

అమ్మహోదరుఁ డెక్కినట్టి యవనిధరాభంబు ద్విపముఁ
గ్రుమ్మి ముష్టిప్రఘాతమునఁ గుంభంబు గునియంగ నదుమ
నమ్మత్తగజము గీపెట్టి యవనిపై నడగిన దాని
కొమ్ము వెఱికి యంగదుండు కోపోగ్రఘూర్ణితాక్షముగ. 23

అ యేనుగుదంతానఁ గొట్టె నసుర ఱొమ్మగలంగ ఱొమ్ము
వ్రయ్యఁగా నసుర నెత్తురులు వాంతిగా బాధ తట్టుకొని
చయ్యన లేచి యంగదువిశాలవక్షమ్మును బరిఘ
నొయ్యన మోద నంగదుఁడు నుర్విపై నొగిఁ గూలఁబడియె. 24

మొగ్గతిలంబడి యంగదుండు భువినుండి మొగి లేవఁబోవ
నగ్గియమ్ముల మఘాట నొసలునందుఁ బ్రహారంబు సేసె
మొగ్గి త్రిశీర్షుండు, వాని మూగురు మూఁగి రక్కసులు
వగ్గె బాధింపఁగా జూచి పావని, పైని నీలుండు. 25

పావని గిరి తెచ్చి త్రిశిరుపై వైచెఁ బలుకోప మొప్ప
నావల నీలుండు కొండ నదిమె దేవాంతకుశిరము
గ్రావాభ మగునట్టి వేఱ గజముపైఁ గడు మహోదరుఁడు
మూవుర నెదిరించెఁ బరిఘ పూని విస్ఫుటరోషఫణితి. 26

పరిఘతో దేవాంతకుండు పావనివక్షంబు పొడువ
బరువుగాఁ 'జా'వని మాడుపట్టది పగులగా గ్రుద్దె
తెలిచి నోర్దేవాంతకుండు త్రెళ్ళె ధాత్రిపయి నంతన త్రి
శిరుఁడు పావనిమీఁదఁ గురియఁజేయగా శితబాణచయము. 27

పరిఘతో దేవాంతకుడు పావనిపై దూఁకఁబోవు
తరుణంబు నీలుండు వానితలపైని ధాత్రీధరము శి
ఖరమునఁ జీరి శూలంబుగా వాడికలది దిగఁబడఁ
బరగించె వాఁడును గొఱతఁబడ్డట్లు ప్రాణాల తొఱఁగె. 28

అంజనీసూనుఁ ద్రిశీర్షుఁ డమ్ముల నలయింపఁ గినిసి
యంజనీసూనుఁడు వాని హయముల హరియించె రక్కి
యంజనీసూనుఁ ద్రిశీర్షుఁ డసి యురమందున వేయ
యాంజనేయుండు వానిని నిరాయుధుఁ డౌనట్లు చేసె. 29

గీ. వాని కరవాలముం గొని పరమఘోర రావముల జేసి బెదరించె రాక్షసులను
త్రిశిరుఁడుద్ధతుఁడై మారుతిం గరతలమునఁబ్రతాడింపగా వాయుపుత్త్రుఁ డంత. 30

వ. వానికిరీటంబుతోడి మూఁడు శిరస్సుల నెడమచేత బొదివిపట్టికొని కరవాలం
బున వానిమెడ నఱికి మూఁడువత్తులతో మూఁడు దీప జ్వాలలు వెలుగుచున్న
ప్రమిద నూది యొక్కసారి యార్పినట్లార్పి, రక్షస్సైన్యంబు నేత్రంబులకుఁ
జీఁకట్లు కప్పిన, మత్తోన్మత్తులను ఋషభగవాక్షులు వధించిన త్రిశీర్ష దేవాం
తక నరాంతకులు రావణుని కుమారులును మత్తోన్మత్త మహోదరులు రావణుని
సహోదరులును. 31

మ. ఒక యానందపయోధి పెన్దరగలం దుయ్యాలలూగెన్ సమ
స్తకపిశ్రేణి, మరుత్తనూజుఁ డొకఁడే సర్వంబు లంకాపురం
బొకగోటన్ మఱి మీటఁగల్గునని యుల్లాహించుచుండంగ వా
రికిఁ గన్పించెను, భూతమో యసురయో ప్రేంఖాచలచ్ఛైలమో!

సీ. ఈ రక్కసులతోడ నేమి నమ్మక మహో! కుంభకర్ణుండు దిక్కుంభికుంభ
కర్ణుండు దిక్కుంభకర్ణుండు, చచ్చిన వాఁ డింతలోపల బ్రతికివచ్చె
చచ్చినయట్టులే చత్తురు రాక్షసుల్ మనమింత వెనుకకు మరలినంత
బ్రతికివత్తు రటంచు భయపడి కీశవ్రజమ్మది కాందిశీకమ్ముగాఁగ
గీ. నంగదారులు మఱలించిరఖిలకపుల నితఁడు కుంభకర్ణుఁడుకాఁడ యితఁడు వేఱు
వీఁడురథి,చాపి చూడుఁడీ! వాఁడుపాదచారి,గది రండురామలక్ష్మణులు కలరు.

మ. అనినన్ వానరులెల్లఁ జూచి యవునం చా యెవ్వఁడో రామచం
ద్రునితో యుద్ధము సేసి చచ్చును మరుత్సూనుండు చంపున్ వినా
శనదుష్టాకృతి కుంభకర్ణుబలెఁ గీశశ్రేణి బొక్కిళ్ళుగాఁ
దినఁడంచున్ వెనుదిర్గుచుం గురిసి రద్రిక్ష్మాజవరంబులన్. 34

గీ. అతఁడు తననామ మతికాయుఁ డంచుఁ జెప్పు చాహవధరిత్రి వీరవిహార మాచ
రించుచున్నాఁడు వానిపేర్విన్నయంత దండిమగలకుఁ ద్రిజగతి గుండెదిగులు. 35

చ. అనిఁ దనమూర్తికిం దగినయంతటి వంద రథాలదౌ రథం
బున సకలాయుధంబులు సముజ్జ్వలమూర్తులు వంద వంద చొ
ప్పున నవి యేర్పరించి తనపూనిన చాపముకాక వేర్పదిం
టిని మణిహేమభూషణ తటిత్స్ఫురితంబుల నిల్పి ప్రాంశులన్. 36

క. ఇరుదెసల రెండుకత్తులు వరుసగ నలువురు గ్రహింపవలయు వెడల్పా
త్సరువును దైర్ఘ్య మ్మది పదికరమ్ము లంతవి రథానఁ గొంతులు చిమ్మన్. 37

చ. అతఁడుతపంబు సేసి జలజాసనుచేత వరంబులందె, వి
చ్యుతి కనరానిదౌ కవచ ముజ్జ్వలచాపము నందె, వేల్పులుం
దితిజులు దాఁటరాని దగు తేజము నందె, మఱిన్ మహాస్త్రసం
తతి పడసెన్ మహాద్వ్యపఘనవ్యతిరేకమహస్సు లందుచున్. 38

ఉ. కత్తులబోను వంటి దశకంధరు రాజ్యమునందు నీతికిన్
గత్తికి నైనవాఁడు పితృకార్యకృతివ్యసనుండు, వేల్పుతో
డెత్తినయట్టి వజ్రమది యెత్తిన దెత్తినయట్లె గాలిలో
హత్తెను, కాదహో వరుణుఁ డాచిన పాశము లేశమైననున్. 39

ఉ. అల్పులతోడ నాహవము నాడఁడు యుద్ధమునందునన్ వృథా
జల్పము సేయఁ డస్త్రములు స్వల్పులయందున వాడఁడున్ నవా
కల్పము లన్న మక్కువయుగా మణిహేమములన్ ధరించుఁ గై
మల్పులు వింటినేరుపులు మాననియిష్టమునన్ ఘటించెడున్. 40

గీ. రావణునిధర్మసతి యోగ్యరాంద్రమిన్నధాన్యమాలిని, యామెసంతాన మితఁడు
పొలసుదిండులలోఁ దప్పి పుట్టినతఁడు వట్టి శౌర్యప్రధానజీవంబువాఁడు. 41

ఉ. ఆతనిపైఁ గపుల్ విసరు నద్రుల వృక్షచయంబులన్ శర
వ్రాతముచేఁ దొలంచుచును బండికిఁ గట్టిన వేయిగుఱ్ఱముల్
ధూళిగ సారథిప్రతతి తోలుచునుండ వెసన్ సహస్రఖ
ద్యోతులు మింటినుండి దిగి యుర్వికి వచ్చినయట్టు లేగుచున్. 42

శా. వందల్ వేలును బండరాళ్ళు తరులున్ వర్షింపఁగా వానరుల్
చిందంబోవదు వాని బండిపయినిం జిన్కైనఁ దచ్చక్రముల్
క్రిందన్ గుఱ్ఱపుఁగాళ్లక్రిందను బడిన్ గీశవ్రజం బేటికిన్
ద్రిమ్మదన్ వానిరథంబు తప్పికొన బర్వైపోయెఁ గీశాళికిన్. 43

వ. గవయ గవాక్షులు మైందద్వివిదులు నలఋషభులు నీలాంగదులు మొదలయిన
సర్వకపిసేనాపతులును వాని శరలీలావైభవంబునకుఁ దాళలేక తొలంగి చనగా
నతికాయుండు సూటిగా శ్రీరామచంద్రుని కెదురుపోయి. 44

ఉ. వేలసమల్ సురారిపతివీఁడును లంకను ముట్టడింపఁగా
వ్రాలఁ డెవండు నీవొకఁడు వ్రాలితి వ్రాల్చితి రాక్షసాళి దో
శ్శాలుర నీవు చేసినవి చేతలు మిక్కిలి యద్భుతంబు ల
ప్ప్రాలికృతంబు కా కితరమైనది యద్భుతమున్నె ధాత్రిపై. 45

ఆ. వట్టి బాహుబలము పనిసేయునే? చేసెనే యదంతదౌ పితృవ్యబలము
అందుచేత నేను నస్త్రబలంబును నేర్చినాడ, నీవు నేర్చినావు. 46

చ. నిసి మిను దాఁకి తారకలు నిక్కినవాఁడను, వ్రేలె డంతమా
నిసి వగు దీవు, మంత్రములునేర్చిన నేర్పు గడించు సామ్యమున్
గుశికసుతుండు నేర్పినవి కోలలు కొన్ని మహాద్భుతంబులై
యొసఁగునొ వానిచే మఱియు నెక్కువయౌదువొ నేను జూచెదన్. 47

చ. తెలిసిన యస్త్రమంత్రములు తీర్చిన శిలముచే మహఃప్రభా
కలితముగా వెలుంగునని కైసరులాడెద రీవు దేవతా
నిలయుఁడవైనచోఁ దెలియనేరనుగాని, భవన్మహోయశో
విలసన మేము విన్నయెడ విభ్రమముం కలిగించుచుండెడిన్. 48

సీ. పితృవాక్యపాలనా వ్రతనిష్ఠుఁడవు నీవు పితృవాక్యపాలనా వ్రతుఁడ నేను
ఏకపత్నీవ్రతాహీనభావుడ వీవు నేకపత్నీవ్రతాహీనుఁ డేను
వివిధాస్త్రశస్త్రాదివేత్తృతాఖని వీవు వివిధాస్త్రశస్త్రాదివేత్త నేను
అల్పులతో యుద్ధమాడ వింతయు నీవు నల్పులతో యుద్ధమాడ నేను
గీ. క్షోణిభృత్ప్రమాణుఁడ నేను గొణిదెఁ డీవు బడలి లక్ష్మిని బాసినవాఁడ వీవు
బడలి లక్ష్మిని బాయనివాఁడ నేను బోల్కి యున్నది మనకును బోల్కిలేదు.

మ. అనినం గోపమునంది లక్ష్మణుఁడు దివ్యచ్చాపకోటిం ఘటిం
చిన జ్యావల్లిగ నిల్చి యెట్టెదురు తీర్చెన్ దేవతారాతికిం
గనుఁగొంచున్ రఘురామసోదరుని రక్షస్స్వామి కోదండ చం
డునిఁ గోపప్రభు సామ్యభాషణసమాను న్నానవక్లిన్నునిన్. 51

ఆ. అన్న నిన్ను యుద్ధమాడఁగ నీయఁడు బవరమందు ననుభవంబు లేదు
పిన్నవాఁడ నీవు నన్నెదిరింతువు మఱియు శ్రేయమైన మాట వినుము. 52

ఆ. అధిగమంబు వేఱు ననుభవం బదివేఱు విద్యకివ్వి రెండువృత్తు లరయఁ
చిన్నవాఁ డటన్న ప్రేమ చెట్టదిసుమీ బాలురైన వారిఁ బాడుచేయు. 53

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. 54

ఉ. అన్నకు నాకు వారడియటన్నది యొక్కదినంబు సువ్వె, నా
పిన్నతనంబు గౌరవనివిష్ట లసద్ధిషణాగతంబు, తాఁ
బన్నుగ మూఁడులోకములు వామనమూర్తి క్రమించెస్వామి, నా
కన్నను జిన్నయప్పటి, కిఁక న్నను బిన్నను టెట్టులున్నదో. 55

చ. పొలుపుఁగ విద్యయుం దదనుభూతియు, రెంటినిగూర్చి పెద్దమా
టలు వచియించుచుంటివి విడంబనగా, నియమంబులేద యా
స్థలముల నొక్కఁ డుండియును సర్వము గర్వముచే నశించు, నా
వల నొకరుండు గెల్చుఁ బ్రతిభాప్రతిభాసితసత్కళాద్ధియై. 56

వ. మఱల నతికాయుం డిట్లనియె. 57

ఉ. అన్నకు నీకు వారడి యటన్నది నిక్కముగా దినంబె యై
న న్నిటలాక్షుకార్ముకపణం బది గెల్చిన దేమొ నీవుకా
దన్నను, భార్గవున్ గెలుచుటన్నది చేసిన దేమొ నీవుకా
దన్నను, నొప్పికొందు నను టన్నది చేసెదవంచు నెంచెదన్. 58

గీ. జమునిపట్టణంబు సర్పణశీలంబు నొకవిశిష్ట దగ్గరకును వచ్చు
వెళ్ళవలయుమనము పెఱమహాగ్రామముల [illegible]మెనడచియరుగుదెంచు.

గీ. నాకు వచ్చునట్టి నష్టమ్ము లే దిందుఁ జెప్పకుండ నేమి చేయరాదు
పిన్నవాఁడ వీవు నన్నెదిరింతువు మఱియు శ్రేయమైన మాట వినుము. 60

ఉ. బన్నముగాఁ ద్రిలోక మణిపట్టము తాల్చిన దర్పభృ త్తురా
సాణ్ణవఫాలభాగమున సంగత మద్దనురుద్గమ త్స్వము
ద్యన్నవసాయకోన్మథనమై పెను నెత్తురుబుగ్గ లేచె భ్రా
మ్యన్నియతిన్ బ్రయోజనము మాలిన కోపము లేచిపోవునాన్. 61

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. 62

ఉ. కొన్నిట గెల్పు కాంచెదరు కొన్నిఁట నోటమి గాంతు రెందఱో
యెన్నగగెల్పు లేరి వచియింతురు వైద్యులు పండితుల్ సమా
సన్నములైన కార్యముల సంగతి యప్పుడు చూచుకోవలెన్
నిన్నటిమాట లేమి యగు, నేడు ఫలానికి రావు కత్థనల్. 63

చ. బిరుదుమగండ వౌదు వనిపించెదు వందరథాలపెట్టు వె
న్నరదము వేయిమావులు శరాసనముల్ పది చాలనట్లు ము
ద్గరములు ప్రాసముల్ గదలు ఖడ్గము లొక్కఁడొకొక్కవంద సం
గరమున కేగుదెంచితివొ క్రయ్యము లంగడికొంచుఁబోదువో. 64

శా. నీ గుఱ్ఱా ల్పకిలింతలందున ఖురానీకావనీఘట్టనా
వేగంబందున చక్రభీషణరవావిర్భూతి త్వత్సారథి
ప్రాగల్భ్యోక్తుల డోలుమ్రోఁతగ వినంబడ్డట్లు నీగొంతు, మా
యీ గొంతు ల్వినిపింప వంబుధిమరు త్తీపాటునన్ రానిచో. 65

చ. అన నతికాయుఁ డిట్లనియె నౌఁ బ్రతివాక్యవిశారదత్వ మై
చనెదవు, పోరుచోఁ బ్రతిపృష్కృత ప్రయోగ విశారదత్వ మై
నను మఱి సంతసించెదన నాకది యేమియులేద, నావిక
త్థనతయుఁ గాదు, పిన్నవని తాఁకుట నిన్నుభరం బటంచునున్. 66

మ. ఒక వేయుద్ధములందుఁ బేర్వడిన న న్నూహించుచున్ దిన్నవా
నికి నీయుద్ధము నప్పగించు టది చన్నే? చూడమీ యిట్టియ
న్నకు మీయన్నకు, నీవునుం గలనిలోనన్ గెల్చినన్ గెల్వవ
చ్చున, యట్లయ్యు ననిశ్చితంబయిన యీచొప్పన్ ఘటింపింతురే? 67

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. 68

చ. కనుకని వచ్చి దెబ్బతిని కాలికి బుద్ధిని జెప్పిపోయె నె
వ్వనిదెస నిల్వలే కతనిపైఁ దనపుత్త్రునిఁ దిన్నవానిఁ బం
చినయటుకాదె రాఘవునిచేఁత? శరాసనముం దనంతచూ
చిన యనుజన్ముఁ బంచె, గెలిచెన్ రిపుఁ దాను, దదీయపుత్త్రిపై. 69

మ. మొరయించెన్ దనయల్లెత్రాటిని గరంబుం బూన్చి సౌమిత్రి దు
ష్కర మారావముచేత దద్దరిలె లంకాపూర్వియద్వీథి, వా
నరులున్ లక్ష్మణువంకఁ జూచిరి, సమంతా ద్రాఘవ జ్యాసహో
దర మీరావమటంచురక్కసుఁడు నేత్రద్వంద్వమున్ విచ్చుచున్. 70

గీ. ఈ ధనుర్జ్యానినాద మిదే కడింది సాకిరి భవత్ప్రతాపదోశ్శక్తి కంచు
మృదులబాణంబు సౌమిత్రిమీదఁ వదలి యిట్టుల వచించె రక్షోమహేశ్వరుండు.

మ. నేను రథాననుంటి మఱి నీవు ధరిత్రిని నిల్చి తాహవం
బైనను బాడికాదు మరియాదయుఁగాదిది చూడు మొప్పికా
న్నానని నీవనన్ విడుతు నారస మం చన లక్ష్మణుండు మే
మైన మఱెత్తివచ్చినది యన్నిటి కిన్నిటి కొప్పికొంచునే. 72

వ. అనిన నతికాయుండు తీవ్రనారాచంబు సౌమిత్రిపైవదలిన నతండు దానిని ఖండించె. మఱియు నైదు వేల్పుదుముదారులను ముండ్లదారులు పట్టించిన యమ్ములు వేయ లక్ష్మణుండు వానినన్నింటిని వారించె, నంత నతికాయుండు నీవు గొప్పకోదండి వగుదువు, ఇపుడు నీవు వేయు మన సౌమిత్రి యిట్లనియె. 73

ఉ. నాకమునందునన్ దివిజనాథుని పెన్నొసటన్ శరంబునం
దేఁకువ నెత్తురుందొరువు తీసితి నంటివి, నీనొసంట నే
నాకరణిం బొనర్తు నది యాగిగొనం గలవేని యాఁగు మం
చే కెలసంబొ విడ్చె నొక యెంచిన బాణము, వంచిచాపమున్. 74

ఆ. అసుర దానివేగ మాపికోఁ జాలక పెఱశరాళి దాని విఱువలేక
ధరణీధరము శిరము తప్పికోఁజాలక పెదవి నెత్రుబొట్లు విద్రిచికొనియె. 75

మ. అవునయ్యా రఘురామసోదర! సెబా సంచున్ సురారాతి పి
న్నవుకా వీపని చేసినట్టిఁడు ననున్ నాకంబునన్ లేడు, రా
ఘవుతో యుద్ధము చేయలేదనిన శంకాలేశముం బాపినాఁ
డవు, నా యమ్మును దట్టికొమ్మనుచు వెంటన్ బాణముందూసిన్. 76

ఉ. లక్ష్మణు లొమ్మునం దహిబలారి యొకండు ఫణంబు విప్పుచున్
సూక్ష్మము లెఱ్ఱనాలుకలు చూపిన యట్లుగ నెత్రుచిమ్మినన్
బక్ష్మము లార్చికొంచు దివివచ్చిన వేల్పులు చూచుచుండగా
లక్ష్మణుఁ డెంచె శత్రునిబలంబును ధైర్యము వింటినేరుపుల్. 77

వ. ఇతఁడస్త్రసాధ్యుఁడు గాని శస్త్రసాధ్యుడు కాఁడని తెలిసికొని సౌమిత్రియత
నిపై నాగ్నేయమును విడువ నతికాయుండు దానికి సౌరాస్త్రంబును జోడింవ.

ఇంద్రవజ్రము

శ్యామారుణంబుల్ సిత శారకాంతుల్ వ్యోమప్రదేశంబున బూర్ణమౌచున్
భీమంబుగా లోచనవిద్ధమయ్యెన్ తా మంతసంతస్ శమటన్ వహించెన్. 79

వ. అంత లక్ష్మణుండు తనశత్రువు తపోవంతుఁడని తెలిసికొనియె. 80

క. ఉపసంహారింపకుండగ విపులవధము సేయకుండ విఱుగకయుండన్
గృప నారవూరక తపో నిపుణుల యస్త్రములుగాని నిర్భరశక్తుల్. 81

వ. అంత నతికాయుండిషీకాస్త్రంబు నిగిడింప లక్ష్మణుం డైంద్రము నిగిడించిన.

ఇంద్రవజ్రము.

ఆకాశభావం బది యస్తమింపన్ కోకొల్లలై నాగటికోల లొప్పన్
సాకొప్పఁ బర్జన్యుఁడు చాళ్లుదున్నన్ జేకొన్న హేలాకృషి చెంగలించెన్. 83

వ. అన్యోన్యద్వేషులు మహాస్త్రవైయర్థ్యభావనులునై శస్త్రనైపుణి మీఁద నాధారవడి
సౌమిత్రి శరీరంబు పుష్పితాశోకంబై యతికాయునిమే నశస్త్రవిద్ధంబై యుండ
సౌమిత్రి. 84

ఉ. నా కదియించు బాణములనైపుణి కించుక లొచ్చు వీఁడు, నా
యే కఱుకమ్ము వీని తను వెక్కదు, నాయొడ లెల్ల రక్తమై
కాక యొకింతయుం బడలికం గనఁ డేగతి వీనిఁ గూల్పనౌ
నాకిది పాలువోదని మనంబున నెంచుచుఁ గోపచిత్తుఁడై. 85

వ. అసమయంబునఁ గడలినుండి వచ్చిన గాలికరఁడు సౌమిత్రి చెక్కిట రివ్వున
దూయగా నతండు కసివాటుగొన వాయువు భయభ్రాంతుండై యాయనచెవిలో
నిట్లని యూదె. 86

శా. ప్రాణోపాసన సేయు నీతఁడు తనుత్రాణం బనిర్భేద్యమౌ
వాణీమానసపద్మ పద్మకసుహృద్వాల్లభ్య లబ్ధంబు ని

ర్యాణం బందఁగ జేయ వీని నెపుడే బ్రహ్మాస్త్ర మొక్కండె పా
రీణం బైనది నాగ సుళ్ళు తిరిగెన్ రిష్టప్రమాణాకృతిన్. 87

వాతోర్మి

అంతన్ రక్షఃపతి కాయాయిదిశల్ కుంతప్రాసమ్ములు కోలల్ పరిఘల్
క్రాంతంబై ముంచిన కంధిప్రభ దు ర్దాంతంబై లక్షలు రాపిళ్ళుగనై 88

దిక్కుల్ కన్పింపక ధీరత్వ మహో యొక్కింతైన న్నిలుపోవం గనకే
చిక్కించెన్ దేహము చెక్కన్ దునుకల్ ముక్కల్ చెక్కల్ చెడిపోయెందనువుల్.

వ. అంఁత నొక పెద్ద కొండమీఁద విశాలాంభోధరమ్ము క్రమ్మి యది విచ్చఁగాఁ గొండ మాయమయినట్లున్న, సకలవానర రాక్షస వీరులును నివ్వెఱ భజింప, నది బ్రహ్మాస్త్రంబని తెలిసిన యాంజనేయుం డహో సర్వాస్త్రంబులు ప్రయోక్తృప్రభావపరిణతంబులనుకొంచుఁ బ్రశంసాప్రమోదసింహనాదంబు సర్వ రాక్షసభయంకరంబు పొనరించిన, నా మహాప్రచండారావంబునకు బెదరి నల్గురు సారథుల యదుపు మాలి వేయిగుఱ్ఱంబులు రథంబుతోఁ గూడఁ బరుగులెత్తి మహాసాగరంబునఁ బ్రవేశించి నశించె. 90

శా. ఇంకన్ యుద్ధ మటంచు నేమికల దా యీ వానరాకీనుల్
లంకాపట్టణ మగ్గిపెట్టెదరు హేలం జూఱగొందు ర్నిరా
శాంకంబై చనె రాజుతోడి బ్రదుకై యయ్యయ్యో! మే మిచ్చటే
లంకాపట్టణమందు నంచు దనుజుల్ లంకాపురిం జొచ్చుడున్. 91

క. పదిదుఃఖము లొకసారిగఁ బొదివినచో దేనికొఱకుఁ బొగులుటయో స
ర్వదితిజలోకేశ్వరుఁడు దృషదాకృతిగ దశగళుండు స్తంభము పొందెన్. 92

క. తెలిసినయంతన యెవరికి వలపోయుటో తెలియలేక వరుస వరుసగా
వలపోఁతకాక ముద్దగ వలపోయుట గుండెలోని బరు వధికంబై. 93

ఉ. శోకము బిట్టుగానగుచు శోకగృహంబునఁ గొన్నినాళ్ళుగా
నేకతముండి భూమిపతి యెవ్వరిఁ జూడఁడటన్న భోగమౌ
శోకముపొంద వీల్పడక శూరుఁడు, దుర్గకవాటమున్ ధను
ర్జ్యాకలితారవంబుగ మహోత్కృఁ డతండు పగుల్చుచుండెడిన్. 94

మ. అతికాయున్ వధియించె నన్నది సుమిత్రానందుఁ డాశ్చర్యసం
గతి, కైలాసముకంటె బర్వు మఱి తత్కాయం బదింకొక్క సం
గతి, తామిద్ద అభేద మన్నయటులం కాకుత్స్థుఁ డాడెన్, సమా
దృతికా కయ్యది నిక్క మేయగునా? తామీ రెండొకే తేజమై. 95

చ. బవరము లాడుచో నుభయపక్షములందున వీరపాళి సం
భవమగు మృత్యువందుట సమానముగా, నొకవంక మొగ్గొ, రా
ఘవుదెసఁ గీశవీరుల నొకండును జావఁడు, చచ్చికూడ రా
ఘవులు సజీవులయ్యెదరు, కయ్యము కా కిది జీవలీలయై. 96

మ. మఘవుండెంత మఱిన్ మఱిన్ సురపురిన్ మాగెల్పువాక్రువ్వ, శ
స్త్రఘనుల్ వీరలు కుంభకర్ణుని వధించం గల్గుటంజేసి, య
స్త్రఘనుల్ వీ రతికాయు నీగతి వధించం గల్గుటంజేసి, ధ
ర్మఘనుల్ శీలఘనుల్ పరాక్రమనిధుల్ రాముల్ మహోగ్రప్రభుల్. 97

మ. సుతులున్ మంత్రులు తమ్ములున్ మఱిమఱిం జుట్టాలుపక్కాలు ది
క్పతులం గెల్చితి వేరి సాయమున నవ్వారెల్లరున్ వీరిచే
హతులై పోవుట చిత్రమయ్యె నిత డాహో వాసుదేవుండెయౌ
శితికంఠుం డిట నేమిచేయఁ గలుగున్ జేజారి పోవచ్చినన్ 98

చ. రజతమరాళమై దితిజరాజు గృహంబుల నున్నయట్టి శై
లజపతి, యక్షపుత్రుని ఛలంబున లంకకు వైరియైన క
ష్టజనునికిన్ లతాంగికిని సల్పె రహస్యపు రాయబారముల్
గజదితిజారి నమ్మికొని కయ్యము చేసిన గెల్చినట్టులే. 99

గీ. జానకీదేవి చెప్పిన చాయ నేను కైతవోపహారంబులు కాలకంఠు
నకును గంఠంబు లిచ్చుచున్నాను మఱి యథార్థముగ నీయవలయునింకైనఁగాని.

చ. కడుకొని వేదముల్ చదివి కయ్యము సేయగ నేర్చినారు నా
కడుపునఁ బుట్టినట్టి పసికందులఁ బొట్టను బెట్టుకొన్న యీ
వడిగల వింటివాఁడొకఁడు వచ్చిన విష్ణువటంచు నెంచఁగా
నిడియఁగఁజేయు చొప్పికొన నీయదు కోపముమండిపోవుచున్.

చ. చెలువుగఁ బుత్రులై హితము చెప్పుట తప్పని చెప్పరంతె, మం
త్రులవలెఁ దమ్ములంబలె ననున్ వచియించియ యుంద్రులేనిచోఁ
దలఁపున నుండెనం చెఱిఁగి తానది చెప్పమి చేసి లేనియ
ట్టుల నటియించు మూఢుఁడు జడుండు జనుండు స్వలాభబుద్ధియై.

క. అకాంత ధాన్యమాలిని వే కొడుకల నిచ్చె శౌర్యవిభవుల నా కే
నా కొడుకుల దిగమ్రింగితి నా కోమలి మొగము చూచుటదియెట్లు శివా! 103

సీ. బవరమ్ము సేసి లాభం బించుకయు లేదు బవరమ్ము నేను దప్పకయ చేతు
జానకి దైత్యవంశ వినాశహేతువు వైదేహి వదలనే వదలనేను
మొదలిది యిది దుఃఖమునుద్రవ్వుటే యగు తుదిదాఁక దానిద్రవ్వెదను నేను
అస్మన్మహోదర్ప మడగించుటకు నిది ప్రాణాలతో దాని వదల నేను

గీ. అసురసంహారమున కయి యరుగుదెంచె నేనిఁ బూర్తిగా నది చేయనీయ నేను
మఱియు నాకంటెముందుగానరిగినాఁడు వీరుఁడుమహాత్ముఁడైన విభీషణుండు.

మ. ఘనుఁ డీతండె త్రివిక్రముండయినచోఁగానిమ్ము యుందాకఁ దె
చ్చినదే చాలును మానవుం డగుచు వచ్చెన్ శ్రీవికుంఠంబునం
దునఁ గాలూఁదగ లేక, జానకియుఁ దోడ్తో లక్ష్మియైనన్ దనం
తన యే తెంచి యిటన్ వసించె హరి కింతన్ సిగ్గుచే టౌనటుల్. 105

శా. ఈ యుద్ధం బిది దీని కేమి యిది ఆ వెట్లౌగునట్లౌగుఁ గం
దోయిం గుండియ నిండఁగా ననుభవింతుం దుఃఖ మే నంచు దై
తేయప్రాజిత శోకసౌధమున నాదేయానిభాక్షుంబులం
బోయెన్ గుండియ పుత్రదుఃఖమునకున్ పుల్లాంగణం బట్లుగాన్.

వ. అంత మేఘనాదుండు రావణుని చేత బురుజులు గుల్మములు రచ్చలు కొలువులు దద్దడములు క్రంతలు భద్రపఱుపంబడినట్లు వానరు లెవ్వరు రక్కసులచే నవజ్ఞ పొందరాదని యాజ్ఞాపింపఁబడినట్లు తెలిసికొని, తండ్రికిఁ గలిగిన భయ సంశయంబుల ననుమానించి శివాదిదైవతముల నమ్మికొనిన వారి నవ్వికొని రక్షోరాజ శోక భవనంబునకుఁ బోయి పితృవ్యులయు ననుజులయు మరణంబులకుఁ దాను సైతమెంతో విలపించుచున్నట్లు నటించి, చివర కిట్లునెమ్మదిగా నారంభించె. 107

శా. నే నం చిక్కడ నొక్కఁ డుంటెనిగదా నీ కీ శుచాదైన్య మే
లా? నాకన్నను మించు పోటరులు కారా రాఘవుల్ తీవ్రచ
ర్యానారాచభుజంగ రాజిఁ గఱిపించన్ మృత్యుపర్యంతమై
రీ నా నేటి శరాళికిం బ్రదికిరారీసారి ముమ్మాటికిన్. 108

చ. అయకరులయ్యు, దొల్తటి మహాభుజగాధిపమంత్రముల్ ప్రతి
క్రియ పొనరింపఁ గాఁదగు నకృత్రిమనిష్ఠలయందు సాధ్యమై
యయయొ మదీయచాపమునయం దిపు ధుద్గలిఁబొందు శస్త్రపా
ళి యమునిఁజూపుటే, తిరుగులేదు, సరాసరి బండినెక్కుటే. 109

చ. గగనము వాయు వగ్ని యుదకంబులు ధాత్రియు నైదు రెండునా
మొగి మఱిరెండు నీమొగి నమూర్తము మూర్తముగాఁగ విచ్చున
ట్టి గురుప్రయత్నమందునఁ గడిందిది దృగ్విషయంబు తొల్తగాఁ
బగిలినయవ్వి డెల్లునివి పచ్చవి నిప్పలుగా విదీర్ణమై. 110

ఉ. దీపితవృత్తియై తదధిదేవత సర్వనియామకత్వరే
ఖాపరమాద్భుతంబయి జగంబులు నిల్పుఁ ద్రయీసమస్తర
థ్యాపరమేశ్వరం బగుచుఁ ద్రయ్యుదితోగ్రపథార్చితుండు స్వా
హాపతి సర్వకార్యకరణాద్భుతవృత్తి జగత్క్రియాకృతిన్. 111

చ. అతనిని మించి యిచ్చట సమర్చనయోగ్యత కల్గువాఁడు లే
డితరుఁ, డమూర్తమైనయది యెల్లయునాతఁడుగాఁగ మూర్తమై
వితతి వహించె, వానిపయి వేల్పులు గల్గరు, వేల్పు లెల్ల ర
గ్ని తమకుఁ బోషకుండయిన నిల్తురు పొల్తురు స్వీయవృత్తులన్. 112

మ. శివుఁడున్ విష్ణువు నింద్రుఁ డీ సురజగచ్ఛ్రీనాథులెల్ల ర్మహా
గ్నివికారంబులె, చేతనత్వమని యగ్నిప్రౌఢతత్త్వంబు వే,
రవినాశంబగువృత్తి వహ్నికిఁ ద్రయీవ్యాహార హోమాదులం
దవు నద్దానికి దాసు లీ హరిహరేంద్రాదుల్ ఫలాధారులై. 113

ఉ. మానవుఁలందుఁ బెద్దయగు మానిసి కేశవుఁ డంచు నందునం
దైన వినంబడున్ దివషదర్యఖిలేశ్వర! యావికుంఠదు
ర్గానఁ గవాటమున్ త్సరువిఘాతముచేసిననాఁడు కాని యీ
మానిసి యౌచు వచ్చిన రమాపతియౌనె యెదం గుమారిలన్. 114

ఉ. అస్మదుపజ్ఞమై తనరు నగ్గిని వేల్మలు సర్వమౌ జగ
ద్విస్మయకారు లచ్చటను విష్ణువు గిష్ణువు పట్టరే ద్విష
ద్దుస్మరమైన దాని ఫలితంబున లొచ్చగువారె వీరు వి
ష్ణు స్మరవైరిముఖ్యులు వినూతన రూపధరుల్ సురాకృతుల్. 115

మ. తపముల్ వేల్మలు నొక్కడే యగున యేతల్లోక కార్యక్రియా
నిపుణంబై చను వేల్మ లీ జగతికిన్ వేల్మల్ తపోజ్యేష్ఠముల్
శపథం బియ్యది రామలక్ష్మణుల నే సంహారముం జేతు నే
నపుడే చేసియయుందు నింతవసరం బౌనంచు నెంచం జుమీ. 116

గీ. మనకుఁదెలియును గొన్నిహోమములు దైత్యవిద్యలవి నేర్వగాలేరు వేల్పులయిన
స్వయముగనమోఘముల్ హుతాశనుఁడువచ్చి లెక్కగానిచ్చిపోవు శిలీముఖముల.

మ. కటికయ్యున్ యముఁడైనఁగాని యల మార్కండేయునింగూర్చి ధూ
ర్జటితోడన్ మొగమోటమిం బడియె నూర్ధస్వేత్వరేఖన్ శిఖా
జటి వైశ్వానరుఁ డింత కక్కుఱితి చేసాచందు హోమక్రియా
స్ఫుటసంలక్షణమూర్తి లేఁడచట విష్ణుండున్ మఱిన్ గిష్ణుడున్. 118

శా. సామర్థ్యంబులు సత్క్రియాతతులు తత్సంజాతమౌ సత్త్వలం
బీమూఁటన్ నడువన్ వలెన్ జగములంతే ధూర్జటుల్ విష్ణులున్
మోమోటంపడి స్వీయముల్ మతములన్ ముందుంచికొంచున్ జగత్
క్షేమంబంచును బైకి నెట్టెదరు భక్తక్లిష్టదుర్జీవులన్. 119

వ. అనిన రావణుం డిట్లనియె. 120

క. నీవాకరుండవు మిగిలితి దేవేంద్రవిరోధి! వారు తెగువరులు సుమీ
నీ వైశ్వానరకోటికిఁ దా వైశ్వానరుఁడు వాఁడు దైత్యేశసుతా! 121

మ. నినుఁ బంపింపఁగ వద్దటంచుఁ గలదున్, నీవేగి యాసంశయం
బును దీర్పంగల వన్న యాశ కలదున్, బోరింతసాగెన్ మఱిం
దనుకన్ వచ్చెను వెన్కకుం దిరుగఁగా నాతండ్రి లేదే కదా!
మనమో వారొ, శివుం డొకండు కరుణింపన్ వారె కానౌఁగదా!

గీ. సర్వథా నీవు వారిని సంహరింపనే వలయు సర్వదితిజధాత్రీవలయము
నిది విభీషణునకు మాట యిచ్చెనంట యన్నియును దనచేతిలో నున్నయటుల.

క. ఒకవేళ వారు గెల్చెద రకటా! యీవీడు వారిదైనది, దైతే
యకధారుణి రాజవు నీవుకావు, కనుగొమ్ము రాఘవుని కోపమ్మున్. 124

ఆ. వారి కెంత తెగువ వలయునో యంతయు నుంచుటకును హేతు వున్నదనుము
మనది పౌరుషంబు, మఱియుఁ జచ్చిననేమి చావకున్న నేమి సాగరులకు. 125

క. వారికిఁ బోయెడి దేమీ? యౌరా పోయెడిది మనకు నక్కటనన్ నీ
వా రాఘవులను జంపుమి యీ రావణు సుతుఁడపైన నేగుము వత్సా. 126

వ. అంత మేఘనాదుండు సకలదితిజలోకేశ్వరచరణపీఠి నమస్కరించి, దండిమగఁడైన రాముఁడు నిండుపరాక్రమముగల్గు నీకెదురై లేకుండెడుగాత మని యాశీర్వచనంబు పొంది యనలత్వరాహంక్రియాధూర్వహములై ఖరములు పూన్చిన మణిమాణిక్య వినూత్న మంజుసుషమా మార్తాండబింబంబువోని రథం బెక్కి మిన్నుదాఁకిన దీప్తిచేతను మేలు మేలని రాక్షసులు పరిఘ కుంత ప్రాస పట్టిస తోమర నిశితాసి చాపపండితులు రక్షోవీరులు తన్ననుసరింప. 127

క. ఎచ్చట యుద్ధము జరుగునొ యచ్చటఁ దా నవతరించె నత్యుగ్రంబై
పచ్చందనము మాడిన యెడ పచ్చని జలధరము వచ్చి వ్రాలినభంగిన్. 128

చ. రథమును నొక్కచో నిలిపి రాక్షసవీరుల బండి భద్రమౌ
విధమునఁ జూడఁగా ముదల వెట్టి మహాహవధాత్రి నొక్కచో
విధుతజలంబు ముగ్గులను వెట్టి హుతాశనుఁబెట్టి జ్వాలగాఁ
బృథుతరవహ్నిఁ జూచిస్తుతియించి యలంకృతు హవ్యవాహనున్.

ఉ. నల్లని మేకనున్ గళమునం గొని హోమము చేసి నగ్ని సం
ఫుల్లశిఖాసముజ్వ్రలితమూర్తి స్వయంబుగ వచ్చి తా హవిః
పల్లవపుష్పమాంసములు పాణియుగంబున స్వీకరించె నా
వేల్మిత వహ్నికుండమున విస్ఫుటమై జయచిహ్నముల్ తగన్. 130

వ. అంత నతండు రథంబును ఖరంబుల బాణంబుల సర్వాయుధంబుల నభిమంత్రించి యంతర్ధానంబుపొంది రాక్షసులఁగాంచి నిట్లనియె. 131

క. మీ కెదురు లేద కీశానీకంబులఁ జంపుఁడింక నిర్భర ప్రాసా
నీకంబుల నసి పరిఘానీకంబుల రాముసేన నీఱై పోవన్. 132

మధ్యాక్కఱలు.

రట్టుగ రాక్షసాళి బవరంబున రాపిళ్ళు బిట్టు
వెట్టగా వానరావళుల, వీరులై వీరు చెట్టులును
గుట్టలు వారిపై విసరఁ, గోలల గుము లెటనుండి
పుట్టెనో వానినిఁ బెలుచ ముక్కలు ముక్కలు చేసె. 133

ఇట్టి వీరుం డొక్కఁడే మహేష్వాసుఁ డింద్రజిత్తనుచుఁ
బట్టి నేత్రమ్ములకుఁ గనుపట్టనివాఁడు కోలలను
గట్టిడువాఁడు మాయలను గదియించి గడువంతెనలు

ఔషధంబునకు నందనిది వ్యాధి మహాతీవ్ర మగుచు
భ్రేషమ్ము కూర్చుచుఁ బ్రాణవితతికి విధృతిమైఁ బ్రతిని
మేషమ్ము చూచుచునుండ మృత్యువు మ్రింగుచునుండ
దూషితవృత్తిగా యత్నదూరమై దూపిల్లునట్లు. 135

కాలుచేతులు కట్టివైచి కంబానఁగట్టి ముండ్లొప్ప
కోలలతోఁ గొట్టినట్లు గునపాలఁ గ్రుమ్మినయట్లు
వ్రాలిన వానరుల్ నేలబడినట్టి వానరుల్ గుండె
వ్రీలిన వానరుల్ మెడలు విరిసి త్రెవ్విన వానరులును. 136

ఒకనికిఁ గన్నులుపోయె నొకనికి నూరువుల్ తెగియె
నొకనికిఁ జేతులు విరిగె నొకనికి నుడిగెఁ బ్రాణములు
నొకనికి నడుము రెండయ్యె నొకనికి నురము బెండయ్యె
నొకఁడు రెండుగఁ జీలె నడిమి కొకని మే నుయ్యాలయూగు. 137

సాగిన పందిరిగాఁగజడ్డవాసంబులు గాఁగ
వీఁగిన వానరుల్ వట్టు విడలక వ్రేలు తీవలుగ
నాగుబ్బుగా నేఁచు దములపాకుతోటయ్యె రావణి ప్ర
యోగించు శరములచేత యుద్ధమహోర్వి యంతయును. 138

అయ్యయ్యొ రామునికొఱకు నరుదెంచి యఖిలఖండముల
యయ్యె వివిధజాతు లైనయట్టి వారఖిలవానరులు
దయ్యమ్ము నెత్తికోలు, తుదిఁ దాఁకిరి తా వానరు లను
నెయ్యమొప్పెడి జీవరాశి నేటితో నేలఁ బాసినది. 139

అల్పాక్కఱలు.

పదియు నెన్మిది శాతబాణాల నంగదు గంధమాదను గర్వమడచి
మదమత్తుఁడౌ నలు మాయించి తొమ్మిది బాణములతోడ మీదు డించి, 140

ఏడమ్ములన్ మైందు నేఁపడంచె నాడించి ఱొమ్మునఁ గంఠంబునన్
వాడివైచను నైదు బాణాలతో కూడి గజున్ స్మృతిగూల నేసె. 141

పదిబాణముల జాంబవంతుండు ముప్పదితీవ్రబాణాలఁ బడసి నీలుఁ
డదవదలై పంచప్రాణాలతో నుదయంబు చెడి లోననురిసిపోవ. 142

వ. సుగ్రీవు డంగదుఁడు ఋషభుఁ డాంజనేయుండు దధిముఖుఁడు కేసరి జ్యోతిముఖుఁడు గోముఖుడు పావకాక్షుఁడు కుముదుఁడు మొదలయిన సర్వసేనాపతులు ప్రాణంబులు బాయ స్మృతిపథంబు ద్రోయ కసవుమేయ గుండియలు రాయ పరలోకపటంబు నేయ యమపురంబుడాయ శిరోక్షి శ్రవశ్చిబుక గల్ల కంఠాంసభుజవక్షోమధ్యోరుజంఘమ్ముల నరుంతుదమ్ముగా సంహరించి. 143

ఉత్సాహము.

చంపదగినయట్టి యొక్క శత్రువైన లేక నై
లింపవైరిచయము పురము లీలగాఁ జొరంబడన్
శంపలేని మొయిలు లాకసమున గ్రమ్మినట్లుగా
అంపవాన కురియుచుండె నసురవీరుఁ డుగ్రుఁడై. 145

కన్ను కన్ను పొడుచుకొన్నఁ గానిపింప నట్టులా
సన్నమైన యంధకారచయము గ్రమ్మజేసి యు
త్సన్నమైన కీశచయము శవములెల్ల భీతిసం
పన్న మైనయట్టు లుండ మఱియు మఱియు నుగ్రుఁడై. 145

రాఘవుల్ కలట్టిచోటు రాక్షసుండు చేరి బా
ణౌఘములను బోనుపెట్టి నట్లు క్రుమ్మరించుచున్
మేఘనీలమూర్తి మింట మిడిసిపోయె బిట్టుగా
శ్లాఘ కవధియైన యట్టి శౌర్యలక్ష్మి పట్టుగా. 146

అంత రామచంద్రుఁ డనుజు నరసి వీఁడు చాల దు
ర్దాంత మైనవాఁడు శరవిదారితాంగులన్ నిర
భ్యంతరముగఁ జేసి మనల నాహవోగ్రజయనితాం
తాంతరంగుఁడై ప్రవేశ మాచరించు లంకలో. 147

ఉ. శస్త్రభృదగ్రగామియుఁ బ్రజాపతిదత్త మమోఘమైన బ్ర
హ్మాస్త్రముచేతఁ గీశపతు లందఱు నిష్ప్రభులన్ నిరీహులన్
నిస్త్రపులం బొనర్చి యిఁక నిన్నును నన్నును సైతమున్ స్వతే
జస్త్రసరేణుభూతులుగ సల్పి జయంబును గొంచు నేగుఁబో. 148

ఉత్సాహము.

అంత నింద్రజిత్తు నవమహోగ్నిభూత బాణ
విక్రాంతిచేత వానకురిసి రామచంద్రు లక్ష్మణున్
శాంతతేజులై యెనంగఁ జండసమరజయనితాం
తాంతరంగుఁడై ప్రవేశ మాచరించె లంకలో. 149

గీ. బయటగోమాయురుతమును వారిరాశిమ్రోఁతయునుదక్క వేఱుచప్పుడులులేక
పరగ లంకాపురీ వియద్భాగగత నిశామహాసమయమ్ము నిశ్శబ్దమయ్యె. 150

ఉ. ఇంద్రజి బాహువిక్రమమహేశ్వరుఁ డూర్జితసత్త్వుఁడు గ్రుఁడై
సాంద్రమహస్కులన్ సరసిజప్రియవంశ్యుల వానరాళి ని
స్తంద్రమహస్కుఁడై గెలిచి చంపె మహాహవభూమి యయ్యె ని
శ్చంద్రము స్వామిహీనము ప్రజాపతిదత్తవర ప్రభావతన్. 151

క. ఆపవటికిఁ గపిశవమ్ము లకూపారమునందు ద్రోసికో వలయును మా
కీ పనిపెట్టెఁ గొడుకు సుభుజాపరిణతమూర్తి రాక్షసమహేశ్వరుఁడై. 152

క. దిగి వారిద్దఱి గొంతులు తెగఁగోసియ యుండవలయు ధృతి మొండిఘటా
లుగ వారు బ్రదుకవచ్చును నిగూఢజీవులు రహస్యనిభృతాత్ములునున్. 153

చ. మఱి యది యట్లు చేయుటయు మంచిదికాద, యవీరకృత్యమౌ
మఱియు మహానుభావుఁ డగు మారుతి మేల్కొనియుండు, నాతఁడే
డ్తెఱ నిది యిప్డు సేయునని ధీవిషయంబున లేద, యీగతిన్
వెరవఱి యీ మహాసమయవిష్ణువు కాలగతుండుగా నగున్. 154

చ. అవును విభీషణుండు కలఁ డచ్చట నస్త్రము లేమి చేయజా
ల ఎతని, వాఁడు రాఘవుని లక్ష్మణు రక్షణ చేయువాఁడు యో
ధవరుఁడు, బాహుయుద్ధమునఁదజ్జయ మింద్రజి పొందఁడింక నే
ను వెడలి చంపఁగావలె వినూత్న సుగారికులాదిపూరుషున్. 155

వ. ఇచ్చట రావణుం డిట్లూహించుచుండ నచట నూత్న రక్షోవంశ మూలపురు
షుండు మహాశ్మశానంబుపోని సముద్రపుటొడ్డున నమ్మహాంధకారమ్మున నేకా
కియై తిరుగుచు భిన్నచమూభాగంబుల కేగి తచ్చమూపతుల వెదకుచు వారిలోఁ
బ్రాణవంతులతో. 156

ఆ. ప్రభువు రామమూర్తి బ్రహ్మాస్త్ర మింత మన్నించె నంతెకాని నెగులులేదు
రేపు ప్రొద్దుటికిని శ్రీపతి తేరుకొనున్భయంబు లేదనున్ వరుసగ. 157

ఉ. మారుతికోసమై వెదకి మారుతిఁ గన్గొని రాక్షసేశ్వరుం
డారయ నీవునుం బ్రభువవై విధిబాణము గౌరవించి త
ద్ధా రుచిరాకృతీ! యనిన దానవవీరునితోడ నిట్లనెన్
మారుతి రాక్షసేంద్ర! పదమా కనుగొందము కీశవీరులన్. 158

క. కొనయూపిరితో నుండిన జనులు సమాశ్వాసధైర్యసంగత చిత్తం
బెనయుదు రోదార్పునఁ బోయిన ప్రాణము లేచివచ్చు నెల్లజనులకున్. 159

వ. మహాకల్పాదియందు మహాపుణ్యజీవుల కొఱకు హిరణ్యగర్భుని వోలెఁ, బ్రాణ
మూడు కీశవీరుల కొఱకు వారిద్దఱును గాగడాలు చేఁబూని వెదకుచుఁ బోఁగా.

సీ. ఒకనికన్నులలోన నొక్క వెల్గుదయించెఁ గాగడా వెలుతురు గాని దొకఁడు
ఒకనిమోమునఁ దోచె నొక్క యుత్సాహంబు శవముఖాయోగ్యభాస్వర మొకండు
ఒకని మేనునఁ దోచె నొక చిన్న కదలిక స్రవదుపలస్థమౌ చలన మొకఁడు
ఒకని చెక్కిటఁ దోచె నొక నవ్వుచిఱుగీత గ్రీష్మసరోవాయుకృత మొకండు.
గీ. కనులుపెద్దవిచేసి చూచెనొకరుండు పెదవియాడించెనొకఁడు కంపించెనొకఁడు
కనులలోపల నీర్వెట్టుకొనియె నొకఁడు కేలు కాలాడఁ బోవని కీశవితతి. 161

చ. బ్రతుకుట చచ్చుటే నడిమిభావమునందున నెన్నివేల వ
ద్ధతు లవి యుండవచ్చు ననుదానికిఁ గీశతతుల్ ప్రమాణమై

దితిజమహేశ్వరుండును మతిప్రభవిష్ణుమహేశ్వరుండు మా
రుతియును సంచరించిరి నిరూపితజీవసనాతనచ్ఛవుల్. 162

వ. గజ గవయ గవాక్ష మైంద ద్వివిద నల ఋషభ గంధమాదన పావకాక్ష జ్యోతిముఖ కేసరి దధిముఖాంగదప్రముఖ సర్వకపిసేనాపతులు ప్రాణవిరహితులై యుండ వారిద్దఱు సుగ్రీవు వెదకి యాయనం గన్గొనిరి. 163

శా. నేలన్ నెత్తురుగొండవోలెఁ బడియుండెన్ జాంబవంతుండు న
ల్కాలీఢచ్ఛవివారశారసుషమల్గా మేను, గన్గొంచుఁ దా
తా! లుప్తాసువు గాకయుంటివి యనన్ దా జాంబవంతుండు నీ
వా! లీలాకృతి గొంతు గుర్తిడితి నయ్యా! దైత్యలోకేశ్వరా! 164

ఉ. కన్నులు బ్రహ్మబాణమున గాయములయ్యెను జూడలేవు జా
నూన్నయనంబుఁ గల్గదు తనూసకలామయసాన్నిహిత్యమై
యున్నల! సర్వసైన్యము సమాప్తము చేసెన వాఁడు, భద్రమై
యున్నది చెప్పు మీ యతని నొక్కని యంజనిదేవిగర్భమున్. 165

వ. అనిన విభీషణుం డిట్లనియె. 166

చ. అడుగవు రామలక్ష్మణుల నంగదు సర్వకపీంద్రు సూర్యజున్
గడుకొని యాంజనేయు నడుగంగను మారుతి నీకు నంత యి
ష్టుండొ యన, జాంబవంతుఁడు కడుంగడు నూరుపుకొంచు నిక్కుచున్
వడివడిగొంతులోఁ గలుగువాక్కును యత్నముతోఁ బెగుల్చుచున్. 167

గీ. వాయుపుత్రకుఁడొక్కండుబ్రదికియున్న బ్రతికియున్నాముమనమందఱము నతండు
బ్రతికిలేఁ డెవ్వరమునిటబ్రతికిలేమ యనఁగనంజనీసూనుండుప్రాంజలియయి. 168

వ. అతని పాదాభివందనముచేసి, తాతా! యిదిగో నేనిచ్చిటనుంటిని యేమి యాజ్ఞాపింతువో యాజ్ఞాపింపు మన ఋక్షపతికిఁ గన్నులు వచ్చె. జానూన్నయనంబుఁ గల్గె నొడలినొప్పు లన్నియుఁదీరె నంత రామలక్ష్మణు లెట్లుండిరని యడిగి తెలిసికొని యొక్క నిట్టూర్పు పుచ్చి యాంజనేయునిగాంచి యీమహాపద తరియింప నీ వొక్కండవే తెప్పవని. 169

చ. నలుబదిరెండుకోట్ల పృతనన్ గపివాహిని నింద్రజిత్తు దో
ర్బలవశవర్తియై దివస పంచమభాగమునన్ హరించె భూ
తలపతిపుత్త్రియుగ్మమును దారితదేహులఁ జేసెఁ బ్రాణవి
హ్వలతను గూర్చి శల్యవృత పంజరవిద్ధులఁ జేసె నుద్ధతిన్. 170

ఉ. ఈ వొకఁడే విశల్యకరణిం గొనితెచ్చి మహానుభావుఁడై
యీ విపదంబురాశిఁ దరియింపగఁజేయ రఘుద్వయిం గపీం
ద్రావళిఁగావ నెంతయు సమర్థుడ వయ్య సుధీ! మరుత్తనూ
జా! విలసద్భుజాపరిణతాద్భుతవేగ బలోగ్రవార్నిధీ! 171

గీ. అప్పు డంబుధిదాంటి మహానుభావ! కపుల రక్షించితివి రామకార్యనిపుణ!
యిపుడువివదబ్ధిదాటింపవే! మహాత్మ! కృపమెయి సరామలక్ష్మణ కపిచయంబు.

చ. కలదుకదా హిమాచలము, గౌరికిఁ బుట్టిలు, భారతావనీ
తలవహనక్షమం బయిన దైవతశక్తికి శైలరూప, మా
మల మలచున్ ధరాజనుల మానససీమల సాత్త్వికత్వ, మా
వల నొక యాస్తికంబయిన భావము కల్గఁగ జేయు నిచ్చలున్. 173

గీ. పైడిమల యేమొ వట్టి దేవతలయిల్లు మంచుమల సర్వదేవతామహిమభూమి
వెండిమల స్వామిసతముకావుండుచోటు చనఁగవలయుఁగైలాస మంజనితనూజ!

గీ. దానికిన్సుంతడవ్వునఁ దనరుసువ్వె ఋషభమనుపేరికాంచనశృంగ మొకఁడు
రెండు శృంగమ్ములకు మధ్య నుండు నోష ధీమహాపర్వతము మారుతీ! మహాత్మ!

చ. కణకణలాడు నిప్పుకలుగా మ్లణిదీపికలట్లు తారకా
గణములు వోలె నల్దెసలఁ గాంతులు చిమ్ముచు దీపితాంశుసా
రణులుగ నోషధీచయము రాజిలుఁ దద్గిరి శేఖరంబునన్
ఘృణినిచయాభిసర్పణ చికిత్సిత సర్వదృశామయంబుగన్ 176

వ. మృతసంజీవనియు విశల్యకరణియు సౌవర్ణకరణియు సంధానకరణియు. 177

శా. యత్సామీప్యముచేఁ బునఃకలితమై ప్రాణవ్రజం బొప్పునో
యత్సంయోగముచేత విశ్లథములౌ నస్థుల్ మఱిం గూడునో
యత్సంపర్కముచేత సర్వశిల లౌ నష్టాపదీభూతముల్
యత్సాన్నిధ్యము చేత ఖండితశరీరాంగాళి సంధించునో. 178

చ. అవి కొనితెమ్ము రాఘవులయందున వానరసేనయందునం
దవిలిన సత్కృపాగుణము తాల్చుము, వేల్పుము పుణ్యహవ్యమిం
దవి గొనితెమ్ము ధారుణికి నస్తమయం బిసుమంత లేకయుం
డ వనజబాంధవుండు గగనంబున తే పుదయించులోపలన్. 179

శా. అంభోరాశియు దక్షిణాపథము నార్యావర్తమున్ దాఁటి త
చ్ఛంభుస్థానము చేరి నంతటన యోషధ్యద్రి కన్పించు సం
ధ్యాంభోభృ న్మహనీయమూర్తివి నభస్వద్భాస్వదూర్జస్వితా
గంభీరాకృతిఁ బోయి రాఁగదవె యోగస్వాకృతీ! మారుతీ. 180

మ. అమృతోక్తుల్ వినినంత మారుతి విఘుష్యన్మారుతాపూర్ణ మే
రుమహాకందర మట్లు పర్వతముగా రూపొంది గర్జించె ను
గ్రముగా, శాంతవియత్పదం బయిన లంకాపట్టణంబెల్ల సం
ద్ర మహా పొంగి ధరిత్రిపై బొరలునో నా! గుండియల్ బెగ్గిలన్. 181

ఉ. రావణి రావణుండు విని రావముఁ బుత్రుఁడు తండ్రియున్ మఱిం
బావని మేల్కనెన్ విఱిగి బ్రహ్మమహాస్త్రము పటుతపెఁ. దా

నీవల నేమి వానరమహేంద్రుఁడు సేయునటంచు నెంచుచున్
రావణి యేమొ నవ్వికొనె, రావణుఁడున్ భయమందె గుండెలో. 182

శా. హింతాలాకృతి యవ్వు శైల మధిరోహించెన్ బయోరాశివే
లాంతప్రోన్నతమున్ మహోరజితశైలాభుండునై యూఁపు కొ
న్నంతన్ దొల్తటి కొండనా నదియునైనన్ ధాత్రిలోఁ జొచ్చి త
త్ర్పాంతంబంతయు నల్లత్రాఁచుగములై ప్రాఁకెం బయోభంగముల్. 183

చ. కదలిన మేనులై యురిసి గాయములందున వానరాళి య
క్కుదువునకున్ శ్రమంపడియె గుండియలందున బాధపొందుచున్
గదలిన ధాత్రియై ధరణి కంపముపుట్టిన నిండ్లు సౌధముల్
మెదలినయంత సర్వమును మేల్కనె లంక యకుంభకర్ణమై. 184

శా. అవ్యాఖ్యం బనిరుద్ధ మూర్జిత మనంతాకాశవీధీ ప్రయా
ణవ్యగ్రత్వర నేగుచుండిన మహానక్షత్రగోళంబునా,
సవ్యాధ్వప్రచల త్సుదర్శన మహాచక్రంబునా, ధర్మర
క్షావ్యుష్టంబగు పాద్మనాభము మహాసంకల్ప రూపంబునా. 185

గీ. సర్వసంధ్యాసమాసన్న సౌరబింబ మొకఁడు కపిరూపమునఁ బోవుచుండె ననఁగఁ
బ్రసభవేగాన నంధకారమయ వియదు దారతేజోభ్రమీ నిరాధారవీధి. 186

మ. ధ్రువనక్షత్రము గుర్తుగా గగనపాథోరాశి సాంయాత్రికుం
డవు నమ్మారుతి యుత్తరంబుదెస సూర్యాంశుప్రతానాలయం
బవు నయ్యోషధి శైలముం గనుచు డాయంబోవుచో నంత నం
త వివస్వత్ప్రభమాలి యావృతమహాంధ్యంబున్ బ్రదర్శించినన్. 187

క. ఈయోషధిగిరికి జన శ్రేయంబుం దెలియునంత చిత్తము లేదో!
మాయాదూరులు రాఘవు లాయుర్మర్మానభిజ్ఞమగు ద్రవ్యంబో. 188

క. లోభము వలవదు పరలోకాభయవృత్తిం గణించ దన్యజనమతి
క్షోభము పట్టించుకొనదు లోభము చెడుగుణము ధనికలోకమునందున్. 189

శా. ఓయీ! పర్వతరాజ! నన్నెఱుఁగ వోహో నీవు, నాకార్యమే
మో! యేనెందుకు వచ్చినానొ, మఱి నాయుగ్రత్వమేలాటిదో
ఆ యీ విజ్ఞత లేనివాఁడవు కదయ్యా! నీకుఁ గైలాసమే
మో యీ దగ్గర దైవమన్న మతిలేదో! యింత సాన్నిధ్యమై. 190

శా. కన్నుందోయికిఁజూపు మోషధి చతుష్కం బట్లుకాదేని నే
ను న్నిన్ గుంకటివేళ్ళతోడఁ బెకలింతుం గొంచుఁబోదున్ జుమీ
నిన్నేకాదు హిమాచలంబయినఁ గానీ! యెత్తిడాలాటి, దిం
కన్నేనై పెకలించి తీసికొనిపోకం దప్పదోయీ! గిరీ! 191

గీ. కడఁగి చుట్టుఁ వెడల్పుగా ఘాతచేసి వేళ్ళు తెగిపోనియట్లుగా విస్రమరముగ
వేఱియొకచోటఁబాతగాఁ బిన్నమొక్క క్షితితలంబునఁ బెల్లగించినవిధాన. 192

గీ. కౌగిలించుక కుదిలించి కుదిపి కుదిపి యూపి పైకెత్తి బుజమున మోపి చోపి
మింటనేగంగఁజొచ్చె సామీరి మీఱిమఱియు వెనుజూచుటయు పావమాని మావి.

గీ. ఆ మహాంధకారమ్మున నరుగుదెంచి నవ్వు డొక మహావ్యాఘ్రమై యరుగుదెంచెఁ
మఱి తిరిగి పోవుచో ఫణామణులకాంతిఁ బొల్చెడు మహాభుజంగమై చుండె.

ఉ. పోయినయంతమేర దివి మోపిన ప్రాణమహానిలంబులం
దాయువుపోసిన ట్లపఘనాయిత సాధువియ న్నిరామయ
వ్యాయతి కల్గినట్టులు శశాంకసుషీమకరప్రసారరే
ఖాయతి బీజభూతకలితాసుచయంబులు కందళింపఁగా. 195

ఉ. తెచ్చినయట్టి శైలమును దెచ్చిన దానిని దెచ్చినట్టుగాఁ
దెచ్చినచోటనే మఱల దింపఁగ నయ్యెను బావమానికిన్
వచ్చిన ప్రాణముల్, తెలియ వచ్చిన వార్తలు, దీర్ఘదీర్ఘమై
పుచ్చినయూర్పులై కపిసమూహము మోహము పోయినంతటన్. 196

గీ. చేతితోఁ దీసివేసినరీతి సర్వబాధలును బోవ నాశ్చర్యపడుచుఁ గపులు
నొడలులందు స్వాధీనత యుడిగినట్టి చోట్లు మఱిమఱి యాడించి చూచుకొనిరి.

క. కూర్చుందురు మైవాల్చెద రర్చిర్జ్వాలాస్వరూపమై దుమికెదరున్
చర్చలు సేసెద రూరక యార్చెదరును మఱల బ్రదికినట్టి కపీంద్రుల్. 198

ఉ. వచ్చునిమేని నిద్దమగు ప్రన్నని కాంతులసామి యూరువుం
బుచ్చఁడు నివ్వెఱంపడడు పొందినమేలుగ నూహసేయఁడున్
వచ్చిన వానరేశ్వరులవంక వినూతన మేమి లేనటుల్
మచ్చిక మాటలాడు కపిమండలి దీనిప్రసంగ మెత్తరున్. 199

వ. అంత సుగ్రీవుం డరుదెంచి శ్రీరామచంద్రునితో నిట్లనియె. 200

చ. ఎసకముగాఁగ బంక్తిగళుఁ డెప్పటికప్పుడు చచ్చినట్టి రా
క్షసులను ద్రోయుడం చనియె సాగరమందునఁ జచ్చినట్టి రా
క్షసులును జచ్చినట్లయిరి సంగరమాదిగ నేఁడుగాఁ గపీం
ద్రసముదయంబు చావరు పురాభవపుణ్యదహత్వరాభవా! 201

గీ. పెద్దనిద్దుర పోయి కపివ్రజంబు మఱల నిద్దురపోవఁగా మదిఁదలచరు
కపులు గంతులువేసిన కరణిఁగడచె నెగసి పరిశిష్టములు యామినీఘటికలు. 202

సీ. ఇసుకతిన్నెలమీదఁ బసుపారఁబోసి కపిశ్రేణి కన్నులు పిచ్చలించి
వార్ధికరళ్ళపైఁ బారాణి యలికించి కపిరాజి కన్నులు కందళించి

రోదసీకుహరానఁ బూఁదోరణాల్గట్టి వనచరాక్షులఁ బెండ్లి తనకు తెచ్చి
వేలాగిరుల్ కుంకుమాలేపమునఁ దెచ్చి వలిముఖాననములు కళ వహించి
గీ. విజయలక్ష్మి వివాహంబు వెలయువేళఁ జేయఁబడు నలంకారవిశేష మనఁగ
న య్యుషోవేళఁ బ్రాచీదిగంగనా మనోజ్ఞ కాంతినేపథ్యమ్ము నూత్న మయ్యె.

ఉ. ముమ్మరమౌచు గూండ్లు చెడిపోయిఎ నెక్కడనైన యట్టి వృ
క్షమ్మును నాయుధం బగుచు జ్యానిరతోగ్రనినాదమై నివా
సమ్ములు మారి భీతి ఖగసంతతి సర్వము లేచిపోఁ బ్రభా
తమ్మునఁ బక్షిరావ మను దానిని దేనికిఁ జెప్పగావలెన్. 204

చ. విఱిగిన బావుటాలగుచు ప్రీలినయట్టి రథంబులై కళల్
తఱిగినయట్టి డాళ్ళగుచుఁ దళ్కులు మాసినయట్టి భీకరా
సురుల మొగంబులై విగతశోభముగాఁ జను లంకలోపలన్
దరణికరప్రసార మది ద్రవ్యచయంబు స్వరూపసిద్ధికై. 205

ఉ. లేచినతోఁ గపివ్రజకళేబరముల్ జలరాశిలోపలన్
ద్రోచినతో సమాప్తమని తోఁచిన యుద్ధము, వెల్గులన్ దిశల్
రాచినతో సరోజహితుప్రాంశులు ప్రాంశులు ప్రాణయుక్తమై
లేచినతో సమస్తము వలీముఖసైన్య మదేమి యయ్యెనో? 206

సీ. తగ యుద్ధభూమివార్తలుచెప్ప నియమింపఁబడిన రాక్షసులు తత్ప్రభుని యొక్క
యాజ్ఞచే భయముతో నరుదెంచి వినతులై యాడిరి గజగజలాడుకొంచు
క్షమియింపవలయు రాక్షసచక్రవర్తి! మాకేమియు దెలియ దహిండనులకు
నొక్క శ్మశానమం దున్నటు లున్నాము కొఱవిదయ్యములు మాకుం గనఁబడె
గీ. నొండు రెండు దూరాన మే మొగిన దత్సమీపమున కేగ నవ్వి యదృశ్యమయ్యె
. నా నరులు కల్గుచోటికి నరుగవల దటంచు మా కాజ్ఞ, దాన మే మరుగలేదు.
గీ. మహితమగునొక్క దేవతామండపమ్ము నాల్గుజోతులు వెలుఁగుచున్నయవి లోన
సూర్యలోకయిద్దఱైన చక్షువులవాఁడు మోసికొనివచ్చి మఱికొంచుఁబోయె దాని.

క. చనినంతఁ గపిశవంబులు కనుచుండగఁ గపిపిశాచకాండం బయ్యెం
జనినాము మాగృహంబులు వనరి కపిపిశాచములకు భయభీతులమై. 209

గీ. నేటిప్రొద్దున నేఁగ మన్నిడ! సర్వకపులు యుద్ధమాదిగ మృతిఁగన్నవారు
నైన బ్రతికిరి గోటఁగోరాడుచుండి యేమి చెప్పదు మర్చితాహీనభూష! 210

చ. పవలునయందుఁ దా రుభయపక్షములున్ శ్రమపొంది నాటికిం
బవరము సేయఁబోమనిన పద్ధతి నుండిరి దైత్యవీరు లం
దెవఁడును నేను బోయి వధియింతును రాముని నంచుఁ జెప్పలే
దెవనికి వానికే భయమహీధర మున్నది గుండెలోపలన్. 211

మ. ఇది యాశ్చర్యముగాఁగ నున్నది మృతుం డేరీతి జీవించునో
యిది యేలాటిది ఖండితాంగము లహో యేరీతి సంధించునో

యిదియుం జిత్రము కీకసాళి పోడియై యేరీతిగా హత్తునో
కదనంబేటికి దొంగవానరులతోఁ గాకుత్స్థుతో విష్ణుతో? 212

మ. అవియే యెండలు కోటలో ననలభావాత్యుగ్రముల్, బాధ నిం
పవు కీశాళికి గంధవాహకసుషీమంబుల్, సుధాంచద్విశా
ల వనీరాశికబంధసిక్త సితవేలా వాలుకాసంస్థముల్
లవతోబాధకముల్ మఱిం గుతపవేళా స్నానతశ్శీతముల్. 213

మ. మలఁగున్ వేసఁగివోని యెండలు మఱిన్ మండించుచుండెన్ హసం
తులు, మధ్యాహ్నపు రెండుజాములకుఁ బాథోరాశి పైనుండి గా
లులు రా, వెండలమంట తగ్గకయ వాలుంబ్రొద్దుగా నైన వే
ళల గాలుల్ సన్నసన్నగా మలఁగి మల్లాడుం దరుశ్రేణులన్. 214

శా. సూర్యుం డగ్ని మఱల్చి తామగిడినన్ సూర్యాత్మజుం డంతటన్
ధుర్యంబై చను రాజబుద్ధి హనుమంతుం గాంచి పల్కెన్ వడిన్
శౌర్యాగ్నిచ్ఛట మాసియున్న యది రక్షఃపట్టణం బంతయున్
బుర్యధ్వంబులు సౌధభాగములు కాపుంబెట్టనా వెంతయున్. 215

మ. ఉపనిర్వార మొసంగలేని స్థితియందున్నా డధోబుద్ధి య
స్రపలోకేశుఁడు కుంభకర్ణుఁడు తనూజాతుల్ మృతింబొందె, దు
ర్గపులుం గన్పడ రాక్కరున్ విగతరక్షుం బొల్చు ద్వారంబు, ల
స్రపవీరుం డొకఁడైన యుద్ధమునకున్ రాఁడీ దివావేళలో. 216

క. మన మాడుకొనఁగ రాలే దనిఁజేయఁగ వచ్చినారమని యాకడకుం
జనుదెంచి వారు కలనికిఁ జనుదేరరు నుఱుకయుంట చన్నే మనకున్. 217

చ. కొఱవులు కాగడాలు దరికొల్పిన నిప్పకలైన కోలలుం
బరిసెలు పూనికొంచుఁ బరిపాలితవేగులు వానరుల్ మహో
సురపురి నిప్పబెట్టవలెనూ! త్వదువజ్ఞమ యగ్నినీతి, నీ
వరయఁగ వైనతేయుఁ డన నాదెస నీదెస నీవుగా హరీ! 218

మ. పవలగ్నుల్ వివరించె మత్ప్రిత, నిశాభాగంబునం దేనునై
వివరింతుం గపిసేనచేఁ గొఱవులన్ వెల్గించి లంకాపురిం
బవరం బన్న మహోత్సవంబు చివరం బాలింతుఁ బూర్ణాహుతిన్
నివురుల్ కప్పిన నిప్ప రాఘవునకు న్నీరాజనం బిచ్చెదన్. 219

మధ్యాక్కర.
అనిన నంజనిసుతు నాజ్ఞ నత్యుగ్రులైన వానరులు
ఘనులు జాంఘికులును వార్ధి గగన లంఘనపటిష్ఠులును
తనర నుల్కాహస్తులగుచు తార్చిరి దహనంబు లంక
వెనుముం దెసల లేచిపడిన పెటిలిన పెళ్ళలవోలె. 220

ఉ. వానరులం దవజ్ఞ నెఱపన్ వలదంచును రావణాజ్ఞ పె
న్మానిన చిత్తవృత్తులయి యుండిన రక్కసు లిండ్లయందునన్
వానరు లగ్ని పెట్టుటను వారణ సేయఁగఁ బోవరయ్యె, య
జ్ఞానులు నెంచఁబోవ రవుగాములు వీఱిడిజాతి మోఱకుల్. 221

సీ. పచ్చిమంటలతోన ప్రభవించుచున్న మహోధూమపటలి యంభోధరములు
తెలిమంట లల్లపాములు ప్రాఁకుచున్నట్లు వదలిన క్రొత్తకాల్వల జలంబు
యెఱ్ఱని మంటలై యెసలారు చోటులు వాసంతములు చూతపల్లవములు
నెగయు మంటలలోన నెగురు పదార్థముల్ చేలపై నాడు షక్షివ్రజంబు
గీ. నాకుపచ్చని మంట లైనట్టిచోట్లు నందముగ మోసులెత్తిన యాకుమళ్ళు
పరగ సర్వానుభవములు చావఁబోవు ముందు దితిజరాజ్యేందిర పొందుననఁగ.

పృథ్వి
అగురు మొదలుగనైన సుగంధ గురువిమల పదార్థచయం
బెగచు శిఖల నహీనమహోగ్నిగఁ బరిమళము నించె దిశల్. 223

ద్రుతవిలంబితము.
నిగుడు గోపురనిర్భరసౌధముల్ పగిలి కూలిన బంధురరావముల్
విగళితాశలు ద్రీల్చినయట్టులై నెగడె వహ్నులు నిల్చినయట్టులై. 224

ప్రహేయము.
ప్రియుఁడు ప్రియయు నిద్రింపంగ నగ్నిన్ శయనగృహము ప్రజ్వాలావిలీఢం
బయిన మదనుఁడేమైనాఁడొ కన్పించు యముని వివృతాక్షుల్ గాఁగ జూడన్.

వంశస్థము.
మహాగజేంద్రంబులు మాడ్చుచుండఁగా మహోగ్ని భీతిం దెసమాలి పర్వఁగా
మహోగ్నిచేతం బలె మత్తదంతిపత్త్రహారమై సైతము ప్రాణముల్ చనన్. 227

ఏకరూప
స్తోకంబై తోఁకలను జాలు నిప్పుల్ దాకొన్నన్ పేషలుగ దౌడు లొప్పన్
జీకాకై మంటలకె చేరు గుఱ్ఱా లేకోనల్ లే వనల మేదు చోటుల్. 227

చంచరీకావళి.
జ్వాలాలీఢం బౌచుం బానశాలల్ నెలంగన్
హేలం బానీయంబై యేపు మీఱెన్ మహోగ్నుల్
క్రాలున్ గత్తుల్ నిప్పుల్ గౌణమౌ వృత్తి మున్నై
యేలెన్ వాచ్యత్వంబే యిప్పు డీ కల్లుబానల్. 228

సుకేసరము.
వనలు చివుళ్ళు వహ్నిపరిణామమమూర్తులై
యనలము లంటుకొన్నఁ దమపైన యాకృతుల్
కొనకొని మాఱెఁగాని మఱి కోలుపోవు నై
జనిభృతమైన వన్నియల జాలి తోటలన్. 229

ఇల.

వసనంబు లూడఁగ బడలిగమి వఱవన్ వసమీఱు తత్కుచభరము రుచి కనుచే
యసురుల్ మహోగ్నికి నఱతగులఁబడియున్ గొనరైనచూపులఁగుసులుకొని కనఁగన్.

మేదిని

తగిలిన చోటనే తగులుఁ దా మరుత్సుతుండున్
దగ మును మంటఁ బెట్టినవె దహ్యామానముల్ గాఁ
దగె ననఁ దద్గృహేశ్వరులు తాల్చు నీర్ష్యచేతం
దగులఁబడంగ గుండియలఁ దప్తి మూఁడు రెట్లై. 231

వరాహము.

రక్షస్సుల్ మదుల నరుచిరముగఁ దలచు రమణ గలరు గృహసంజాతం
బక్షీణంబుగఁ బశుతతి యసువు లురల నజవిసరమును వరాహంబుల్
భక్షింపన్ మఱుసటిదగు పవలునఁ బగ ననలుఁడు కరుణాధూతిన్
దీక్షన్ వారిని సయితము తెరల నుసురు తిగిచె నసువులు ప్రచండుండై. 232

అలసగతి.

తమగృహములున్ మఱియు దగ్ధ మగుచుండన్
గుమతులయి రక్కసులు కొందఱు దురాశా
భ్రములు తగులంబడు పరావసథచౌర్య
క్రమము నెఱపన్ దహనకాండము దహింపన్. 233

దోధకము

తల్లులు పాలను ద్రావెడు గ్రుడ్డుల్ పిల్లలతోఁ బెనువీధులఁ బర్వన్
కొల్లలుగాఁ బశుకోటులు నంభావేల్లిత సంరవవిక్లబ మౌచున్. 234

మధ్యాక్కఱలు.

నిప్పంటుకొని వంశఘటలు నిడివిగా నిట్టగాఁ జీలి
కప్పలు లేచిపో నిండ్లు కాలిపోఁగాఁ గూలిపోయి
తుప్పలై మింటికి నెగిరి దూరాన దూఁకి యాయిండ్లు
నిప్పంటుకొని యార్పరాక నిప్పలే నిప్పలై పోయి. 235

ఊరెల్ల మంటలై యురిసి యుప్పరం బూఁటి జ్వాలలను
వారిధిలో దవ్వుగాఁగ బ్రతిబింబపరిణామ మొలసి
వారాశియును మిన్ను నెత్తువడి మహాప్రళయకాలంబు
చేరు నైనట్లుగా భీతి చెందించెఁ జెందించె వగవు. 236

ఒడలికి వహ్నికావలయు నొడలికి నుదకంబు వలయుఁ
గడుఁ బ్రమాణము గల్గునట్లు కావలెఁగాని యారీతి
విడివిడి యున్నచోఁ బడసి విలయంబు వినయంబు బెడిసి
చెడిపోయి భూతముల్ లయము చెందించి చెందించి భయము. 237

తంతన్యమానమ్ము నగుచుఁ దానభేదప్రతిపత్తి
యింతగా గుణిగుణములకు నెసలారు టెంద్రైనఁ గలదె
వింతగా నగ్ని యౌష్ణ్యమ్ము వెస శిఖావిసరమ్ము నరుణ
కాంశులు భిన్నముల్ కాక కడఁగు నొక్కటిగాఁగఁ జేగ. 23

ఫలసదనము.

అనలమిటుల పురమునలమియఱుమంగా
దనుజసమితి చెడి సదనము లఱవంగా
దనుజపతికి నెడఁద తలరి చెదరంగా
మనసు వివశ మగుచు మఱల గరువంబై. 23

చ. ఒకరవ మేమొ చాలనటు లుప్పరమంతయు నిండిపోయె వ
హ్ని కలగురావ మల్ల కరిబృంహితముల్ హయహేషలున్ బళు
ప్రకరము గొంతు చీర్చికొను రావము రాక్షసు లేడ్పులున్ మఱి
ట్లు కడలిఘోషలున్ బ్రళయలోలవియత్తు విదీర్ణమైనటుల్. 24

చ. చచ్చెదునప్డుకూడ నొకశాంతియుఁ దీప్తియు సౌఖ్య మొప్పఁగా
జచ్చుట కేమొ యిష్టపడు సర్వజగత్తును దానిచే బలెం
బచ్చని మేని నిద్దమగు ప్రన్ననికాంతుల స్వామి యాదరం
బెచ్చఁగ నల్లెత్రాటవిరియించెను నిస్వన ముగ్రశాంతమున్. 241

ఉ. ఒక్కనితో విరోధమయి యుండిన, నుండిన యావిరోధమే
మిక్కిలి కాలమై చన నమిత్రునియం దొక యాదరంబునౌ
ప్రుక్కిచనన్ విరోధము, విరోధము యొక్క విలక్షణత్వమై
నెక్కొను నాదరంబదియు నిండి విరోధముతోడఁ జిత్రమై. 242

ఆ. తాదృగాదరంబు దానవవైరికి దానవాళియందుఁ దనరుచుండు
మఱియు నాదరంబు మసలిన చోటుల స్వామి తానె వ్రాని చంపుచుండు. 243

మ. మరి లంకాపురి చేరినప్పటికి రామస్వామి యద్దాననే
మొరయించెం దననారి మోహకగుణాపూర్ణ స్వనాభోగని
ర్భరమున్ నేటికి నర్ధరాత్రమున ధారాకచ్ఛపీనాదసుం
దరమున్ నారిని మ్రోసె దైత్యజనహృ త్సమ్మోదభీదాయిగా. 244

గీ. కడఁగి సర్వరవంబులఁ గలసిపోక పరిమళము వోలె వెల్గునాఁ బైకిఁదేలెఁ
దనరెడు ప్రవాహమునఁ బూలదండవోలెఁ దనరు నంధకారమున సౌదామనివలె.

క. మంటల వెలుఁగుల యందున మింటం గనిపించె దైత్యమేదినివతి యి
ల్లంటుకొని యున్న గోపుర మంటపములు దైత్యరాజ్యమహిమాంకములై. 246

మ. తన కోదండజగద్విదారణసమర్థ ప్రాజ్యవిద్యాప్రద
ర్శనముం జేసి దశాస్యుగుండియ నధైర్యంబుం బ్రతిష్ఠింప నెం

చిన శ్రీరాముఁడు నారసం బొకఁడు దూసెన్ గోపురం బద్ది కూ
లిన దాయెత్తుననుండి రాఘవధనుర్లీలామహోంకంబుగన్. 247

గీ. మొగి నహంకారమునకును ముద్దుబిడ్డ
కోప మనునది యది శతకోటి ముఖము
దుఃఖ మసమర్థతయు నీర్ష్య తూల్పు నోట
మియుఁ బరాభూతి యన్నింటి మిగులు గుణము. 248

ఉత్సాహము.
రామచంద్రుమీఁద వచ్చె రావణునకుఁ గోపము
ద్దామభీమమైన గుణము దైత్యరాజ్యనాథతా
భూమభావ మదియు జన్మభూమి యైన గుణము సం
గ్రామశక్తి మిగిలినట్టి కారణంబు కలదియున్. 249

వ. గోపురనిపాతసంజాతకోపభావ మసురలోకేశునకు నవశ్యంబు కలుగునని సుగ్రీవుండు కపిచమూపతుల దుర్గముఖ్యద్వారముల యుద్ధమునకు సమాయత్తపఱచి యిట్లనియె. 250

సీ. దివిషజ్జగన్మహోధినిదానమై ప్రాదంతసీమ నాటిన నారసంబు
జలరాశిగత ప్రతిచ్ఛాయామిషన్ భోగి జగతి నెత్తిన జిగీషాపతాక
మధ్యమలోక సమ్రాడ్వ్రాతమునకు గంతాంతరంబునఁ బట్టినట్టి డెక్కె
దైత్యరాజ్యేందిరా తారుణ్యపరసీమ గజనింబఫలమైన ఘనకుచంబు
గీ. అరయఁ దనయిల్లె పెద్ద దేవాలయముగఁ గోరి నిర్మించికొన్నట్టి గోపురంబు
నలుదెసల నిట్లుగా గూలినన్ సురారి నడుమనే పెద్ద పెద్ద మంటలుగలేచు.

ఉ. శ్రీరఘురామచంద్రు విరచించిన యమ్మెటులేగె భూమిలో
దూరెనా? దూరి గోపుర మధోధరణీస్థితిలోఁ బునాది వి
స్ఫారఁగఁ జేసెనో విడిలునట్లుగ, గోపుర మిట్లు నల్దెసల్
బీరుకొనంగ, సృష్టి విరచించిన బ్రహ్మ యెఱుంగఁగా వలెన్. 252

చ. నలువుగ సప్తతాళదళనంబును వాలివధంబు శైవచా
పలవనమున్ రఘూత్తముని బంధురకార్ముక సత్కళాద్భుతం
బులుగ వచింత్రు, గోపురము ప్రోవుగఁ గూల్చుట వానినెత్తిపై
మొలిచెను, యుద్ధమందుఁ బడిపోవుచు నున్నది లెక్క కెక్కకన్. 253

వ. అనుచుండ రావణుండు పడని గోపురమెత్తు మండుచుఁ గుంభకర్ణుని పుత్త్రులను గుంభ నికుంభులను బలిపించి యిట్లనియె. వారిలోఁ గుంభుడు చాపాయుధుఁడు నికుంభుఁడు పరిఘాయుధుఁడు. తండ్రి ముక్కులో నుండి యూడిపడివాఁడు. 254

శా. మాయాసంగర మంచు వేఱుగఁ దలవం దాతఁ డవ్వీరులున్
మాయాదూరులు చేతిలావు కలిమిన్ బన్నంబు పొందింపవౌ

గా యుద్ధంబున, ఱేనికోస మని కాకన్ వేనికిన్ వెట్టయో
స్వీయం బాతఁడు సేయఁగా వలయు నువ్వే యుద్ధముం దీవ్రమున్. 255

శా. నాకుం దమ్ముఁడు మీకుఁ దండ్రియును నానాదేవతాశౌర్య రే
ఖాకుద్దాలము వానిఁ జంపెనుగదా కాకుత్స్థుఁ డవ్వానిపై
నాకుండన్ వలె, మీకు నుండవలెఁ గంఠవ్యగ్రకోపంబు వే
ఱే కాండీరుల కేలయుండు? మఱి వారేలా చనన్ వారిపై. 256

శా. మీరేతాదృశమైన కోపమును గంభీరోహులై దాచికొం
చౌరా ముజ్జగముల్ హరింపనగు శౌర్యారంభులై యుండియున్
దా రాజై పెదతండ్రియో జనని చేతఃప్రీతికై యాజ్ఞ లే
కా రామున్ వధియింప నేగరుకదయ్యా! శౌర్యధర్మాబ్ధులై. 257

క. పరిఘను దండ్రికి నెక్కువ యిరమ్మదమువోలెఁ దీర్తు వీవు నికుంభా!
సరి పిత పుత్రా దిచ్చే త్వరాజయ మ్మనుచు ననెదువాఁడు కదయ్యా! 258

క. మరియును గార్ముకవిద్యన్ గురువను నే నగుదుఁ గాదె కుంభునకున్ మీ
రిరువురు మాయిద్దఱికిన్ సరియౌదురు పోయిరండు జయముం గొంచున్. 259

వ. అంత వారిర్వురును మసృణఘూసచ్ఛటామహిత మరకతశిలాఘటితాంగుళికులు నుదయత్తరణి కిరణభరణ మాణిక్య కుండలులు, జానుఘటిత వస్త్రపరిస్తు రన్నూపురఘటిత శత్రురూపతిరస్కారి వరభూషణులును చిత్రవిచిత్ర తంత న్యమాన కాంతిసంతాన నిరూపిత గగనకోణ రమణీయ నవరత్నహారులును ఖడ్గత్సరుభూత వైదూర్యసుషమా సమాలింగిత పార్శ్వదేహులును నై రథంబు లెక్కి యుత్తమఖరంబుల ఖురవిదారణంబుల శిలాఘటితరథ్యల మిణుంగురులు రేగఁ దోవచ్చు భీకర రక్షస్సైన్య ఖడ్గప్రాస పరిఘాద్యాయుధ సంఘర్షణంబున జనించు రావంబు భయద యుద్ధసూచిగా నొప్పార శాంతించిన యుద్ధదేవత మఱల లంకా పురంబునఁ దాండవించుచున్నట్లు సైన్యాధ్వప్రదీపకోల్కాసహస్రం బులుగా బయల్దేరిన.

గీ. తండ్రు లార్జించి యుంచిన ధనము రాజ్యమైన తనయుల దగు భూషణాభిలాష యునునహంకారమును దర్పమొక్కతెరువుచనవు నానావికారముల్ సంక్రమించు.

వ. వారితో యూపాక్షుండును శోణితాక్షుండును ప్రజంఘుడును గంపనుఁడు యుద్ధం బునకుఁ జనిరి. 262

మ. పరిఘప్రాస గదాసులం గపులఁ జంపన్ రాక్షసుల్ క్రూరవా
నరులున్ దంతములన్ నఖప్రతతిచే నక్తంచరాళిం గరా
గరి ముక్కుల్ చెవులుం గళంబులును ఆక్కన్ ముక్కలుంజేయ సం
గర మాఖీలము రక్తబంధురముగాగన్ మాఱెనయ్యొ యెడల్. 263

చ. రథులయి దానవుల్ శరపరంపర వానరవీరరాజి ని
ర్మథనము సేయగాఁ గపులు దైత్యుల పైనను బర్వతంబులున్

బృథులకుజంబులం బఱపి వ్రీలఁగఁ జేయఁగ దేహరాజి స్వా
ర్థథురవమేదురంబు బవరంబును వర్షబుతు ప్రచండమై. 264

క. వెనుదిర్గి పాఱు కపితోకను దైత్యుఁడు త్రొక్కి పట్టుఁ గళవళపడఁగా
జనుచున్న దైత్యుజుట్టుం గొని యూపును జెట్టుమీఁద కోతియుఁ బెలుచన్.

క. ముక్కులు చెవులుం బోయిన రక్కసులును దోఁకలెల్ల రాలిన కపులుం
దిక్కులఁ జన యుద్ధేందిర మొక్కలువోయిన ఖరాసివోలిక నొప్పెన్. 266

ఉ. కంపనుఁ డంతటం దనువు కంపర మెత్తినయట్లు సేన జి
ల్లింపుగ ఖడ్గముం గొని వలీముఖసంతతి రాచుచుండ సై
రింపక యంగదుండు విపరీతముకోపము నూని వానిచె
ల్లింపులు సాఁగనీక యదలించిన నాతఁడు కోపమూనుచున్. 267

ఉ. అంగదు వక్షమందునఁ గరాసిని వ్రేయఁగ నంగదుండు క
ప్పం గనుదోయి లిప్తగను బమ్మెరవోయి తెమల్చికొంచు వా
నిం గమకించి పట్టికొని నీల్గినఁ గత్తిని లాగివేసి వా
నిం గదియించి గ్రుద్ది యమునిం గనిపించె నిమేషమందునన్. 268

చ. తన పినతండ్రి నిప్పగిది దైవతనాథునిపౌత్రుఁడున్ హరిం
చినఁ గని శోణితాక్షుఁడును శీఘ్రముగాఁగను వాలిసూను మే
నను నిశితాశుగంబులను నాటిన నంగదుఁ డంగ లొప్ప దై
త్యుని శకటంబుపై నరిగి దూసెడు నమ్ముల లెక్క సేయకన్. 269

గీ. కడుకొని రథాశ్వయుగ్మంబు మెడలు విఱిచి యూవులింపంగ సారథి నణఁగఁద్రొక్కి
పట్టికొని లాగి వానిచాపంబు విఱిచి వాని యురమును దాడించులోన వాఁడు.

క. మింటికి నెగురంగా వెనువెంటం దానరిగి వాఁడు విసరిన కత్తిన్
గెంటుకొని లాగి జందెపు గంటుం బొనరించె వానికాయమునందున్. 271

మధ్యాక్కఱ.
ఈ పగిదిన్ శోణితాక్షుఁ డెంతయు నిఱుకటం బడఁగ
యూపాక్షుఁడుం బ్రజంఘుఁడు మహోగ్రులై యుఱికి సాయమ్ము
దీపింప శోణితాక్షునకు, ద్వివిదుండు వేగ మైందుండు
కోపించి సాయ మంగదునకున్ సమకూడిరి వచ్చి. 272

క. అమ్ముమ్వురు నిమ్ముమ్వురఁ గ్రమ్మిన శౌర్యలసదిందిరాయుగ్మము వే
గమ్మున జడలు పెనంగొన చెమ్మాచెక్కాడినగతిఁ జెలు వొప్పారెన్. 273

వ. ద్వివిదమైందాదులు రువ్విన శిలావృక్షంబులు ప్రజంఘుఁడు ఖడ్గంబుతో యూపా
క్షుండు శరములతో శోణితాక్షుఁడు గదతోఁ దిరిగి తిరిగి వృథా చేయగా నంతఁ
బ్రజంఘుండు తీవ్రఖడ్గంబున నంగదునిపై కుఱికిన నంగదుఁ డశ్వకర్ణద్రుమంబున
వారించి వాని ఖడ్గంబును లాగికొని దానితో వానిశిరంబుఁ ద్రుంచె. పితృవ్యుఁ డీ

రీతి ఘోరాతిమ్మృతినంద యూపాక్షుండు కోపాక్షుండై యమ్ములపొది శరమ్ములు వమ్మగాఁ గత్తిబూని నేలకుఱికినంత ద్వివిదుండు వానియెడందఁ బిడికిలి నడచి బాహాపంజరంబున బిగింప శోణితాక్షుండు గదాగ్రంబున ద్వివిదుఱొమ్ము గాడ నేయ ద్వివిదుండు సొమ్మసిల్లి తెప్పిఱి వానిగద వానిచేతనుండి గుంజుకొనియె, నంత మైందుండు యూపాక్షు వక్షస్థలంబు ముష్టిఘాతంబున బ్రక్కలించిన శోణితాక్ష యూపాక్షులకును మైందద్వివిదులకు నాకర్షణ ప్రకర్షణ ఘోరంబుగా బాహాయుద్ధంబు ప్రవర్తిల్లె. ద్వివిదుడు శోణితాక్షుని మొగమంతయు రక్కి వాని నంధునిజేసి నేలమీఁదం గూల్చి వానిని బ్రాణంబుల నుండి పాపె మఱియు మైందుండు యూపాక్షుని యూపపశువుం బోలె సంహరించిన రాక్ష ససేన భయపలాయమానంబై కుంభునిఁ బోయి యాశ్రయించిన. 274

శా. కుంభుం డంతట గార్ముకోగ్రశరదక్షుండై విజృంభించినన్
శుంభద్బాణజ వాయువీచిఁ గపిరాట్పూరుల్ పరాధూతులై
శుంభద్బాణజవహ్నితప్తిఁ గపిరాట్పూరుల్ పరాభూతులై
గంభీరాహవ మొప్పె వానరచమూకాండమ్ము గగ్గోలుగా. 275

ఉ. వీఁడొక రావణాసురుఁడు విస్తృతకీశచమూ జయేందిరన్
బోఁడిమి దొంగిలించికొని పోయెడు వానరసేన నిస్పృహన్
వాఁడిమగంటిమిం జెడియె వచ్చినదానికి రాముసాయమున్
వేడగ నయ్యెడున్ మఱల వెంటనె ప్రత్యుపకారవాంఛులై. 276

గీ. కుంభకర్ణుని తనయుకున్ ధనుస్సునకును సంబంధ మేమి యనంగ నద్ది
కపుల ప్రాణంబులకు శరకాండమునకుఁ గలుగు సంబంధ మన్నట్లు కానిపించె.

ఉ. సంజను నిన్న రావణియు సర్వవలీముఖసేనఁ జంపఁగా
నంజనిపుత్త్రకుండు కరుణాంబుధియై బ్రదికించెఁ దెల్లవా
రం జనువేళ నేఁ డితఁడు రాక్షసుఁడై మఱలన్ వధించెఁ దా
నంజిక యొక్క రోజు కొసరైనది యాబ్రదు కెంత చిత్రమో. 278

మ. ద్వివిదున్ మూర్ఛనుబుచ్చి మైందునిధరిత్రిన్ వ్రాల్చఁగా నంగదుం
డవురా చూచుచు మాతులద్వయము పాటాభీలుఁడై కుంభునిం
గవియన్ గుంభుఁడు వానిగూడ బటువౌ కాండంబులం గూల్చ దా
నవులుచ్చై ర్నినదంబులం గెలుపుకంఠంబుల్ దువాళింపఁగన్. 279

ఉ. అంగదుఁ డట్టులౌట కపు లందఱి కచ్చెరువైన వార్త వా
రంగద వేగి రామునకు నంగదువార్తను జెప్ప రాముఁడుం
జెంగటి జాంబవంతుని సుషేణునిఁ గుంభుని దాఁకఁ బొమ్మనెన్
సంగరమందు నేగిరి వెసం గరమందుఁ గపీంద్రు లుగ్రులై. 280

ఉ. వచ్చిన వానరేంద్రులను వారణచేసెను గుంభుఁ డంతటన్
విచ్చిన నారసంబులను బెట్టిన గ్రొడఁగ జేసి వారు తా

మెచ్చుట నుండి రచ్చటనె యించుకయుం గదలంగ నీక వా
రచ్చటులోఁగ్రవిక్రమము నారసి రిచ్చవడంగ గుండెలన్. 281

మ. అది సుగ్రీవుఁడు చూచి వీనికరమం దత్యుగ్రమౌ చాప ము
న్నది యీ కార్ముక మున్నదాఁక నితఁడైనంగాదు సాధ్యుండటం
చెద నూహించి తదీయమౌ శరచయం బింతైన లెక్కింప కు
న్మదవృత్తిం జని వానిదౌ రథముపైన న్నిల్చి తీవ్రాకృతిన్. 282

వ. వానిధనుస్సు వానిచేతినుండిలాగికొని ఫెళ్ళునవిఱిచి యిట్లనియె. 283

ఉ. రావణుఁ డీవపో! శరపరంపర యీగతి విడ్చు చాడ్పునన్
నీవుగఁ గుంభకర్ణుడవు నిర్భరమైన భుజాబలంబునం
గావలమైన యీ కపులకాండము నీవిలుముంద రాగునే?
యీ వొకరుండె యీత్రిజగ మెత్తిన నొత్తెద వొక్కమూలకున్. 284

మ. అనినం గుంభుఁడు తీవ్రకోపమున బాహాశౌర్య మేపారఁ బె
ల్చిన సుగ్రీవునిగుండెపైఁ జఱచినన్ సౌర్యుండు కోపంబు మం
కెనగాఁ గంటి తుదం ఘటించి ధర లంఘించెన్ మఱిన్ వానితో
డన, తామొక్కరి నొక్కరున్ వదలకుండన్ జెట్టులోఁజెట్టుగా. 285

వ. అంత సుగ్రీవుడు వానిని విదలించి దూరంబు త్రోపి మఱలఁ బట్టుకొని చేతులలో నెత్తి విసరి సముద్రంబునందుఁ బడునట్లు వేయగా నతఁడు మఱల నెగరివచ్చిన సూర్యసుతుండు వానింబడఁద్రోచి వక్షస్థలం బెక్కి కంఠంబు నులిమి నిష్ప్రాణుంజేసిన నికుంభుం డిదియంతయు దూరము నుండి చూచి యుగ్రుఁడై తన మహాపరిఘను గగనసీమ మ్రోఁగించుచు నాడించుచు సింహానాదంబు సేయుచు వచ్చుచుండిన. 286

మధ్యాక్కఱలు.

మువ్వలు గంటలు గగనముం జీల్చి మ్రోసెడు పరిఘ
దవ్వుననుండి కూడ యమదండంబు దండించు పరిఘ
నవ్వి యింద్రుని శతారంబు నాట్యంబునం బేర్చు పరిఘ
క్రువ్విన బొడుపులఁ బ్రాణకూటముల్ కుదిలించు పరిఘ. 287

వరగ నాకసమును మ్రింగు వరిణాహపటువైన పరిఘ
పరగ రక్షోయశ స్స్వాలయు సందులు సంధించు పరిఘ
అరిరాజవక్షస్థిచయము నగలించి యార్చెడు పరిఘ
యురవుగాఁ గొని తురాసాట్టు నెడద పేదెత్తించు పరిఘ. 288

మొగిని గన్నంతలోఁ బ్రాణములు నాగిపోయెడు పరిఘ
దిగిభదంతముల మొదళ్ళు తెమలించి తీర్చిన పరిఘ
యగలించి తన తండ్రి పరిఘ యదిలెక్కయా యనుపరిఘ
దిగుదితకీర్తిప్రభాళి తెలుపులు దిద్దిన పరిఘ 289

మ. కృతమయ్యెం గపిరాజు నాయు వది సుగ్రీవుండు చచ్చెం గపీ
ట్త్రతి నిర్మూలనమందె నంచుఁ గపిరాడ్వ్రాతంబు ఘోషింపఁగా
నతమై వాయుపథంబు తత్పరిఘ ఘంటానాదసంతానసం
ప్లుతమై యేడ్చినయట్టి రావములఁ గల్లోలంబుగా నైనచో. 290

గీ. జయజయనినాదమేదురాశాభరంబు దితిజసంతానఘోషముల్ దిశ లగల్ప
నొక్కడుగు రెండునడుగులమొక్కలీఁడుపోయి సుగ్రీవునిందాఁకఁబోవుచుండ. 291

ఉ. ఎచ్చటి నుండి కీశపరమేశ్వరమూర్తి నభస్వదాత్మజుం
డచ్చట దూఁకెనో, పరిఘ కాతనివక్షము లక్ష్యమయ్యె దా
విచ్చెను ముక్కముక్కలయి వ్రీలెను, మారుతియున్ నికుంభునిన్
ముచ్చిలిగుంట నొక్కికొని పోవఁగ తర్జను లుగ్రవైఖరిన్
ద్రచ్చిన నాముగుంట నరుదారఁగ బొట్టనవ్రేళ్ళు నొక్కగా. 292

గీ. మెడ పిసికి ప్రాణములు తూలఁ బుడమిఁగూల్చి
గుండెపైఁ గాలుమోపి మిక్కుటముగాఁగ
శిరసు కుడిచేత మెలికలు తిరుగఁ ద్రిప్పి
పాటితంబైన శిరసును బాఱవిసరి. 293

మదరేఖ.
సింహధ్వానము చేసెన్ రంహస్ఫూర్తిగ మింటన్
రంహోయానము వైతేయాంహో వ్రాతము బాసెన్. 294

వ. అంత రావణుండు తన యిరువది చేతులకుఁ బదితలలకుఁ జారితార్థ్యంబు కలి
గినట్లు తలలువూని యుస్సురని దుఃఖించి యయ్యో! తమ్ముడా కుంభకర్ణ!
నిన్నుఁ జంపికొన్నది చాలక నీ బిడ్డలఁ గూడఁ జంపికొంటి ననియేడ్చియేడ్చి.

గీ. పరమయోగీశ్వరుండును బరమభక్తుఁడైన యాంజనేయునకుఁ గ్రౌర్యం బిదేల
యెచట వానరవాహిని కిరకటమగు నచటఁ బ్రత్యక్షమగు నీతఁ డయ్యొ యనుచు.

చ. వెడలినవారు రాముపయి వెంటనె పోవక దారిమధ్య నీ
బుడిబుడి కోఁతులం దెదురుపోవుదు రేటికొ! నాకు రాము నా
త్తిడియయి త్రాఁడొ పేఁడొ యది తేల్చరు, మూర్ఖులు శూరులంచు జీ
వుఁడు వడు సంశయంబు విడిపోవదు సర్వనిదానదూరమై. 297

గీ. అతని భార్యను నేనుగా నపహరించి వాసి లోఁకువతనమును జేసికొంటి
నతఁడు నాకంటె నధికుఁడైనట్టు లాడె నతని యధికత నా చేసినట్టి తప్పు

మ. తనకంటెన్ రఘురామచంద్రు నధికత్వం బేమి విర్విద్యలో
ఘనబాహాబల మందుఁ జెప్పనెడ నా కైలాసముం బూనుకం
టెను జ్యేష్ఠుండగునేమి? గోపురముపాంటెన్ జ్యేష్ఠుఁడన్పించెడిన్
ధనువం దుండిన నేర్పు కావలె భుజాదర్పంబు మా కేటికిన్. 299

క. నావలె నతనికి లోఁకువ భావము గనకుండఁ గోపభావము కలిమిన్
దావిలు నేర్పున మిక్కిలి నావలె నైనట్టిఁడై చనన్ వలె మఱియున్. 300

ఉ. అంతక కల్పుఁడైన మకరాక్షుఁడు కార్ముకవిద్యయందు నా
యంతటివాఁడు శిష్యుఁడగు నాతని కన్నియు నేర్పినాఁడ వాఁ
డెంతయు రామునందున వహించును గోపముఁ దండ్రిఁ జంపె నం
చింతటి వాఁడు తండ్రిపగ, యెత్తిన నాపగ రెండుతీర్చెడున్.

గీ. ఖరునిఁజంపి యెన్నాళ్ళయ్యె ఖరుఁడు వీఁడు నతనిపగ యింతకునుదీర్పనైతినేను
తండ్రిపగయును మఱిపెదతండ్రిపగయు రెండుతీర్చున యీబిడ్డదండిమగఁడు.

ఉ. తమ్మును బిల్చి యిట్లు పెదతండ్రియుఁ దండ్రిపగన్ హరింపు మం
చు న్నెఱిఁ జెప్పగా నెదురు చూచెడు నమ్మకరాక్షుఁ డర్ణవం
బెన్నడు దాఁటి లంకపయి నెత్తెనొ రాముఁడు నాటినుండియుం
గన్నులయందు నిద్ర చెడి కార్ముకముం గనుచుండు నెంతయున్. 303

శా. నొవ్వంజేసెను ముజ్జగంబు దశకంఠుం డేడులోకంబులన్
నొవ్వం జేయఁగ జాలు దానొకడు తానున్ లంకలో నుండె వాఁ
డెవ్వాడో తన తండ్రియైన ఖరునిన్ హింసింప రాముండు వాఁ
డెవ్వాడో మఱి తేర్చిపెట్టు నొక యమ్మే యీ పగంటన్ మఱిన్. 304

క. తన విలువిద్దియ యేమో తనకే యచ్చెరువు గొలుపు, దశరథసుతుచే
సిన జగముమెచ్చుపనులకు మనమున నవ్వికొనుఁ బ్రజకు మతిపోయినదో. 305

ద్విపద.

చనుచుండఁ బెక్కు దుశ్శకునంబు లయ్యెఁ దనకుఁ దండ్రికిఁ బోలెఁదానెఱుంగండు
తనతండ్రి కేరీతిఁ దగిలెనో యవ్వి తనకు నదేరీతిఁ తగుల బోయెడును. 306

జలదము.

భీకరగర్దభారుణము పెద్దమొగిల్ ప్రాకటశోణితోదకము వర్షము ద
ర్వీకరపుచ్ఛధారముగ హృద్భయ బాధాకరఘోరమై కురిసె నచ్చెరువై. 307

విమానము.

అమేఘ మాకాశమందున్ గమించి విద్యుత్తు పొందెన్
సమేత ముల్కాప్రపాతం బమేయమై పొల్చె నెల్లన్. 308

వ. అంత ఱెక్కతోఁగొట్టిన గ్రద్ధ బాహుదండంబునం బెడద్రోచి సీదరించి మకరాక్షుం
డిట్లనియె. 309

క. ఎవఁడో యల్పిష్టునకు నశివమో శివమో మఱేను శీఘ్రసముద్య
న్నవశితశర నవసితశర దవిరత హరిణాంక నవనవాంశుకమూర్తిన్. 310

వ. అంత మకరాక్షుండు శ్రీరామచంద్రుని కెదురునడచి యిట్లనియె. 311

క. నే నెవ్వరనో యెఱుఁగుదె నేను ఖరాసురుని సుతుఁడ, నే నపుడు జన
స్థానమున లేకయుంటిని నే నుండిన నిచట నేఁడు నీవుండవునున్. 312

ఉ. అయన యూహలున్ మఱియు నాయనవే, నను దండకంబు రా
నీయఁగ లే దెదో పదకమెత్తెను, దొంగిలికొంచు వచ్చె నీఁ
తోయజపత్రలోచనను, దోయధి దాఁటితి వచ్చినావు నీ
కీ యెడ బ్రహ్మవ్రాసెఁ గద మృత్యువు నాదగు చేతిలోపలన్. 313

శా. మత్తెక్కించెను నీ కహో ప్రజలవౌ మాటల్, మహాధన్వి వీఁ
డెత్తెన్ శైవధనుస్సు, వంకరలుగా నేడైనతాళ్ళెసె, నా
యెత్తా వాలినిఁ గోలనేసెనని యింకేమున్న దేనే ధను
ర్భృత్తన్వ్రించును నీయెడల్ తెలియలేదే! నీకుఁ గాకుత్స్థుఁడా! 314

ఆ. వానికొడుకు లంకలోన ధనుర్విద్య వింటికొప్పు తాఁకు విద్య నేర్చు
మఱియు వాఁడు వచ్చు మనపైని నేమౌ నటంచుఁ దెలియలేని యధమమతివి.

ఉ. నించిన శౌర్యమై నిలుము నీదగు రక్తముచేత నట్టక
ట్టించెద లంకనేల, ప్రకటీకృతచాపకళుల్ సురారు ల
గ్గించగ నంపచేటఁ జెఱిగించెద నీదు పరాక్రమంబు, జ
ల్లించెద నీదు శౌర్యము శిలీముఖనిర్మితమైన జల్లెడన్. 316

వ. అంత నవ్వుచు శ్రీరామచంద్రుం డిట్లనియె. 317

చ. ఖరుఁడన నాకుఁగల్గె మమకార మొకానొకఁ డంతరంబునన్
ఖరుని సుతుండు నీ వనుచుఁ గార్ముకముం గొని నేన వచ్చితిన్
వెఱలగు దానవాళిని గపిప్రభులం దెవఁడో వధించు, ని
న్నరయగ నిట్లె పంపుఁడని యాజ్ఞ యొసంగితి వానరాళికిన్. 318

చ. తొలుతను గుల్మముల్ మఱియుఁ దోడనె సారథి తోడబండియున్
విలు విఱుతున్ ద్వదీయకులవీరులు శూలము గొంచు వత్తు రా
వల నలశూలమున్ విఱుతు వారలు వత్తురు మల్ల యుద్ధకౌ
శలులయి యగ్నిబాణమునఁ జంపుదు నిన్నును నట్లె చంపుదున్. 319

వ. అంత మకరాక్షమరణశ్రవణ సంజాతదుఃఖ దుఃఖితుండైన రావణుండు. 320

గీ. చదువుచెప్పి కొడుకు శౌర్యవారాశిని జేసిపెట్టు మనుచుఁ జిన్న యమ్మ
కొడుకు ఖరుఁడు పంచెఁ గూలద్రోసితిని వారాశియందు దైత్యరాజ ననుచు.

ఉ. ప్రోదిగ బుద్ధియై గురువు పోలిక శిష్యుఁడ వౌచు సంశయ
చ్ఛేదము చేసినావు గుణిశేఖర! యో మకరాక్ష! వీఁడు దా
మోదరుఁ డంచుఁ, గాని యొకపోలిక సంశయలేశ మొప్పు, నా
గాదిలి పిన్నతల్లిదగు కార్ముకవిద్య యటంచు నెంచెదన్. 322

క. ఒక్కొక్కవిద్య యందున నొక్కొక్కప్రదేశమందు నొక్కొకవిధమై
మిక్కిలితనములు కలుగును జిక్కనితలఁపులు మనస్సు చిగిరించినటుల్. 323

వ. అనుచు మహాదుఃఖసాగరంబుననున్న తండ్రినెఱింగి యింద్రజిత్తు తండ్రిని దర్శింప వచ్చి మౌనంబునఁ గూర్చుండ రావణుం డింతయేడ్చి యిట్లనియె. 324

క. కనిపింతువా కనిపింపవా! తనరంగా మాయయో యథార్థంబో! రా
మునిఁ జంపగలిగెదేన్ రామునిఁ జంపుము నా కదొకఁడె ముఖ్యమ్ముసుతా!

ఉ. వేనికి గోటిమీఁద పని వెక్కసపాటును బొంద వేలుపుల్
తేని నొసంట రక్తపుఝరిన్ బిరుదై యుబికింప, వానికిన్
మానవు నొక్కనిం బిలుకుమార్చుట యెంతటి, దీవుగాని వై
శ్వానరుఁ డందు మాటికిని, వానికి వీనినిఁ గ్రిందుచేయుమీ. 326

గీ. అనిమఱల దుఃఖముంద్రవ్వ నసురరాజు నొగిని మేఘనాదుం డటనుండిజారి
తండ్రి కీ రీతి నైనఁ జేతఃప్రియంబు నాచరించుటకును నిశ్చయంబుచేసె. 327

చ. తనబలమందె నమ్మకము ధారణి నెవ్వనికైన, శత్రువౌ
జనుని బలం బెఱుంగుటకుఁ జాలఁడు, తక్కువసేయుదాని, నీ
జనులను రెండుసార్లుగను జంపితి, నేగతి లేచివచ్చి రీ
మనుజులు! వీరివైన మహిమల్ మది బర్వఁగ గోచరించెడున్. 328

ఉ. చచ్చిరటంచు నెంచుటకుఁ జాలదు, ప్రొద్దును నింగి దవ్వనన్
వచ్చినయంతఁ జాపములు వారును సిద్ధము, వారిమాట పో
నిచ్చిన నిన్నికోట్ల కపు లేగతి లేచి రిదేమి మాయయో?
పొచ్చెమునాదుమాయ యయిపోయిన దచ్చటిమాయ యెట్టిదో? 329

క. బ్రదికిన బ్రదుకఁగ వచ్చున మదస్త్రసంతానమహిమ మరణింపక త
ప్పదుకాదె! యిప్పటికిఁ జూచెద వారిరహస్య మేమొ చిత్తమునందున్. 330

గీ. అని తలంచికొంచు యజ్ఞభూమికి నేగి హోమ మాచరించె హుతవహోగ్ర
కుండమందు నగ్నికూలంకషంబుగాఁ బ్రజ్వలించె నాజ్యభావితుండు. 331

ఉ. ప్రవ్వలువూని యెఱ్ఱతలపాగలు తాలిచి రాక్షసాంగనల్
మువ్వురువచ్చి శస్త్రము లమోఘములున్ శరపత్రకంబులన్
ద్రవ్వి విభీతకాత్తసమిధల్ నవవస్త్రము లప్పనంబుగా
నవ్వల నివ్వల న్నిలిచి రంజలిబద్ధ కరాంబుజాతలై. 332

మ. సమిధల్ దర్భలు నూత్నవస్త్రములునున్ సంస్తీర్యమాణంబులై
యమరన్ వహ్నిని వేల్చె దానవుఁడు సప్రాణంబు ఛాగంబుఁ గృ
ష్ణము వహ్నిప్రియ మాహరించెఁ బరితోజ్వాలాగ్రధూమంబు కే
శములై యొప్పు హుతాశనుండు సముదంచి త్సుప్రసన్నుండుగా. 333

గీ. దక్షిణావర్త శిఖుఁడు హుతాశనుండు స్వయముగా వచ్చి హాటకసన్నిభాంగుఁ
డయి హవిస్సునుస్వయముగానందుకొనియె నరుణభుజగఫణాభ హస్తాంబుజముల.

మ. అన్నృతంబున్ బుతమైన యట్టుల నదృశ్యంబౌ రథంబున్ ధను
స్సును గుఱ్ఱంబులు కేతనం బొసఁగ తేజోరూపమై యుండియున్
కనరాకన్ దశకంఠసూనుఁడు, దిదృక్షాతీవ్రులై చూడఁ బా
సిన కీశేశులవైన యక్షులకు నక్షిత్వంబు లేనట్టులన్. 335

చ. వినఁబడుచుండె నాగక నవీకృతసంతతధారగా రథ
స్వనమును జాపఘోషమును వాజిచతుష్టయ హేషలున్ వినూ
తనకశవిశ్లథస్వనము దర్పసముజ్జ్వలహాసమున్ దమం
తన పరిదీప్తమైన శ్రవణంబులకున్ శ్రవణత్వ మొప్పగన్. 336

ఉ. ఆతని వాడియంపగమి యగ్నికణంబులఁ గొట్టినట్లు ప్ర
స్ఫీతము లౌచుఁ దాఁకినవి వ్రీలక యచ్చట నంటుకొన్నటుల్
చేతము సొమ్మసిల్లగను జేయుచు నూరక మండెడున్ వృథా
నూతనశక్తి యొప్పెడు తనూత్వమునందుఁ దనూత్వ మొప్పగన్. 337

గీ. అతని రథనేమినిస్వనం బదిగొ యంచు సూటిగా మింటిలోనికిఁ జొచ్చినట్టి
కీశవీరులు మిన్నుఁ గౌఁగిఁటనుబట్టి యచట దూరాగతముల శరాళి వ్రస్సి.

ఉ. చచ్చిరి మొన్నఁ బ్రాణములు సంగతమయ్యెను నిన్న, నేఁడహో
చచ్చుచునుండిరిన్ మఱలఁ, జర్వితచర్వణమైన యట్టులం
జచ్చుటయున్ సజీవతయు సౌఖ్యమొ దుఃఖమొ వానరాళికిన్
వచ్చిన పోవుచున్న వగు ప్రాణములయ్యెను వానరాళికిన్. 339

ఉ. రాజితమూర్తులై యెసఁగు రాముఁడు తమ్ముఁడు పూఁచు కింశుక
క్ష్మాజము లట్లుగాఁ గనను జాలని లక్ష్యము గాఁగనై వృథా
భ్రాజితకోపవృత్తులయి భాస్వరరక్తమనోహరార్ద్రనీ
రేజము లట్లుగాఁ దనర దృష్టులు మిన్ననఁ జూచుచుండఁగా. 340

చ. కడువడి రామలక్ష్మణులు కట్టిన చిక్కని యంపపందిరిన్
నడుమను సందుచేసికొని నారసముల్ చనుదెంచు, నొక్క క
న్నడని సురారి బాణముల పందిరిలోనఁ జరించునొక్కొ! బి
ట్టొడలులయందు వ్రస్సిన రఘూద్వహు లించుక యెంచజాలకన్. 341

ఉ. మైథిలిఁ బాసి మిక్కిలి నమాయకుఁడై చను రాముఁడట్లు మా
యాధనుఁడైన యింద్రజి శరాహతి డయ్యుట న్యాయమే, ప్రభుం
డై ధరిణీకుమారిక హృదంతరమందున విస్మరింపనౌ
బాధ ప్రమాణముం దెలిసి బాణములేయుటయొప్పు వానికిన్. 342

ఉ. దానవరాజపుత్రశరతాడిత దేహులు నిస్పృహాయులై
వానరవీరు లెల్ల రఘువల్లభు చుట్టును జేరి యుండఁగాఁ

గోనల కన్నులం దెరువుకూడిన లక్ష్మణుం డన్నం గాంచి యీ
దానవవంశ మెల్లను విధాతశరంబున సంహరింతునాన్. 343

ఉ. రాముండు నవ్వి యిట్లనియె, రాక్షసుం డల్పుండు వీండు నీ శర
గ్రామమునుముందు నిల్చుటకుం గల్గునె? యొక్కండు వీనికోసమై
యేమి సమస్తరాక్షసవధేచ్ఛ? మఱంతగ నీకుం గోపమై
ప్రామిన, వీని నేనుగ శరాంతమునందు వధింతు లక్ష్మణా! 344

శా. ముల్లోకంబుల మేఘనాదుం డితం డేమూలన్ మహాభూతసం
పల్లీనుండయి యున్నయప్పటికిం జంపన్ నిశ్చయం బూనితిన్
వెల్గౌ సీతనిమాయ సం దొకటి కన్పింపంగం దద్దేహమున్
డొల్లంజేసెద చించి చీల్చంగను గండుంగోంతు లాపిండమున్. 345

వ. అని శ్రీరామచంద్రుండు ప్రతిజ్ఞావ్యగ్రుండై యున్నంత. 346

చ. చిటికియుం గూడ బూరటిలు చేవ యదెట్టులు గల్గె! రాఘవ
ద్వితయమునందు నంచు, మతితీవ్రత పాయని మేఘనాదుడున్
బ్రతినిముసంబు రాఘవుల బంధురదీపితచిత్తవృత్తులన్
మతిం గనుగొంచు రాఘవుని మాటలు వించును గంచు నర్థమున్. 347

ఉ. దానవరాజసూనుని హృదంతరమందునం గల్గె భీతి, వై
శ్వానరమూర్తి చల్లబడి చాక్షుషవీథిం దగెన్, దదుగ్రవై
శ్వానరమూర్తి రాఘవుని బాణముఖంబునం దోచె నంత, నం
హోనతమాయ బీట్లు పడుచున్నటులం గనిపించె బుద్ధికిన్. 348

మ. తనతోడం జనుదెంచినట్టి దనుజుల్ తానేగినన్ వానరేం
ద్రనఖాపీడన దంతఘట్టన విరక్తప్రాణులైపోదు, రే
గనిచో నగ్ని యుపాస్యదైవమె విరక్తంబౌ గతిం దోచనా
యెను, భీతాత్ముండు దైత్యుండుం దిరిగిపోయెన్ దొడ్డిదారింబడిన్. 349

మధ్యాక్కఱలు.

తిరిగిపోయిన యింద్రజిత్తు దితిజుల స్థితిగూర్చి తలంచి
సరయంబుగా వారికేదొ సాయంబు సమకూర్చ నెంచి
మఱియు వైశ్వానరు నధికమహిమంబు మాటయు వేఱ
తెరువున నవుగాములందుం దిరముగాం దేల్చుకో నెంచి. 350

సౌమిత్రి యన్నట్టి మాట చాల యాశ్చర్యంబు గూర్చె
హోమంబు సేయంగ నగ్నిహోత్రుం డాహూతుం డైరాండు
నే మాదిరిగను బ్రహ్మాస్త్ర మేయ దైత్యేంద్రువంశంబు
శ్రీమించగా నంత సంహరించు, వారించు నగ్రజుండు. 351

ఉ. అతఁడు నన్ వధింతు నని యాడెను నన్వధియింపరాక ప్ర
స్ఫీతము నొక్క హోమమును జేసెద నేను నికుంభిలాఖ్యమున్
ధాతల కెల్ల ధాతయును దాని ప్రతిక్రియ చేయలేఁడ, ప్ర
ద్యోతితమూర్తినై వెలయుచుందును నే నపు డప్రధృష్యుఁడై. 352

మధ్యాక్కఅ.
అది రెండు మూన్నాళ్ళు పట్టునట్టి క్లిష్టాచారనియమ
మది యాచరించుచుండగ నల్ప మభ్యంతర మైనఁ
బొదలకుండగఁ జూడవలయుఁ బూన్కికిఁ బొదల సర్వాశ
మొదలంటఁ దెగిపోవ యత్నమున్ మాని మొద్దులైయుంద్రు. 353

ఆ. అంత మేఘనాదుఁ డరదంబు నడుమను సీత దుఃఖమూర్తి చెలువు మిగుల
నాహవంబునందు నవతరించెను వాఁడు కనులు పెద్దవిచ్చి కపులుచూడ. 354

వ. అంగారకగ్రహపీడితయైన రోహిణింబలె దుష్టజనహస్తగతయైన స్మృతింబోలె విహ
తయైన శ్రద్ధంబోలె సోపసర్గయైన సిద్ధింబలె నపవాదలగ్నయైన కీర్తివలెఁ బ్రతి
పద్విద్యవలె సంస్కారహీనయై యర్థాంతరగతయైన వాణినిబోలె స్వరవిహీనయై
నిష్ఫలయైన వేదవిద్యవోలె నసత్పురుషదత్తయై సుజనాపకారిణియైన యధికార
రేఖయుం బోలె నీచభాషాక్లిశ్యమానావస్థయై జగన్మైత్ర్యైక మార్గోపదేశరహిత
యైన దేవభాషయుంబోలెఁ బరలోక భావనా పరిత్యక్తయైన సంఘవ్యవస్థబోలెఁ
గలిసమాశ్రితయైన ధర్మదేవతం బోలె నతని యరదంబున నున్న సీతంగాంచి
మారుతి ప్రముఖ వానరేశ్వరులు నివ్వెఱవోగా నింద్రజితిట్లనియె. 355

సీ. లంకాదహనకార్య శంకారహితధుర్య మహితులారా! మదోన్మత్తులార!
కైంకర్యభావనిశ్శంకదూషిత సంగరాగతులార! దురాత్ములార!
యేకారణంబున నేగుదెంచితిరో మీ రే కారణంబున నిచటు వదల
రా కారణంబు నాయరదంబునందునఁ గూరుచున్నది చూచికొనుఁడు కనుల
గీ. నామె వధియించెదను గనులారఁ గనుఁడు ఈ త్వదీయమహాకార్య మెల్ల బూది
లోనఁ బోసిన పన్నీరుగా నమోఘ కార్ముకులు మీదారల్ బిట్టుగాఁగ నేడ్వ.

గీ. ఎంతచేసిననైన మీరిచటి నుండి వెడలిపోయెదునట్లు కన్పించలేదు
తిరిగి పోదురో కడలిలో దిగుదురో మఱింతలోఁ బీడ వదలిపోయెడిని మాకు.

ఉ. ద్రాక్షములైన కాయగసురుల్ తిను జంతువులైన కోఁతులున్
రాక్షసరాజధానిపయి రాముఁడు నాఁగఁ గిరాతు నొక్కనిన్
దక్షుఁడటంచు ముందునిడి దండుగ వచ్చిరి చిత్ర మీ కురం
గేక్షణ సీత నేను వధియింపగఁ జూడఁగ వచ్చి రబ్రమున్. 358

ఉ. వచ్చినసేనయో ఎలుఁగుబంట్లును గోతులు కొండముచ్చులున్
వచ్చెనుగాదు తోడేలులు పందులు నక్కలు నైనఁ గూడ రా

వచ్చును గొప్పసేనఁ గొనివచ్చెను రాముఁడు గొప్పసభ్యులం
దెచ్చెను నేను జానకి వధించెదు రూపకదర్శనార్థమై. 359

వ. అంత నిలువున నీరై క్రుంగిపోయిన మారుతి. 360

గీ. ఓరి బహుమహోకల్ప మహోరుయుగనిరంతర మహాఘసంతాన మట్టికట్టి
యిట్టు లైనట్టి వాఁడ! నీకెట్టు లయ్యె వశుఁడు కృతవేదియైన వైశ్వానరుండు.

ఉ. స్త్రీవధముం బొనర్తువటె! స్త్రీజనతారమణీయముగ్ధచూ
డావిలసన్మణిన్ మనుగడన్ సయిరింతువు సాధు రేఖమున్
నీ విలయోహమున్ మఱియు నీవును దానవజాతిజన్మకుం
దావలమౌ నఘంబునకుఁ దా దలముట్టిన దంచుఁ జెప్పనౌ. 362

గీ. దుష్టుఁడా! దురాత్మ! దుర్నీతివారాశి! చటులబుద్ధి! పాలసా! నృశంస!
సకలపాపభావసంజాత! దానవ ధూర్తసర్వవంశధూమకేతు! 363

మ. అనుచుండం గపివాహినీతతి క్రుధాహంకారరోషధ్వనుల్
మినుముట్టన్ దితిజేంద్రపుత్రుకునిఁ గ్రమ్మెన్ మేఘనాదుండునుం
ధనువుం జేకొని దూదిపింజలుగఁ దత్సైన్యంబు దూరాలకుం
జనగాఁ దూల్చెను వ్రాల్చె వ్రీల్చెను ధనుశ్చండక్రియానైపుణిన్. 364

మ. త్రపయున్ మాలిన యింద్రజిత్తు కడఁకన్ ధాత్రీతనూజాత జం
దెపుదెబ్బన్ నిశితాసి వాలుగను ఖండించెన్ గపీశాను ల
ప్రపుదుష్కృత్యము జూచుచున్ హృదయవారాశ్యున్నమద్బాడబుల్
స్నపితాక్షుల్ శిలలట్లు నిల్చిరి కృతాంతర్వహ్నిదగ్ధానముల్. 365

వ. జాంబవ త్సుషేణ నల నీలాంగ దాంజనేయులు నిలుచున్నవారు నిలుచున్నట్లు కూలిపోయి కత్తివేసిన మొగమున నెత్తురుచుక్క లేనట్లుండ, వికృతహాసాననుండై యింద్రజిత్తు రథంబు మఱల్చుకొనిపోవ వారు చదికిలబడి పెద్దకాలంబు తలలు చేతులంబూని యుండి, యీ వార్త శ్రీరామచంద్రునకుఁ దెలియంజేయవ లయు నని స్మృతి యుదయించి నెమ్మదిగా నేగి ప్రభువు నెదుట దుఃఖా కృతులై నిలచి గొంతులు పెగుల్చుకొని యర్ధోక్తులతో నంతయు విన్నవించిన.

క. విన్నాఁడో లేదో రాముఁడు విన్నట్టుల మొగము కానిపించదు మఱికం
చున్నాఁడో లేదో పతి కంచున్నట్టుల కంటి వెలుఁగు లొప్పకయుండెన్. 367

సీ. అంజనీసుతుఁడు హస్తాంజలిగుప్త ముఖారుణాంభోజుఁడై యట్లెయుండ
సూర్యతనూజుండు శూన్యదృష్టులతోడఁ గడలిపై గగనంబు గాంచుచుండ
నంగదుండును దృష్టు లవనిపై హనుమపై రామచంద్రునిపై మఱల్చుచుండ
కపిచమూనాథు లుత్కటలోచనాంతులై ప్రాణమ్ములుండి లేనట్లు తిరుగ

గీ. నొగిని సౌమిత్రియునునిష్క్రియుం డగుచును రామచంద్రునిపాదనీరజమునందుఁ
గూరుచుండిబాష్పహిమంబుగురియుచుండఁ గాలపురుషుండకాలత్వఘటనమంద.

ఉ. వచ్చి విభీషణుండు రఘువానరవీరులఁ జూచి కారణం
బిచ్చ నెఱుంగనేర కట నెవ్వనినో కపివీరు గాంచుచున్
వెచ్చని యూరుపై పెడగఁబిర్చి సమస్త మెఱింగి వార్తలన్
విచ్చిన మోముగాఁగ రఘువీరులఁ గాంచుచు నిట్లుగా ననెన్. 369

శా. సీతాదేవిని మేఘనాదుడు వధించె న్నాగ నమ్మంగ రా
దా తండ్రిన్ దనయుండెఱుంగు నతఁడేలా యొప్పికోల్తెచ్చు! భూ
జాతన్ బంక్తిగళుండు గొంతున నభస్వద్వీచి యాడంగ నా
రీతిం జేయఁగ నొప్పికోఁడిది మృషావృత్తాంత మెల్లెంచినన్. 370

ఉ. ఆతనియొద్ద దుర్గుణము లన్యము లొక్కసహస్ర ముండినన్
నాతివధంబుసేయు టనినన్ దశకంఠుఁడు సేయఁ డెప్పుడున్
నీతివిదుండు శౌర్యరసనీరధి వేదమహార్థవేత్త, కా
మాతురుఁడన్న దొక్కటియె, యంగనఁ జంపెడు నంత చెట్టయే? 371

గీ. మాయ యన్నమాట మారుపేర్వానికి మేఘనాదునకు మహోఘమతికి
స్వీయమాయ యెట్లు చెల్లింపనౌ నది యొక్క యూహ మేది యుండదెపుడు.

క. అనెడు విభీషణు మాటలు వినుచుండియుఁ గూడఁ గీశవీరులు వినరున్
గనులారఁ గనినయట్టిది వెనుకను విననట్టిమాట విద్ధపఱచునే? 373

చ. మరల విభీషణుం డనియె మాటలు నాయవి మీరు నమ్మఁబో
వరు, మఱి నమ్మ కే మొనరుపం దలఁపూనెద రిట్లయుండి య
బ్బురముగి నిండ్లకుం దిరిగిపోదురొ, క్రుద్ధులు లంకనెల్లఁ గా
ల్తురొ యటు కాల్పనెంచినను దోరముగా నిటులున్న నానాకో? 374

చ. క్రతువు నికుంభిలాఖ్యము దురాత్ముఁడు వాఁ డొనరింప నేగెఁ, ద
త్క్రతువు సమాప్తమైన యెడఁ గల్గదు వానిని గెల్చు టన్న దా
క్రతువును భంగపుచ్చవలెఁ గార్ముకభగ్నుని వానిఁ జేయఁగా
మతి గలదేని నెయ్యదియు మానక వెంటనె సేయఁగావలెన్ 375

క. అది పూర్తియైన వానిం గదలింపఁగ లేదు శార్ఙ్గకార్ముకుఁ డైనం
గదలుఁడు దుఃఖింపంగా నొదవిన కాలంబు యుగము లున్నవి భావిన్. 376

చ. ఒక వటవృక్షమున్నది మహోన్నత, మచ్చట వాని హోమశా
ల కలదు చుట్టునన్ దనుజులం బెనుగాపుగ నుంచి, వాని య
జ్ఞకృతిని వేగ భంగపఱచన్ వలె, లేనియెడన్ సమస్తమై
నకపులు నేట తేపట పునర్మృతిఁ గాంచుట తప్ప దింతయున్. 377

గీ. హనుమ యెఱుఁగు నశోకంబు నచటి కరిగి చూడవచ్చును మీ భావశుద్ధి కొఱకు
నటులఁబావనియేగుత మిటులమేము లక్ష్మణస్వామియు నికుంభిలకుఁజనుదుము.

గీ. అంతనంగదుఁడనియెన యతఁడెచెప్పె నద్దిరూపకమంచు మఱామె యనియె
నీమెయనుటకుఁ, బదఁడయ్య యింద్రజిత్తువధపొనర్చును లక్ష్మణస్వామి యనుచు.

క. అనినన్ సప్రశ్రయులై వనచరులును రాఘవులును వనరుట మానం
గను లక్ష్మణుండు తోడన ధనువుంగొని బయలుదేరె దానవువధకై. 380

చ. అచట విభీషణుం డనియె నా కపిసేనలతోడ లక్ష్మణుం
డు చనిన చాలదవ్వఁ గడుం గగనంబున నల్లికొన్న చె
ట్టుచివర లావరించిన యటుల్ పొలుపొందిన మేఘమాల దై
త్యచమువు, కావు మేఘములు, తత్తరువే వటవృక్షరాజమున్. 381

శా. చెట్టుం జేరగ రానియట్లు దితిజశ్రేణిన్ మహావ్యూహముం
గట్టెన్, గట్టిన వ్యూహ మీవు విఱువంగాఁ దట్టుకోలేక వాఁ
డెట్టుల్ వచ్చును యుద్ధమాడ నది యంతే, వేల్మి భంగమ్మునా
నొట్టుం బెట్టినయట్లు వాఁడవుడు వధ్యుండౌను ముమ్మాటికిన్. 382

ఉ. వాఁడు తపంబు చేసికొనె బ్రహ్మశిరంబు నికుంభిలాస్త్రమున్
నేఁడు మఱిన్ రఘూద్వహుఁడు నీవును గెల్వగలేరు పూర్తిగాఁ
బోడిమి వేల్పగాఁబడినఁ, బూరుషయత్నము భంగ పుచ్చుమీ!
వాఁడెఱుగండు కాల మనువాఁ డనలాధికుఁ డన్న యర్థమున్. 383

శా. అంతన్ మారుతి భీమవిక్రముడు దైత్యవ్యూహముం బట్టి పా
దాంతంబందు నఖాంతమందున ముఖాంతంబందునన్ భ్రూధవ్రు
క్రాంతంబందున వేలువందలుగఁ బ్రాణాంతంబు సేయన్ ద్వరా
వంతుల్ దానవు లేగి గొల్లు మని యేడ్వన్ వాఁడు కోపంబునన్. 384

మ. ధనువుం గైకొని చైత్యమున్ విడి వియత్సంకర్షణున్ మారుతిం
గని వీఁడొక్కఁడు సర్వదానవమహాకాలుండు వీనిన్ వధిం
చిననే గాని ప్రశాంతి లేద యనుచుం జిత్తంబునం దెంచి యే
సెను బ్రాసంబులు బాణముద్గరములున్ శీఘ్రంబులౌ హేతులున్. 385

క. విఘటిత సర్వాయుధుఁడై యఘమతి యింద్రజి తలంచె నతని వధంబున్
మఘవ జయముఁగన్న మనః ప్రఘూణమున వాయుసూతివధముఁ దలంచెన్.

చ. అతని పరాక్రమించు విధ మద్ది యెఱుంగు విభీషణుండు, మా
రుతిని వధింప నెంచెడు దురూహుఁడు వీఁడని చెప్పె లక్ష్మణున్
శితశరజాలతాడితుని చిత్తము నీదెసకున్ మఱల్చు మా
నతముగ నన్న, లక్ష్మణుని నారసముల్ విహరించె నాదెసన్. 387

మ. తన కన్పించని మింటియుద్ధమున నేతద్బాణ సంతానమం
దున నొక్కండు స్వదేహరక్తమున యందుం దోఁగి ధాత్రింబడెన్
గనఁ దాదృక్షరముల్ పరంపరగఁ రాఁగాఁ దాళఁగాలేక, పా
వనిదిక్కున్ విడి యేగి, లక్ష్మణునితో పా టక్షులన్ విప్పుచున్. 388

ఉ. చూచి విభీషణున్ మనసు చూఁడినయట్లయి యెట్టిచోటునం
దోఁచితి! నాకు సర్వమును దోచిన దివ్వాడు నీవులేక నా
యీ చయనంపుచో టెఱుఁగు టెట్లగు వీరికి? నిన్నుఁగాని యీ
హో చిననాన్నయం చనిన నందము చందము విద్వదగ్రణీ! 389

ఉ. చాలి స్వవంశదూషకు నసాధువు నెత్తురు త్రావఁబోదు వే
గోలము కుక్క నెత్తురును గ్రోలు, స్వపక్షము వీడినట్టిదిన్
జాలక మా రహస్యములు శత్రులకున్ వచియించుచుంటి కా
కోలము క్షీరసాగరనిగూఢము, సిగ్గని లేదు దానికిన్. 390

క. వీరులఁ జేరితి, చత్తురు వీరులు, బ్రదికెదరు వారు వీర్బ్రతికింపన్
వీరులు చంపెద రరులను వారి రహస్యములు చెప్పువా రుండంగన్. 391

చ. అనిన విభీషణుం డనియె నన్నవి నీవు యథార్థముల్బలెన్
దనరును లౌకికంబుగను దత్పరమార్థము వేఱయుండు, నీ
జనకుఁడు సీతఁ దెచ్చిన దసజ్జనకృత్యము నీవు కాదటం
చనినదిలేదె? పోయి యిది యాడితె? యెప్పుడుగాని తండ్రితో. 392

క. అనినను నీమెడ పిసుకును, నను నాఁడగ బయలుదేరినాఁడవు మఱియున్
మనవంశము క్షీరోదధి మనయెదలు తిమింగలములు మకరఝషములున్ 393

క. మృతుని బ్రతికించు, నెవ్వఁడు? మృతుఁడవు నీవగుదు నేఁడు నెవ్వఁడు నిన్నున్
బ్రతికించుఁ, జచ్చె నెవ్వఁడొ బ్రతికించె నెవండొ యనుట పామరనఘ సుమీ!

క. అతని రహస్యమ్మును నీ పితకుం జెప్పితి నతండు వినఁడాయెను, జె
ప్పితి మీరహస్య మతనికి నతఁడు వినుచునుండె, దోసమది నాయదియే? 395

ఉ. చెప్పిన విందురే జనులు! చెప్పిన విందువా నీవు చూతు నే
నిప్పుడు, చెప్పుటల్ వినుట లెవ్వఁడు చేయును, బ్రహ్మచేసినం
జొప్పడు, నగ్ని వేల్చి రిపుసూదన మస్త్రము తెత్తునంటి నీ
వప్పని యేమియైనయది? యగ్ని క్రియాఫలదాతమాత్రమే. 396

క. క్రియజరుగవలయు నగ్నియుఁబ్రియపడుటకు, జరుగనెవఁడు ప్రియపడవలయున్
స్మయచిత్తులకుం దెలియదు క్రియారహస్యము మహోఘకృతినిపుణులకున్. 397

ఉ. వీరులొ కారొ రాఘవులు వేల్చిన మాయ ఘటించుచున్ శరా

మీరిటనుండి రిద్దఱును మేకొనఁజాలవు మాయ స్వామియున్
నేరఁడు వీరతాగుణము నిగ్గును దేల్చికొనంగఁ జూడుమీ! 398

వ. అంతమఱిం బరస్పరవధైషులు, బద్ధమనస్కులు, రథ మారుతిభుజా సమారూఢులు, నరరాక్షసవీరులు నొకరి నొక రెదురుకొని, యింద్రజిద్వ్యూహనిశిత నారాచ పరివిద్ధుడు లక్ష్మణుండుగా నెగడిన సౌమిత్రి చాలకాలము శరములను స్వీకరించుటయె కాని తిరిగి ప్రయోగించుటలేకయుండ, నింద్రజి యతని నిరాదరణమునకుఁ గుపితుఁడై తీవ్రతరము లమ్ములు చిమ్మ సుమిత్రానందనుండైదు బాణంబుల నతనిఁ దాడింప నవి యరుతుందములై రావణి భయభ్రాంతుండై మొగంబున దైన్యంబు నిరూపింప, విభీషణుండు సౌమిత్రితో నతని తక్కువతనంబు వచించె. నంత సౌమిత్రి యెంత సేపటికిఁ బరిసర శిలా వృక్షచ్ఛేదనంబు చేయుచు శత్రురథసామీప్యంబు వారించుచు బహుకాలంబుచేసి యస్తమయవేళ నతని సారథిని ద్రుంచి యశ్వంబుల సంహరించి రథంబును నుగ్గుచేసి యతనిని విరథుం జేసె. 399

మధ్యాక్కఱ.
అసురశక్తివివృద్ధికరము యామిని యామనివోలె
యసురరాట్సుతు మేనఁ జివురుటాకుల యరుణిమఁ దెచ్చె
మసలి పశ్చాద్గమనంబు మసలిన మ్రాఁడిఁ గాలంబు
శిశిరమై యాతని మేనిచివురు వంచించి యాకార్చె. 400

వ. పరమవిచిత్రచంక్రమణ భాస్వరవేగుఁడైన హనుమ కెదురురథంబు లేని తన నిస్సహాయత భావించి, రాత్రి చీఁకట్లుమఱుగునఁ దనలేమిఁ గప్పిపుచ్చుఁడని యసురసైన్యంబుతోఁ జెప్పి మేఘనాదుండు పురప్రవేశంబుచేసి, యొకరాత్రివేళకు సరథాశ్వసూతుండై కనిపించిన దైతేయవీరుగాంచి సుమిత్రానందవర్ధనాదు లాశ్చర్యపడి, యతని యెలయింపు బవరంపు నెలయింపులు సాగియు సాగకుండ యుద్ధంబు సాగింప. 401

మధ్యాక్కఱ.
వైవస్వంతబైన వెలుఁగు ప్రాగ్దిశాభాగంబునందు
సౌవర్ణరేఖతోఁ బొలిచె సౌమిత్రి శాంతాస్యమందు
భావించె మేఘనాదుండు బవర మీఁ బటువయ్యు నితఁడు
నూవుగింజంతైన యేల నూల్కొని నొవ్వఁడటంచు. 402

వ. అరదంబులేక పట్టుతప్పినట్లైన రావణుపట్టికి సిగ్గుపుట్టునట్లు సౌమిత్రి హనుమబుజంబు డిగ్గి యుద్ధమాడుచు, మేఘనాదుని మోఘనాదునిఁ జేయుచు విజృంభింప, నతండు తన సైన్యంబు సౌమిత్రిం దాఁకునట్లు చేయ, మారుతియు నంగదుండును విభీషణుండు నాసైన్యంబునెదురుకొని యద్దివాభాగము నంతయుఁ గపిరక్షస్సైన్యముల పెనంకువలతో బీభత్సంబై యింద్రజి సౌమిత్రిని డాయుచు డయ్యుచు చేరుచు, సారహీనుండగుచు, నడుమ నడుమ మారుతి విజృంభణంబుల నరికట్టుచు విభీషణునను చరులైన రాక్షసులఁ బోల్చికొనలేని తన

రక్షస్సైన్యంబు దిగ్భ్రాంతి వాపుకొనుచు నెడనెడ నిడియించుచున్న రాము తమ్మోని యమ్ములకు నాసారంధ్రమ్ములఁ గ్రమ్మి నెత్తురులు చిమ్మికొంచు మఱల సౌమిత్రి నలయించుచు నాగర్భశ్రీమంతుఁడై పరాజయ మెఱుంగక విరథుండగుట యెఱుంగక నిత్య మాయాసమాశ్రితుఁడై నేల మీఁద నున్న మహావీరులపై నమ్ములేయు వింటికోణంబు లలవాటులేక. 403

మధ్యాక్కఱ.

చీకట్లు తూర్పుది క్కురలి చెలఁగ పశ్చిమదిక్కు చేరి
చౌకట్లుగా వ్రేలుచుండి చదలున జలధరాభములు
రాకాసిసేనకు బలము రంజిల్ల రాత్రి జృంభించె
నాకాశతారకల్ భయము నందినయట్టు లల్లాడ. 404

వ. అంత రక్కసిమూఁకలయిక్కలును మఘవారియరదంబు నిరవును గనిపింప మాటిమాటికి సౌమిత్రి వెలయించు నాగ్నేయ బాణంబులతో, మరణించు కపిరక్ష స్సైనికులయాక్రందనములతో, జితులవలెఁ గన్పించు చిట్టిపొదలతోఁ, బిశాచాక్రం దనములవోని భయభీతహయహేషలతోఁ, గాలుచున్న శవముల నెగఁద్రోయు వాసముల సవ్వడివోని యాయుధములధ్వనులతో, నా యుద్ధభూమి రుద్ర భూమివలె నైన. 405

మధ్యాక్కఱ.

సౌమిత్రి వినికృత్త బహురసారుహ శైలమౌ నచట
నే మడ్డమై లేకయ యుదయించిన యినబింబమందు
సౌమిత్రిశిరమైన, నింద్రశత్రు లోచనయుగ్మమునకు
భూమికి దిగివచ్చె నినుఁడు మోహనమూర్తి యన్పింప. 406

వ. మఱియు యుద్ధంబు తుములంబై దినంబు గడచి యింద్రజిత్తు పరాక్రమించి విభీషణు నైదు బాణంబుల హరియూథంబు బహుపృషత్కంబుల వ్యధింప, రామా నుజుండు కోపంబున నతని రథాశ్వంబుల సంహరించె. హతాశ్వుం డింద్రజిత్తు యమదత్తంబైన యొక మహాస్త్రంబు పినతండ్రిపై నేయ సౌమిత్రి దానినిఁ దనకుఁ గుబేరుండు స్వప్నమందుఁ బ్రసాదించిన యస్త్రంబుతో నివారించె. వ్యర్థాస్త్రుండై రావణి విభీషణునిపై శక్తిం బ్రయోగింప లక్ష్మణుండు దానినిఁ బదియమ్ములతో వమ్ముచేసి వారుణంబుఁ బ్రయోగించిన నింద్రజిత్తు రౌద్రంబు ననుసంధించె. ఈ రెండస్త్రంబులాకాశంబున నొండొంటిఁ దాఁకి రెండును విఱిగిన, రావణి మహాకోపంబున నాగ్నేయంబు నిగిడించిన సౌమిత్రి సౌరంబు సంధింప నాగ్నేయంబు వ్యర్థంబుకా, మేఘనాదుండు మహాద్భుతమైన యాసు రంబుప్రయోగించిన నదిశతకోటి సూర్యసంకాశంబై యనంతములగు ప్రాసము ద్గరాభీలంబుగ వచ్చుచుండ సౌమిత్రి మాహేశ్వరంబుఁ బ్రయోగింప నాకాశంబు పగిలి భూతంబులు వ్రయ్యగా సర్వదేవతాఋషులు నరుదెంచి విస్మయాకులితు లగుచుండ నవి రెండును బెనఁగి పెనంగి యుపశమిల్ల, లక్ష్మణుండు క్రోధావే శంబున నెద్దాని మున్నింద్రుండు దేవాసుర యుద్ధంబునఁ బ్రయోగించె, నెద్ది

హుతాశనసమస్పర్శమో, యెద్ది దురావారమో, యెద్ది శరీరాంతకంబో, దాని
నైంద్రంబును దేవసంఘ సమర్చితంబు నస్త్రశ్రేష్ఠంబును ధనుశ్శ్రేష్ఠంబున నర
శ్రేష్ఠుం డనుసంధించి "దాశరథియైన రాముండు ధర్మాత్ముండు సత్యసంధుండు
పౌరుషంబున నప్రతిద్వంద్వుండు నయ్యేనేని నిది రావణివధంబు సేయుగాత"
మని వదలిన నది యింద్రజిచ్ఛిరంబు శ్రీమంతంబు జ్వలితకుండలంబు సశిర
స్త్రాణంబు తెగనఱికిన నతనిశిరస్సు భూమిమీదంబడియె. 407

మధ్యాక్కఱ.

అన్నిశీథమునందు నంత యసురసంహారంబు జరిగె
నన్నది తెలిసిన యంత నఖిలదైత్యశ్రేణి జలధిఁ
జన్నది తెలియక యుగ్రశైలాగ్రసంపాత మన్న
దెన్నక భయమునఁ జచ్చి రిట్లని యెఱుగక చావు. 408

తూరుపుదెస నబ్జహితు నెదుట గెల్పుతోఁ దూగు తమ్ము
శ్రీరాఘవుఁడు పొంగి కనులు చెలువారఁ జెన్నారఁగాంచి
హేరాళముగ నర్ఘ్యమిచ్చి యినదేవు నెఱువులు విఱచి
యారఁ జికిత్స చేయించి యనుజు గాయమ్ములు మాన్పె. 409

ఉ. ఎప్పటివోలెఁ దూర్పుదెసనే యుదయించెను సూర్యుఁ డేగతిం
జొప్పడు నింద్రజేత యగు సూనుని నొక్కఁడు చంపె మానవుం
డిప్పలు కెట్లు నమ్మఁదగు నిందఱు మంత్రులు మాటి కందఱుం
జెప్పఁగ నమ్మకున్కి యిది చిత్తము స్థైర్యము తప్పినట్లగున్. 410

శా. అయ్యయ్యో! దశకంఠ! ముజ్జగమునం దాజ్ఞాప్రభావాపగల్
కయ్యల్ కోయుట దానిదై చను భుజాగర్వంబుకా రామ! నీ
వొయ్య న్నేర్చిన మాయకుం బరిధిలేదో! శల్యమార్గానుసం
ధాయ్యౌషధ్యతిశాయితామహిమ సానాధ్యాతిగాధ్యాయమై. 411

శా. నన్ను న్మత్తునిఁ జేయుచుంటివి సుమా, నా తప్పు లేదింక, నే
నిన్నేమన్నను దోసముండదు సుమీ, నిన్మార్చి యేమైన నే
నున్నిక్కమ్ముగఁ జేయవచ్చును సుమీ, నూల్కొన్న శత్రుత్వము
న్నన్నిన్వోలెఁ గుజంబుబోద మిగిలెన్నా నిట్లు ఛేదింతురే. 412

శా. అమ్మారీచుఁడు మున్నె చెప్పెఁగద దైత్యక్ష్మామహేశాన! యా
తమ్ముం డుండఁగ రాము నోర్వనగునే? తానై యసాధ్యమ్ము సా
ధ్యమ్ముం జేసెడువాఁడు, చూచెదవుగాఁ దద్వైరయాత్రాస్థితిన్
నమ్మంజాలవటంచు, నమ్మెదనయా! నమ్మంగరా కెట్టులా. 413

శా. తానేఁడో పదమూఁడగున్ సమలు నిద్రాహారముల్ లేనివాఁ
డైనంగాని వధింపలేఁడనిరి యాహా! వాఁడు వీఁడా? మరు
త్సూనుండొక్కఁడు వీఁడొకండు రఘునాథుం దమ్ముఁడై బంటునై
కానంజొచ్చిరి లంకఁజొచ్చిరి పరాకాష్ఠామతిక్రూరులై. 414

చ. అతఁడుకిరాతుఁడం చెఱిఁగి యాతనివద్దకుఁ బంపితిం జుమీ
సుతులను వహ్నిరూపముగఁ జొచ్చుక వచ్చుచు నున్న మృత్యుదే
వతఁ గని భీతి దప్పికొని బాలుర నందఱఁ బేరఁ బేరనా
హాతి యిడినట్లు, లజ్జయని యున్నదె రావణుఁ డన్నవానికిన్. 415

శా. ఇంకం దా నతఁడేమి సేయఁగలఁడో నే సేయఁగాఁగల్గుదున్
శంకాదూరముగాఁగఁ జేయుదు సహస్రంబైనయేడుల్ నిరా
తంకంబౌ తపమాచరించి తుది క్షత్రవ్యాధుఁడౌ వీనిబా
ణాంకంబందున వాఁడు లేడియయి, నేనా కాక యిట్లౌదుమే. 416

వ. అని రావణుండు కోపవివశుండయి నిశ్చయించి. 417

ఖం డాం త ము

గీ. ఇంద్రజిత్ఖండ మిద్ది మహేంద్రనీల కాంతికలితోరుమంజుల కంఠదేశ!
శ్రోతమైన ముక్త్యాల ధరాతలేశు వెండికొండపైఁ బదిలించివెట్టు మభవ! 418

చ. నిను మదినెంచుకొంచు శయనించినఁ గట్టియమేను నాది కా
దనియును నుండె లేదయనియున్ దలపించెడు నట్లుగాఁగఁ జే
సినయది చేఁతయా! స్మరణచేసెడు చిత్తము నిత్యమౌనె? నా
కను లనినట్టిచోటఁ గలుగన్వలె నీ వెలుఁగింత మత్ప్రభూ! 419

శిఖరిణి.

పురస్తా దాగచ్ఛద్ధవళ సుషమాభోగ దివిష
త్పరీవాహోర్వ్యాధః ప్రసరణ యుగీభావ సువహో!
ధరాభృత్కన్యోద్య త్కనకరశనా తర్జనభయ
ప్రరోహద్హాసశ్రీ ధవళిత దిశాభాగనివహో! 420

# నిస్సంశయ ఖండము

క. శ్రీ మంత్రాది ప్రాప్యా! కోమలపరమాణుభావ గుంఫితతను! నా
నామంత్రానభిగమ్య ప్రామాణ్యమహోంబురాశి! ప్రభు! విశ్వేశా!

సీ. మాణిక్యకాంతి కుగ్రాణంబు లైనట్టి కుండలద్వయము చెక్కుల జలింప
గాణిక్యవిద్య మాగాణంబుగా నైన రుద్రాక్షమాల పేరురముఁ గలఁచ
వాణీవిలాసనిద్రాణంబుగా నున్న వదనాంతమునను గోపమ్ము విరియ
రీణాప్రభావపారీణంబులై యున్న లోచనంబులు రక్తమాచమింప
గీ. నా నఖశిఖంబు కంపిత మైన మేన జానకీదేవి యెదుట సాక్షాత్కరించె
రావణుండు దైవతజగ ద్రావణుండు రావణుండు మానుషజగ ద్రావణుండు. 2

ఉ. అతని ఫాలభాగమున యందున నౌష్ణ్యము క్రక్కుచున్న ప్ర
స్ఫీత విషోన్నమ ద్భుజగభీషణదంష్ట్రలువోని యూర్ధ్వరే
ఖాతత రక్తవర్ణ పరికల్పిత వహ్నిశిఖాద్వయంబు లో
కాతిభయంకరంబుగ దృశాతివిదారక మౌచుఁ గన్పడెన్. 3

ఉ. అతని నేత్రయుగ్మమునయందునఁ గన్పడె మృత్యుదేవతా
దూత సమస్తజీవులకుఁ దోచెడు వాఁడు గమించువేళ, శ
య్యాతల పార్శ్వభాగమునయందు నిలంబడి యున్నయట్లుగాఁ
జేతము నిర్వృతిం బడఁగ సీతకు నాగతిఁ దోచె దైత్యుఁడున్. 4

చ. అరయగ నేకచిత్తత ముఖాంత దృశాంతములందుఁ దీవ్రమై
పరగు కటారికానివలె వచ్చెను బూర్వము నన్నుఁ జంప వే
గిరపడు లక్షణంబదియుఁ గేవలనాటకమై కనంబడెన్
దిరమయి యొప్పుచున్న యొకతీవ్రత క్రూరముగాఁగఁ దోచెడిన్. 5

చ. మునుపటి తీరు వే ఱిపుడు పూర్తిగ స్వీయము సర్వశక్తి చా
లని దని నిశ్చయించి యిక లాభము లేదనుమాట తేలిపో
యిన సకలాశలున్ మఱలి యేమియుఁ జేయగలేని వట్టిదు
ర్జనతయుఁ గ్రూరభావమును సాహస మొప్పెడు వీనియందునన్. 6

చ. పలుకు వెగల్చరాని దగు ప్రాణము పట్టినపట్టుతోడ నీ
వెలలినయట్టి వీనిదగు వెట్ట ననున్ మఱి సంహరించు దో
హలత నెసంగు నాదయిన ప్రాణము నేటికి సంశయంబునం
బొలసెడు నాహవస్థలిని బుట్టిన దెట్టివిశేష మయ్యెనో. 7

చ. తొలుతను కామినీ పరివృతుం డయి వచ్చెడు వాఁడు నన్నద
మ్ముల వధియించి యున్నయెడఁ బొల్చెడి యుబ్బది వేఱురీతిగాఁ
బొలిచెడు రాముఁడున్ సకలపుత్త్రిల బంధుల సంహరింపగాఁ
దెలివి సమస్త మొక్కట గతించిన వైఖరిగోచరించెడున్. 8

ఉ. మారుతియున్ బుజంబుపయి మన్ననఁ గైకొనిపోవఁ దెప్పఁగా
నేరిచితిన్ రఘూత్తముని నీతిని నాతివధంబు సేయనౌ
క్రూరత లేదె వీని కనుకొంటిని దాదృశమైన క్రూరతన్
నేరిపె వీని కే దొసఁగొ, నేరగ నయ్యెద యుద్ధవార్తలన్. 9

ఉ. వచ్చుచునే విదల్చి కరవాలము కుత్తుక ప్రీల్చవచ్చు నీ
యుచ్చటిరాఁక దైవ మెలయించెను జాగును జేయు మృత్యువుం
దెచ్చునొ యింతలో ననుమతించని మృత్యువు దవ్వుసాగునో
యుచ్చట నిల్చియుండె నితఁ డెత్తనికత్తిగ వహ్నిమూర్తియై. 10

క. ఆరాజు లల్లె యుండఁగ నీ రక్కసి నన్నుఁ జంపు నేమో యకటా!
ఆరాజులు మరణించిన నీరక్కసి నన్నుఁ జంపఁడేమో యకటా! 11

మ. అనుకొంచుండ సుపార్శ్వుఁ డన్న సచివుం డా దేవతారాతితో
ననె వాచ్యంబుగ, జేయరాని యది భగ్నాలాన మైరావణం
బును బిట్టార్చుచు భీతిగన్న నయనంబుల్ దిక్కులార్పన్ బలా
యనసూత్రంబు పఠింపఁ జేయుటయె గంగావిగ్నకూలంబులన్. 12

ఉ. దక్షత వెండికొండ భుజదర్పమునం బయికెత్తఁ బర్వతా
ధ్యక్షునికూఁతు వాహనము దందడిగా గిరి డిగ్గివచ్చి యే
యక్షులఁ గాంచి భీతిమెయి యాత్మబిలంబున యందుఁ డాఁగెనా
యక్షులయం దయోగ్యమయినట్టి తలంపుల కాంతు లొప్పనే? 13

ఉ. పక్షిశతారివాహనుఁడు భామిని భాగ్యముపట్టి పుండరీ
కాక్షుఁ డటన్న కీర్తిగనె నయ్యయొ రావణుఁ డన్ననో భుజా
దక్షతఁ బౌరుషోజ్జ్వలపథంబున నిచ్చలు నొప్పఁ బుండరీ
కాక్షతఁ దాదృశంబులగు నక్షుల క్షుద్రతరాంశు లొప్పనే. 14

శా. ధుర్యంబౌచు జగత్స్థితి ప్రకటహేతుత్వంబు దీపిల్ల ధీ
కార్యత్రయ్యనువాకశబ్దగత సంఖ్యానిర్ణయప్రక్రియా
పర్యాలోకనదక్షమైన నయన ప్రాగల్భ్యసుశ్రీకి సౌ
దర్యం బంచును జెప్పనైనదియె యేతద్భావనాకాంతియున్. 15

చ. మఱియు నిరాకరించినను మానిని దుర్గుణవంతుఁడైనచో
నెఱియు నెడంద ద్వేషము వహించును, సజ్జనుఁడైనచో నిరా
దరణము చేయ దెప్పుడును దామరసేక్షణ పొందకున్న నా
దరమతి గౌరవించుటయు దాని కదే యగు వాంఛనీయమై. 16

వ. అనినంత రావణుండు చేతిలోనున్న కత్తి నొరయందుఁ జొనిపి వెనుదిరిగి
పోయి పరిశిష్ట మంత్రిసేనాపతుల రావించి సభఁదీర్చి సుపార్శ్వువంకఁ జూచిన
సుపార్శ్వుండు లేచి నిలుచుండి యిట్లనియె. 17

మ. మనమే రాక్షసజాతి, యింత కెగువై మాయావి యన్నట్లుగాఁ
గనిపించున్ నరుఁ డెత్తివచ్చి మన లంకారాక్షసక్ష్మా పయిన్
దన యిందాఁక పొనర్చినట్టి పనులే తార్కాణమై పొల్చుఁ జ
చ్చినవా రెచ్చటనైన లేచెదరె? లేచెన్ వానరశ్రేణియే. 18

మ. జ్వలదాకారులునున్ జగత్త్రితయగర్జామేఘనాదుల్ సుతుల్
బలకుంభీనసచక్రవర్తులగు నాభ్రాతన్ యదాభీలవృ
త్తుల ము న్నిల్వఁగలే రహో దిగధినాథుల్, వారలొక్కొక్కరున్
విలయం బందుట మాయకాకయ భుజావీర్యం బనం జెల్లునే? 19

ఉ. అందఱి మాటయున్ వదలి యా మకరాక్షుని యంత ధన్వి యీ
సుందరుఁ డంచుఁ జెప్పినను సొంపవు మాటగునే, పురంబునన్
మందరపర్వతం బనిన మాద్రి విమానము చాపవిద్యయం
చందుమె, యయ్యొ యెత్తుపడి వావువిధంబునఁ గుప్పకూలఁగా. 20

మ. బయటన్ వారునునారి మ్రోసెదరు భూపాలుండు లోగుండియున్
బయలై దుఃఖభరంబు మోసెడి, రణప్రాలంబయౌ లక్ష్మి య
గ్రియవృత్తిన్ మఱి యెప్పుడే దెసకు లంఘించున్ శివుండైన వి
స్మయచిత్తుం డెఱుఁగంగరానియవి రక్షస్సైన్యరక్షావిధుల్. 21

ఉ. నేనును సిద్ధమై యిచట నిల్చిన దైత్యచమూమహాపతుల్
దానవచక్రవర్తి ముదలం దననోట వచింపలేని దుః
ఖానతమూర్తియై యెసఁగు నాతని యుప్పను దిన్న దానికిన్
ధీనిధులార! యీ ఋణముఁ దీర్చుట జన్మము చారితార్థ్యమౌ. 22

సీ. కీర్త్యంబునిధి త్రిలోకీజేత రావణు రాజ్యంబులోని వారన్న గొప్ప
మన మేపనిం జేసినను సాగునన్నట్టి ధార్ష్ట్యబుతోడిది దర్పగరిమ
యమరావతీపట్టణము చూఱగొన్న సంపద పంచికొన్న సౌభాగ్యమహిమ
మనమే దశాస్యుల మనుకొను నంతటి గుండెలలోపలి దండితనము
గీ. దితిజపతి సాహసాదార్యదీప్తి వలన వేయియేండ్లుగాఁగ ననుభవించినాము
యిపుడు సమయంబు వచ్చిన దీ ఋణంబు వడ్డితోఁ దీర్చవలయునవ్వారిగాఁగ.

గీ. అక్కటా! మేనశక్తి యున్నంతవఱకుఁ బూని తనయది రక్షించుకోను వలయు
చూచుచుండగృహాళిఁగాల్చుటెయుజరిగె సుదతిజనులయీలువులుప్రీల్చుటయె మిగిలె.

చ. అతిశయ బాహుగర్వమున నాహవమాడుచునుందు మింతలో
దితిజమహేశ్వరుండు చనుదెంచును వచ్చిన యంతలోన నా
మతకరిమానవుండు తనమాయ సమస్తము డుల్చికొంచు ని
ష్కృతిఁ గనినట్లు యుద్ధమున గింజలు రాల్చినకంకెయైచనన్. 24

సీ. పదివేలరథములు పదియునెన్మిదివేల ద్విపములు పదునాల్గువేల గుఱ్ఱ
ములు మఱిరెండు లక్షల పదాతులు నైన సైన్యమువారు తత్సైన్యపతులు

గుఱ్ఱాలు నారాచకోటులు ద్విపములు పక్షవదంజన పర్వతములు
నశనిగర్జాప్రపాతాభీలమూర్తులు రథములు రథులు సారథులు హరులు

గీ. వారు పాదాతులే కారు, వారు పులులు నాఁగ, దోడేళ్ళు కపి గొఱనాసిగండ్లు
నాఁగఁజెప్పంగఁదగిన జనంబు, చంపి పీకికొని తింటయేగాని వేఱెఱుఁగరు. 25

చ. మొదలింటి సైన్యమంతయును మూలబలం బది యొక్కొకండు నొ
క్క దెసను గోయుచుండగ నొకంటను స్వీయము నెత్రు తావు న
ట్టిది, యొక చండశిక్షణకు టెంకె, మనస్సున నూహయన్న సం
పదయని లేక జంతుగుణమాత్రము శిష్టముగాఁగ నైనదిన్. 26

గీ. కూడి యొక్క యొక్క గుంపుగా నేర్పాటు గుంపునకును నాయకుం డొకండు
నాయకుండె వారి నాథుండు రావణుం డొక్కఁడుండె ననుటయును నెఱుఁగరు.

చ. తినుటయుఁ గామభావపరితృప్తియు నాయకు సేయు సంజ్ఞపైఁ
దినుటకుఁగాను జంపుటయుఁ, దెచ్చిన నాల్గవయూహ లేని యా
దనుజులు రెండు లక్షలను దాదృశమౌ గజవాజియూథమున్
మనుజులు వానరుల్ మఱియు క్ష్మాగతజంతువు లెట్టులోర్చనౌ. 28

మ. అతనిం జంపెదు, చంపులోన భవదీయంబైన దేహంబులో
నతమై మాంసపుగూడు చేసికొని తిన్నన్ వాఁడు నీకేదియౌ
గతి? యాబొక్కనుబూడ్చికో నెఱచిముక్కన్ వేఱయంటించుకో
మతి సేయన్‌వలయున్, విదల్చికొన బ్రహ్మల్ చాలరా వాహినిన్. 29

ఉ. చచ్చినవారు క్రిందబడి చచ్చుచు నుందురు, చావనట్టివా
రిచ్చటనంచు లేరు, తను వెచ్చట నందిన నచ్చటే మఱిం
బెచ్చును దీసి నీయొడలఁ బేర్చిన మాంసము తించునుందు, రా
త్రచ్చెడు నట్టితీ రెలుకత్రవ్వుట, పీకుట రేచుకుక్కలై. 30

చ. మరియును బూర్వదానవుల మాదిరి వారలె వీరటంచు వా
నరపతులన్ ధరారుహసనాథధరాధరపాళిఁ జంపుచుం
బరిఘలఁ బట్టిసంబులను బ్రాసములన్ గదలన్ ఖరాసి తో
మరముల ముద్గరంబులను మానక దానవపాళి చంపుచున్. 31

గీ. రాక్షసులు లక్షలే వానరవ్రజంబు కోట్లుగా నొటఁ జేసి యొక్కొకని నొక్క
వందమందిగా వేయిగాఁ బట్టికొంచు సంహరింతురు సమదదోశ్చండు లగుచు.32

ఉ. మూఁగిన వందమందియును ముష్టినిపాతములన్ నఖంబులం
దాగరమీఁదఁ బెట్టి యొకదానవు సాగఁగ గొట్టులోపలన్
మూఁగయి చచ్చులోపలను ముప్పురినైనను గోఁతులన్ బుభు
క్షాగతి వాఁడు నస్థులును చర్మము మాత్రముగా మిగుల్చఁగన్. 33

ఉ. ఒక్కనిచేతిలోఁ బరిఘయో గదయో యసియో ధరం బడం
జిక్కని శౌర్యరేఖ విరచించిన వానరుఁ డొక్కఁ డంతలో

రక్కెసపట్టు పట్టికొని రాక్షసుఁ డాతని మేనియందునన్
బొక్కను జేసి మాంసమును భోజనముం బొనరించుచుండగా. 34

క. ఎలుకలు త్రవ్విన గాదెల వలె నయ్యెం గీశసేన వానరులును దై
త్యులుకడఁ జని తినఁబడెదరు ఫలములు తఱిగికొని తిన్న వడువున నయ్యెన్.

గీ. వాజిసైన్యంబు ఝుఁఝుగా వచ్చుచుండ నుగ్గగుచునుండెఁ గపిసేన మొగ్గుటకును
మిగులుటకు వీలులేకుండ మింటియందు నాశ్వికుల ఖడ్గనిచయకుడ్యములు కలవు.

క. దంతంబులు తుండంబులు కృంతనయై యేన్గుపిండు బృంహితములు లే
కింతటఁ గబంధములుగా వింతగ దొరలెడు శిలాళివిధమున రేఁగున్. 37

క. రథములు చక్రభ్రమణోత్పథమునఁ జరియించు వారి బాణచయంబుల్
పృథుతర తాళద్రు స్ఫూర్జథు రావాభీలముగను సంహరించున్. 38

చ. కదుకొని చావు చచ్చుటయె కాని విచిత్రపు దైత్యసేన బిం
దెఁడుదధి నొక్కకవ్వము మధించెడు, సందెడు కీశసైన్యముం
బిడికెఁడు దానవుల్ బిగువు ప్రీలఁగఁ జేసిరి కీశులుం దినం
బడుచును బీకికొంచుఁ దిన మారిమసంగిన యట్లు బెగ్గిలన్. 39

ఉ. అయ్యయొ! కుంభకర్ణుఁ డనునట్టి మహాగిరిదాటి దొంగగాఁ
గయ్యలు కోయు నింద్రజియుగాఁ జను ఘోరనదిం దరించి తా
మొయ్యన వేలుగుట్టలును నూఁటలు వాఁగులుదాటి వచ్చి నేఁ
డియ్యెడ దొంగయూబి వడి యీగతిఁ జచ్చుట చిత్రమయ్యెడిన్. 40

ఆ. ఒగిఁ గళేబరమ్ము లున్నను సంధాన కరణియును విశల్యకరణి; ఘటజ
మౌని వచ్చి యేమి మన్నించు జీర్ణించి నట్టి పాడుకపుల ప్రాణములను. 41

సీ. ఇతమిత్థ మని వచియింప రాని మహాభయంబున వానరు లావటిల్లి
మిగిలి లాంగూలంబు లెగఁబట్టికొని శ్లథాధరపక్ష్మలౌచును బరువులెత్తి
రఘువంశపతి పాదరాజీవములయందు నిర్వాక్కు లగుచును నిశ్వసింప
కోదండమును బూని గుల్మంబు వెలువడి రామచంద్రుఁడు గాంచె రాక్షసాళి

గీ. రాక్షసాళి చూచె రామచంద్రుని వాఁడె వాఁడె యంచు సైన్యపతులు పలుక
వాఁడెవండొ చూడఁబడువాఁడు నెవ్వండొ చూచువాఁడెవండొ తోచకుండ. 42

సీ. నిభృతపశ్చాన్నీరనిధి సూర్యకిరణపారీధారలం దేర్పరింపరాక
పైనుండి సన్నజాల్వారు మొయి ల్గాన్గు చివురుకాంతులను బోల్చికొనలేక
తూఁగుమేఘాన సేతువు నీడకును వార్ధి ప్రతిబింబమందుఁ జాపం బెఱుఁగక
ఎఱుపులు విరిగెడు తరణికాంతులలోనఁ గావిగుడ్డలకాంతి కానఁబడక

గీ. సాగి గగనంబు నీరధి జలధరంబు తరణిగాఁ గానిపించి లోఁబురుషమూర్తి
కనులమఱుమిట్లుతొలఁగఁగాఁ గ్రమముగాఁగ చాఱగా నేర్పరించుకొన్నారు జనము.

క. అతనిని భుజింపవలయున ప్రతివానికిఁ గోర్కి కలిగె రాక్షసు లందున్
మతి చెదరి దైత్యసేనా పతులును చమువులును భ్రాంతిపడి రాకవేళన్. 44

శా. ఆసైన్యంబును నప్పుడప్పుడు రథాలం దెక్కి హేమావళీ
భాసుల్ సన్ననిపట్టువల్వలు జరీలా దుస్తులై భోగరే
ఖాసంపన్నులు పోవఁజూచిరి, మఱీ యందంబు కాషాయశో
భాసంపన్నత జోట మాధురియు నే వట్లన్ విలోకింపరున్. 45

గీ. మఱియు వెలగలభక్ష్యముల్ మక్కువగను పూఁతబంగారురేకులఁ బొదుగుచుంద్రు
రథగజతురంగపాదాతపృథులసేన యొక్కసారిగ వాంఛించె నోగిరంబు. 46

శా. కోదండంబును వామహస్తమునఁ గైకో లెప్పుడయ్యేన్ ధను
ర్జ్యాదీర్ఘీకృతి యెప్పుడో శరలసత్సంధాన మెప్డో జ్యాల
న్నాదంబున్ ఘటవర్ష మొక్కపరి యన్నట్లయ్యె నాముంపులోఁ
బాదం బీతలఁ బెట్ట వీల్పడక నిర్బంధంబుగా నయ్యెఁబో. 47

ఉ. అక్కడ నొక్క చాపి కలఁ డాయన చేయు శరప్రయోగ మీ
ఫక్కిగ సాగుచున్న దను భావమె సాగదు రాక్షసాళి, కా
దిక్కున నొక్కచక్ర మది తిర్గుచునున్నది దానిలో మహా
స్ఫుక్కగు నొక్కమూర్తి వివరించెడు నగ్నులటంచు నెంచుచున్. 48

మ. రథముల్ నుగ్గుగ నయ్యె నేనుగులు శీర్షచ్ఛేదముం బొందగాఁ
బృథులాశ్వంబులు కంఠకర్తనము ప్రాపింపన్ బదాతుల్ తనూ
మథనం బందుచుఁ గూడఁ జిత్తముల రామశ్రీశరీరాభిజ
గ్ధి ధురాభావనతోడఁ జచ్చెదరు ధీదిగ్ధాశనాయాజనుల్. 49

మ. దనుజవ్రాతముపైని రాఘవుఁడు గంధర్వాస్త్ర మేసెన్ మఱిన్
దనుజుల్ భ్రాంతినిబొంది యొక్కొకఁడు చిత్తంబందునం బ్రక్కవా
నిని రాముండనుకొంచుఁ జంపికొనుచున్ దించున్ మఱింకొక్కయా
తనిచేతన్ వధియింపఁగా బడుచుఁ జిత్తస్థైర్యముంబాయుచున్. 50

గీ. బండిపై నున్నవారలు బండిచక్ర మల్ల కనిపించు చక్రమటంచు దాని
క్రిందమెడపెట్టి దానివక్రింపఁజేయుచుంటి మనుకొంచు మృత్యువు నొందుచుండ.
51

చ. తెగిపడఁబోవు వాజితల దీనుఁడు రాముని శీర్ష మాతలన్
బిగియుచునున్న దంతములు ప్రీల్చెదనంచు నొకండు చేత వే
యగ నది నోటిలో నిఱికి హస్తములాగి పెకల్చి యెంతయున్
సొగసి తుదిన్ మృతింగనియె శూరుఁడు వీరుఁడు రామశత్రువై. 52

మ. ఇదియున్ రామునిపక్షమంచుఁ గననయ్యెన్ సామజం బింతయుం
గదలంబోవదు నేను దీని విఱుతున్ గన్మంచు వేడిగ్గి త

త్పదమున్ విర్వగఁబోవ వానితనువున్ బాదాన మట్టించె ను
న్మదమత్తేభము నిత్యమై మఱిమఱిన్ భ్రాంతుల్ చనున్ సృష్టిలో. 53

సీ. ఒకచోట సుంత యంటుకొని దూదివిధాన నంతయు సురసురలాడిపోవు
నరదముల్ చూపించినంత నూనెవిధాన మాటలో భగ్గున మండిపోవు
పొగరేగి మండి గుప్పుమని యారి మఱంత జ్వలియించి మఱియును నిలిచికాలు
గుఱ్ఱాల యేన్గుల గుములఁ బెళ్లలుపడి కూలఁద్రోసి మఱింత కుములఁబెట్టు
గీ. కనఁగ నిదిసేనయా లేక కాననంబ! బాణచయమా మఱిద్ది దావాగ్నియా! శ
రత్తొ గ్రీష్మంబొ యిదిసమరంబొ దివ్వెటీలతో నాల్గుదెసలుముట్టించి చనుటొ!

గీ. నాల్గులక్షల దైత్యసైన్యంబు నమ్ము క్రమ్మి దొంతర దొంతర కుమ్ముపెట్టి
వండఁగాల్చెను గుమ్మరావంబు వోలె క్రమ్మి తద్దివసాష్టభాగమ్మునందు. 55

ఉ. అతఁడు రామచంద్రుఁ డగునా! మఱి యాతనిచేతఁ జాపమే
నా! తగ నిర్గతంబు లగునట్టివి యక్కట బాణరాజియే
నా! తమనేత్రముల్ మఱియు నమ్మగఁ జాలరు వానరేశ్వరుల్
సీత గ్రహింపఁదెచ్చెఁ గపిసేన నితండిది నాటకంబుగా. 56

వ. శ్రీరామచంద్రుం డంతఁ గోదండంబు డించి తనవంక నివ్వెఱవోయి చూచు
చున్న సుగ్రీవ విభీషణ నల నీల సుషేణాంగదమైంద ద్వివిద కేసర దధిముఖ
శతవలి మారుతి జాంబవత్ప్రముఖులవంకఁ జూచి నవ్వి యిట్లనియె. 57

క. కలన నిది నేను సేయం గలుగుదు శ్రీకంధరుం డొకండును జేయం
గలుగును మూఁడవవానికిఁ గలుగ దసురమూల సైన్యఘట యిది యింతే. 58

శా. పారాడెన్ దరుణాతపంబులు సితప్రావారముల్ గాలిలో
నారంబట్టినయట్లు, దాశరథి చూడాభోగరోచిశ్ఛటా
పారాకారము లట్లు, ప్రాగ్గగనగోష్మక్ష్మా మనోజ్ఞంపు కీ
లారంబందునఁ బాలబిందియలు నొల్కంబోసికొన్నట్లుగన్. 59

క. నడి మధ్యాహ్నపు టెండలు కడలిజలమ్ము తడిపట్టె కడమాత్రము వె
న్కడుగయి సుంతగ దవ్వగు పుడమిని సైతమ్ము తాపములు కలిగించున్. 60

వ. గడ్డిపరకయు వదలకుండ సకలమ్ము వినిన రావణుండు. 61

శా. కైలాసంబున నున్న స్వామికిని నిక్కం బింతగా నాపయిన్
వేలాతీతము కోప మెందులకొ? తా వేంచేసె రాముండుగా
హేలాక్రీడగఁ జేయుఁ ద్ర్యంబకుఁ డొకం డిష్వాసనామ్నాయవి
ద్యాలీలాకృతి ప్రాణకాలయుగ సంధ్యామర్మవిజ్ఞాతయై. 62

గీ. శివుఁడు కేశవుఁ డిద్ది పంచికొనెదరు ప్రధానమున నిద్ది శివునికృత్యంబు, తత్త్వ
మందభేదము, చేయు కార్యములు విడిచి వారలిర్వురె యీజగత్కారణములు.

శా. సీతం గొంచునుబోవ సీతఁ డిట వచ్చెన్నాగ వ్యాజంబు, వి
ఖ్యాతిన్ దానవవంశనాశనము కార్యం బీ శివాద్వైతికిన్
సీతం గైకొనిపోవ వే విధములం జేయంగవచ్చున్, మహో
దైతేయోన్మథనంబు ముఖ్యము సముద్రాంభోవ్యథాకారికిన్. 64

ఉ. అచ్చట నొక్కఁడుండును రహస్యము చెప్పఁగ వారి వారి నా
యచ్చట నచ్చటన్ నిలిపి యాయన ధాత్రికి డిగ్గి వచ్చుఁబో
వచ్చినవాఁడు వాఁడెయని బంధురముల్ మఱి యాదృశంబులౌ
నచ్చెరువుల్ వచించెడినహో! యది నేర్చిన నాటికిన్ వృథా. 65

గీ. నాల్గు తలుపులు మూసి లోనన్ బిగించి యమర సున్నములోకి బొమికలేని
యట్టు లీ సేఁతయేమి క్రౌర్యం బిదేమి యిద్ది యాహవమేమి యిదేమిసూడు.

వ. నాకొడలు మండిపోవుచున్న దనుకొంచుండ బయట హాహారవంబులు విని
పించి వెలికిరా, మరణించిన మంత్రులయు సేనాపతులయు మహోద్యోగులయు
భార్యలు కూతుండ్రు కోడండ్రు వేలాది స్త్రీజనంబు విలాపించుచు నతని
పాదములపైఁ బడి యింత దుఃఖించి యిట్లనిరి. 67

శా. రాజా! నీకృపచేత వేల్పములుగా రంజిల్లినామయ్య! యా
యాజానేయములున్ సుభద్రగజముల్ హార్యగ్రరత్నంబులున్
భ్రాజద్హేమమయంబులౌ వసనముల్ రాజ్యంబులున్ భోగముల్
రాజా! నీదయలేక నేటికి సముద్రా లయ్యె మా గుండియల్. 68

ఉ. మస్తకముల్ ముసుంగులయి మాబ్రదుకుల్ మఱియేమి! యేమిమా
నిస్తులమైన యాలువులు నేటను తేపట నయ్యొ! రాహుసం
గ్రస్తములైన మావగు ముఖంబులు చూడుము రాజ! నీకు మా
పుస్తెలత్రాళ్ళమీదఁ బగవూనిన జానకి యెందుఁగన్పడెన్. 69

గీ. అచ్చరలు వేలుగాఁ జాలరాయె స్వామి రాజ్యమున నుండిన సమస్తరత్నములును
జాలవాయెను నేటి కీ శక్తి వలసె విఱుచుకొని తిన్నది సురారివీరచయము. 70

చ. అకట! యుపేక్ష యొక్కటి యనర్థము కోరినయంత తెచ్చు, వా
యక ప్రియశిష్యుఁడైన మకరాక్షుని కిచ్చకమైన యత్త వా
నికిఁ బ్రియ మంచు శూర్పణఖ నేర్పిన నేర్పులు నేర్పినావు, వం
చకమగు తోఁకచి చ్చిడితి సర్వసురారికులంబులందునన్. 71

వ. కులకులంబులందలి పరోక్ష నిందాగర్భ దుఃఖోక్తుల సారాంశంబు రావణుండు
విని రాముఁడన్నచో. 72

మ. నగవున్ గన్నులకెంపుగాఁగఁ గనుచు న్నారీవ్రజంబున్ భగా
భగమంచున్ బదిమోములన్ నఖశిఖాపర్యంతమున్ మండె మం
డిగముం గంచును జారి రొక్కొకరుగా నీరేజపత్రేక్షణల్
చిగురుంగన్నుల కెంపులున్ మిణుఁగురుల్ శిఖ్యుజ్వలజ్వాలలై. 73

ఉ. పోఁడిమిఁ బావకుం డనఁగఁ బొల్చెను వానివిలోచనంబులన్
వేఁడివెలుంగు ప్రాగ్ధరణిభృచ్ఛిఖి వెల్గులు రెండుజాము లౌ
వేడిమియున్ గనంబడియె వెక్కసమయ్యెను వానిఁజూడ నా
పీడిత దిక్తటీగగనబృంహిత చైత్రమహాతపంబులై. 74

ఉ. వంచితసాంధ్యమేఘతనువర్ణుఁడు సూర్యుఁడు వెన్కతట్టు తా
డించిన యెఱ్ఱవెల్గులు కడిందిగ నంచులయందుఁ గ్రుమ్మి ము
ద్రించినయట్లులై యతని హృద్గతకోపము క్రుమ్మి వాని దే
హాంచలమందునం బరిధి యయ్యె మహారుణపావకచ్ఛటల్. 75

చ. అదియొక యగ్నిగోళ మరుణాసితమైనది దానిలోపలన్
బెదవులు కన్నులుం బొమలు భీషణమై తగు, మున్ను బిట్టురే
గి దివము నంటుకొన్నపుడు కేవలపావకభావ మిట్లు లే,
దిదియొక యచ్చనిప్ప తన యేతొలిరూపము నేఁడుతాల్చెనాన్. 76

చ. ప్రతిభయొ కోపమో దయయొ బంధుర బాహుబలంబొ శౌర్యమో
యతిశయ మొంచు నొక్కొకనియందున నుండున, దాని యున్నతో
న్నతపరిణామమౌ స్థితి కనంబడ దెప్పుడు కానిపించు సం
గతి సమకూడు టొప్పు దశకంఠుని యిప్పటికోప మట్టిదై. 77

చ. భృశము దవాగ్ని మింటికిని రేఁగును జ్వాలలు, జ్వాల లింధన
స్పృశములు, నస్పృశంబులు చరింపవు జ్వాలలు, కాని, గాలి బా
లిశముగ నొక్కొకప్డు విదలించును మింటను జ్వాలరేఖ న
స్పృశముగ, నద్ది యగ్ని కురరీకృతమౌ సహజస్వరూపమై. 78

సీ. ఇదియుండు నదియున్న, నిదిలేద యదిలేక యిద్ది సంబంధ మగ్నీంధనముల
కా గాలి విదలించి నట్టి యగ్నిజ్వాలయది యథార్థంబైన యగ్నిమూర్తి,
కోపమ్ము కూడ నట్లే పొల్చు, నది సహేతుకముగాఁ బుట్టి హేతువునశింప
నుఱక మనోవీధి నూగాడు జ్వాలగా నద్ది కోపాభాస మది యహంక్రి

గీ. యాప్రథమమూర్తి, బంధువు లనుజసమితి సుతులు నందఱు చచ్చిరి, సురవిరోధి
కోప మెవ్వరికోసము? కోరి మఱల నేది సాధింపఁగలఁడు? వారెట్లు రారు.

క. వారు వినా యీ భోగము లీరాజ్యము నుండి లేనివే యగు లోకం
బౌర! పగతీర్తు నం చను తీరక పగ కోపమున కుదించుటయె కదా! 80

గీ. ఒకమహాగ్ని రామాఖ్యమైయురవడించు శలభములఁబోలె సర్వ బంధులదహింప
నందులోనికి తా నైత మరుగుచుండె తెలివి యిది కోపమును బగదీర్చుకొనుట. 81

క. ఈ యచ్చమైన కోపం బే యాత్మపదార్థనాశ మెంచియొ దానం
బోయి ప్రవేశించుటకయి యీ యమలినభావవృద్ధి యేలో యకటా! 82

వ. దుర్విషహ్యంబై దుర్నిరీక్ష్యంబై యేతాదృశంబయిన జననకాల సంగత జీవగతా హంకారహేతుకంబయిన కోపంబున రావణుండు మండిపోవుచు సమీపస్థులయిన యంగరక్షకులు పరిశిష్ట సేనాపతులు మహాపార్శ్వ మహోదర విరూపాక్షులను గాంచి. 83

క. రథ మాయత్తం పఱపుఁడు పృథువుగ మత్సేన సవదరింపుడు మీరున్
రథులు నను ననుసరింపుడు పృథివీ చక్రంబు నడ్డ విఱుతును నేనై. 84

సీ. దృప్తకాకోలజగ్ధి యవసథీభూత గిరి మూపురమున నూగించినాఁడ
పదికంఠములు పదిపదిసార్లు శివునకు వెగటుగా నారగింపించినాఁడ
దిగుపదిక్పతులమోదిన చదలి యిరమ్మదపుచెర్వు నీళ్ళులఁ దాపినాఁడ
సకలత్రయీశబ్దసంఖ్యా పరిజ్ఞాన దీపమ్ము లోకానఁ దెచ్చినాడ
గీ. వేలయేండ్లుగఁ దపము తపించినాఁడ నూల్కొనినయట్టి యల్పమానుషపుశక్తి
నన్నెదిర్చిపోనగునె ప్రాణములతోడ యిపుడురావణుఁడెవఁడొ తానెఱుగగలడు. 85

శా. అన్నాదమ్ములు మచ్ఛరప్రహతులై ప్రాణాంతకాలంబునం
ద న్నేలం బడియుండి రాత్రిసమయంబై చుట్టునున్ మూఁగియు
న్న న్నక్కల్ కనులున్ మిణుంగురులుగా నా బాణపుంఖంబులం
చు న్నేత్రంబులు మూసి ప్రాణములయంచు ల్పొతురున్ భీతులై. 86

మ. కపిసేనాశవముల్ పరిస్ఫురితలంకావార్ధి వేలావనీ
విపులక్ష్మాజచయాలవాలములలో విస్తారమై తత్ఫలా
నుపమశ్రీరుచిహేతుకంబులగుతన్ నూల్కొన్న మద్దీవ్యద
స్త్రప్రువహ్నిన్ మఱిపాళమై యుడికి మాంసంబుల్ రుచింబొందగన్. 87

శా. నేనున్ వానరవాహినీచయముల న్నేతున్ బ్రమూర్ఛాగతం
బై నింగిన్ మఱి నేలయుం దెలియరానట్లాచరింపన్ మద
స్త్రానీతానలదగ్ధ లయ్యెరువు రాహో చూర్ణితాస్థుల్ మరు
న్నానాధ్వంబులలో నణుప్రతతులై వెం గానరాకుండఁగన్. 88

ఉ. మున్నొక రెండుసార్లు మృతిపొందిరి లేచిరి నేఁడు మచ్ఛరో
త్పన్నులు లేచు టెప్పగిది సంభవమౌనొ, విదగ్ధచూర్ణితా
స్థ్యున్నమితాణుదేహు లయి యూరక పంచిన పంచభూతసం
పన్నతఁ దూపరాణులయిపట్టిన మచ్ఛరసంచయమ్ములన్. 89

ఉ. దిమ్మయి ప్రాణముల్ బయలుదేరియు మచ్ఛరకల్పితాంధకా
రమ్మున మార్గముం దెలియరాక సమీహితలోక మేగలే
కిమ్మెఱుఁగంగరాక చరియించుచు నట్టె నిరంత పంచభూ
తమ్ములయందుఁ జొచ్చుటయె తా నది వ్రాసెను వారికిచ్చుటన్. 90

వ. ఇట్లు నిరంతరిత సాంపరాయభావనాపరంపరా పరిమిళితచిత్తవృత్తియై సమాయ త్తపఱచి తేఁబడిన తేరెక్కి ధనుస్సుం జేబూని. 91

గీ. క్రూరమౌ త్రాటితుదియుచ్చు కోటినంకరకులగింపఁబో మాటిమాటికిని జారి
యాతఁ డెంచె నుద్వేగమైనట్టి వేళ నే పనియుఁ దొందరగ సాగనీ దటంచు.

గీ. వామబాహూరుయుగ పరిస్పందనమున నెంచె దశకంధరుండు నదిల్లో కాదె
పదియునేడు దినంబులు పట్టరాని నిద్రయు సయించరాని తిండియునటంచు.

గీ. కేతుదండోపరి నిపాతకృద్గరు చ్చికీర్షితోర్జితానుస్వార గృధ్రచయముఁ
గాంచి యతఁ డెంచె మది నావరించెఁ గపి శవాదఖగరాజి లంకావియత్తటంచు.

గీ. గగనమున నుండి నెత్తురుగాఁగఁ గురిసె నవ్వుకొనె రావణుఁడు గగనంబునందుఁ
దరణికిరణాహ్వాతము లంబుదములు రక్తదంబు లగుటలో లేదు చిత్రం బటంచు. 95

గీ. రామలక్ష్మణు లున్న ద్వారంబునుండి రథము తోలించె దానవరాజు రాజి
తాంతరాగ్నిశిఖాలోచనాంశుఁడగుచుఁ దనకిరీటచ్ఛవుల్ మిన్నుఁ దన్నుచుండ. 96

క. తోరాలు త్రొక్కె నరదం బారూఢిగ ఘోరవానరానీకినిలో
వీరకపులు దాని త్వరాధూరాధూతిఁ జన దూరదూరంబులకున్. 97

సీ. ప్రళయ ఝుంఝూమరు త్పాతంబు వోలిక రాక్షసురథము దూరాలు తోలె
యమదంష్ట్రికాహంక్రియాక్రియవలె దైత్యు నారాచసమితి ప్రాణములు తీసె
గిరిశేఖరము వెల్లగిలి దూఁకు గతి వాని ఖడ్గపాతము బొమికలను నూరె
ఘనమహోజలపాత మన వానిశౌర్య వాహిని యధఃపాతాళమునకుఁ ద్రొక్కె
గీ. రాక్షసుచరించినంతమేరయుఁ గపీంద్రసమితి సమతింజయుని వాని శౌర్యవహ్ని
ప్రమితి లేకుండఁ జచ్చె దీప్రమతులైన వీరులౌ కపులెల్ల నివ్వెఱ భజింప. 98

సీ. రక్షశ్శరాంతకార్యముగఁ జెవుల్ తెగి పడిన సంగీతమ్ము పాడెనొకఁడు
అసురేశ్వరునివ్రాలుట మ్మూరువులను ఛేదించ మద్దెలనువాయించె నొకఁడు
అసుర శరాళి సర్వాంగమ్ములను రట్టు సేయఁగా నాట్యమ్ము సేసె నొకఁడు
అరచేతులను దైత్యవరుఁడు మండింపగా విలవిల తాళంబు వేసె నొకఁడు
గీ. రామభూపాలరాగ పర్యాప్తగళులు వేలకొలఁదిగఁ బాడిరి వెనుకహంగు
రావణుండు శరాంతకార్యముగ రామభజన చేయించె వానరవ్రజముచేత. 99

సీ. లంఘించుచున్న గోలాంగూలు పాదముల్ ఖండించె నొక్కరాక్షసుఁడు కడిమి
నిగిలించుచున్న కపీంద్రుని దంతముల్ రాలఁగొట్టె మఱొక్క రాక్షసుండు
వృక్షంబు విసరు కపిశ్రేష్ఠు పృష్ఠంబుఁ దాడించెఁ బరిఘతో దానవుండు
చేయెత్తినట్టి కీశేశు బాహామూల మగలించె నొక్క దైత్యప్రభుండు
గీ. పొడిచి పనిచేయఁజాలకపోయె వందవానరుల గుంపు నొక దైత్యవరుని ముందు
నింగినెగిరెడు వానరుల్ నేలపాఱుజాతిగామాఱె మూలరాక్షసుల యెదుట. 100

చ. మరియును గద్దుగా నగు సమస్యయె యియ్యది యెవ్వడైన ను
ద్ధురుఁ డయి రావణుం డనికి దూఁకిన నాతనివెంబడిన్ మహా

పరమపరాక్రముల్ కదలి పత్తురు రాక్షసవీరు లా ధురం
ధరులను గెల్వఁ గష్టమగు దానికి వేఱ ప్రయత్న మొప్పనాన్. 101

శా. సుగ్రీవుండు స్వసైన్యముం గనుచు సంక్షోభంబు పొందంగఁ గ్రూ
రగ్రావంబులు వృక్షముల్ గొని మహోరక్షశ్చమూవ్రాతమున్
దృగ్రక్తాంతులుగా నెడంపెడగ మోదెన్ మోదినన్ రాక్షసుల్
ప్రాగ్రూక్షత్వము తూలియున్నను విరూపాక్షుండు సక్రోధుఁడై. 102

శా. మత్తానేకప మెక్కి సూర్యసుతు నున్మత్తేషుసంతానసం
పత్తిన్ వక్షము ప్రచ్చి యాతఁడును దిగ్భ్రాంతిన్ వహింపన్ గపుల్
మొత్తంబున్ గదలింపు లూచి విదలింపుల్ గాఁగ బాణంబులన్
మిత్తిం జేర్చుచునుండె పందలుగ నున్మీలద్భుజాదీప్రుఁడై. 103

ఉ. ఈ విలయంబు దాటు టెది యెట్టులు కన్పడు వీరు మువ్వురున్
రావణు నంగరక్షకు లరాతిభయంకరు లందుచేత నీ
మూవురు చావకుండ దశమూర్ధుఁడు లొంగుట లేదటంచు సు
గ్రీవుఁడు నిశ్చయించె మువురిన్ మునుముందుగ సంహరింపగన్. 104

గీ. కడఁగి రథమువదలి గజమునెక్కెను వీఁడు గజము మీఁదియొడుపు కలఁడువీఁడు
రథము చాపకళకుఁ బ్రథితవాహనమైన నితని కేమొ యేను గెక్కె రింత. 105

మ. అని సుగ్రీవుఁడు వాని పెన్గజము కుంభారామముం జొచ్చి యా
తని బాణంబును దూయనా నెడము చింతల్ వీలు లేకుండఁ బె
ల్చన నయ్యేనుఁగు కుంభమున్ నఖములం జక్కాడి పెన్గ్రద్దుచే
ననిచెన్ దానిని స్వాగ్రజావసథమున్ హారిప్రమోదాకృతిన్. 106

ఉ. అక్షుల కోసలందుఁ గన లగ్నికణంబులు రాలఁగా విరూ
పాక్షుఁడు డాలు వాలు గొని యాకసమం దెడమున్ సహించి ఫా
లాక్షుఁడు చేతి ముమ్మొనలయమ్మును వాల్చిన యట్లు వాల్చెఁద
ద్వక్షమునందు సూర్యసుతు వక్త్రము వక్రముగాఁగ బాధచే. 107

ఆ. సొక్కువచ్చెఁ బోయె సూర్యసూతికి లిప్తలోనఁ, దెలియు నంతలోనఁ దెలిసె
నాయుధములయందు నసహిష్ణు వీతనిఁ జంపుటకును వేఱ చంపవలయు. 108

చ. కలియఁబడెన్ సరోజసతికాంతుని సూనుఁడు దేవతారితోఁ
బలకయు వాలు లాగికొని పాఱఁగ వేసెను దవ్వునందునన్
వెలయఁగ మల్లయుద్ధమున వీడిన వాలినిగాని ముజ్జగం
బులఁ దనయంతవాఁ డెనఁగబోఁడు నాఁగ నెఱింగి గుండియన్. 109

చ. కలియుచు దవ్వుపోవుచును గ్రమ్ముచుఁ గ్రుమ్ముచుఁ బాణిపీడనో
జ్జ్వలతను గంచుఁ దాచుచును సౌర్యుఁడు వానిశరీరమందు నే
వలనునఁ దీవ్రఘాతమును బట్టఁగఁ జాలఁడొ చూచి చూచి య
గ్గలముగ శంఖదేశమున గాఢముగాఁ బ్రహరించె ముష్టితో. 110

క. అది యతని ప్రాణనిర్గతి పద మిదితని సర్వశక్తి బృంహాకముష్టి
ప్రదము, విరూపాక్షుఁడు యమ సదనంబున కింతలోన సాగినయంతన్. 111

గీ. అంత మదిలోన రావణుఁ డనుకొనియెను వాలి బలశాలి యితఁడు ధీశాలికూడఁ
దెలివిగా వానిచేతిలోపలి నవాయుధమ్ములు తెమల్చి మల్లయుద్ధమున దించె. 112

చ. బవరము గల్గనే నుభయపక్షములందున వీరు లుంద్రు, వా
రవిరళశౌర్యవంతులును, నక్కట గెల్చెడినట్టి పక్షమం
దు వెలయు వారెదో తలఁపఁదూఁగి ఫలించును, గానిచోటఁగా
దు, విమలశౌర్యమెందులకు దుష్టము దైవము చేయుచుండగన్. 113

శా. నన్నున్ వీఁడొక రెండుసార్లు మును వెన్నం బోర రక్షించె వీఁ
డన్నన్ గుండెదిగుల్ సురేశ్వరులకే, నావీరుఁ డీ వీరుఁడై
చెన్నేదన్ మును వాలి మన్నుఁ దినిపించెన్ వేనిచే వానిచేఁ
జన్నె యీగతి నయ్యెనంట, కృతమాశ్చర్యంబు కన్పించుచో. 114

శా. మాపక్షంబున వీరులెల్లరు నసామాన్యుల్ త్రిలోకీ జిగీ
షాపర్యంత పరాక్రమాంబుధులు నాశ్చర్యం బగున్ గీర్తి యేఁ
డో వైవాని పరాక్రమక్రమము దిగ్వ్యూహంబునం జొచ్చు బా
హాపర్యాప్తుఁడు క్రిందివాఁ డతనిఛాయాగ్రస్తుఁడై పోయెడున్. 115

క. కోపమ్మును గోపముగా దీపించును జీవులకును దెలివి తెలివిగా
దీపించును దీపములకు లోపించని వెలుఁగు నీడలుం బలె నకటా! 116

వ. అంత రావణుం డూరక కోపమ్ముతోఁ బెరిగిపోయి రామలక్ష్మణ సుగ్రీవులు
మరణించి తీరవలయు నన్న కోపముతో మహోదరునిఁ గాంచి యిట్లనియె. 117

ఉ. వీఁడొక చెట్టుకోఁతి మనవీరుల నెందఱినైనఁ జంపెఁబో
పోఁడిమి నెట్టులైన మృతి పొందఁగఁజేయుము వీని, బోరిలో
గోడిగ మల్లయుద్ధమునకున్ దిగు నీతఁడు నిన్నెఱుంగకన్
వాఁడిమగండు మృత్యువును వాఁకిటికిం గొని తెచ్చుకొన్నటుల్. 118

శా. ఈ దుర్మార్గుని నేనె చంపుటకుగా నెంతున్ మఱిన్ నాకు మ
ర్యాదానష్టము వీనితో నెదిరి పోరాడన్, ధరాకృత్స్నమ్ము
త్సున్నదిగ్గాంగుఁడ నేలపై బొరలి క్రిందన్ మీఁద నౌటేమి? యా
హా! దైతేయకులాధినాథునకు, నీవైయుండ నామాఱుగన్. 119

శా. వీనిం గుత్తుక కత్తిరింపుము, ధనుర్విస్ఫార నారాచమా
ర్గానన్ నేనును రామలక్ష్మణులవౌ కంఠంబులన్ గర్తరీ
స్థానంబుం బొనరించెదన్ గగనపుష్పం బామరీ కిన్నరీ
వానోచ్చైః పరిదేవనాకృత మిళిందస్వాన పూర్ణంబుగన్ 120

చ. అనుడు మహోదరుండును నహంక్రియ హుంక్రియగా వెలార్చుచున్
గనుకని సూర్యసూతికి మొగంబునఁ జూపవినిర్గతోగ్రమా
ర్గణములు నీటివెల్లువలుగా వెలలించుచు విల్లు రామచం
ద్రుని వలెఁ జక్రమట్లుగఁ గనుంగొనఁ జేయుచునుండఁ జూచుచున్. 121

గీ. ఒక మహాశిల్పి యగుటకు నొక్క వేయి లక్షణము లుండు నే రెండులక్షణములలో
యమరియుండిన వాఁడు తనంత శిల్పిసృష్టిలో లేఁడటంచు గర్వించుచుండు.

ఉ. అయ్యో! రఘూత్తముండు ధనురంతమునందున నాల్గులక్షలన్
వ్రయ్యగఁ జేసె దానవుల వానరసైన్యము నిన్నికోట్లు తాన్
వ్రయ్యగఁ జేసె నిప్పటికి రావణుఁ డచ్చెరువంది చూడఁగా
నియ్యసురేశుఁడున్ మఱియు నింతటిదైన్యము నందు నేటికిన్. 123

ఉ. క్రేవల వానివిల్లు పచరించిన ద్రోహము చాలనట్లు సు
గ్రీవునిఫాలమున్ శరయుగీవినిర్గమము చేసినంత సు
గ్రీవుఁడు నన్నుఁ జంప నుఱికించెను వీనిని రావణుండు, వీఁ
డావల మల్లయుద్ధమున యందున నేర్పరి యేమొ కావలెన్. 124

ఉ. ఐనను దానుచాపమున యం దధికుండ నటంచు నెంచు, నేఁ
డైనను నొక్క విద్యను మహానిపుణుండయి వేఱువిద్యలోఁ
దాను బ్రవేశముం గలిగి దానను గొంచెము నేర్చి దీనియం
దైన మఱంతవాఁడ నని యచ్చపు గర్వము కందళించెడున్. 125

మ. అనుకొం చొక్కవిలిప్తలోన నితఁడాహో! యిట్లుగాఁ జేయఁబొం
దునటం చెంచగ రాని దా నిముసమందున్ బండిపై దూకి యా
తని గుఱ్ఱంబుల కంఠకర్తనముగాఁ దత్సారథిం జంపి యా
తని చాపమ్మును నమ్ములన్ విఱచి దంతక్రీడగా నిల్చెనన్. 126

ఉ. అంత మహోదరుండు ప్రభు వాడిన నిక్కము నెంచి వానికే
ల్వంతము మీఱఁ బట్టుకొని లాగి ధరాస్థలికిం గపీ! మఱంత దు
ర్దాంతుఁడ వేమి? చూచెదను రమ్మని యాతని గుండెపై భుజా
దంతురముష్టిపాతముగఁ దాడనముం బొనరించె నుగ్రతన్. 127

చ. ఇరువురు నొక్కరొక్కరి సహించుచు వెక్కసమందుచుం గ్రుధా
భరమున గక్కసించుచును బట్టి యొడళ్ళను వ్రక్కలించుచున్
మిరమిరలాడ జూచుచును మింటికి నెత్తుచు నేల వ్రేయఁగా
సరగున లేచుచున్ మఱియు నాగుచుఁ జూదుచు బిట్టుమోఁదుచున్. 128

మ. మది సుగ్రీవుఁ డెఱింగె వానిదగు సామర్థ్యంబు బాహాబలో
న్మదవృత్తిం గొనిగాని కై నసిమొదల్ మన్నించినంగాని యా
పద పొందింపనురాద యేమఱికలన్ వానిన్ వధింపంగ రా
దది వా డేమరుపాటునుంగలఁడ తానై దూకుటన్ నేర్వకన్. 129

వ. అగ్రదృష్టి మహోదరునిపై నిలుపుచుఁ గ్రేవల జాగ్రత్తగాఁ బరికింపుచు నంత దూరాన నున్న పరిఘంబు చూచి వానిచేతఁద్రోయంబడి యందువ్రాలి వాఁడు వెంబడిఁ బొడువరాఁ బరిఘతో లేచి దానితో వానిమెడ తెగనఱకిన. 130

క. హాహాకారోచ్చైర్నా దాహ్వాత బహుదనుజకంఠమై మిన్నొరసెన్
సేహోజయనాద లసత్ హీహీలఘుహాస మొప్ప నేచిరి కపులున్. 131

గీ. రావణుఁడు సుంతగా నిర్వేఅన్ భజించి యింతలోఁ దెల్వివచ్చి తానిట్లు తలఁచె
వలయు విద్యకైకాగ్ర్యమభ్యసనవేళఁ జనుసు బహుముఖత్వము ప్రదర్శనమువేళ.

చ. నరుల వివేక ముజ్జ్వల మనంతముఖంబుగ నుండు, నట్లె వా
నరులదిగాఁగ నెంతయు గనంబడు, హన్మ యొకండు తీవ్రసుం
దరమతి, వీఁడు నైనఁ గలనం దెలివిం గనిపించు, వట్టియా
శరమతి బిట్టుమందగొడి జంతుబలంబున సంతసించెడున్. 133

ఉ. ఏనొక పెద్దపర్వతము నెవ్వఁడు నెత్తగలేఁడు నన్ను నాన్
దానవుఁ డెంచునొక్కఁడు, యథార్థము వానిని వందమందియుం
బూని కదల్చలే, రొకఁడు బుద్ధిబలంబున లేవు సుల్వుగా
మానవజాతి సూక్ష్మమతి, మాధవుఁ డచ్చటనే జనించెడున్. 134

క. అనుకొంచు నున్న రావణు మనమున నూరకయ పెద్దమంటలు మండెన్
దను దాను గాలిపోవక వనజాక్షేక్షణునిఁ గాల్చువంక మఱల్చెన్. 135

శా. ప్రాంతంబందున యుద్ధమాడెడి మహాపార్శ్వున్ సమీపించి వృ
త్తాంతంబున్ వినిపింప నాతఁడు సమీపారణ్యదావానల
స్వాంతుండై యెసఁగన్ దశాస్యుఁడు నిజస్వాంతంబు వించెన్ గ్రుధా
సాంతత్యం బెసగంగఁ గోపము నవోత్సాహంబు కల్పించుచున్. 136

ఉ. నా దుముదారులన్ మిగిలినాఁడవు నీవొకఁ డీ కపీంద్ర సే
నాదళనంబు నీబుజమునం గొనసాగవలెన్ మఱింక, నీ
వాది ప్రచడదైత్యకులమం దుదయించితి, దైత్యరాజ్యమ
ర్యాద సమస్తమిప్డు భవదంసము పట్టెను వీరశేఖరా! 137

చ. దళముగఁ గీర్తిలక్ష్మి యొక తారువుఁగత్తియ యౌత నీకు ని
ర్దళనము పొంది రా నిఖిలదానవవీరులు నీవుగా నిర
ర్గళముగఁ జొచ్చి యింత సమరావసథంబు జయేందిరాసుధా
గళమున హేమసూత్రమును గట్టు స్వయంవరగాఢ సూత్రమున్. 138

ఉ. మొక్కలుపోయి యింక నయిపోయిన దన్న సురారిలక్ష్మి నీ
వొక్కఁడు దండివై నిలువుమోయి చమూపతి! పౌరుషంబె నీ
దిక్కగుఁ, గుత్తుకన్ విసముతేరిన సామిని నమ్మి నేటి కీ
ఫక్కికి వచ్చినాము, కరవాలమె నీకు శరణ్య మన్నిటన్. 139

క. వ న్నడిగినచో గెల్చుట యున్నది లేదిపుడు గెలుచు టది యేలా యే
మున్నది చివరకు గెలిచితి మన్నది కన్నీళ్ళు తుడిచినట్టులు కాకన్. 140

ఉ. ఈకపులున్ నృపాలకులు నిద్దఱు నింద్రజి చేత రెండు సా
ర్లాకడఁ జచ్చిరిన్ బ్రదికి రయ్యది చిత్రముగాఁగ నీవు నే
నీకడఁ జంపినన్ బ్రదుకు బెట్టులొ చేయుదు రైనఁగాని నీ
నా కరవాలముల్ రణమునన్ వధియింపక వీరిఁ దప్పదున్. 141

మ. నునుపో మక్కువ వేఱజాతిపయి యర్ణోరాశినీళ్ళుల్ మధిం
చిననాఁడేమొ విరించి నెన్నొనట వ్రాసెన్ దైత్యమౌ జాతికిన్
మనమేమో మనశత్రులన్ గెలుతుమ న్మాటే, తుదిన్ వారు ని
న్నును నన్నున్ వధియింత్రు గెల్చుటయు నెందుం జచ్చుటీజాతిపై. 142

క. అమరులు సరే సురారుల కమరిన సర్వారిచయము నమరులగుటొ? వ
ట్టి మనుజులుం గపులున్ వీరమరు లగుటయేమి? బ్రహ్మ ననవలెఁ గాకన్. 143

వ. అంతకుముందు మహాపార్శ్వుం డంగదుని సేన కభిముఖుండై గుఱ్ఱమ్ము నెక్కి ధనుఃఖడ్గ క్రీడాప్రచండుండయి కపిసేనాదుర్నిరీక్ష్యుండై యంగదాదులు వాని ఢాకకుఁ దాళలేకుండనుండ. 144

ఆ. గిరులు తరులు వాని శరములఁ జూర్ణమై వానిపైని దూఁకరాను రాక
యతని చాప మాడినంత మేరయు మృత్యు దేవతావిహారతీర్థమయ్యె. 145

క. నిలచినచో నిలువక యుజ్జ్వల సౌదామనివిధాన వల్గనవటువై
జ్వలియించె వాని యశ్వము నలయశ్వము వాఁడు, వాని నశ్వము, వెనువన్.

ఆ. అతని పార్శ్వవర్తులతనికంటెను గూడ నధికు లగుటచేత నంగదుండు
మఱియు జాంబవంతు మఱియు గవాక్షునిఁ దోడు తెచ్చుకొనియెఁదూఁగలేక.

క. ముగురకు బరువై యాతని బవరమ్ము గవాక్షుఁ డనియె వాఁడును మనకున్
ముగురకు నసాధ్యు డగుఁ గీశవీరుల మఱెవ్వరికి నసాధ్యుఁ డనంగన్. 148

మ. అనినన్ వాలిసుతుండు నవ్వి, యటులా? యల్లెన్నడుంగాద, యీ
దనుజశ్రేణి నెవండునేన్ మన కసాధ్యంబైనచో దానెఱుం
గునుసూ మారుతి, తానె వచ్చి యిట నీకుం బర్వు తగ్గించు, మిం
చినచోఁ దాన యెఱింగిస్వామి ధనువుం జేఁబూని యేతెంచెడున్. 149

గీ. అందుచే నసాధ్యుండుకాఁడనివచించి మఱి మహాపార్శ్వుఁడన్నట్టి మాటకేమొ
పార్శ్వగతరక్షఁదొలుతను బాయఁజేయఁగావలయునంచుఁజెప్పి యంగదుఁడు మఱియు.

క. యుగపత్క్రి యాప్రచండులు నగు నమ్మువ్వురను నాతఁ డాఁగికొనన్ లే
డుగఁ జెప్పి పార్శ్వగుల నేచి గవాక్షుఁడు తాఁకుటయుగఁజెప్పి మఱియునున్.

గీ. తోడలంఘించి జాంబవంతుండు వానిగుఱ్ఱమునుజంపుఁ బరిఘఁ గైకొంచుఁ దాను
నెగిరి వానిఁదాఁకుటనిర్ణయించి రావణుండు చనుదెంచి మాటాడుచుండ నాఁగి.

వ. విషయంబు తెలిసికొని యిది తనపినతండ్రికి బరువగుట మఱియు దొందరింప రావణుండటు మఱలుటయు నిటు తననిర్ణయంబు ప్రయోగించుటయు నై మహాపార్శ్వుండు నివ్వెఱపోయి వాహనంబుపోయి పార్శ్వరక్షపోయి ముసలంబున నమ్మువ్వురనుమూర్ఛ నొందింప నంగదుండు తెలివి పొందుటయు మహాపార్శ్వుండు వాని యెడమబుజంబున గొడ్డలితో వేయ నంగదుండు బుజము తెగియు నది లాగికొని దానితో వాని శిరస్సును ఖండించిన. 153

గీ. ఒక మహాసాగరము మధ్య నొక్క పెద్ద కంబమును నాటి చుట్టును గట్టియిన్న
సౌధమున నొక్కఁడొక్కఁడుజారిపోయి యల్లకంబము మిగిలిన యట్టులయ్యె. 154

శా. ఒక్కొక్కప్డు మనస్సె యాడద యెదో యూహన్ బయల్దేరు నా
యొక్కొండై చనునూహయో యదియె వేఱొక్కండు రానీయకన్
జిక్కుల్ గాఁ గొనసాగ దేవనియు నీచిత్తంబు స్తంభించు నా
యొక్కండే తొలియూహనిల్చి చనుఁదా నుద్భూతమైనట్లుగన్. 155

గీ. రామునిం జంపవలయును రామలక్ష్మ
ణులవలన నీ మహావిపత్తుల పరంప
రలు ఘటిల్లె రాముఁడు చావవలయు ముందు
లక్ష్మణుఁడుగూడఁ జావవలయుఁ బిఱుంద. 156

శా. రాముండెవ్వఁడు లక్ష్మణుండెవఁడునౌరా! వేల్పులా? దైత్యులా?
యేమీ! దిక్కుల నేలునట్టి దొరలా? యే వేలయేండ్లైన ని
స్సీమప్రౌఢి సరోజసూతినిఁ దపశ్శ్రీచేత మెప్పించిరా?
తా మెవ్వా రొక మంటిముక్కదొరసంతానంబ యాశ్చర్యమై. 157

గీ. నిన్న మొన్ననొ వీరు నాకన్ను లెదుటఁ బుట్టినా రింతలోపలఁ బొడుచుకొంచు
వచ్చినాఁ డెట్లుగా గ్రుడ్డువచ్చి పిల్ల వెక్కిరించిన యట్లైన విధము తోఁచె. 158

గీ. గాలితోఁ బుట్టుచుండును గాలితోడఁ జచ్చు నీఁగల దోమల చాయఁ బట్టు
మంచు వందేండ్లుబ్రదుకనియట్టి మనుజలోక మహావృక్షముంబలె నూగుచుండ్రు.

గీ. ఇంతలోఁ ద్రుంచికొనిపోవు నీతఁ డొక్క గట్టిజీవునివలెఁ జెట్టుకట్టినాఁడు
వీని చెట్టుతనంబును బెల్లగింతు వీని చెట్టుతనంబును విద్ధపఱతు. 160

మ. ఇది నారాయణమూలమౌ తరువు నాయీ రాముఁ డన్బోద యొ
ప్పిదమై లక్ష్మణుఁ డన్న వంగయు మహాభీష్మంబులౌ శాఖలై
ముదివగ్గై చను జాంబవంతుఁడు మరుత్పుత్త్రుండు సుగ్రీవుఁ డం
గదమైందద్వివిదుల్ గవాక్షగవయుల్గా వందలౌ వానరుల్. 161

మ. ఇది యీ కొమ్మలు సాగకున్న మునుపే యే దీని భేదింపఁగా
మది నూహించితి జానకీహరణ మన్మందుం బ్రయోగించి మొం
డిది యీ చెట్టును కొమ్మలన్ విరిసి నిండెం బూలతోఁ బండ్లతోఁ
జిదలున్ సాగర మావరించినది యాశాసంతతిం గ్రుమ్ముచున్. 162

శా. అస్మద్బాహువిలంబి చాపగళితోద్య ద్బాణవహ్నిచ్ఛటన్
భస్మీభూతముఁ జేతు నీదృశమనోభావంబు దర్పంబునన్
విస్మేరావహమైన యాదృశధనుర్వృత్తంబు నృత్తంబుగా
నస్మద్బాహుపరాక్రమేందిరకు దీవ్యద్దిగ్యశోమూర్తికిన్. 163

శా. ఖండింపన్ దొరకొన్న గొడ్డలుల మొక్కల్ ప్రచ్చు నీకొమ్మలన్
మండింతున్ బహుశస్త్రవహ్ని దివిలో మంటల్ ద్విధాభూతమా
ర్తాండజ్వాలలు గాఁగ బొగ్గులకునేన్ రాకుండ న న్నీ మహో
ఖండక్రోధమహాగ్ని మండలముగాఁగం దీర్చె వీఁడద్దిరా! 164

శా. ఓయీ! సారథి! నేను నారథముతో నున్నాను నీతోడ దై
తేయంబైన సమస్త శూరకధరిత్రిన్ శిష్టమై, యింకఁ బో
నీ యారాముని గుండె కెట్టయెదురై యేరీతిగాఁ బోవు నా
యీ యమ్ముల్ మఱి యంత సూటిగ మహోహిక్రూరవేగంబునన్. 165

శా. ఓయీ సారథి! మున్ దిగీశ్వరుల నే నొత్తన్ సురగ్రామముల్
పై యుగ్యంబుల మింటఁదోలితి మహాప్రౌఢిం బ్రతోదింపు మా
తోయం బొప్పఁగ రాముఱొమ్ము పగిలింతున్ నేను దోడన్ సుమి
త్రాయోషాసుతుఁడన్న యాతనియెడందన్ వ్రక్కలింతున్ మఱిన్. 166

శా. సారించెన్ దితిజాధినాథుఁడు ధనుర్జ్యావల్లి దిక్కుంభిక
ర్ణారూఢం బగు మింటి శబ్దగుణ ముగ్రంబై ప్రమాణాతిగం
బై రంహఃపరిసర్పణంబుగ విశీర్యత్వంబు సంధించుచుం
బారావారములోని వారుణపరిస్పందంబు కుంభింపఁగన్. 167

మ. డిమభూతంబుగ బాణసంతతి నిగిడ్చెన్ దిక్కటాహంబులం
దమరారాతిజగ న్మహేశ్వరుఁడు వ్యోమాపూర్ణ నానామహీ
ధ్ర మహాకానన భూమిజాతచయ పత్రశ్రేణులుం డుల్లగా
భ్రమరీసంచరణాభిరామ కుసుమవ్రాతం బపేతంబుగన్. 168

మ. శితికంఠార్చనదక్షుఁడా నసుర చేసెన్ సింహనాదంబు వి
క్షతమై భూతహృదంతరం బది ధరాసంలగ్నక క్షత్రసం
తతిప్రాణాంగణ ధర్మభావము వియత్సంలగ్న నక్షత్రసం
తతి నిత్యభ్రమణోద్గిర త్కిరణ సంతానచ్ఛవిచ్ఛేదమై. 169

గీ. ఎగిరి గుఱ్ఱాలఁ దోలించె హేష లొప్ప తగిలి రథమును దూఁకించె ధరణి కదల
రగిలి జ్యావల్లిమ్రోగించె గగనమద్రువ మిగిలి శరములువిదలించె మిన్నుమండ.

ఉ. సత్తు నసత్తు రెండివియు జంట సదా చనుఁ తోడుతోడుగాఁ
గత్తియు వర్మమున్ ముఱుగు కాల్వయు వెంబడిఁ బంటకాల్వగా
నెత్తిన ప్రాణసంతతి వహించును వీనిని, స్పర్థమానెడున్
సత్తుపయిన్ నిరంతర మసత్తు నసత్తును దొల్త లేనిదై. 171

గీ. సత్తు భావము వెలుఁగు, నస త్తభావ
మిరులు, తొలిమూఁడు నిజము చివరి వబద్ధ,
మిచటఁ గొంతది కొంతిది, సృష్టి సత్తు
నకు నిరతభీతియ, యసత్తనంగ నకట. 172

చ. తవిలి యసత్తు సత్తివి యధర్మము ధర్మముగా నెసంగుఁ, దా
నవిరతమై యధర్మము దురాగ్రహి, సత్తునకైన యీ యస
త్తువలని భీతి మానవులతో సుర యక్ష పిశాచ దైత్యదా
నవతతితో నెసంగెడు, మనఃక్రియలొప్పెడుఁ బ్రాణిరాజితో. 173

ఆ. భయమనఁగ నాంతరముపరిస్పందనంబు పంచభూతముల్ సైతముభయమునందు
రావణుని యీ పరాక్రమారంభమునకు క్షితి గగన వార్ధులును విహ్వాలతవహించె.

ఆ. అరయ సత్పదార్థ మన్నింటిలోనుండు నదియు లేక యున్కి యనుచు లేద
యున్న సత్పదార్థ ముదధి ధరా గగనాదులందు దైవమనఁగ నుండు. 175

ఉ. దీపితమూర్తియై వెలుఁగు తెచ్చిన ధర్మము సత్తు నైన సీ
తాపతి నాశనార్థముగ, దానవలోక మహేశ్వరుం డహో
చాపము నెత్తగా భయవశంవదమయ్యె ధరాధరాబ్ధిధా
త్రీపరిణామభూతములు వృక్షసరిద్బహుజంతు సంతతుల్. 176

చ. అమలినమైన ధర్మమున కంతటిభీతి ఘటింపగా నధ
ర్మమునకు నంతశక్తియవురా! యెటులన్ ఘటియిల్లు నాఁగ, లో
కమిది క్రియాజగత్తు, క్రియ కల్గినయట్టి ఫలం బొసంగు, ను
త్తమఫలమే క్రియం గలుగు దాని కదే ఫలమున్ ఘటించుచున్. 177

క. అతఁడు తపోవంతుఁడు మఱి వితతమహాశౌర్యజలధి, వివిధాస్త్ర మహా
తతి గలఁడు, సర్వదివిషత్తతి నోర్చినవాఁడు మఱి యధర్మమతియునై. 178

మ. అమరన్ భూతహృదంతరస్థము నధర్మాపేతమున్ సత్పదా
ర్థము ధర్మప్రవణంబు భాగవతమున్ రామాభిమానంబు, దై
త్యమహోగ్రం బగుశక్తి రావణభుజావ్యాపారదోశ్చండరూ
పముగా నెత్తిన నంతరావిలపరిస్పందంబుగా నూగెడిన్. 179

ఉ. సద్గత మీ భయంబును నసత్తును గూఱిచి, యచ్ఛమైన దౌ
సద్గతమౌ భయం బని యెసంగదు సద్బహుళాసు సంతతిన్
హృద్గతమై భయం బిది చరించును జిత్రము సాధుహృత్స్థమై
సద్గతమైన బాధయె యసత్పరిభావనిదానమై చనున్. 180

ఉ. వానరవీరులుం గనిరి వానిరథంబును వాని నూర్జితై
నోనిరతాంధ్యభా గవఘనున్ సహసాపరిదీపితోగ్రతే
జోనిబిడస్వరూపుని నిషూదితశత్రుని దీర్ఘచాపవ
ల్లీనినదప్రపూర్ణ విరళీకృత భూతమహోణుసంతతిన్. 181

క. పెఱ రక్షోవీరుల వగు శరతీవ్రత యెఱుఁగుఁ గీశజాతియు దశకం
ధరుని నిగిడించు శరములు నరుంతుదము లయ్యె మివుల నధికార్తిదముల్. 182

ఉ. శ్రీరఘురాము బాణముల శీఘ్రత వహ్ని యెఱుంగ రీ కపుల్
శ్రీరఘురాము సత్కరుణచే నవి వార లెఱుంగు టుండదున్
గ్రూరుఁడు రావణుండు నిదిగో శరముల్ నిగిడించు నయ్యయో!
శ్రీరఘురాముబాణముల శీఘ్రత వహ్నియు వీని మించునా? 183

శా. క్రోధాకారుఁడు దైత్యనాయకునిఁ గన్గొరాద యట్లయ్యు సే
నాధర్మంబుగ వానరాళి శిలలున్ క్ష్మాజంబులున్ రువ్వ న
య్యో ధాత్రీధరముల్ మహాకుజము లెన్నో వేలునున్ లక్ష లౌ
రా! ధారాగతి దైత్యనాయకునిచే వ్రయ్యల్ పొనర్పంబడున్. 184

ఉ. పూర్వసురారిరాజి శరముల్ నిగిడించుచు నుండగాఁ గపుల్
గర్వమహోగ్రతన్ దరులు గట్టలు వేయుచు నుండ నల్ల సౌ
పర్వవిరోధి గుల్మములో బండియొ వ్రీలుచునుండు నీమహో
ఖర్వధనుఃకళాపటిమ కానఁగరాద పురాహవంబులన్. 185

చ. ఇదియొక లీలగాఁ గలద యీతని కీ కదనంబు బాహువ
ల్గదమల శౌర్యరేఖ సురలన్ మఱలంబడఁ జేసె నన్న వా
క్పదమున లేద యచ్చెరువు కార్ముకచండుఁడు వీఁడు రాముతోఁ
గదనము సేయ కే నడుమగా విఱువంబడునట్లు సేయనా. 187

మ. అనుచున్ వానరవాహినీపతులు క్రోధాకారులౌచున్ మహః
ఖనులై చెట్లును దైత్యముక్తపరిఘల్ ఖడ్గంబులున్ బ్రాసముల్
గొని యొక్కుమ్మడి వానిపైఁ గవిసినన్ గ్రోధంబు ని ప్పన్నప
ల్కున నున్నట్టినిజంబు చూచిరి కపుల్ కుద్దాలదీవ్యన్నఖుల్. 188

శా. ఈయల్పుల్ నను రాముమీఁదఁ జనగా నీనంత శౌర్యాంబుధుల్
గా యోజించుకొనంగఁ దమ్మిదియు నిక్కం బబ్రమై పొల్చు దై
తేయుల్ పూర్వుల వీర లొక్కొకఁడు సాధించెన్ ననుం గూడ న
ట్లే యూహింతురు వీరి నందఱను మెట్లెక్కింతు స్వర్గానికిన్. 189

గీ. అని తనరు బ్రహ్మదత్తమైనట్టి తామసాస్త్రముం బ్రయోగించెఁ గీశాధికోగ్ర
సర్వసైన్యాధిపతులపై శస్త్రపాణు లఖిలకపులు నిర్వీర్యులై యటమటింప. 190

మ. గదలున్ బ్రాసములున్ మహాపరిఘలున్ ఖడ్గంబులుం దాఁకినన్
మదముల్ డిగ్గి శరీరముల్ దునిసి ధీమాంద్యంబు వాటిల్లి వా
రిదముల్ క్రమ్మిన తమ్మిపూఁజెఱువుగా శ్రేయోతిదూరంబుగాఁ
జెదరెన్ వానరసేన సర్వమును సంక్షీణాత్మతేజస్కమై. 191

క. తూలినిరాఘాటంబుగఁ దోలించెన్ బండి రామతోయదము దెసన్
గాలివలెం బటుర్ఘుంర్ఘూ భీలంబుగ రావణుండు భీషణమతియై. 192

సీ. శ్రావణాంబోధరచ్ఛాయా మనోజ్ఞాసితస్ఫాదు నీలసుందరశరీరు
సంవ్యాపి ప్రాతస్తుషారావనయన భాస్వరవారిజాత విశాలనయను
మధురప్రాతఃకాల మహిరుహోధశ్చ్యుత పున్నాగకసనాళ పుష్పనాసు
పరిసితారగ్వధావనిజాత కిసలయోపరిసాంధ్యరాగ సంవ్యానయుగళు
గీ. బాలవల్మీక వరజటాభరకిరీటు నవకుటజకోరకాగ్ర కాంత్యాభసహజ
సూక్ష్మమృదు మందహాస భాసురకపోలు రామచంద్రునిగాంచెను రావణుండు.

సీ. పీనాంసయుగ దృశ్యమానతూణీరేషు నతగరుద్భ్రమర సేవితముఖాబ్జు
కోదండప్రాగ్దిశా కుంభిశుండాదండ భాస్వర స్వర్గలక్ష్మీస్వరూపు
అయసవల్లి సమాశ్లిష్టకవచ దీప్తోరువక్షో మహామేరుభూతు
ఫాలద్యుతిచ్ఛటా శ్రీలీనశితలోచ నప్రభా హృతగగన పరిణాహు
గీ. ఘోరఫణి పరీభావజకోప లిప్త లిప్తనవవివృత్యభిముఖలీన సూక్ష్మ
చలనపటు ఫణాసదృశ హస్తములవాని రామచంద్రుని గాంచెను రావణుండు.194

సీ. శైవశరాస లస్తక హస్త సంత్రుటనాత్త కీర్తి ప్రథమావతారు
పరశురామాభీల బాహుగర్వవిభంజనజ్ఞాత దోరనంత ప్రభావు
ఖరదూషణాది రాక్షస చతుర్దశచమూ లీలావిధూనన క్లేశకారు
సప్తతాళీ ప్రభంజన కార్యచాపక ళా శ్లక్ష్ణతరకౌశల ప్రశస్తు
గీ. దర్పితాసుర వీరవధ ప్రచండ కృతికృతమహోపకారు దూరీకృతోగ్ర
మూలసేనామహాక్రూరు మోహదూరు రామచంద్రునిఁగాంచెను రావణుండు.195

సీ. నఖశిఖాపర్యంత ముఖరితబంభరీ కమనీయ వనమాలికామనోజ్ఞ
వక్షస్స్థలీ మార్దవగుణ సమాకృష్ట మృదుమందహాస లక్ష్మీసనాథు
రాక్షసవ్రజ సంహరణకార్య చక్రీభవత్కాద్భిర కార్ముక బాహుయుగళు
ఇందిరాసిత కపోలేందురోచిః పరిస్పందనానందిత మందహాసు
గీ. నిబిడితాకాశ నీలకాంతి ప్రరోహ కందళీకృతమంజుల కాంతదేహు
వినిహతసమస్తలోకమోహుని నిరీహు రామచంద్రునిఁ గాంచెను రావణుండు. 196

సీ. గిడసపాఱినకైక గడుసుదనమ్మునఁ బంపఁగా నడవులఁ బట్టువాని
జడదారిమూఁక వెన్నాడిచి యెక్కింపఁగా నంతంత వింటివాఁడైన వాని
ముల్లోకములయందమ్ముం జూఱగొన్నట్టి చాన రక్షించుకో లేనివాని
కోఁతిమూఁకలను వెన్నాని లంకపై నెందు నెఱుఁగని సేఁతగా నెత్తువాని
గీ. నేది యెట్లైనఁ బోవు నదేమి తనకు నన్న రీతి బైరాగిగా నున్నవాని
ప్రతిది తనకును ననుకూలపడెడు వాని రామచంద్రునిఁ గాంచెను రావణుండు.

క. ఒకసాయకమ్మె చాలున యకటా! యీతని వధింప నాశరవీర
ప్రకరము చచ్చె నితని నీతికి నొక్కొక్కండు గుండె తీసిన బంటుల్. 198

క. ఇదియును జిత్రముగా నున్నది నదితలపైనిఁ దాల్చె ననఁగా ననఁగా
నెదఁ జూఱగొన్న దేవర యిది యింతగఁ జేసె మఱియు నేమనవలయున్. 199

క. మాయిద్దఱ లోపల మఱి యీయన గెలుచుటయె మంచి దిప్పుడు తనకుం
బోయెడి దేమీ? నాకుం బోయిన దిప్పటికి సర్వమున్ మాయయుగా. 200

ఉ. ఆ పదిశీర్షముల్ గల మహోహికిఁ జూచుచుఁ జూచుచుండగా
గోపము వృద్ధిపొందెఁ బదికోట్ల గుణంబులు పెన్విషాగ్నులం
జాపము నెత్తి గ్రక్కెఁ శరజాలమిషంబున వైరిచేతిలోఁ
జాపము లేదటన్నదియుఁ జాలని నీతిగ యుద్ధభూమిలో. 201

గీ. ఎంత యశ్రద్ధగా నున్న నేమి స్వామి చెంతఁ జేరవు దనుజు దూసిన శరములు
నెపుడుకోదండమెత్తెనో యెపుడుదూసె నడుమవిఱుగుచునుండె దానవుశరములు.

ఉ. వంచన రూపముం గొనినవాఁడును కొంచెము యుద్ధనీతి పా
టించని దైత్యరాజు వికటించిన బుద్ధిని గాంచి బిట్టు కో
పించిన లక్ష్మణుండు వెనువెంటనె చాపముఁ బూని వాని ని
ర్మించుచునున్న యమ్ముల హరించెను మించిన వింటినేర్పునన్. 203

ఉ. ఈతఁడు మేఘనాదు వధియించెను ముందర వీనిఁ జంపుటా?
యాతఁడు సర్వకారణము నాతనినే మును సంహరించుటా?
చేతమునందు నిశ్చయము చేయక కొంచెము సేపు రావణుం
డాతని మీఁదికిం జనియె నంజలపైఁ బెడఁద్రొక్కి లక్ష్మణున్. 204

ఉ. వీ యొకయమ్ము చాలునని యెంచెనొ రాముని సంహరింపఁగా
వేయియు రెండుమూఁడయిన వేలుగఁ దాదృశబాణసంతతిన్
దూయఁగ వైరి రాఘవుఁడు దోసిళులన్ విరఁజిమ్మినట్లుగా
నా యఖిలమ్ము లమ్ములను నమ్ములఁ జిమ్ముచుఁ గ్రమ్మరింపగా. 205

క. తెక్కలు తెగిపోయినయవి ముక్కలు విఱిగినవి నడుమ మునిఁగినయవిగా
నక్కట పక్షులవోలిక నక్కాండచయమ్ము పరియలై చనుచుండెన్. 206

చ. ఇరువురు నేయు బాణముల నెల్ల వియత్తును నిండిపోవఁగా
విరిగినయట్టి శాణములఁ బృథ్వి సమస్తము నిండిపోవ నొ
క్కరి నొకరున్ శరమ్ములను గ్రమ్ముట సాధ్యముకాని దంచు బం
ధురతరమైన మంత్రములతో బవరంబును జేయ నెంచుచున్. 207

మ. ఇది శస్త్రం బిది యస్త్రమంచు మదిలో నేర్పాటుగా లేక య
క్కదనం బాడగరాద దేని ప్రతిగాఁగన్ దేనినిన్ వాడనౌ
నదియున్ నేర్వవలెన్ బరాస్త్రమునఁ బేరైనన్ మఱి న్నేర్వ కొ
ప్పదు వారిద్దఱు సర్వవేత్తలు దురాపప్రౌఢబాహాబలుల్. 208

చ. కటకట! యొక్క రొక్కరును గాంచినకోప మదింతకాద తొ
ల్లిటి యపకార మట్లునిచి దానికిఁ జేసెను వేయి రెట్లు ధూ

ర్జటి పదసేవకుం డయిన రావణునందున రామచంద్రుఁ డిం
తటిదగు కోప మేచుననినం దశకంధరునందుఁ బట్టునే! 209

ఉ. ఒక్కని భార్యఁ గొంచుఁ జను టుక్కివుఁడా దనుజాధినేతకున్
మిక్కిలి గోటిమీఁది పని మేదిని కన్యక నట్లు తెచ్చె వీఁ
డొక్కరుఁ డెత్తివచ్చి యది యోపనివాఁడయి వచ్చి లంకలో
మొక్కలు డెంతచేసె చిఱుమొక్కల సైతము పెల్లగించెబో. 210

శా. బాహోధూర్జటు లిద్దఱిద్దఱు మహేష్వాసుల్ కృతాస్త్రుల్ రణ
వ్యూహాభిజ్ఞులు శత్రుసంహరణకార్యోత్తాలధీకుల్ ద్విష
ద్గేహన్యాప్తాతి దుష్టుఁడొక్కఁడు ద్విషద్గేహానలుం డొక్కఁడున్
సేహుల్ శత్రువధైషు లుగ్రు లపరిక్షీణాత్మతేజుల్ బలుల్. 211

ఉ. మిన్నని తోచకున్నయది మిన్నది యమ్ములరూపు వెల్లువై
చన్న విధాన నొప్పె సహసావినిపాతిత బాణజాలసం
ఛన్నతఁ బృథ్వీభాగము దిశాతతి శాతశరాహతిన్ సమీ
హా న్నతకాంతి యొచును గవాక్షిత మయ్యె నభంబు బిట్టుగా. 212

ఉ. అంతట నంత రాత్రిపడె నంబుజమిత్రుఁడు క్రుంకెఁ జీకటుల్
వింతలుగాఁగ వారినిధి వీచికలం బ్రతిబింబితంబు లౌ
కాంతములైన తారకల కాంతులు క్రొచ్చిన యిర్లపిండులం
గ్రంతలు పొల్చె నల్లుల పరంపర లంటు మిడుంగురుల్ బలెన్. 213

ఆ. సాగరంబు లేదు రేగు చీఁకటి లేదు మిన్నులేదు మఱియు మన్నులేదు
వారె కలరు బాణపంజరంబున యందుఁ బోరుచున్న రెండు పులులవోలె. 214

చ. కవచసురక్షితంబులగు కాయములందున బాహులందునం
దవిలిన యమ్ము లే దలుగుతండము దవ్వనయందె విర్చుచుం
డ విధృతకోపియై దితిజనాథుఁడు నేర్పున నైదునమ్ములన్
రవిలిచి రాము నెన్నొసట రక్తము జిమ్మన లేవ నేసినన్. 215

శా. కోపం బేచి రఘూత్తముండును వెసన్ గోదండమున్ జ్యాలతా
క్షేపంబై యొసఁగంగ రావణునిపై శీర్షంబునన్ మోమునం
దోపన్ రాని శరంబులన్ నినిచెఁ, దా నోపెన్ సురారాతి, హే
లాపద్మాక్షుఁడు రామమూర్తి కతివేలంబైన యాశ్చర్యమై. 216

గీ. వాలి యొక్కయేయమ్మునవాఁడిమికినినాపునకునిల్వలేదొ యా యులియలుగులు
వదికి నిర్విదికిని వీఁడు కదలఁబోడు వీఁడు పదిపర్వతంబుల బిగువుకలఁడు. 217

సీ. అసురప్రయోగించె నాసురాస్త్రము బ్రహ్మ నిర్మితంబును తనూమర్మభేది
దానినుండి సముద్గతం బయ్యె ఖడ్గముల్ ప్రాసముల్ పరిఘలు పట్టిసములు
నలుగులు తోడేళ్ళు పులులు భుజంగముల్ ముఖములు గలవి యమోఘములును

గీ. నొక మహాంధకారంబైన యుగ్రమైన యట్టి కాంతారమునుబోని దడుగుతీసి
యడుగు వేయగరానిది యడుగడుగున బ్రాణమునుదీయునట్టి యస్త్రంబు నేసె.

సీ. దండకాటవిఁ ద్రయోదశవర్షములుగాఁగ సంచరించిన రామచంద్రుఁ డేసెఁ
బావకాస్త్రంబును బ్రబలనక్షత్రముల్ గ్రహములు వహ్నిశిఖాసహస్ర
ములును దావాగ్నులు పొడిచిన చంద్రులు విరిసిన సూర్యులు వెక్కసముగ
నయ్యస్త్రమువనుండి యావిర్భవించి కాంతారాస్త్రమును సర్వనాశనంబు

గీ. చేసినం జూచి దానవశేఖరుండు మనసునందునఁ బదిరెట్లు మండిపడియె
తన సహస్రవర్షంబుల తపమువలనఁ గృచ్ఛలబ్ధమస్త్రంబు విశీర్ణమైన. 219

సీ. అమర లంకాపట్టణము వినిర్మింపించి నపుడు తానిచ్చిన యువదలకును
మఱియు సుప్రీతుఁడై మయుఁ డిచ్చినట్టి రౌద్రాస్త్రంబు నేసెను రావణుండు
ముద్గరంబులు శూలములు మొదల్ గాఁగ నా యుధము లందుండి సముద్భవింప
దశరథసూతి గాంధర్వాస్త్రమును విడ్చె నది అంపములవోలె నరుగుదెంచి

గీ. మద్గరముల శూలమ్ముల ముసలములను గడఁగి కణుపులు కణుపులుగాఁగ రాచె
దైత్యు కోపాగ్ని చలితచేతంబు వేయి గాఁగ విఱువులు విఱువులు గాఁగవిఱిగె.

సీ. తనవద్ద నొక్కయస్త్రంబున్న యది దానిఁ జూర్ణించుటకు వీలు సుంతపడదు
తనర సముద్భవించును దాని నుండి చక్రమ్ములు స్థూలసూక్ష్మమ్ము లగుచు
వాఁడియంచులతోడి వేఁడిమంటలతోడఁ గదియఁగా రాని వేగంబుతోడ
గిరగిర తిరిగి తాఁకినచోటఁ గత్తెర వెట్టు చావఁగరాని వేగమొప్ప

గీ. దానిపేరు సౌరాస్త్రంబు దానినెంచి రావణుఁడు ధ్యానమగ్నుఁడై రాముఁడింక
దానితో నంత మగునని తలఁచి యేసె నదియు రోహిణికార్తెనానరుగుదేరె. 221

సీ. రాముండు చూచి మంద్రమ్మృదుహాసముచేసి ప్రతిలేని యట్టి యస్త్రము నెఱింగి
కైకేయి నేర్పిన కార్ముకశ్లక్ష్ణ విద్యాప్రభావంబున నమ్ములేసె
చికిలివా నమ్ములు జిలుగులౌ నమ్ములు ప్రక్కవాటమ్ములు వ్రచ్చు నమ్ము
లింతవేగమ్మంచు నేర్వరింపఁగ రాని యుగ్రానిలములతో నుఱుకు వాని

గీ. వేగి చక్రాలవేగమ్ము వేగపఱచి వేగము వృధాపఱచువాని వేగమందె
శీతలింపించి వాఁడిమి జెఱచువాని బల్లపఱపుచు మొక్కవోఁ బఱచువాని. 222

ఉ. బమ్మెరవోయె రావణుఁడు బ్రహ్మయుఁ జేయఁగజాల డీ పనిన్
నమ్మగరాని వయ్యె నయనంబులు, వేలును లక్షలైన చ
క్రమ్ములు సూక్ష్మముల్ శరపరంపర వమ్ముగఁ జేంత, చేతఁజి
క్రమ్ము కలాఁడు చేయవలెఁ గాని యొరుం డొనరింపఁజాలఁడున్. 223

ఉ. అప్పుడు రామచంద్రు గన నాయన చేతి ధనుస్సు చక్రమై
యొప్పెను శీఘ్రశీఘ్రముల నుగ్రశరంబుల నేయు వేఁడిలోఁ
ద్రిప్పఁచుఁ ద్రిప్పచున్ విలు ధరింపఁగ నద్దియె నాల్గుబాహులై
కొప్పను శంఖమై విరిసికో ల్వహియించెఁ గనుల్ భ్రమింపఁగన్. 224

చ. తొలుత సుమిత్రబిడ్డఁ బెడఁద్రొక్కిన యప్పటినుండి రాముని౦
దలపడి యుద్ధమాడుట ప్రధానముగా నయినన్ సురారి వం
తులు పడుచున్న లక్ష్మణునితోడన బోరును జంపలేద యు
మ్ములు నిగిడించు చార్చుచును బోరుచునుండెను మధ్యమధ్యలో. 225

ఉ. కార్యము దుర్ఘటంబయినఁ గల్గు ఫలానికి దేనిపైననో
ధైర్యము పెట్టుకొంచు నది తాఁ జెడిపోయిన జారు గుండెయై
వీర్యము మాలినట్లు కనిపించును రావణుఁ డట్లు తోప ధీ
ధుర్యుఁడు లక్ష్మణుండు తఱితోఁ బరగించుచుఁ బెక్కులమ్ములన్. 226

శా. సౌరాస్త్రోద్ధతచక్రసంచయములన్ జాపక్రియా ప్రౌఢవి
ద్యారూఢిన్ విదళించు నగ్రజుని దైత్యస్వామి శస్త్రంబులన్
వారింపం దలపెట్టకుండఁ బరగింపన్ దీవ్రనారాచముల్
వే రక్షఃపతి వీనివంక మఱలెన్ విస్ఫారకోపంబునన్. 227

మ. నృకపాలోగ్రము దైత్య కేతనము తార్చెన్ నేలకుం, గోపియై
వికటాస్యుండు దశాస్యుఁ డూర్జితముగా విడ్చెన్ మహోభీలశ
స్త్రకదంబంబుల లెక్కసేయక సుమిత్రాసూతి దుర్వారశ
స్త్రిక నొక్కండు కదల్చి సారథి శిరశ్ఛేదంబు గావించినన్. 228

మ. మిపులన్ మండిపడెన్ దశాననుఁడు సౌమిత్రిన్ విలోకించి దా
నవుఁ డేదేని బెడంద యెంచు నను చింతంగూరి తత్రత్యుఁడౌ
వ్యవధాబుద్ధి విభీషణుండు గదతో నవ్వాని గుఱ్ఱంబులం
గవిసెన్ వాని తల ల్పగిల్చెను దురంగంబుల్ ధరన్వ్రాలఁగన్. 219

సీ. వీడుఁగా యింద్రజి వేల్చుకందువ చెప్పె వీఁడు దైత్యకులంబు వేరుపురువు
నచటి రహస్యంబు లిచటఁ జెప్పచునుండె నది చాలనట్లు దురాత్ముకుండు
వీరి పక్షంబున వీరుఁడై యుద్ధమాడుచునుండె సిగ్గువీడుటయె కాక
భయము లేకుండంగ వచ్చి నాతోఁగూడఁ గదియంగ సుంత కొంకఁడు బికారి
గీ. వీని వధియింతు నంచును దానవేంద్రుఁ డెద వినిశ్చయపఱచుచు నెద పగుల్చ
పనికి నది యొక్కఁడే చాలు ననినదాని శక్తి నేసెను వే విభీషణుని పైన. 230

ఉ. దాని నెఱుంగు లక్ష్మణుఁడు తాను విభీషణుఁ డిందు జోక్యముం
బూనఁగ రాద శక్తి యిది ముక్కలు ముక్కలుగాఁగ నయ్యు బ్రా
ణానికి దెచ్చునంచును ఘనంబుగు స్వీయమహోగ్రదోర్బల
ధ్యానము చేసి నారసము లైదిఁట శక్తి నశక్తిఁ జేయగాఁ. 231

ఉ. కాంచుచు నున్న రావణుని కన్నులయందున లోన లోన వ
ర్తించుచు నున్న వహ్ని వివరించిన మంటలు లేక పెట్ట జ
ల్లించిన యట్లు గాగ గదలించని చూపులు సూదులౌచు యో
జించిన కార్యపున్ ఫలము చేతికిఁ జిక్కినయట్లు లెంచుచున్. 232

సీ. అడవి భార్యావిరహముగఁ జావకయుండ నన్న నోదార్చికొన్న యదియుఁ
లేడియౌ మారీచు లేడి కన్నులను జరించు దానవత గుర్తించినదియుఁ
బదుమూఁడుసమలు బ్రాల్పక తెప్ప నింద్రజి మృతికోసమై నిగ్రహించినదియు
దన యన్న శరణమిచ్చిన విభీషణుని రక్షించు ధర్మంబు యోజించునదియుఁ

గీ. గామమున్ గెల్చినదియును గ్రౌర్యమునకుఁ బొలముగానైనదగు వీని తెలివి యెల్ల
నేటికిఁ బరిసమాప్తిఁ బొందింతు ననుచు నెంచి రావణుఁ డిట్లు వచించెనతని.

క. అతనిని నిజముగ రక్షించితి వగు నిను నీవ రక్షచేసికొనుము నీ
మృతిలోన నీదు నగ్రజు మృతియు నిమిడియున్నయది సుమిత్రాతనయా! 234

వ. అంత మయనిర్మితం బష్టఘంటాకమ్ము నశనిమహాస్వనంబు ప్రళయకాలాశీవిషా
కృతిఁ దాల్చిన రుద్రుని వంటిదియు రావణ బాహుసర్వవేగోత్సృష్టంబు నయి
మహాశక్తి లక్ష్మణుని గుండియకు సూటిగా వచ్చుచు. 235

చ. గణగణలాడు చెన్మిదగు గంటలతోడ మహాహివోలె ల
క్ష్మణు దెస వచ్చుచున్న దగుశక్తిని గాంచి రఘూద్వహుండు ల
క్ష్మణునకు నెల్ల స్వస్తియగుగాక యటంచు చనె నంతలోన ల
క్ష్మణుని యురంబు భగ్నముగ సల్పెనుశక్తి యతండు త్రెళ్ళగన్. 236

చ. నిముసములోపలం దెలియనేరఁడు తానును రాముఁడంచు వి
క్రమనిధి మేన గ్రుచ్చుకొను రావణు నమ్ములచే నెఱింగి తా
నమరిన దుఃఖమంత హృదయంబును నిండగ దైత్యనాథు బా
ణములు నరుంతుదమ్ములయి నాటుచు నుండ శరీర మంతటన్. 237

గీ. అంత రాముఁడు తమ్ముని కడ్డు నిలచి చేత విల్లూని దైత్యుఁ గాంచెను దృశాగ్ర
వహ్ని, రావణు మేను గంపంబునొంద నసుర యమ్ముల నేయుట యాపలేద.

శా. రాముం డొక్క విలిప్తలో శతసహస్రంబుల్ శరంబుల్ మహో
ద్దామంబుల్ పరగించ వాని వగు శస్త్రంబుల్ విదారించి త
ద్భీమంబైన శరీరమంతయును గప్పెన్ బర్వతంబున్ బయ
శ్శ్రీమంజూషికవోని మేఘము వలెన్ దృగ్ద్వార మౌనట్లుగన్. 239

వ. అంత రాముండు మహాకపులు నివారింపరాక ధరాతలంబున దూరిన యాశ
క్తిని బాహులతోఁ బెకిలించి దానిని విఱుచుచుండగా రావణు డంపమొయిలు
విరియించి మఱల రామునిపై బాణప్రయోగంబు చేయుచుండలెక్కసేయక.

ఉ. కుట్టినతేలు రాచుటయుఁ గ్రొచ్చిన యమ్మును విర్చి పెట్టుటల్
ముట్టిన పుర్వుఁ జంపుటయుఁ బుట్టిన బాధ సగంబు త్రోయుటై
నెట్టన శత్రుకార్యము గణింపక పై నవమానపుచ్చులై
యట్టుల రావణుండును శరావళి గుప్పుచునుండె రాముపై. 241

వ. అంత రాముండు కోదండ దండంబున వాని యమ్ములం దొలఁగఁ ద్రోయుచు
సుగ్రీవాంజనీసూనులం గాంచి యిట్లనియె. 242

క. తానేమొ చూచుచుండఁగఁ దా ననుజుని కేమొ యింత దగ్గరనుండన్
దానవుఁడింత యొనర్చెను తానా! రాముండు వాఁడు దైత్యుడు కాకన్. 243

మ. పరిరక్షించుచు నుండుఁడీ యనుజునిం బాకారి నిర్జించె న
య్యరి, పాకారిని గాంచ నద్దనుజుఁ బ్రేతాకారుఁ బంపించెదన్
సిరిఁగైకొన్నది చాలకీ యపకృతుల్ సేయంగఁజొచ్చెన్ మఱిన్
మఱి యీధాత్రియహో యరావణ మరామంబేదియో కావలెన్. 244

ఉ. నాపినతల్లి యీతని వనంబుల కంపెను నేను వద్దుర
న్నా! పనికాని యీపని యటన్నను వచ్చె నితండు, వచ్చినాఁ
డో పదునాల్గువత్సరము లోపిటినో పితృవాక్యపాలనం
బీ పరమాసురుండు ఘటియించెను సర్వఫలంబు నేటికిన్. 245

చ. ఇఁకఁ గనుగొండు చాపమున నింతగఁ జేయఁగవచ్చు నన్నదా
నికిఁ బరిధీకృతంబుగను నేఁ బొనరించెద, దైత్యమూర్తి వీఁ
డొకరుఁడు కాద, యింకఁ బదియుం బదియుం దలలైనవాఁడు గా
ర్ముకి నయినట్టి నాదయిన ముందర నిల్వను గల్గుటుండునే? 246

ఉ. నాదయినట్టి రామునితనంబును జూడుఁడు మీరలెల్లనే
నూఁదిన విండ్లు వేలు మఱియుం గరముల్ పదివేలుగాఁగ దా
నీ దనుజేశ్వరుండనుచు నెవ్వఁడొ రావణుఁడంచు నుండఁ డా
హో! దురితాత్మకుండయి మహాహవమున్ విడి పాఱిపోనిచో. 247

గీ. అని విలుకొనురామునకుం గనుగొనఁ బదివేలునైన కరములు వేయౌ
ధనువులు గాఁగ మహాభయమునఁ రావణుఁ డంత బాఱిపోయెఁ జులుకనై. 248

వ. అంత శ్రీరామచంద్రుడు లక్ష్మణ పర్యవస్థితుండైన సుషేణుంగాంచి యిట్ల
నియె. 249

క. నా తమ్ముని బ్రదికింపుము సీతావిరహమున నేను సేగిం గనకన్
నాతమ్ముఁడు రక్షించెను నాతో వనములకు వచ్చినాఁడు కపీంద్రా! 250

గీ. అతఁడుచనిపోవలేదని యీవుచెపుమ యితని బ్రతికింతు నంచును నీవుచెపుమ
యితఁడుబ్రతుకకయున్నచో బ్రతుకనేను నాకురాజ్యమ్మువలదు జానకివలదును.

ఉ. ఎచ్చటి యోషధీలతలు నీవ యెఱుంగుదు కానలందు భూ
భృచ్చయమందు నీవయిచరింతువు చూతు గుణంబెఱింగె దా
యెచ్చటి యాకొ తెచ్చిభరియింపుము నాయనుజన్ము ప్రాణముల్
తెచ్చిన నీదు పుణ్యమును దీర్తు భవంబుల నైన నోకపీ! 252

శా. ఇంకన్ రావణు నే వధించవలెనం చేమున్న దా సీత నా
వంకన్ వచ్చియు రాక యొక్కటియె, నాప్రాణంబులన్ బ్రాణమీ

కైంకర్య ప్రథమానమూర్తి విడి నాకంటెం ద్రపాహీనుండై
యింకన్ సౌఖ్యము కోరు నెవ్వండును వాండెవ్వాండో దుర్బీవియై. 253

క. మునుపటి బంధ మ్మనుజుండు వనితాబంధమ్ము నేటి బంధము సంత
త్యనుబంధము లేనియెడన్ వనితాబంధమ్ము కూడంబట్టదు దీనిన్. 254

శా. రానీ! పంక్తిగళున్ గృపీటధరధారాధోరణీసారణుల్
గా నమ్ముల్ కురియింపనీ? యనుజుం డీకాండీరరత్నమ్ము లేం
డేనిన్ రాముండు లేండు కానియెడ నే నిందుంటి వాండున్ సుషే
ణా! నీవుం బరికించి చెప్పంగదె యున్నాండంచు వైద్యోత్తమా! 255

వ. అని కోదండంబు బుజంబు జార్చి నిర్వ్యాపారునివలె విషణ్ణుండైన రామచం
ద్రుని గాంచి సుషేణుం డిట్లనియె. 256

చ. మఱి వదనంబునందుం గళ మాయదు వెచ్చదనంబు మేనునం
గొఱవడ దెందు కిట్టు లనుకొంట? నవారుణపద్మపత్రసుం
దరములుగాం బ్రవాళములునా నవుబో యఱచేతు లేగతిం
బొరసె నితండు మృత్యు వనం బోలును? నా కనిపించ దా గతిన్. 257

మ. అణుమాత్రమ్మును లేదు సంశయము దీర్ఘాయుష్కుండో వాని ల
క్షణముల్ సర్వము గోచరించు నిట మీ కాండీరరత్నమ్ము ల
క్ష్మణుం డింతేనియు నేగి పొందండును దుఃఖం బూన నైనట్టి కా
రణముల్ లే వింట రాఘవా! సుశరధారాకృ ద్విషల్లాఘవా. 258

శా. నీ యీ దుఃఖమె చాల ముచ్చటగ నుండెన్ రామ! విల్కట్టుంజే
దోయింజార్చుము రావణుండు జయముం దోకొంచుం బోవున్ మఱిన్
నీ యీ తమ్ముండు నేట జేపటను దానే లేచికూర్చుండు మే
మే యీకోంతుల మంబుధుల్ నడుమ సామీ! చిక్కుకొన్నట్టులై. 259

ఉ. ఓరఘురామ! నీపలుకుచుండిన మాటలలోని సవ్వడుల్
దారులుకొట్టి ప్రాణవుం బథంబున లక్ష్మణు మేనియందునన్
జేరుచునుండెం బ్రాణములు శ్రీపతి! నిక్కపు దుఃఖమందినన్
దీరిన ప్రాణముల్ తిరిగి తెచ్చును గాదటె ప్రాణబంధులన్. 260

చ. తడబండకుండగా మివుల ధైర్యముతో నిటు లాడంగా సుషే
ణుండు రఘురాము నాననమునుం దళుకొత్తెను, దమ్మునందు నే
ర్పడిన యెదేని కాంతి కనవచ్చెను శ్రీరఘురామమూర్తికిన్
వడిగ సుషేణుండున్ జలధివాఃపరిలంఘనదోఃపటిష్ఠునిన్. 261

చ. ప్రవిమలధీవిశాల పరిభాసితు మారుతిం గాంచి యయ్య! జాం
బవదుపదిష్టమైన హిమవద్గిరిసానుగతంబు నోషధీ

ప్రవిమలపర్వతంబునను భాసిలు నక్కరణుల్ గ్రహించి ర
మ్మవిరళరామకార్య కరణాద్భుత బాహురమాధురంధరా! 262

వ. నీ వెఱుంగుదు కద సంధానకరణి సౌవర్ణకరణి విశల్యకరణి సంజీవకరణి యను
నవి. నే నీ లోపున నితని మేన నున్న యమ్ములు పెకలించి చికిత్సించు
చుందు ననన. 263

క. మిన్నందెన్ హనుమంతుఁడు ము న్నీతని మింటి కెగురు పోడిమి కనఁడున్
గన్నాఁ డిప్పుడు రాముఁడు వెన్నంటిన వృక్షసమితి వెనుకం బడఁగన్. 264

క. చన్నాఁడు హనూమంతుఁడు మిన్నింతటి చిన్నదైన మేరయె యనఁగాఁ
గన్నులు నమ్మఁగ రాకయ యున్నవి మనసేమొ నమ్ముచున్నదిమఱలన్. 265

శా. వచ్చెన్ మారుతి తెచ్చెఁ బర్వతము సంభావింపఁగా లేన నే
నెచ్చో నున్నవొ యోషధుల్ కనుక భూభృత్తెల్ల భూభృత్తుగా
నిచ్చోఁ దెచ్చితిఁ జూచికొమ్మనఁగఁ దానే యోషధుల్ కోరెనో
క్రొచ్చెన్ వాని సుషేణుఁ డంతఁ గొనిపో క్షోణీధరం బన్నచో. 266

ఉ. అయన కొండఁ దెచ్చుటయు నాయనకొండను గొంచుఁబోఁక కం
దోయిని విప్పిచూచుచు మనోహరణంబుగ వారు వీరు దై
తేయులు వానరుల్ మనసు తెప్పిరిలంగను జేసికోను లే
కాయన పర్వతం బునిచి యచ్చట వచ్చెఁ బునఃప్రయాతుఁడై. 267

మ. చెలువొప్పన్ నిదురించి లేచె నన లేచెన్ లక్ష్మణుం డబ్జగం
ధిలవిస్ఫారదృశాభిరామముగ వైదేహీమనోనాథుఁడ
ర్మిలి బాహాపరిరంభణమ్ముగను సౌమిత్రిం గ్రహించెన్ ద్యుతుల్
పులకల్ పొందినయట్లు సోదరుల నవ్వుల్ పండఁ జింతామణుల్. 268

వ. మఱియు శ్రీరామచంద్రుం డిట్లనియె. 269

శా. అన్నా! నీవును జన్న నాకిఁకను రాజ్యంబేల? యేలా మరు
త్సన్నద్ధంబగు జీవితంబు ధరణీజాతా సమాయోగ సం
పన్నత్వం బదియేల? యేల జయమీ వారాశివేలా పరి
స్కన్నక్ష్మాజచయాల్పపర్వత శిలాసంశీర్ణ లంకాతటిన్. 270

చ. విపినము రామలక్ష్మణులు వెళ్ళిరి, వచ్చెను రాముఁడొక్కఁ డీ
యపయశ మింతయుం బొసఁగ, దైనఁ బొసంగునొ యన్న కారణ
వ్యపగతమైన భీతి మనసందునఁ గొంతటివేళ నుండె, నీ
వుపహితజీవితుం డయితివోయి మదంతరప్రాణవర్తికా! 271

ఉ. అత్తఱి నీవులేక భయమయ్యెడి నివ్వనుకో నయోధ్యలోఁ
దత్తరపాటుపొంది పినతల్లినిఁ జూడగ, నామె నన్ను వి

ల్లెత్తుగఁ జూచుచున్ భయములే దనుకొన్నది నిన్నుఁ బంప లో
కోత్తరవర్తనుండ వయియుందువ తానది యట్టులైనచో. 272

మ. అనినన్ లక్ష్మణుఁ డిట్లనెన్ దనుజు నేమైనన్ సరే నేవధిం
తు నటం చీవు ప్రతిజ్ఞ చేసితివి నీ దుఃఖంబుచేతన్ బ్రతి
జ్ఞను భంజించుటచన్నె? యందునఁ బ్రతిజ్ఞామూర్తివీవై, యెవం
డును దుఃఖంబున కొగ్గు? వే సముపపన్నుండై బుతార్థ్యంబునన్. 273

ఉ. జానకి వేఱుచేసినది చాలక నన్నును వేఱుసేయఁగా
దానవుఁ డెంచుచుండె నతిదారుణుడంతకు మించి నాస్తికుం
డైన నధర్ముఁడైన బరమార్థ రహస్యవిదూరుఁడైన ను
న్నే? నిను నన్ను వేర్పఱచు టెన్నడు కానిది యేర్పరించుచున్. 274

ఉ. నక్తములం జరించుచును నన్నును జానకిఁ బాపి నిన్ గ్రియా
శక్తులు లేనివానిగను సల్పి స్వతంత్రతపఃప్రభావసం
సక్తత నిన్ జయించుటకు జాల్కుఁడు లోనఁ దలంచుఁ దత్సుతుం
డుక్తపథంబువం జన ననుక్తపదంబున వానిఁజేర్చితిన్. 275

ఆ. ఇపుడు కర్మసాక్షి యపరాంబునిధిఁ గ్రుంకుటకును మున్న వేసడములకొఱకు
బండికొఱకుఁ జిన్న పాలసుండగు వాని నాజిఁబంపు యముని రాజధాని. 276

ఉ. అ యనలాక్షుఁ గొల్చుటయు నద్ది. మృషారచనంబు వీఁడు శా
క్తేయుఁడు దుష్కృతుప్రభవదీధితి సీతలమీఁదఁ బెట్టు దై
తేయుఁడు వీనిపుత్త్రికుఁడు దీధితిరూపగిరీంద్ర కన్యకా
జ్ఞేయమహాస్సు మీరగుట చేతము చేయఁడు దుష్టబుద్ధియై. 277

మ. సరథుండై చనుదెంచె రావణుఁడు దీక్షాస్వీకృతేష్వాస ని
ష్కర దీవ్యద్గగనస్పృశత్తనువు గండూషించి సద్యస్తపః
పరిచిత్యగ్ర మహోగ్రసంస్మరణ తీవ్రాకారుఁడౌచున్ ధరా
భర మంతంతన బండిచక్రములదౌ బర్వ్యానఁగా నూగఁగా. 278

సీ. ఫాలభాగవిభాసి భసితత్రిపుండ్రోపరివిలిప్త కుంకుమశ్రీలు నెఱయ
కంఠగతైకముఖశివాక్ష పరిదీపితార్ద్రి కుంకుమదీప్తు లవఘళింప
శ్రవణాగ్రమకుటాంత సమ్మృష్ట నవకదంబకపుష్పవాసనల్ పరిమళింప
జ్యాసంగతాంగుళీయక భోగిభోగాగ్ర మాణిక్యకాంతులు మూఁగుదేర
గీ. విఱిచికట్టి నష్టాపదాంబరము మరకతాంచలాంశులు దెసలందు సంచరింప
పంచభూతమ్ములును బట్ట బరువుగాఁగ రావణుఁడువచ్చె యుద్ధసంక్రాంతబుద్ధి.

ఉ. వచ్చుచునే దశాననుఁడు బాణములన్ రఘురాము మేనునన్
గ్రుచ్చుచు వచ్చెఁ దీవ్రము లరుంతుదముల్ మణిరుక్మపుంఖముల్
త్రచ్చిన నిప్పలైనవియు రాముని పచ్చికపట్టు క్రొంజిగుల్
ముచ్చటకొల్పు మే నెసఁగె బూచిన తంగెడుచెట్టు వోలికన్. 280

ఉ. అంబుదముల్ ధరాధరము నట్టుల వాహిని వల్లమట్లు బా
ణంబుల నావరించె రఘునాథుని జిందన భూరుహంబు స
ర్పంబులు వోలె నందు రఘురాముని కందువ తోచె వింటియ
గ్రంబున వార్షుకం బయిన రాతిరి మిన్నులు మెర్పుచే బలెన్. 281

మ. విరియించెన్ రఘురామచంద్రుఁ డసురోర్వీనాథు బాణంబులన్
కురియించెన్ రఘురామమూర్తి దనుజక్షోణీశుపైనమ్ములన్
హరియించెన్ రఘువీరుఁ డన్ తరణి క్రవ్యాదాంధకారమ్ములన్
మెరయించెన్ ప్రభు వంపవానల సమున్మీలద్గరుచ్ఛంచలల్. 282

ఉ. దేవతలున్ సురల్ ఋషులు తెచ్చిన భేదము చూచి, బండిపై
రావణుఁడున్ ధరిత్రిపయి రాముఁడు, నిత్యసమూర్ధ్వదృష్టిగాఁ
గావలెనంచు వారడిని గ్రమ్మకొనన్ వలె నమ్మనమ్మనన్
శ్రీవిభుఁ డంచు మిక్కిలియుఁ చింతవహించుచు నుండునంతలో. 283

క. ఒక యొయ్యారపుఁ బాగయు నొకప్రక్కలఁ జూచు చూపు నొనరఁగ మోచే
తికడ బిగియు నంగీ కల యొక దివ్యుఁడు వచ్చి రాము నొగి దర్శించెన్. 284

చ. అపుడు సుతీక్ష్ణ నాశ్రమమునందున దూరమునందు లీలగాఁ
గపురపుఁ గ్రొమ్మొయిల్ నడుమఁ గాంచిన బంగరురేక లొప్పదే
వపతి రథంబు కన్నులకు స్పష్టముగాఁ గనిపించె ముందరన్
బ్రపవలె రామచంద్రునకు రావణయుద్ధ మటన్న వేసఁగిన్. 285

మ. మును మా పూర్వుల కింద్రుకోసమయి, యిప్డో నాకు నాకోస మై
నను మన్నింపఁగదే ఋణంపడెద నన్నా దేవతాసారథీ!
యనినన్, మాతలి యిద్దియున్ మఘవుకార్యంబే యనన్ బిన్నన
వ్వున రాముండు ప్రదక్షిణించి రథముం బొల్పందె దైత్యారియై. 286

వ. ఇంద్ర ప్రేషితంబు మహాచాపంబు స్వీకరించి తత్కవచంబు ధరించి యతఁడు వంచిన మహాశక్తి నవధరించి కాంచనచిత్రాంగదభూషితంబు కింకిణీశతమధుర నాదంబు వైడూర్యమయకూబరంబు రుక్మవేణుధ్వజంబు హేమజాలవిభూషిత హరిసమాయత్తం బైన రథంబు రాముం డారోహించిన. 287

శా. లోనన్ మండిపడెన్ దశాననుఁడు సోల్లుంఠంబు గాఁగన్ త్రిలో
కీనాథుం డతఁ డెక్కె నెక్కియుఁ ద్రిలోకీరావణుం గెల్చు పీ
డీ నారంబును సౌర మెల్లపుడు వారే వీరు వీర్వారు దై
త్యానీకంబులకున్ విరోధులు పరీహాసాస్పదప్రక్రియల్. 288

శా. అం చూహించుచుఁ గోపమంతయు రథంబందైంద్రమౌవాజులం
దంచత్కాంచనవేణు కేతనమునం దా మాతలిన్ గాఁగ ని
ర్మించెన్ సాయకసంచయమ్ము లురరీకృద్వ్రజసారంబులన్
మించెన్ రావణు నంపగాలి దెసలన్ మింటన్ మహోభీలమై. 289

శా. కంచున్ గైకయి చెప్పినట్టి గతులుం గాఁ జెప్పి రాముండుతో
లించెన్ బండిని గింకిణీనినదవల్లీకంబు వారాశి వే
లాంచ న్మంజు మరుద్రవాధినవ హేలాకాననం బిద్దిరో
యంచున్ జూడఁగనొప్పెరావణుని యీర్ష్యాక్రోధముల్ పొంగఁగన్. 290

ఉ. ఆస్యము నాస్యముం గదుర నాహవ మాడుచునుండె నా నమా
వాస్యయుఁ బూర్ణిమానిశయు బద్ధవిరోధులు రామరావణుల్
లాస్యము సేయు నా శరములం బరగించి రొకళ్ళొకళ్ళపై
నస్యతిశాతముల్ ఘనశిలావలిఘోరనిపాతవేగముల్. 291

ఉ. ఆ దివిషద్ద్విషత్పతి శరావళి రాముని ముంచె ముంచెనా
కా దిది కాదు ధామవిశిఖంబులు గండ్లను గొట్టు నెల్ల చో
నాదట రాక్షసేంద్రు విశిఖాగ్నులు మండెడు మండునాఁగ దా
మోదరమూర్తి రాఘవుని ముక్కులు మంటల నెల్లనార్చెడున్. 292

వ. అంత రావణప్రయుక్త సర్వాస్త్రంబులు విఘటితము లగుచుండ నతఁడు గాంధర్వంబు ప్రయోగింప రాముండు దానిని గాంధర్వంబుచేత వారించె దైవంబును దైవంబుచే నుపశమింప రావణుండు మండిపోయె. 293

సీ. అసురాస్త్రం బేసె నాశీవిషంబు లాగ్నేయముల్ జ్వాల లాకృతులు గాఁగ
వమదుగ్రకాకోల వదనంబులును నుగ్ర దంష్ట్రాకరాళ వక్త్రములు నగుచు
పుచ్ఛతాడనముద్భూత రావోగ్రముల్ వివృతఫణావిద్ధ విదిశములును
చూపులు విరియించు సురియలై దిక్కు లంటించు జ్వాలలను మండించుకొంచు
గీ. సూర్యకిరణంబులే దందశూకములయి రోదసి సమాక్రమించిన రూపుగాఁగ
దానవుయథార్థరూపంబు త్రాఁచుపామునాఁగఁ జనుదెంచుచుండగా నారసములు.

సీ. ఒక వందపాముల నొకచోటఁ జేరిచి చిత్రమ్ముగా వధ చేయునవియు
విరియించు ఫణములు వ్రీలఁగా దన్నుచు ముక్కుల శిరములు పొడుచునవియు
నడుములు తునియంగ నఖములఁ దన్నుచు లేచు మున్ముక్కుల రాచునవియు
పక్షానిలాధూతిఁ బాఱిపోవుచు నుండ సగములోపలఁ బట్టి చంపునవియు
గీ. పిన్నవానికిఁ బిన్నవి పెద్దవాని కేమొ పెద్దవి గరుడులు నేగుదెంచి
రామచాప శరాంతనిర్గతము లగుచు రావణాస్త్రభుజంగుల రాచి పెట్టు. 295

శా. ఆనందంబును గొల్చె వేదపురుషుం డంతంత యంతంతగా
నానాజీవులదైన కోపపరిమాణం బింత యింతంచు నె
ట్లో నేర్పాటుగఁ జెప్ప, నప్పరిధి బ్రహ్మానంద మం చన్నచో
నౌ నాడంగను నేటి కిప్పరిధి దైత్యస్వామి కోపంబనన్. 296

శా. తారాగోళములున్ గ్రహంబులు వియత్స్థానంబు నిర్ణీత చ
క్రారాధ్వంబున నేగుచుండు, భువనన్యాసాత్మయౌ దేవి, శ

క్ష్యారూఢక్రియ దేవ్యుపాసకులు రక్షోధీశులో దేవతా
స్వారాట్సంతతియో సమస్తభువన వ్యాపారపారీణులై. 297

శా. వీరశ్రేణి కిరీట నీలమణి, దేవీదక్షిణామ్నాయవి
ద్యారాజీవభవుండు, రావణుఁడు నైంద్రంబైన యశ్వాదిసం
భారంబున్ గని ఖడ్గరావణ మహామంత్రాధిదైవంబు త
త్సారం బెల్లను శీర్ణమున్ శిథిలమున్ స్రస్తంబుగాఁ జేయఁగా. 298

ఉ. మాతలి డస్సె నైంద్రములు మావులు క్రుస్సెఁ బతాకవ్రస్సెఁదా
జేతమునందు రాఘవుఁడు సిగ్గిలె, సిగ్గిలి నంతలోన స
ర్వాతి భయంకరంబులు ధురాప్రసభంబులు వహ్నికల్పముల్
శాతములైన బాణము లసహ్యము లంటెను రామచంద్రునిన్. 299

శా. ఐదమ్ముల్ సనుదెంచి రాఘవుని ఫాలాగ్రంబునన్ నెత్తురుల్
బోదెల్ త్రవ్విన యట్లు వెన్కదెసకుం బోయెన్ రఘుస్వామికై
కోదండంబునఁ బట్టు నిల్వదును గైకో నమ్ములున్ రావు వి
చ్ఛేదంబందిన సర్వశక్తియయి పొల్చెన్ రాముఁడాలిప్తలో. 300

వ. ఇట్లు రావణరాహు గ్రస్తుండు రామచంద్రుండు కాఁగా, శశిప్రియమైన ప్రాజా వత్యనక్షత్రంబును రోహిణిని, బ్రజాశుభకరుండైన బుధుండు సమాక్రమించె సముద్రంబు సధూమపరివృత్తంబయ్యె. నగ్నులతో మండె. సూర్యుండు శస్త్రవర్ణుండై పరుషుఁడై మందరశ్మియై కబంధాంకుండై కేతుగ్రస్తుండయ్యె. ఇంద్రాగ్ని దైవత్యంబైన కోసలదేశ నక్షత్రంబును విశాఖను కుజగ్రహం బాక్రమించిన.301

ఉ. కోపము పొంగులై యుబికెఁ గోసలరాజకుమారమూర్తికిన్
దాపితచంద్రసూర్యుల విధంబునఁ బొల్చెను నేత్రయుగ్మమున్
జాపము కోటియం దెసఁగు జ్యా ప్రతిశబ్దము లీనె వచ్చినం
గోపము లక్ష్మణాగ్రజునకున్ ధరణీతనయాధినేతకున్. 302

గీ. పృథివికంపించె నప్పాలువిరియబడియె మఱియుఁ దేజస్సు మంటలు మంటలయ్యె
వాయువీధులు ఘూర్ణితావర్తములుగ గగనసీమ ఛిద్రచ్ఛిద్రముగ విరిసెను. 303

చ. మిలమిలఁ బంచభూతములు మేనుననుండి వినిర్గమించి ది
క్కులఁ గనిపించె, రావణునకున్ భయమిం తనరానిదయ్యె, లోఁ
దెలిసె నితండుపో సుసమధిష్ఠితదిక్చయ పంచభూతని
ర్మలగ్రహరాజిరా జితఁడు రాముడు నేటికిఁ గోసలంబులన్. 304

గీ. నెఱి నెచటివందు సద్దుకొనెం గ్రహాళి రాముడుం దేఱుకొనియెను రావణుండు
సుందరుని రామసంహారింపం దలఁచెఁ దత్సమయశక్తిహీను నుద్భ్రాంతచిత్తు.

క. ఏ లక్షణములు కలిగినదై లక్ష్మణుఁ జంపె శక్తియనివార్యంబై
యా లక్షణములు గలిగిన శూలము చేఁబూని పొలసుఁడు రావణుఁడున్. 306

వ. వజ్రస్వనంబును మహానాదంబును మహాగిరిం బోలెఁ గూటమ్ములు కలదానిని యమునకేని దురాసదం బైనదానిని సర్వభూత భయంకరం బయినదానిని, జీల్చు దానిని, ముక్కలుసేయు దానిని బరమ రౌద్రంబు నడుమ నూని యిట్లనియె. 307

చ. అరయ దయన్ విభీషణున కడ్డము పోయి మరేమియయ్యె ని
ర్భరమతి లక్ష్మణుండు? మఱివానికి నడ్డము పోయి నీవు న
క్కరణిన యౌదు, దీని నిద కాచుకొనందగుఁ దీవ్రశూలమున్
విరవిరలాడు ప్రాణముల విచ్చెడు నట్టి సకూటశైలమున్. 308

క. ఏదానవుఁ డరుదెంచిన నాదానవు నీవు చంపి తది వన్నుచు సం
ఛేదము చేసితి వంశము కోదండాంతమ్మునన్ మిగుల్చ పౌకనినిన్. 309

శా. నిన్నుం జంపుట గోటిమీఁది పని వానిన్ మారుతిం జంప వీ
లున్నన్ లక్ష్మణు నైనఁజంపుటకు వీలున్నన్ మఱిన్ సీతయున్
నిన్నే భావనఁ జేయకున్న, నిదె మండింతున్ నినున్ శూలని
ర్భిన్నోరస్కుని నిత్య మందహసన శ్రీ దర్పణ ద్గల్లునిన్. 310

శా. ఈపై నవ్వులవారె రాక్షసులు నే నింతేనియుం గాన నీ
చాపంబుం బనిసేయ దిందు నపరిస్కన్నోగ్రమౌ మృత్యుచేఁ
జాపీ! శూలము చేతఁ జావుమని దోస్సంధామహావేగదీ
క్షాపద్మాసనుఁ డైన రావణుఁ డుదంచచ్ఛూలమున్ విడ్చెనన్. 311

క. ఒక వేయి బాణములఁ జీల్చక వచ్చుచు నున్నయట్టి శూలము రాముం
డకుటిల వేగుఁడు బాహుల వికలంబుగఁ బట్టికొంచు విఱువం దలఁచెన్. 312

ఉ. అంతట నైంద్రశక్తివయి నక్షులు వ్రాలిన దానిఁ గొంచు ని
శ్చింతుఁడు రామచంద్రుఁడు వశీకృతచిత్తుఁడు శూలముం బ్రతా
రింతు నటంచు నేసె వివరించిన మంటలు గాఁగ శూలమున్
గాంతము భస్మసాత్కృతముగా నొనరించెనుశక్తి యంతటన్. 313

క. ఇంద్ర పురాప్రేషితమై సాంద్రమహాశక్తి యిట్లు చాలనియది నే
డింద్రుల కింద్రుడు శ్రీరఘుచంద్రునిచే శూలదమనశక్తిం బడసెన్. 314

క. రథగమయిత్ర చూడామణి పృథులగతులు గాఁగ సంచరింపించె మహా
రథి రాముఁడు రావణుని వితథతేజునిఁ జేసెఁ దార్చు తార్చు శరమునన్. 315

ఉ. వాజివిధంబునన్ రథము వల్గనృత్యము చేయుచుండె వి
భ్రాజిత తేజుఁడైన రఘురాముఁడు నేర్చుచు నున్నవౌ శర
వ్యాజముచేత రావణుని యంగము లందున నిప్ప లుంచె నీ
రాజితదేహుఁ డయ్యె నసురప్రభుఁ డెంతయు యుద్ధలక్ష్మికిన్. 316

క. అపాదమస్తకమ్మును వ్యాపాదితశరునిఁ జేసె నసురేశ్వరునిన్
శ్రీపద్మాక్షుఁడు రాముఁడు కోపాటోపమున గ్రుచ్చి గ్రుచ్చి శరమ్ముల్. 317

క. నొసలన్ త్రిశరమ్ములచే నసలును ద్రవ్వుకొని వచ్చు నస్రుగావగఁగా
విసురుకొనివచ్చు నమ్ముల నసుర దిగులువడియె తాళునట్టులు లేకన్. 318

మ. మఱియున్ దానవచక్రవర్తి మది సంబాళించుకొన్నాఁడు ని
ర్భరుఁడై యేనును గూచి చేసితినిగా రాముం బ్రతారించి, సం
గరమందొక్కవు డొక్కడొక్కరుడు సంక్రాంతాత్మతేజః ప్రభా
కరుఁడై పొల్చు, దిగుల్పడం జనునె దుఃఖంబైన యవ్వేళలన్. 319

క. ఇరువురు సమానమగు శౌర్యరమ గలిగినట్టివార లయినం దానై
యరి పొంగు, నీవు పొంగెదు దురమాడెదు నప్పుడిట్లు తూఁగుచునుండున్.

క. నే నధికుం డైనప్పుడు మానవపతి కోపమూనె మఱి నేను దిగుల్
పూనం దగునే కోపము నూనెద నని యతఁడు కోప మూనెం బెలుచన్. 321

మ. ఒక కోపంబని కాదు స్వీయప్రతిభోద్యోగంబు చెల్లింపఁగా
నకటా! కోపము గాని కోప మదియాత్మావిష్కృతింబొందు, దా
నికి జీవుండుమ మాటిమాటికి నెదన్ నిండించుకోఁ గావలెన్
ప్రకటోత్సాహనిదానభావములతోఁ బాలార్చు భావాళితో. 322

మ. సహజంబై చనునట్టి కోపమును రక్షస్స్వామి యీరీతిగా
విహరింపంగను చేసికోనగుట కల్పించున్ మహోశ్చర్యమై
సహసా రాఘవనేత్రయుగ్మవిహర చ్చంద్రార్కసందర్శనం
బు హరించెన్ దనుజేంద్రు దానవతలోఁ బొంగైన రక్షస్త్వమున్. 323

సీ. రామచంద్రుని శరీర మను కుడ్యమున దైత్యపతి జేగురు పరదాలు కొట్టె
రామచంద్రుని శరీర మను మిన్నునను రక్షఃకులేశుఁడు వానకాళ్లు దింపె
రాకాసి రామపర్వతసానువుల నెత్తు రేగు వాఁగులఁ బ్రవహింపఁ జేసె
అసురుఁడు రామగిర్యగ్ర సీతావియోగవ్యథా స్నానోదకములు నింపె
గీ. రావణుండు ప్రచండసంగ్రామశీలి తన మహాశక్తి రూపంబు తాల్చినట్లు
నుర్విజాపతి నిల్వనీకుండఁ జేసె రామచంద్రుండు నిలచెను రథమునందు. 324

శా. ప్రత్యస్త్రంబుల రామచంద్రుఁడు సముద్రం బట్లుగాఁ బొడ్చినన్
దైత్యుండున్ గిరిరాజువోలె నిలచెన్, దైత్యుండు ఝుంఝానిలా
గత్యుగ్రంబుగ నైన రాముఁడు చలత్కంధింబలెం బొల్చినన్
దైత్యోర్వీతనయాపతుల్ గిరిసముద్రంబుల్ బలెం బొల్చుచున్. 325

శా. అమ్ముల్ నిండిన మింట నిద్దఱను దృశ్యాదృశ్యమూర్తుల్ సమీ
పమ్మున్ దూరమటంచు నేర్వక ధనుర్వ్యావల్గ దాశీవిషో
గ్రమ్ముల్ చిమ్ముచు నారసంబుల జయాకాంక్షాసమాసన్న చి
త్తమ్ముల్గా బవరంబు సేసిరి నదద్దర్పోగ్రసింహాకృతుల్. 326

క. ప్రతిబాణంబును వేయక క్షితిజాపతి యుండెఁ గొంతసే పట్టులనే
దితిజేశ్వరుండు బాణప్రతతిం బరగించుచుం బ్రవాహముగాఁగన్. 327

గీ. అప్రకంప్యుండు మందహాసాననుండు సుందరుఁడుకార్ముకోగ్రభాసురుఁడు రాముఁ
గాంచి నివ్వెఱవోయి రాక్షసుఁడునిలచె నిట్లనియెరామమూర్తి దైత్యేంద్రుఁ గాంచి.

క. అప్పుడు నే నుండినచో నిప్పల మండించియుందు నిల్వున నిన్నున్
దప్పికొని వచ్చినాఁడవు నిప్పుడు తప్పించుకొనుము యేదీ చూతున్. 329

శా. నిన్నుం దొల్తన విడ్చిపుచ్చితిని మన్నీఁడౌచు లజ్జాపరి
స్కన్నంబై మతి వేఱవచ్చితివి నీ సంతానమున్ బంధులన్
మన్నుంజేసితి మిన్నుజేర్చితి నిలింపద్రోహి! యింకైన సి
గ్గ న్నిక్కంబుగ నేర్చికోవలయు దిక్కుల్ భూతముల్ నిల్వగన్. 330

శా. సిగ్గన్నట్టి దపూర్వమౌ దినుసగున్ జీవుల్ త్రపావంతులై
లగ్గుం బొందెద, రెగ్గు గాంతురుసుమీ లజ్జావిహీనుల్ ఛవుల్
కగ్గన్ జీవు లధోజగత్తులకుఁ బోగా నేల! లోకంబునన్
సిగ్గన్నట్టిది ధర్మముల్ వినయముల్ జెందించు భావంబుసూ. 331

ఉ. శూరుఁడటన్న ధర్మమున సొంపు నెఱుంగుట కాని, చేతిలా
వై రచియించు కార్ముకమునం దసియందున నేర్పుకాదుసూ!
నేరుచు విద్యయంతయును నేలను మన్నగు ధర్మబుద్ధి చే
కూరనిచో హతింబొరయు కోపమదిం బయిమెట్టు దానవా! 332

ఉ. దైవము సాగనిచ్చున యధర్మము నీ మినుముట్టుదాఁక, నీ
వీవల లౌకికంబుగ వహించిన దంతయు గొప్పయంచు దు
ర్భావన సేసె, దన్నియును వచ్చి పయింబడు నొక్కమాఱుగా
నా వలమానకార్ముకమునా నిది దైవముసుమ్ము దానవా! 333

క. నీతో మాటాడుటయును జేతోదోషంబుగాఁగ సిగ్గుచుండెన్
నీ తెన్నె గెదు నిలుమీ యాతోద్యం బయిన జ్యారవాభీలముగన్. 334

మ. అనుచుండన్ రఘురామచంద్రుడు, సమభ్యస్తంబు విల్విద్య నే
ర్వనియట్లయ్యెను రావణాసురునకున్, వైదేహినిం బూని కా
ననమం దెత్తుకపోనియట్లు తలఁచెన్, నవ్యంబుగా మానసం
బున లజ్జోదయ మయ్యె స్వామి కెదురమ్ముల్ తీర్ప లేనట్లుగన్. 335

మ. శవముం గొట్టినయట్లు గొట్టె రఘువంశస్వామి దైత్యేశ్వరున్
శవముం బ్రాణసమేతమున్ గలిత లజ్జాకంబునున్ సంస్కృతి
ప్రవణంబున్ భయహీనమున్ సుశరసంపద్విత్తమంబున్ సము
ద్భవవైరాగ్యవిదూషితాత్మము నసంభ్రాంతంబు క్రాంతంబునున్. 336

క. రావణ సారథియును యుద్ధావనిఁ దొలగించెఁ దద్రథంబును రక్ష
స్సేవాపారీణుం డయి రావణుదేహంబు నపుడు రక్షించుటకై. 337

గీ. తెలిసి రావణుఁడును సారథీ! యిదేమి చేసితివి? నన్ను నిచట తెచ్చితివి నీవు
నంగనలు సాంధ్యవాహ్యాళు లరుగుచోటఁ గంధితరఁగలు బండలుగ్రచ్చుచోట. 338

ఉ. చూచుచుఁ జూచుచుండ రిపుసూదనకృత్యమునన్ మఱల్చి వీ
రోచిత కార్యమిద్దియె? యెఱుంగవు బండిని ద్రిప్పికొంచు నీ
వీచికలన్ మరుత్తు పలవించెడి చోటికిఁ దెచ్చినావు మై
త్రీచరణుండ వౌదువె! యరిప్రియకృత్యమునం జరించుచున్. 339

చ. తెగఁబడి వీడి చన్న పొలదిండి విభీషణుగుంపు లోపలన్
మిగిలినవాఁడవౌదువా? యమిత్రుల పక్షమువాఁడ వౌచు నా
నొగలుననుండి యుద్ధమునను౦ గికురింపఁగ నిన్ను నుంచిరో?
సగమునయందునన్ విరిగి సాగరవేలకుఁ దెచ్చి సారథీ! 340

మ. అపుడే రాముని బిట్టు నేర్చితిని దానై నిందకుంజొచ్చి నే
రపుమాటల్ రచియించె రాఘవుఁడు శౌర్యప్రక్రియన్ మాలి యా
కృపణుండున్ దనభార్య పోయెనని దుఃఖించున్ మ ఱే నెంత దై
త్యపుభావంబున నున్నఁ జంపుదునె భార్యాదుఃఖశీలాత్మునిన్. 341

మ. మరియున్ రాముఁడు నన్ను నోర్చినిలచెన్ మాహాత్మ్య మన్నట్లుగన్
తిరుగన్ నేనును నిల్చినాఁడఁజుమి నాతీరున్ వివేకించు నే
ర్పరి వింతైననుగాక తెచ్చితివి నాబండిన్ సుషీమాంబుసుం
దర వీచీ జలరాశితీర పవమానశ్రీ వనీ వీధికిన్. 342

చ. పొలుపఱి నాదు కొమ్ము పడిపోవుచు నున్నది యోర! భద్రజీ
వులు మఱియున్ గృతజ్ఞులయి పొల్తురు, తక్కినవారు జీవవం
తులు పరిశిష్టమౌ బ్రతుకు త్రోవల నెప్పుడు చూచికొంద్రు, నీ
వలయిక వారిలోన నొకఁ డౌదువా? న్యాయమె యద్దియైననున్. 343

మ. అనినన్ సారథి బిట్టు ఖిన్నుఁడయి యేలయ్యా మహారాజ! నే
నును వేలేండ్లుగ బండితోలు కులమందుం బుట్టితిన్, నీకుఁ బూ
నిన నా యీ కళ నాదు తాతయునుఁ బూనెన్ దైత్యలోకేశ! నా
తనువందుం బ్రవహించు నీకు ననురక్తంబైనవౌ రక్తముల్. 344

గీ. నేఁగృతఘ్నుఁడగాను బండితుఁడనేను కడు నమిత్రుఁడగాను శూరుఁడను నేను
నాకులంబునవారు చన్నట్టిత్రోవఁ బయనమై వచ్చినాఁడ నీబండి నడుప. 345

చ. తతముగ బండియుం దిరుగు ధారుణి నంతయు బీట్లు బీట్లుగా
శితశరసంతతిన్ విరియఁ జేసెను రాముఁడు, సూటిఁ ద్రోలినన్

గతుకుడు పొందు లక్ష్యముఱుఁ, గాదని ప్రక్కకుఁ ద్రిప్పితోలఁ దా
వతుకక పోయి యొడ్డగెడవౌ దిగి చక్రము గుంజుకోవలెన్. 346

ఉ. ప్లోషణమైన యస్త్రమును బుచ్చెను రాముఁడు నేను గుఱ్ఱముల్
ఘోషణ మొప్ప దప్పికను గొంటిమి, మాకుడివైవు, గోడ వి
ద్వేషితవృత్తి నమ్ములను వెట్టెను దిట్టరి సందొసంగకన్,
దూషితబుద్ధి మాపయినఁ దోలఁగనీయఁడు కంధివాయువుల్. 347

ఉ. ఈవయి నేను జెప్పటయు నింతయు ధర్మముగాదు స్వామికిం
గోపమురానిచో నిదియుఁ గొంచెము చెప్పెద రామునందు నే
దో పరమానురాగమొ దయోదయమో ఘటియిల్లె నీకు, నీ
వోవఁగ నెంచినన్ రిపుని యుద్ధమునం దది కోసివేయనౌ. 348

వ. అంత రావణుండు నవ్వి నీవు నగరములోనికిం బోయి యెట్టి నేల నైన నడచెడు దానిని నీయిష్టమైనరథంబును, డయ్యనివానిని, దప్పి నోర్చికొనెడు వానిని నీయిష్టమైన గుఱ్ఱంబులు కట్టి తీసికొనిరమ్ము నే నింద యుండెదను.

ఉ. రాముఁడు చావఁగావలయు రావణుఁడైనను జావఁగావలెన్
హ్రీమతి సుంతయున్ బెసకనీయను ధూర్జటితోడి దేమి? దే
వీమహితానుభావపదవీస్థితి సూర్యకరాంతరస్థకా
లామితవేగ చంక్రమణ మాపెద నీ 'విదె పోయిరమ్మనన్. 350

ఉ. ధీమహితంబు సృష్టిని స్థితిం ఘటియిల్లగఁ జేయు విష్ణుతే
జోమహితుండు దానవనిషూదనుఁ డంబుజబంధుకాంతి కా
లామిత వేగచాలనము నావఁగ నెంచిన వింధ్యపర్వత
గ్రామణి గుంజి తీసిన యగస్త్యుఁడు రామునిముందు నిల్చుచున్. 351

గీ. ఇది రిపువధార్థ మాదిత్యహృదయమన్న మంత్రముపఠింపుమనియిచ్చి మౌని యేగె
మంత్రముగ్రహించి రాముండు మహితనియతి కీర్తనీయతద్భావనామూర్తి యయ్యె.

సీ. అహరాగమమునందు నవ్యక్తముననుండి వ్యక్తంబు సర్వంబు ప్రభవమందె
నాదిత్యమూల మ్మహస్సు, వ్యక్తమ్మెల్ల నాదిత్య హేతువై యవఘళించు
నాదిత్యు డనగను నగ్ని తేజస్సు చైతన్యంబు ప్రాణంబు తనుగతంబు
నతడగ్నిహోత్రంబు నాతఁడె క్రతువులు నాతఁడే యాయువు నతఁడె మృత్యు

గీ. వతఁడె కర్మప్రబోధకుఁ డతఁడె నిద్ర
మఱియు ఋతువులు నతఁడె సంవత్సరంబు
నతఁడె పూర్వాద్రియును బశ్చిమాద్రి యతఁడె
పూషుఁడు గభస్తిమంతుఁ డంభోజహితుఁడు. 353

సీ. ఇంద్రాదిదిక్పాలు రీశ కేశవ పద్మభవులును స్కందుండు వసుమనువులు
మనుజయక్షులు సాధ్యమండలియు మరుత్తు లహులు పిశాచమ్ము లదితిసుతులు

శంభుండు ఋగ్యజుస్సామముల్ త్వష్టయు దైత్యులు నసురులు దానవులును
తిమిరగర్భుండు హృద్దీపిత నారాయణుండును మఱియు మార్తాండు డతఁడ

గీ. యాతఁడె సృజించు రక్షించు నతఁడె చంపు
చెలఁగి తపియింపఁ జేయు వర్షించు నతఁడె
సర్వభావోద్భవుండు నాశకుఁడు నతఁడ
యల నమస్కారములు సర్వ మతనిఁ బొందు. 354

ఉ. ధీరుఁడు రాముఁడున్ సముపదిష్టుఁడు చేసెను ధ్యానమూర్తి ము
మ్మాఱు జపంబు తానుగనె మన్నన జేయుచు నెల్లఁదానె యం
భోరుహమిత్రుఁడై సకలమూర్తము తానయి సర్వదేవతా
ధారుఁడు తానెయై వరనిధానమునై త్రిజగన్నిదానమై. 355

శా. తన్నిష్ఠాసమయంబునన్ రఘుకులేంద్రస్వామి కవ్యక్తమున్
స్కన్నం బొచును వ్యక్తరూపక మహస్సంచారభావంబు నౌ
చున్నన్ దోచె నొకర్తు, సంసరణభావోద్భూతయై యామె తా
నన్నట్లుండి స్వతంత్రయో యనఁగ సేవాధీనయై యెంచినన్. 356

గీ. ఆమె చేతులు జోడించి యనియె నిట్టు లంబుజాతాక్ష! యవ్వాల కాది వీవ
యవ్వాలును నీవ యబ్జుఁడ వైనయపుడు నాథ! సంధిలోఁగలసికొన్నాను నిన్ను.

వ. అంత శతసహస్రసూర్యమండల విభాసియైన శ్రీరామచంద్రుండు దూరాన
నరుదెంచు రావణరథంబు చూచె. 358

సీ. కనకమయ మృదుల ఘంటికాస్వనములు మణికింకిణీ కుణుకుణు నినాద
కములతోడను నాట్యకత్తియవలెఁ, గేతు పీతాంబరాంచలాన్విత మరుత్త
రంగంబులను నప్సరఃకామినీచయ మందాకినీతీర మధుర మధుర
వాహ్యాళివలె, హిమవర్వతకన్యకాపతి లీల లవి వ్రాయఁబడుటచేత
గీ. రజతశైల శేఖరకందరమ్ము వోలె ముగ్ధగంధర్వనగరంబుఁ బోలె సిద్ధ
సాధ్య సుర యక్ష కిన్నర జంపతీ మనఃప్రియామానమగు విమానమ్ము వోలె359

సీ. కాసారవత్పతాకా శారవర్ణ ప్రకాశాభిరంజితాకాశ మగుచు
హేషాప్రఘుష్య ద్విభీషాత్త పూత్కార ఘోషాశ్వవదనాంబరీష మగుచు
నేమిత్వరాకేళి భూమిప్లవద్ధాళి సామిగ్రస ద్వియత్సీమ మగుచు
ఘంటావినిస్వాన ఝింటీకుణుక్వాణ ఘంటాపథీ భవత్కాంత మగుచు
గీ. వ్యాళపూత్కృతిగఁ గశాకరాళ ఘోణిప్రోథకూబర వినిద్రాణ మగుచు
మండితాయుధాగార ప్రచండ మగుచు సర్వతశ్చక్రపరికంపితోర్వి యగుచు. 360

సీ. వర్షాసమారంభ వాలాహకచ్ఛటా నిర్గత తీవ్రాశని స్వనాళి
కుంఛిత కుంభమై, కుణుకుణు చిఱుత చప్పాళ్ళ బంగరు చిన్నమువ్వలగమి
యలుపంపుటులివుల కొలువు చప్పరమై, కశాచాలనోద్గత స్వనరథోగ్ర
చక్రనిస్వాన కృష్ణమహోగ్ర సైంధవ హేషా మహాస్వాన పృథులరావ

గీ. ముల సభాభవనమ్ములై, కలితగగన శబ్దగుణమెల్ల నొకచోట సంతరించు
కొన్న సంయతదేశమై, కొండగూడు తెగిన తేనెటీఁగలఁబ్రోఁత మొగిలువోలె.

గీ. వచ్చుచున్నట్టిదైన రావణురథంబు చూచి శ్రీరామచంద్రుఁడు శూరమౌళి
చాపలస్తక నిహితహస్తముగ మాతలిం బలుకరించి యెదురుతోలించె బండి. 362

ఉ. వంచితబుద్ధి ముంచికొని వచ్చుచున్నది వీనికిన్ విదా
రించితి మూఁడుమా ర్లతకరించుచు నెప్పటికప్పు మద్భుజో
దంచిత శౌర్యమున్ మఱల నాహవభూమికిఁ గ్రొత్తబండి తో
లించుక వచ్చుచుండెను శిలీముఖనిస్వనదంతురంబుగాన్. 363

చ. చదలునఁ బ్రొద్దుక్రొవ్వెలుఁగు సందుల విందుల బండితోలెడుం
జదురు వెలార్చు నో మఘవసారథి! బండిని తోలిపెట్టు నిం
ద్రుదయ సమస్తమున్ ఫలము నూల్కొనఁజేయుము, తిర్గిపోవరా
దు దితిజరాజు, నేఁడిచట దుమ్మయి మిన్నయి నిప్పగాలియై. 364

సీ. మనువులు వసువులు మరుదాదు లాదిత్యు లింద్రులు రుద్రులు నీదృశముగ
లిప్తలుయామముల్ దినములు మాసముల్ ఋతువత్సరయుగంబు లీదృశముగ
మహితవర్ణము లాశ్రమంబులు ధర్మంబు లీడితాచారంబు లీదృశముగఁ
గ్రతువులు వైశ్వానరప్రభ లాహుతు లిహపరలోకంబు లీదృశముగఁ
గీ. బవలు మొదలిడి రాతిరి పడెడు వఱకు ధర్మపరిణామ మయమైన తరణికిరణ
సమితి నడ్డముత్రిప్పెడు కుమతివృద్ధి ధృతి మహోఘట్టమున సంహరింతు దైత్యు.

చ. అను సమయంబునందు నుభయంబును ధర్మ మధర్మ మౌచు రా
మునిదెస దైత్యరాజుదెస మొత్తము లౌచు శుభాశుభంబులై
చను శకునంబు లొప్పె, దితిజప్రభు నిల్చినచోట ధాత్రి కం
పనమును బొందెఁ దద్రథము వాల్పడి తూగఁగ భల్లుకంబనన్. 366

చ. అరదము కేతుదండమున నాడెను గ్రద్దలు, బండికప్పపైఁ
గురిసెను నెత్రువాన, విలుకోటిని జారె గుణంబు, గుఱ్ఱముల్
చరణములందుఁ గుంటుపడె, సారథి విభ్రమమందె, బండికిన్
వఱడులు సూటిగా నెదురువచ్చుచు నూలలు వేసె నుగ్రముల్. 367

ఉ. దుశ్శకునంబు లెన్నియగు దుష్టము లన్నియు నయ్యె, దైత్యు తే
జశ్శమనంబుగా, దిమిరసంతతి కప్పెను బండినెల్ల, నం
తశ్శుభభావనాచయ వినాశకరంబుగ, వాని యొక్క స
దృశ్శమనాతిథిత్వమున యందలి స్వాగతలక్షణంబులై. 368

గీ. శకునములు సర్వజనులకు సంభవింప వుత్తమత్వ మే లేశమో యుండవలయు
నద్ది సత్వదార్ఢ్యము కృప నాదరించు టాదరింపక పోవుట యతని కర్మ. 369

ఉ. రావణు సంహరించుటకు రాముఁడు నిశ్చయముం బొనర్చె, నా
రావణుఁడున్ స్వకీయము పరాక్రమమున్ బహుశాస్త్రమంత్రముల్

దేవతలం జయించుటకుఁ దెచ్చినశక్తులు మూటకట్టిన
లై, విలయాంతకుం డనఁగ నాహవముం బొనరించుచుండఁగా. 370

సీ. మానిసిదిండి గ్రీష్మర్తువై యెండింప నలినాక్షుఁ డంత వానలను గురిసె
వానలు కురియ రావణనీలమేఘంబు రామచంద్రుండు శరద్రాత్రిచేసె
పొలదిండి గూడమంచులను బట్టింపగా రాముండు మృదుశిశిరంబు తెచ్చె
రావణుండును శిశిరము ముదిరిపింప మాధవుం డయ్యె సీతాధవుండు
గీ. నిరువురేసెడు బాణాల కెగువ దిగువఁ బ్రక్కలందునఁ గానిపింపక బవరము
చూడవచ్చిన ఋషులును సురలుచూచి రాత్మమహిమలచే నంతరాంతరముల.

ఉ. నల్లనిమేనివాఁ డొకఁడు నారసముల్ కురియించుచుం దళత్
ఫుల్లసరోరుహాక్షుఁడును మోహనమూర్తియు నిల్వ ముందటన్
సుళ్ళుగ సుళ్ళుగా మునరఁజొచ్చెను దైత్యుఁడు నల్లనౌ గరు
త్మల్లసితోజ్జ్వలన్నిశితతుండము లొప్పు శిలీముఖాకృతిన్. 372

ఉ. సంగరమందు రావణుని జంపఁగ రాముఁడు నిశ్చయించె నా
సంగరమందు రాఘవుని జంపినఁ దానును జంపవచ్చు నా
సంగరమందుఁ దాను మఱి చచ్చినఁ జావనువచ్చు నంత ని
స్సంగతి నంతరాత్మ దితిజాతజగత్ప్రభుమూర్తి యాడెడున్. 373

ఉ. రాముని కేతనంబును ధరంబడఁ జేయఁగ నెంచె రావణుం
డా ములుకుల్ విఖండితములై చనఁ జేసెను రామచంద్రుఁడున్
రాముఁడు తత్ప్రతిక్రియఁగ రావణు కేతనముం బగిల్చె, ను
ద్దామము కోపముం గనఁగ దానవరా జది నేలపైఁ బడెన్. 374

చ. మఘవుని పంపు గుఱ్ఱముల మాతలి నొంపఁగ నెంచె లోకశౌ
ర్యఘనుఁడు రావణుండు, రఘురాముఁడు సాధ్యము కానియట్లు చే
సె, ఘుమఘుమార్భటీనిశితజిహ్మగసంతతి దైత్యనాథుఁడున్
లఘుతరవిక్రంబున హళాహళి చేసె విచిత్రనైపుణిన్. 375

చ. లలితములైన చిత్రగతులన్ నడిపింపఁగ బండిఁ జెప్పి మా
తలి, రఘురామచంద్రుఁడును దానవరాజు రథాని కన్ని ది
క్కుల నొకసారి తోఁచు గతి గుఱ్ఱములన్ బెసగించె, బిట్టు టం
గులు దెగిపోవ దైత్యపతి కూర్చికొనెన్ హయరాజియత్నమై. 376

క. రావణుండు ఖడ్గరావణుం డయ్యెను జయము జయము రామచంద్రునకును
జయముజయమయోధ్యజనులకు సురలకుజయమటంచు భూతచయము పలుక.

క. అంతట నిరస్త్రకంబుగఁ గుంతమ్ములు ప్రాసములను గోలలు పరిఘల్
వింతగఁ బట్టిసములును ధరాంతమ్ముగ నెసఁగె దిక్పయాంతంబుగనై. 378

మ. కదలెన్ మిన్నులు, భూమి క్రక్కదలె, నింకన్ వార్ధు లల్లాడె, నీ
చద లీ ధారుణీభాగ మీ కడలి నాఁగా లేక శేషించె న

న్నది లేకుండఁగ, ఖడ్గరావణ మహోనాగోగ్రదంష్ట్రానలో
న్మదకాకోలము మండఁబెట్టఁ దొడఁగెన్ నాళీకగర్భాండమున్. 379

ఉ. రామశరప్రపంచము విరామము లేక ధరామరేంద్రర
క్షామహనీయమై పొలిచె, సర్వజగత్తును దానఁజేసి ర
క్షామహనీయమై పొలిచె, క్ష్మాస్థలి మిన్నులునుం గడళ్ళునున్
శ్రీమహనీయమై యనుసరించెను రామశరప్రపంచమున్. 380

ఉ. సంగర మీగతిన్ విరతిచాలక సాగుచునుండ సూర్యుఁడ
స్తంగతుఁడయ్యెఁ బశ్చిమదిశన్, రఘురాముఁడు తానె సూర్యుఁడై
పొంగినయట్టి వెల్గులుగఁ బూంచిన తీవ్రశరాన, దైత్యరా
ట్సంగత కంఠముం దునిమె, క్ష్మాస్థలి గన్పడఁ గృత్తశీర్షమున్. 381

క. తల తెగెనా! తెగినది, భూతలమునఁ గన్పించు తెగినతల, యింకొకఁడౌ
తలయున్నది కృత్తమ్మవు తలయుండినచోట మౌళితలముగ నదిరా! 382

ఉ. సంచితసూర్యతేజుఁడయి సంగతధీ మధుసూదనుండు న
క్తంచరరాట్ప్రయుక్తముగ దాముసలాదిక వర్షమున్ నిరో
ధించుచు నప్రమత్తతను ద్రెంచినదౌ తలఁ ద్రెంచినట్లు ఖం
డించెను నూటయొక్కవరి, నిండిన శీర్షము నిండినట్లుగన్. 383

ఉ. రాతిరి యంతయుం గడచె రాముని కింతయుఁ బాలుపోద యా
హో! తన యమ్ముతుట్టతుదయందున భూతచయంబు ప్రాణముల్
ప్రోతములై యెసంగెడిని, బూన్చినదౌ తల పూన్చినట్లుగా
నీతని ప్రాణనిష్క్రమణ మేటికిఁ గల్గదు చిత్రమయ్యెడిన్. 384

వ. అంత రావణుం డిట్లనుకొనియె. 385

చ. ఇతనికి దేవికిం దనరు నింతటిభేదము, స్వ్యాతభావనా
తతముగ దేవియే యితఁడు తానగు, నన్ను వధింప బ్రహ్మ సం
గతమగు దీప్తికాఁ దొలివికారము నందలి తేజమౌచు, న
చ్యుతుఁడును దానుదేవియు త్రిశూలియు నందఱునైనచోటునన్. 386

వ. అంత నాస్ఫూర్తి రావణునుండి, మాతలికివచ్చి మాతలి శ్రీరామచంద్రునితో
నిట్లనియె. 387

ఉ. కోరిక దైత్యులన్ గెలుచుకోసము వృత్రవిరోధి, పూర్వ మం
భోరుహసూతి సర్వజయమూలము దేనిని సృష్టిచేసెనో
కోరిక కుంభసూతి తమకోసము రావణు సంహరింప నం
భోరుహనేత్ర!నీ కొసఁగెఁ, బూంచుము దానినిఁ జాపమందునన్. 388

వ. అదిపైతామహంబైనయస్త్రంబు, దేనితెక్కలయందుఁ బవనుండును ఫలము
నందుఁ బావక భాస్కరులునుందురో, దేనిశరీర మాకాశమయమో, యేది

మేరుమందరములయంత భారమో, జాజ్వల్యమానమైన యదియు సువుంఖమును హేమభూషితమును సర్వభూతతేజోనిర్మితమైనదియు భాస్కరవర్చసమును సధూమమైన కాలాగ్నియు మహాశీవిషమువలె దీప్తమైనదియు పరనాగాశ్వభేదనము క్షిప్రకారియు ద్వార పరిఘ గిరిభేదకమును మేదోదిగ్ధమును నానారుధిరసిక్తాంగమును సుదారుణమును వజ్రసారమును మహానాదమును నానాసమితి దారుణంబును సర్వవిత్రాసనంబును భీమంబును నైన దానిని శ్రీరామచంద్రుండు విధివత్తుగా వింట సంధించి విడిచిన. 389

శా. ప్రాణం బెచ్చట నుండు నాస్థలమునం బట్టెన్ మహాస్త్రం బని
ద్రాణంబౌచుఁ ద్రిశూలమట్లు హృదయగ్రంథిన్ విభేదించెఁ, బా
రీణంబైన సుదర్శనం బన మహాస్త్రజ్ఞాడు లేర్చెన్ మఱిం
దూణీరంబును జొచ్చె నస్త్రమును దైత్యుండుర్విపై వ్రాలఁగన్. 390

చ. మఱియును జల్లనౌచుఁ బవమానుఁడు వీచెను, లేఁతయెండ భా
స్కరుఁడును గాచె, ధాత్రియును గంపము నొందక నిల్చె, వార్ధి శీ
కరములు చల్లెఁ ధీరమునఁ, గందని నీలిమి తోచె మింట, సం
గర మఖిలమ్ము చల్లపడి కాయము నిర్వృతి పొందె నెంతయున్. 391

శా. కోదండంబును వాల్చి యొక్క శిలపైఁ గూర్చుండ శ్రీరాముడున్
సైదోడుంబలె బల్కరించి చనియెన్ జంభారి మింటన్ లల
న్నాదంబుల్ శుభవాదముల్ మధురగానంబుల్ నదత్కింకిణీ
పాదానూనరవంబులున్ వినఁబడుం బ్రహ్లన్న భావంబునన్. 392

వ. అంత సుగ్రీవ విభీషణాంజనేయ మైంద ద్వివిదాంగదాదు లొక్కరొక్కరు వచ్చి రాముని పాదంబులు స్పృశించి బద్ధాంజలులయి యొదిగి నిలుచుండ శ్రీరామచంద్రుండు వారివంక జూచి మందహాసంబు చేసిన. 393

శా. కాసెన్ వెన్నెల లచ్చ శారదనిశా కల్హారకాంతానట
ద్దాసశ్రీకము లప్సరశ్చయ దృశావ్యాపార సంచారముల్
భాసిప్రోజ్జ్వలవార్ధితీర సికతాపర్యంక నిద్రాలుక
న్యా సంగత్యతిభోగభాగహిప దేహాంశుప్రభాచోరముల్. 394

ఖం డాం త ము

క. ఇది నిస్సంశయఖండము ప్రదరమనువ్రజ సమధిక భాసితతత్త్వా!
యెదయందుఁ జంద్రమౌళిని బొదలించవె శ్రోతయైన ముక్త్యాలపతిన్. 395

ఉ. ఈ తను వింత శోషపడి యెంతయు నిన్నుఁ దలంచుటందు ని
ష్నాతముగా మెలంగెడిని నా ప్రభు! నేను తొలంగిచన్న చో
నీతలఁపుల్ సమృద్ధముగ నిండెడు నట్లుగఁ జేయు భక్తిభా
వాతిథి! రెడ్డివచ్చె మొదలాడుము నాఁ బొనరింపకే ప్రభూ! 396

స్రగ్విణి

ప్రాణమూలస్థలీభాసి లింగాకృతీ!
స్థాణురూపాంత రాస్పందపాథోనిధీ !
క్షోణిభృద్గర్భ వక్షోజ కాశ్మీరసం
త్రాణ చైతన్య నిత్యత్వ తేజఃఖనీ! 39

  

# ఉపసంహారణ ఖండము

క. శ్రీద్రుషదాలయ పరిషద్వేదీ! యైరంమదీయ విమలసరోమూ
ర్తీ! దళితాశ్రిత జనతార్తీ! దీపిత సర్వధర్మకృతి! విశ్వేశా!

గీ. చటులమవుకార్యము తదుపసంహారణము శ్రమకుఁజూడ సమానభారములె యౌన
వెలయ నెక్కువభార మన్వించుచుండు ప్రథమమైన దవిజ్ఞాతఫలము పొంటె.

మ. భణితముకాని సౌఖ్యమగు భావన మైత్రిపురస్సరంబు ల
క్ష్మణుఁడును దాఁకబోఁ దనకశౌచ మటంచును జెప్పచున్ విభీ
షణుఁడు తొలంగ స్వామి కనుసన్నల దానినిఁగాంచుచున్ విభీ
షణు ననియెన్ సఖా! మిగులు సంగరమంచును లేదుగాయిఁకన్. 2

మ. మరణాంతమ్ములువైరముల్ ప్రకృతులున్ మన్నింపకున్నన్ సహో
దరభావం బది జన్మతోడ వినిబద్ధంబైన బంధంబు, సు
స్థిరకర్మంబులు సాంపరాయములు నీచేఁ గల్గు నిచ్చోట బం
ధుర మీరాక్షసరాజ్య మంతయును నీతో నున్న దీ లంకలో. 3

ఉ. చను మనఁగా విభీషణుఁడు సంగరభూమికి వేగఁ యన్నఁ గ
న్గొనె వినికృత్త పక్షమగు కొండను, రామమహేంద్ర పాతితం
బును, నదులున్ లతాతరు సమూహము ధాతుచయంబు భోగిరా
ట్ఫణమణులున్ గుహాచయము మంజిడిగాయములైన దానినిన్. 4

మ. కనుచున్నంతన వచ్చెఁద్రవ్వికొని దుఃఖంబంత దైత్యానుజా
తునకున్ మానసమందు లేనిది సముద్ఘాతంబుగా గుండె పం
చ, నితాంతంబు మనస్సు వాహిక, జనిస్థానంబులో నున్న దా
రని దుఃఖాదులు యూబికాలువ సముద్రం బంత వైశాల్యమై. 5

గీ. బాధపడునది గుండియ, బడలిపోవు నది శరీరము, భావించునదిమనస్సు.
నా జనిస్థానమగు రహస్యస్థలంబు పొలఁకువ యెఱుంగరాద యోగులకు నైన.

క. నిన్నిగతిఁ గనుచుంటిని నన్నిటు లెవఁడుం గనుంగొనఁడు నీదెస నే
నున్నన్, రాముఁడు నాదెస నున్నాఁ డక్కతనఁ జూచుచుంటిని నిన్నున్. 7

చ. అతఁడు తలంప నీప్రతిభ కందఁడు నాఁజెవి నిల్లుకట్టిపో
రితి, వినినావుకా వపుడు, మృత్యువు వేనికి భీతిఁబొందు నా
మృతికిని నేడు లోఁకువయి, తింతటివానికి నీకు నిట్టి దు
ర్గతి యనఁ జేతులారఁగను గగ్గెడునట్టులఁ జేసికొన్నదై. 8

మ. అలవాటైన యఘం బొకండెవుడు కార్యంబై తదీయంబు దు
ష్ఫలితంబున్ బహుకాలముం గన కదిన్ సాగించుచుండున్ మఱిం
దెలియన్ రాకయ యొక్కసారిగ మహాద్రింబోలె నాసర్వమున్
దలపైవచ్చి గుభేలునం దుముకగా దైవంబు నిర్మించెడున్. 9

శా. ఈదృశ్యంబగునట్టి దేహ మొకనాఁడీ మూఁడులోకంబులన్
బాదుల్ త్రవ్వి తదిందిరాతరువులన్ వ్రాలించి ప్రీలించి పెం
పేదం జిట్టచిటారుకొమ్మల పువుల్ ప్రీలించి వ్రాలించె నేఁ
డీ దుష్టంబగు నేలఁ బండుకొనియుండెన్ గాలుసే యాడకన్. 10

మ. ఖరు మారీచుని వాలి నే శరమువేగం బిట్టె యూగించెనో
యరయన్ వేగబలమ్ము లవ్వి పనిచేయన్ లేద యీమేన, ని
ర్భరమై సృష్టికి మూలహేతువగు మంత్రంబై విదారించు శ
క్తి రమావంతము పాంచభౌతిక విభక్తింబొల్చు మేనియ్యెడన్. 11

ఉ. ఎంతటివౌ తపంబులు మఱెంతటివైన వరంబులున్ బరా
క్రాంతియు భోగదర్పములు కల్గిన నొక్క దురాగ్రహంబు తా
నింతటి చేటు తెచ్చు, క్షణీయించిన నైనను రామచంద్రు చా
పాంతమునందునన్ నిలుచుటన్నది యున్నది తత్త్వలంబుగా. 12

ఉ. ఆగడమంత చేసితివి యాయనయందున, దుఃఖమందులే
నీగతి రామచంద్రునకు నిష్టము కానిది, నిన్ ద్యజించి నే
నేగితి నద్ది కోపగుణహేతువు నీకును, నీవుమెచ్చ వ
ద్దా గతిమాలి యీ యుభయధా యవివేకపథానఁ బోయెదన్. 13

చ. ఒక పెనువైన భోగమును యోగము, దుఃఖము పొందఁగాఁ దిలో
దకము లొసంగ బంధుజనతాపరిశేషము కల్గియుంట, యీ
సుకృతము నీవు చేసితివి శూరశిఖామణి! నేను గూడ మృ
త్యుకబళమైన నాసుకృత ముండెడి దింతయుఁ గాదు నాకిటన్. 14

ఉ. కొంచక రెండుశక్తులను గుప్పితి నాపయి లక్ష్మణుండు త
ప్పించెను రెండుసార్లు మతివీరుఁడు మృత్యువునాకు, నీకదిన్
మించిన లాభమై పరిణమించెను చిత్రము కార్యజాత మే
లించెడు స్వామికిం దెలియు లేశ మెఱుంగక సేతు మన్నియున్.

చ. అయయొ జగత్తు కామవశమై పొనరించు క్రియాకలాప మం
తయు హరికి న్నివేదనము నాఁజను, దేనిఫలంబు దేనికో
యయి పరమేశ్వరార్పితమునై సకలక్రియ యెంతయొప్పు! నీ
వయయొ పొనర్చుటొక్కటియు నయ్యెడి దొక్కటిగాఁగనైనచో.

గీ. అరయఁ బరభార్యయనుటలోఁబరునిభార్యయన్నయర్థంబు తీసిన యట్టియాతఁ
డిన్ని కాలాలలోన నీకన్న నెవ్వఁ డింత ఫలితంబు పొందిన యెవఁడు కలఁడు.

ఉ. తమ్ములు మంత్రులున్ సుతులు దానవయోధులు సైన్యనాథులున్
గ్రుమ్మినబంటు లొక్కడనుకోఁ దగినట్టిఁడు లేకయుండ యు
ద్ధమ్మున కీవు వచ్చితివి దానికి నీవొకవేళ రాఘవుం
జిమ్మిన, దైత్యులన్ మఱల సృష్టి పొనర్పఁగ నెంచినాఁడవో. 18

చ. తవిలి యెదేనియుం దెగువ తార్కొను గుండియ రాముచేతఁ జా
వవలయునంచు వచ్చితివి, వచ్చినవాఁడవు నంత తీవ్రమౌ
బవరము చేయనేటికిఁ దపంబుల పెక్కువ చూపి యల్ల రా
ఘవు భయపెట్టనెంచితివొ, కాదని, వానికి గెల్పునెంచితో. 19

చ. దరిసి నిరస్త్రకంబగు గదాముసలాదిక తీవ్రవర్షముం
గురిసితి వెవ్వడున్ నిలుచుకోటికి రానిది సర్వసృష్టికిన్
బిరుసుబిగించు దాని, నతిభీషణమున్ రఘురాముఁ డెట్టివా
శరముల నొంచె దాని, నది సంశయమున్ విడఁదీసె నీయెదన్.

వ. ఇట్లన్నవద్ద గూర్చుండి విలాపించుచున్న విభీషణుం దవ్వులఁ గాంచిన నక్తంచ
రులు నగరంబున నీవార్తఁజెప్పగా జనంబులకు ధైర్యంబుకలిగి యొక్కరొక్కరు
నంతఃపురస్త్రీలు రావణుని భార్యలు పెక్కుమంది వచ్చి హైమనప్రతిసీరాంచల
సంచిత సరోజాతాక్షులై వానిమీఁదఁ బడి బిట్టు విలపించుచుండగా వారిలో
నొక్క యచ్చర యిట్లనియె. 21

చ. ననుఁగొని తెచ్చినా వసురనాయక! నీదగు నల్లరూపునన్
మనసయి వచ్చితిన్ దివిజమానిను లెల్లరు కక్కసింప న
న్నును విడిపోయినా వొక యనూతనమైన స్థితిన్ ఘటించి నే
నును సురలోక దూషితను నూల్కొన రాక్షసలోక దూషితన్. 22

గీ. అధమురాలైతిఁ జిత్రమౌ విధవరాలనైతి బెండిలిలే దుభయమున నాద
రంబు మాలిన వగు నగరములుగాఁగ దితిజపురికాక యమరావతియును గాక.

ఆ. ఏ నమర్త్యనగుట యిదివేఱ యొకబాధ యవధిలేని విధవరాలితనము
క్రొత్తరాజు కూడుగుడ్డ యిప్పించునో యూడిపించునో పురోర్వువీధి. 24

వ. అంత నొక విలాసిని యిట్లనియె. 25

ఉ. నీకును నే నొకప్డు ధరణీసుతఁ దెచ్చి తటంచుఁ బ్రేమ కం
గీకృతిఁ జూపకున్న నది కేవల రూపక మామె తల్లి యౌ
నాకని చెప్పినావు, కలనన్ భృగురాముని వీరశైవు నా
హో కికురించె దాని కిది యంచని, యాడి తబద్ధమౌ నుడుల్. 26

ఉ. కోరిక లేక స్త్రీజనులకూటమికై పురుషుల్ మృషోక్తులన్
ధీరత నాడఁగా వెనుక దీయర యందుర నిద్ది యాడనౌ
నారయ విద్దియాడఁ దగదంచును లేకయ తత్థలంబుగాఁ
గూరిచె స్వామి నీ కిదియుఁ గూరిచి నాకిదియున్ మనోధవా. 27

వ. అంత నొక కులాంగన యిట్లు వందురె. 28

ఉ. బంటులు గాఁగ నీకలనఁ బ్రాణము లేదిన బంధులైన పు
ట్టింటికి బోయి నేను బతిహీనన యందఱివోలె నందుఁ, బు

ట్టింటను మున్ను నీకయిన యింతి నటించుమను గొప్ప, నేఁడు నా
కంటెను వారు మేలు, గృహకార్యములైనను జేయఁగల్గుటన్. 29

శా. స్త్రీ లే పున్నెము లాచరించెదరొ పుంస్త్రీచావు చావంగ నే
నేలా వత్సము బాసి చన్నదగు మాహాయీవిధం బొప్ప నం
భాలోలారవ మట్లుగా నరవ, నా మండోదరీ దేవియున్
రాలే దింకను వచ్చి నన్గనుచు నీర్ష్యాకోపమున్ పొందునో. 30

మ. మఱియుం జచ్చినఁ జత్తురీ జనములన్ మర్యాద మర్యాదయే
యరయున్ బట్టపురాణికిన్ మిగిలి యన్యస్త్రీ విరోధంబు ము
మ్మరమైనన్ సహియింప రాశరజగన్మార్తాండుఁ బెండ్లాడి య
బ్బురమానాఁడును నేఁడునున్కి యెడఁదం బొంగార్చికొంచుం బొరిన్.

వ. అంతట గుపితసింహ నఖకుద్దాలిత కుంభదేశంబై పరికాఁడు పడి యున్నచోటికి మత్తమాతంగి వచ్చినట్లు మండోదరి వచ్చి, పులి చంపిన బలీవర్దకళేరంబులు కడ కీహామృగంబురా జంబుకంబు లట్లు పెఱకాంత లపసరిల్లగా నామెకు. 32

మ. మదికిన్ బుద్ధికి గుండెకున్ మివులఁ బ్రేమస్థానమై యున్న యా
మదనాకారము, పూర్వమీస్థితి తలంపంగూడ దోసంబె యై
నది, నేత్రంబుల కొక్కసారిగ సమానద్ధాశనింబోలెనై
నది, సర్వేంద్రియ చేతనాపసరణాజ్ఞామూర్తియై కన్పడెన్. 33

వ. చాలదవ్వు నిశ్చేష్టయై చేష్ట పొంది పతిశరీరంబుపైఁ బడియుండి నిర్వాక్కై వాక్కు పొంది యిట్లని విలపించె. 34

క. మనకిట్లు వ్రాసెనని నెత్తిని నోరుంబెట్టు కఱచితిన్ సుంతైనన్
వినినావుకావు చివరకు ననుకొన్నదియంతయున్ ఫలాకృతిఁ దాల్చెన్. 35

గీ. దేవియైననుగావచ్చుఁ దెఱవ నన్నుమించి తెఱవగా నామె యేమియును గాద.
సుదతి భర్తకు నోచుకొన్నదియు సీత నేను నోచుకోలేద యున్నిద్రచరిత! 36

చ. కదు పెదు కొడ్కులం గని యొకండు నొకండును బోర నీల్గగా
నెడఁదయు వ్రయ్య వ్రయ్యలయి యింతలు నింతలుగాఁగనయ్యెనో
పుడమిని ధూళిధూసరిత మోహనమూర్తిని జూచి నిన్ను నా
యెడఁదను గ్రొత్తగాఁగ బలులిచ్చుటకున్ స్థలమున్నదా పతీ. 37

ఉ. రాముఁడు చూడు మిక్కిలి కిరాతుఁడు జోలికిఁ బోకయా పతీ!
నీమది క్రొత్తమోహ మిది నెక్కొనెఁ జిక్కని వాలుటమ్మ వా
లై మన మేల పల్లమునయందున డయ్యుట యంచు జెప్పినన్
నీమది కెక్కదాయెఁ గరుణింపరు స్వామియు నీవు నిద్దరున్. 38

శా. ఈ మండోదరి వీరమాత తనయుం డింద్రుం జయించెన్ బొరిన్
పే ముల్లోకములన్ జయించిన మహావీరుండుసూ భర్త, నేఁ

డేమో వచ్చునిలంకలోనికి నరుం డేతెంచి యెవ్వాఁడొ పెం
డ్లామున్ గాననమందు నేమఱిన భల్లాక్షప్తుఁ డిట్లయ్యెఁబో. 39

మ. అవురా! నా౯బదు కేమిచేతివి నాథా! జీవితాంతానఁ బం
డి వృథాపోయిన చేనికంటె దొలిపంటే లేని క్షేత్ర మ్ము మే
లవునాఁ బండియుఁ బొల్లవోతి నన నేలా? వేళ్ళతో నాకిపో
యె వనీధూర్తులు వానరుల్ మిడుతలై యీదండు మాలంకలో. 40

చ. ఇతఁడొకబ్రహ్మ యీతఁడు మహేశ్వరునిం దలనిచ్చి కొల్చెఁబో
యితఁడును ముజ్జగంబును వహించెను గుప్పిటఁ గాని కామదు
ర్మతికిని సీతఁ డగ్గమయి రామునికోర్తల కగ్గమయ్యెనా
క్షితి నెవఁ డింకఁ గామమును జెందవలెం దలలేని యట్టిఁడై. 41

ఉ. నాకును నప్పుడప్పుడువ నంబున మెర్పు విధానఁ దోఁచెడున్
నీ కిది యంతయున్ దెలిసి నేరిచి నేరిచి సీతఁ దెచ్చినా
వీ కడ వహ్ని వెట్టుటకు నెంచి యటం చెది కోరి చేసితో
నాకు నెఱుంగరాదు, లలనామణి సీత కెఱుంగవచ్చునో. 42

ఉ. శత్రులువచ్చి కోటయును సైన్యము ముట్టడివేసి గెల్చుచోఁ
బుత్రులఁ బెండ్లముం దరలపుత్తురు వేఱొకచోటఁ జాటుగా,
గోత్రము సర్వనాశనము కోరర యెవ్వరునేన్, విభీషణున్
శాత్రవపక్షు నెంచితివొ చాలఁగ రాక్షసవంశవర్ధనున్. 43

ఉ. నా పతియున్ గుమారకులు నాకముపైకిని దండువెళ్ళిరిన్
తే పుదయాన వత్తు రమరీగణకంఠమణిప్రవాళము
క్తావలితాచ్ఛహారములు కానుక దెత్తురటంచుఁ జూతునా!
నాపతియుం గుమారకులు నాకమునన్ స్థిరవాస ముండఁగా. 44

చ. హృదయము ముఖ్యమై మఱి శరీర మముఖ్యముగాఁగ భావసం
పద కలరెల్ల దేవతలు వారియెడం దనుముఖ్యతామితిం
బొదలినవారి కాపదలు పుట్టును, సీత యరుంధతీముఖల్
సుదతులు పొల్చు శుద్ధమగు చోటిది భావనిదానమూర్తియై. 45

చ. తెరలని వ్యాధి మంచమునఁ దీసుక చత్తురు వారి మృత్యువున్
స్థిరములు గుండె వ్రయ్యలుగఁ జేయద, యట్టులె భావరోగను
స్థిరులను గూడ నిశ్చితము చెందిన మృత్యువు సంఘటిల్లఁగా
నరయ హఠాత్తుగా నయినయట్టిది కామి భరింప శక్యమే. 46

ఉ. ఆ దురుసైన కార్ముకి శరాంతము నందునఁ జావు, నీకు మం
డోదరి కౌఁగిటం దనరు నూతనసౌఖ్యముకంటె నెక్కుడై
కాదని యెంత చెప్పినను గాదని, విల్లునుబూని నీవు యో
ధాదులు నేగి తేల్చుకొనినట్టిది యేమొ యెఱుంగ నయ్యెదన్. 47

చ. అభినయ మాచరింతి ధరాత్మజయందునఁ గోరి తెచ్చితో?
త్రిభువన మోహనాకృతిని దేవత వోలికఁ దెచ్చి యుంచితో?
యభయుఁడ వౌచు వేఱయిన యంగనలందున, సంచరింతు వీ
సభయవిలోచనాంబుజ దెసన్ సభయుండ విదేమి యబ్రమో. 48

శా. ప్రోయాలుం బతి తల్లిదండ్రులు కుమారుల్ కూఁతు లీలోక మి
ట్లే యౌచున్ జనముల్ స్వకర్మవశులై లీలన్ విడంబించుచో
నా యీ బంధము లిచ్చఁటం దెగిన, నేలా కల్గు వేతైన చో
పై యిట్లే చనునన్న నిశ్చయము చాపైయున్న లోకంబులన్. 49

మ. తనరం జిన్నవి మళ్ళు మళ్ళుగను క్షేత్రాజీవులుం జేసికొం
చును నీర్వెట్టుచు మొక్కలం బెనుచుకొంచున్ మంచుచున్నట్లు నీ
వును నే నీ బ్రదుకైన శీలమును బ్రోవుం జేసికొం చేగి చ
చ్చిన నాపై నది యేదియో యతని దాక్షిణ్యంబు దైత్యేశ్వరా! 50

ఉ. ఓయి మనోధవా! తెలియు నొక్కటి నాకునుఁ నిన్నుఁగూర్చి నీ
లోయెదలోని మెత్తనయు లోకమునందు నెఱుంగ రానిదై
యా యముఁ డెంత దిట్టరియొ యంతటి దిట్టరి నీదువైరియై
నీ యెదలోని మెత్తనయు నేర్చుట సాధ్యముకాదు వానికిన్. 51

వ. ఈ చివరిమాటలు వించు రామచంద్రుం డచ్చటికి వచ్చిన నతని రాక గుర్తించి మండోదరి లేచి నెమ్మదిగా నేగుఁచో బెఱరాణులందఱుఁ గదలిపోఁగా స్వామి తారామండోదరుల ప్రకృతిభేదంబు నెంచి యచ్చెరువంది విభీషణునితో నిట్లనియె. 52

మ. అవునా! మేమిఁక బోవఁగావలె నయోధ్యాగ్రామ మెప్డైప్డు నా
మివులుం గోఁతులు దండడించెదరు, సామీరిన్ నినుం జెప్పఁ బం
పవలెన్నానతఁడేమొ కన్పడఁడ, యీమాటల్ నినున్ నేను జె
ప్పవలెంగా మఱిపోదు మంచనినఁ బ్రైప్రాణాల్పయిం బోవఁగన్. 53

గీ. వదినెగా రన్నమాటలు వనజనేత్రుఁ డయిన యీ రామచంద్రుఁ డన్నట్టి మాట
లొక్కదానికి సరిపోయి యొకటి యా విభీషణుం డిట్టులనియె నిర్భీకుఁడగుచు.

వ. నేనుఁ గూడ మీ రంగీకరించినచో మీతో వత్తును. నా కిందే మున్నదన, రాముం డన్నకు సంస్కారమ్ము చేయవలయును గదా యనిన, నితఁడు పర దారగమనాఘుఁడు, పాపి, నేను సేయ ననిన శ్రీరాముం డిట్లనియె. 55

శా. సీ! సీ! యట్లనరాదు కర్మలిచటం జేయన్‌వలెన్ లోకముల్
భాసాభాసము లూర్ధ్వముల్ కలవు, నీభ్రాతన్ దురాత్ముండు నాఁ
గాసర్వంబును జెప్పినట్లయినదే? కామారిభక్తుండు, బా
హాసంపాదిత నాకలోక జయకీర్త్యగ్రీయు డల్పుండఁటే? 56

క. ఒక్కప్పుడతని ముందర నిక్కమ్ముగ నిల్వలేద నేను నతండున్
మిక్కిలి కనుగలవానిని జిక్కించుకొనెన్ దినంబు శిరము లొసంగుచున్. 57

వ. అన విభీషణుండు నీయాజ్ఞ, నీవేది చేయుమనిన నది చేయుదును, నాదేము న్నదని. 58

ఉ. అంతిపురంబు చేర్పఁబడినట్టి దశాస్యు కళేబరంబు సీ
మాంతము ప్రాణవంతు లగునట్టిరు రాక్షసులెల్ల వచ్చి నే
త్రాంతగళ ర్ఝరీకలుషితాంబులు చూచిరి రాత్రియై యుషః
ప్రాంతమునందు సంస్కరణకైన పదార్థములెల్ల వచ్చినన్. 59

శా. హేరాళంబుగఁ బట్టెమంచములు నేయే భోగసామగ్రి పా
టీరంబైనది యున్న వన్నియును బాటింపించి పంచెన్ గుసుం
భారాగాంచిత దారుఖండశకటుల్ మండోదరీ దేవి ర
క్షోరాజార్ద్ర చితాప్రకల్పనకుఁ బొంగుల్ వారు దుఃఖాశ్రులన్. 60

చ. మొదట దశాననుండు చనిపోయిన వార్తను విన్న రాణులున్
గదలరు రాతిచట్టులయి కన్నుల నీరిడ రింతయేడ్వరున్
బదియును రెండునాళ్ళు నెఱపన్ దుది నాగ విభీషణుండుగా
రొదయయిపోయె నంతిపురి రోదననిస్వనబంధురంబుగా. 61

మ. ఒగి నే కర్మ మదెందుఁ జేయవలె శాస్త్రోక్తంబుగాఁ జేసెఁ దా
నొగి దానంబు లవెల్ల లోపమని లేకుండంగఁ గావించి యే
మిగ నే రాణి మతెద్ది చేయుమనె సామీచీన్య మేపార నే
నుఁగు తాఁజచ్చి యదే వెలన్న గతిగా నూల్కొంచు గావించినన్.

వ. వియోగదుఃఖ మట్లుండఁగర్మలు సుష్ఠుగా జరిగె నన్న యొక తృప్తి బంధువ ర్గంబున నుండు. నదిలంకాపురంబున నభివ్యాప్తమై విభీషణునం దెల్లయెడల సౌముఖ్య మేర్పడియుండె, నంత శ్రీరామచంద్రుండు తన సేనాపటగృహంబున నుండి విజ్ఞాతవిభీషణ ప్రశంసా ముఖరితలంకానగరవీథియై సుగ్రీవాంజనేయాది సర్వవానరపరివేష్టితుండై యుండ నచటికి విభీషణుండు నరుదేర రాముండు సుగ్రీవవిభీషణులం గాంచి యిట్లనియె. 63

చ. అలయికతెచ్చెఁబో యసుకృతాత్ముఁడు పూరితియయ్యె నంత్యక
ర్మలు సయితంబు, నే తిరిగిరా డనుకొందును రావణుండు మీ
ర లిరువురున్ సహోయులయి రాముని గెల్పును జేయ, నొక్కఁడన్
జలనిధి దాటి యిచ్చటను సాయము మాలిన నేమి కావలెన్. 64

చ. సులభముగాఁగ జెప్పెదరుసూ జనముల్ దశకంఠు నాజిలో
గెలిచెను రాముఁడంచు నది కేవలవాక్య మతండు నొక్కఁడా
గెలుచుట కే నొకండనయి, గెల్పితి మందఱ మంతమంది దై
త్యుల, బని నాదియొట గెలు పొప్పఁగఁ జెప్పెద రప్పు! నాదిగా.

వ. అని సుగ్రీవుని గౌఁగిలించుకొని మఱల నిట్లనియె. 66

చ. బలితవుగుండెలోఁ దలలపాతర యున్నది దైత్యరాజుకున్
దెలియఁగ జాలనైతి తలఁ ద్రెంచుట యన్నది చంపు టన్నదా
పలుకు నిరర్థకంబుగను బంధురధీకుడు బండితోలు మా
తలి వచియించె నా సులువు, దైత్యుని నాతఁడు చంపినట్టులే.

మ. అనినన్ మాతలి సుంత నవ్వి, రఘునాథా! నీవు మాటాడఁ గా
దనఁగా నేగతి నౌను? లౌకికము యాథార్థ్యంబు సర్వంబు తూఁ
చినయట్లాడెదు స్వామి! యీసకలమౌ సృష్టిన్ సరోజాతయో
ని నితాంతం బొకఁడై రచించెనటె యీ నీ వాదిగా లేనిచో. 68

చ. తొలిజనువందు బున్నెములు తోలితి నాదౌర జాలి నీకునుం
బలముగఁ బంపె నీదయిన బండిని దోలితి వేఱుజన్మ మా
తలినయి కాక నీచరణతామరసంబులఁ జేదికోవె యీ
వలన సుమంత్రుఁ డేను నొక బండినిఁ దోలితి మయ్య రాఘవా!

క. ఈ జన్మకు నాదౌర సురరా జాతనికడకుఁ బంపు రాజీవాక్షా!
నా జన్మకు నిను మఱువన యాజి రథముఁదోలు టన్నయది తెలిసెఁ జుమీ.

వ. అనిన శ్రీరామచంద్రుండు ననుజ్ఞ యిచ్చి యాతఁడు బండినెక్కగా వాజులఁ
జేత నిమిరి యింద్రునకుఁ దన కృతజ్ఞత తెలుపుమంచుఁ జెప్పిపంపి తిరిగివచ్చి
లక్ష్మణునితో నిట్లనియె. 71

చ. అలసి విభీషణుండు తనయన్నకుఁగర్మలు చేసె, దాన దై
త్యులకును గైక నాకును నయోధ్యకుఁ గాదని చేసెఁగాన నీ
యిలవయి నాకుఁగోర్కి కలదేమొ యటం చనుసంశయంబునుం
దొలఁచె విభీషణుండు, తఱితో నసురేంద్రుఁడు కావలెన్ జుమీ.

ఉ. కావలెనంచు నెంతొ సుముఖంబుగ నున్నది యూరు, నీవు సు
గ్రీవుని వానరేంద్రు క్షితికిం బతిచేసితి మున్ను నేఁడు దై
త్యావనికిన్ విభీషణు సురాధిపుఁ జేయుమ యింద్రజిద్వ్యధన్
నీ వల కేలుగా నిలచె, నీరధి నీరము తేరఁ బంపుమా. 73

ఉ. నిస్తులమైన మైత్రిగొని నీవుగ రెండవుసార్లు సంశయ
గ్రస్తము చేసికొంటివిని బ్రాణము లాతనికోసమై, మఱిన్
బ్రస్తుత మిద్దినేయ నగు భారము నీయది, దైత్యరాజధా
నీస్తుత! సూర్యసూతియును నేనును బెత్తనదార్ల మిచ్చుటన్. 74

ఉ. ఈవును జెల్మినీదగు బ్రకృత్యనుకూలత గల్గు వారితో
నే వెలయించికొందు వటులే రఘురామునకున్ సఖుండు సు
గ్రీవుఁడు లక్ష్మణుండు వచరించు విభీషణుతోడఁ జెల్మి తా
ర్సేవకు లిద్దఱున్ దమకుఁ జెల్మి ఘటిల్లుట న్యాయమై తగన్. 75

మ. పరమప్రీతిమెయిన్ విభీషణునకుం బట్టాభిషేకంబు సం
బర మాకారము గొన్నయట్లు పొనరింపం జేయఁగా లక్ష్మణుం
డరయన్ వార్ధిజలంబు తెచ్చె నది దీవ్యత్సర్వశైవాలినీ
ఝరిణీ వార్గతబిందుసంభరితమై సంతర్పణంబై తగెన్. 76

ఉ. రాజు విభీషణుండెచట రావణుఁ డెచ్చట నన్నమాటకున్
రాజు విభీషణుం డిచట రావణుఁ డచ్చట నన్నమాటయై
రాజన శాంతిమంతుఁడని రాజన సద్గుణవంతుఁ డంచు దై
త్యాజిరభూములందు విననయ్యెను సృష్టిని గ్రొత్తలౌ నుడుల్. 77

ఉ. ఉపదల్ తెచ్చిరి రామచంద్రునకు దైత్యుల్ తద్గుణాకృష్టులై
కృపణుల్ నేడు విభీషణార్పితధరిత్రిం బ్రీతులై దైత్య నం
తిపురంబందున సుంతయేనియు నతృప్తిం గాంచగా లేర పూ
ర్వపుమర్యాదలు సాగు నింతయును లోపంబంచుఁ గన్పింపకన్.

ఉ. మున్ను దవాగ్ని దగ్ధ మయి పోయిన భాగము భాగమే పరి
చ్ఛిన్నముగాఁగ నైనఁ బరిశిష్టము కాననమంతయున్ వసం
తోన్నయనంబుగా, జివురు, లుబ్బిన తేనెల పూలగుత్తులున్,
సన్నని చల్లవాయువుల సంచరణంబులు గాఁగ నొప్పెడున్. 79

వ. అంత నంగద మైంద ద్వివిద గవయ గవాక్షాదు లయిన యువ వానరసేనా
పతులు పారితోషికములుగా వచ్చిన వస్త్రాభరణంబులచే నలంకృత దేహులగుచు
లంకానగరవీథులయందుఁ గిష్కింధా నగరంబునందు వలె సంచరించుచుండ. 80

చ. ఇనకులసార్వభౌముఁడును నీ పదుమూఁడవు రాత్రులన్ బయో
ధినతసుషీమవాయువులు తెచ్చిన చల్లదనంబుచేత బా
ధను బడి యొంటినిండ, బరిధానము గప్పుచు విచ్చియున్న లో
చనములఁ జొచ్చుచుండగ నుషస్సుషమల్ సిచయంబు ద్రెచ్చుచున్. 81

చ. తనర విభీషణున్ దితిజధాత్రికి రాజును జేయకుండగాఁ
దనపనియైనదంచు వసుధాతనయాపతి యెంచలేద, నా
టి నిశఁ బయోధి యంత వికటించెన, యమ్ములఁ గొట్టికట్టె నం
చను పగయెల్లఁ దీర్చునన నగ్నులఁ జిమ్మెఁ బయోధివాయువుల్. 82

వ. మఱునాఁ డాంజనేయ సుగ్రీవ విభీషణాంగద జాంబవత్ప్రముఖులైన వీరులం
దఱు పరివేష్టించియుండ శ్రీరామచంద్రుం డాంజనేయునితో నిట్లనియె. 83

శా. ఈవార్తల్ సకలం బశోకవనిలో నిన్నాళ్ళు కూర్చుండు నె
ట్లో వైదేహికి సర్వముం దెలిసియుండుంగాని న్యాయంబుగా
నీవై యేగి వచింపగా వలయు నిండెన్ రావణాయుస్సు ర
క్షో వీధిం బ్రభువై విభీషణు డటంచున్ సత్క్రియాహేతువై. 84

చ. తెగి తెగి శీర్షముల్ తెగనితీరున మొల్చెను, రావణున్ వధిం
పగ బరువయ్యె నింద్రుఁడును బంపె రథం బది గెల్చు తెచ్చె, ని
మ్ముగ దశకంఠుఁ డేసిన యమోఘపుశక్తికి లక్ష్మణుండు మూ
ర్ఛగనె, హిమాద్రినుండి విలసత్కరణుల్ గొనితెచ్చినారమున్. 85

చ. మఱియు విరాధులొక్క పదిమందియుఁ గూడి జనింప నెంత వి
డ్డురమగు గుండె కల్లఁ గనుడున్ మఱి యట్టిఁడు కుంభకర్ణుఁ డ
బ్బురముగ నింద్రజి త్తసుర పుత్రుఁడు వానిఁ జంపె లక్ష్మణుం
డిరవుగ నాళ్ళు పట్టినది యీ యఖిలంబును జెప్పరాగదే. 86

క. మన మందఱమును గుశలమ్మని జానకితోడఁ జెప్పి యరుదెమ్మనఁగా
ననిలసుతుఁడు కదలకయుండిన రాముని కనులు వానినిం గదలించెన్. 87

చ. హనుమ యశోకవీథిఁగనె నంబుజలోచన గోళ్ళతోడ గీ
సిన దగు పాపపై వెనుకఁ జేర్చిన దూముడి జుట్టు దానిఁ, దా
ల్చిన మలినంపు వస్త్రమును జేతుల దుల్పి ధరించినట్టి దా
నినిఁ, గనులందు సన్నవగు నిప్పులు కల్గిన యట్టిదానినిన్. 88

చ. తనుఁగని మందహాసముఖతామరసంబునఁ జూచునట్టి దా
నినిఁ దనకూరుచున్న యొక నీటగువైఖరి మౌఖరంబుగాఁ
దనదగుకోర్కి యెల్ల ఫలితంబును బొందినయట్లు చెప్పదా
నినిఁ ద్రిజగచ్చిరస్థ్సితమణి ప్రవికల్పిత దీపికాకృతిన్. 89

చ. సవినయమూర్తియై హనుమ చాగ్రిప్రణామముఁచేసి, ప్రశ్రయం
బునఁ గనుగొంచు జానకియు మోమున నొక్క బిగింపు కల్మని
ట్లనియెను స్వామి రాఘవుఁడు నంపెను నన్ను నినుం గనుంగొనన్
నిను వచియింప యుద్ధమున నీల్గుట రావణుఁడాది రాక్షసుల్. 90

చ. తనకుశలంబు చెప్పమనెఁ దృత్కుశలంబు నెఱింగి రమ్మనెన్
దనుజజగత్ప్రభుండిపుడు దాసజనుండు విభీషణుండుగా
వననిధి రెండు తీరములు వల్లభముల్ తనకంచుఁ జెప్పమం
చనియెను స్వామి, లక్ష్మణుఁడు నంజలిబద్ధుఁడు స్వామి చెప్పచో.

ఉ. యుద్ధమునందు నద్భుతము లున్నవి రాముఁడు చెప్పమంచనెన్
గ్రుద్ధత రామచంద్రుఁడును గోలల దానవరాజు శీర్షముల్
విద్ధము చేయఁగాఁ దెగినవే మొలిచెన్ తల లొక్కవంద సం
బద్ధము కాకయుండఁ దుది బ్రహ్మమహాస్త్రముచేతఁ గూల్చెఁబో.

ఉ. నీవు విరాధుఁ జూచితివి నిక్కము వార్పదిమంది యైనచో
నీవలఁ గుంభకర్ణుఁడగు నీతని చేతులుకూడఁ ద్రుంచితిన్
వా, వినుచున్ ధరాతనయ వాక్కుఁ గదల్పకయున్న నేదియో
భావము చేయుచుంటివిని బల్కవదేటికిఁ దల్లి యంచనన్. 93

వ. అంత మారుతితో జానకీదేవి శ్రీరామచంద్రుని పరాక్రమము భావించుచుంటి నంతకు మించి యేమియు లేదన, నతం డుభయ పక్షంబులు గ్రహించి సీతకు సంతోషంబు గలిగింప నెంచి. 94

శా. ఎంతో బాధను నిమ్నుఁ బెట్టిరి సుమీ! యీ రాక్షసీశ్రేణి చె
ల్లింతున్ వీరిని నేటితో ముదల తల్లీ! యిమ్మునాన్ సీత నీ
వెంతో వారలు నంతె, రాజయినవాఁడెం తాజ్ఞగా నాడునో
యం తాజ్ఞంగొని సంచరించెదరు మీ కా దోస మంచుండునే? 95

ఉ. ఇద్దగుణుండు రాముఁడు జయించెడు వార్తలు వచ్చుటాదిగా
బద్దనవాదరల్ నను సభాజనభాజనగాఁగ జాతురున్
గ్రుద్ధుఁడు రావణుండు కనుగొంచుచు నుండినఁ దర్జనక్రియా
బద్ధమతిన్ నటించెదరు, వారల దోసము లేద యింతయున్. 96

గీ. అరయ లక్షణసంపన్న మైనయట్టు తనరు మాధుర్యగుణభూషితంబు నగుచు
నవ్వ మష్టాంగబుద్ధి యున్నయది నీకు విశ్వసంస్తవమతి పృషదశ్వతనయ. 97

ఆ. పరమధార్మికుఁడవు బలమునుశౌర్యంబుసత్వగుణముశ్రుతముక్షమయు దయయు
విక్రమంబు నీకు వెలయుఁ గొండంతగా నంజనీకుమార హర్ష రాశి! 98

క. మఱియు ధృతిస్థైర్యంబులు మఱియు వినీతత్వ మశ్రమము తేజంబున్
మఱియుఁ గృతివిసర్వహణము బౌరయున్ నీయందుఁ బూర్ణముగ వాయుసుతా!

చ. ధరణిని జంతువుల్ తనువు దాల్చును, క్షుత్తును గల్గు, క్షున్ని రా
కరణము కోసమై కమలగర్భుఁడు వ్రాసినదానినిం దినున్,
దురితముకల్గు నోటు బహుదూరము చూచిన నీవు నేను భా
స్కరకులుఁడైన రాఘవుఁ డఘంబున మన్కిగ నున్నయట్లగున్. 100

వ. ఇది ఋక్షగీత మన, మారుతి తల్లీ! శ్రీరామచంద్రునితో నేమి చెప్పమందు వన, నే నాయనఁ జూడ నెంచుచుంటి నని చెప్ప మనఁగా, మారుతి తిరిగిపోయి శ్రీరామచంద్రుని దర్శించి యిట్లనియె. 101

చ. హనుమ యశోకవీధిఁగనె నంబుజలోచన గోళ్ళతోడ గీ
సిన దగు పాపలై వెనుకఁ జేర్చిన దూముడి జుత్తుదానిఁ, దా
ల్చిన మలినంపు వస్త్రమును జేతుల దుల్పి ధరించి నట్టిదా
నినిఁ, ద్రిజగచ్ఛిరస్థితమణి ప్రవికల్పిత దీపికాకృతిన్. 102

వ. శ్రీరామచంద్రుండు చెప్పమన్న వన్నియుఁజెప్పి, తల్లీ, నీవాతని కేమి చెప్ప మందు వన నతనినిఁ జూడఁగోరు చున్నానని చెప్ప మన్నదని యూరకుండిన రాముండు కనులువాంచి చాల దవ్వూరకుండి విభీషణునితో నిట్లనియె. 103

క. కమలాయతాక్షి జానకి నమరఁగ నీవేగి స్నాత నమలిప్తాంగిన్
గమనీయభూషణాంచిత విమలసిచయ ధారిణిన్ విభీషణ! తెమ్మా. 104

క. నిన్నున్ నమ్మును జానకి నన్నున్ నమ్మితివి నీవు, నాతుక నిను న
మ్మున్ నీమాటంబడి వచ్చు న్నిక్కంబుగను నన్నుఁ జూచును రాజా! 105

క. పలుకుచు నుండగ రాఘవుఁ డలఘువు బడబాగ్ని కుంభితాంబుధి వోలెన్
జ్వలదాకృతి సౌమ్యాకృతి జలభరితాక్షుండు తోచె జనుల కనులకున్. 106

ఉ. అందు విభీషణుం డరిగి యంతిపురంబున స్వీయకామినీ
బృందమునందు నల్లన చరించెడు జానకిదేవిఁ గాంచుచున్
వందన మాచరించి రఘుపత్యనుమోదితమయ్యె నిన్నుఁ దే
రం దనవద్దకున్ మతిధురంధరుఁ డార్యను నిన్నుఁ దెమ్మనెన్. 107

శా. స్నానంబుం బొనరించి ధౌతపరిధానంబున్ మెయిందాల్చుచున్
నానాభూషణముల్ ధరింపఁ గొనిరా నాథుండు నన్ జెప్పెనాన్
నే నిట్లే చనుదెంతునం చనియె దన్వీరత్నమౌ సీత, ర
క్షో నాథుం డటుకాదు, తల్లి! పతికిం గోపంబు రావచ్చునే. 108

క. నా పలుకు నాదరింపుమ యాపతియును జాల చిత్రమౌ వాఁడు త్రిలో
కీపాతివ్రత్యశిఖా దీపాకృతి! భర్తమాట తీర్పవె యనినన్. 109

వ. అంత జానకీదేవియు స్నాతానులిప్తాంగియై. 110

మ. కిణముల్ మానిన చోట్ల గుర్తిడుచు సుగ్రీవుండు పంపించు భూ
షణముల్ తాల్చుచు శుభ్రముంబఱచి వస్త్రంబద్దియే తాల్చుచున్
మణిదీపం బన నిల్వ దైత్యపతియుం బల్యంకికారూఢ స్త్రీ
గణసంసేవిత రాముసన్నిధికి వేగందెచ్చె దైత్యేంద్రుడున్. 111

వ. అంత నచ్చట సమావిష్టులై యున్న వానరవీరులను దైత్యజనులను హెచ్చరికదా
ర్లను వేత్రహస్తులను వీచోపుదార్లను విభీషణుండు తొలంగిపో నాజ్ఞ యీయఁగా
వారియం దొక గొప్ప సంరంభమై. 112

శా. ఏ స్త్రీకోసము దక్షిణాంబునిధి యిట్లేఁదెన్ రఘూత్తంసుఁ డా
యే స్త్రీకోసము చంపెనో సకలదైత్యేంద్రున్ మహాయత్నమై
యా స్త్రీస్త్రీవలెఁగాక వేఱ యెదియో యయ్యయ్యొ త్రైలోక్యస
ర్వస్త్రైణాకృతి పూని యంబికవలెం బద్మాక్షి రంజిల్లునో! 113

ఉ. ఈ రఘురామచంద్రుఁడును నీజటలన్ మఱి వల్కలంబులన్
వీరులు తాల్చగా నయిన విల్లును సంపపాదుల్ ధరించి చ
క్షూరమణీయతాపరిధి శోభ వెలార్చెడు నట్టివాని కిం
పారెడు భార్య, పూరుషులయం దితఁ డెట్లటు లౌనా స్త్రీలలో! 114

ఉ. ఆ నయనోత్సవంబు గనులారగఁ జూడఁగ వేచియుండఁగా
వానరరాక్షసుల్ బలిసి వాఁకిలియందున మూఁగి వారలన్

వే కడకుం దొలంగఁగ విభీషణుఁ డాజ్ఞ యొసంగ గుంపులై
వే కడలింబలెన్ జనులు విస్తృతరావమునం దొలంగుచో. 115

వ. అట్లమ్రోఁత విని శ్రీరాముండు ముంగిలికి వచ్చి జరుగుచున్న యీ యుత్సా రణంబు చూచి విభీషణుని మీద మండిపడి వారందఱను బోవలదని యాపి విభీషణునితో నిట్లనియె. 116

చ. గజిబిజి పౌరభావములఁ గాననవాసుల గ్రామవాసులన్
విజనము చేయనెంచెదవు వెక్కసపాటును వీరు పొందఁగన్
స్వజనము వీరు నాకిచట సంగరమందున గెల్పు తెచ్చి, నీ
రజనయనం గనుంగొన ధరాతనయన్ మది నెంతు రెల్లరున్.

గీ. ఉత్సవములఁ బెండ్లిండ్లయందొలయునాపదలను నంతఃపురస్త్రీలఁ దగును జూడ
నెల్లవారలు చూచిన నేమియయ్యె నందఱును జూడవచ్చు ధరాత్మజాత. 118

వ. అంత సమావిష్టమైయున్న మహాసభవోని యచట సుగ్రీవాంగద లక్ష్మణ విభీ షణాంజనేయ జాంబవ న్మైంద ద్వివిద గవయ గవాక్ష శతవలి దధిముఖ మహావీరులందఱు నున్న యచ్చోటికిఁ బల్యంకికాప్రతిసీర తొలగించి జానకీదేవి మత్త గజమంధరగమనంబున భీతవోలెఁ విరాగిణివలెఁ దిరస్కారభావయుతవలె భర్తృనిరక్తవలె నడుచుచుఁ బ్రవేశించి శ్రీరామచంద్రుని కెదురుగా నిలుచుం డిన. 119

సీ. ఏడాది యన్నమ్ము నెఱుఁగదు లలితాంగి నిద్దుర యెఱుఁగదు నీరజాక్షి
ముడుచుక కూర్చున్న యొడలుగా నంసభాగమున వంగినయట్లు కానిపించు
మొగి నిరంతం బెడతెగని యేదో భయం బక్షుల పెనుభాగ మావరింప
నఖిలలోకాతీతమైన సర్వాంగ విన్యాససౌభాగ్య సౌందర్యమొప్ప

గీ. తన్నుహరిణంబుఁ గొనితెమ్మటన్నకాంత సగముసగమైన మై రామచంద్రునకును
తన సమస్తకామమున కాస్థానభూమి కనులయెదుటను వచ్చి సాక్షాత్కరించె.

ఉ. ఈయమ హేతువై వనులనెల్లఁ జరించెను దా బికారిగా
నీయమ హేతువై జలధికెంతొ శ్రమంపడి కట్టగట్టెఁ దా
నీయమ హేతువై గెలుచు టెంతొ శ్రమం బయిపోయె లంకలో
నాయమఁ జూచినంత హృదయంబునఁ బట్టగరాని కోపమై. 121

ఆ. అతఁడు రాక్షసుం డటంచు సౌమిత్రి వచించె నుంత వినదు చెలువ తాను
ననుభవించెఁ దాను ననుభవించితి మేము నాడ దింతసేయుననుచుఁగలదె?

వ. ఇట్లూహించుచు రాముండు మనసులో నూరక కోపంబు పెంచు కొనుచుండగా.

చ. ఉవిదయుఁ జిక్కెనో బలిసెనో కపులున్ దితిజుల్ పురాధరా
భవఁగని లేమిఁ దారెఱుఁగఁ బట్టరు, కన్నులముందుఁ జూడఁగా
నువిదయొ యింతలోన నయనోత్సవమై కనిపించు, నేదియో
నవ మయినట్టి తేజమొ, జనంబులు నేరరు చూచుచుండియున్.

మ. తెలియన్ రాకయ చూచు నేత్రములకున్ స్త్రీమూర్తి తానింతలో
వల నాగ్నేయశిఖాకృతిం బొలుచు, తెప్పన్ వాల్చి తామెత్తులో
వల నేదో ఫణమెత్తి యాడు భుజగీభావంబు దీపించు, నీ
వల దైత్యాహృతయైన సీత నిలుచున్ భర్తన్ విలోకించుచున్.

వ. అంత బడబాగ్నిచేత సళపెళ గ్రాఁగి కళపెళలాడు సముద్రోపరి సముద్గా
బుద్బుదధ్వనులవోని కంఠరావ మొప్ప శ్రీరామచంద్రుం డిట్లనియె. 1

చ. దితిజుఁడు చేసె నా కపకృతిం బొనరించతి సర్వశక్తులన్
దితిజున కేను వందగఁ బ్రతిక్రియ దుర్లభమైన సాయమై,
దితిజుఁడు తెచ్చె నా కులసతిన్ గులమున్ హరియించినాఁడ నా
దితిజునకున్ మఱింత పగఁదీర్చితిఁ బౌరుషదీప్తి కల్గఁగా. 12

ఉ. మచ్చ యెఱుంగనట్టిదగు మామకవంశమునందు దైత్యుఁడున్
మచ్చనుదెచ్చి వే తొలఁచు మార్గము కానఁగరాని యట్టి దా
మచ్చను, నింటనొంటఁ గులమానిని నెవ్వఁడో కొంచుఁబోయెఁబా
టచ్చరుఁడన్నమాట యకటా! యినవంశమునందు లేదుగా. 128

మ. అన్వృతం బియ్యది నాకు వ్రాసె విధి నేనై యింత కోదండినై
జనకుం డాడనిమాట యాడినవిధిన్ సల్పంగనౌ తీవ్రవ
ర్తనుఁడై పూర్వపుకర్మ యెట్టిదియొ కాంతారత్నముం దొంగిలిం
చెను దైత్యేంద్రుఁడు జీవితం బఖిలముం జెందించి తత్కార్మమున్.

చ. చెడునిముసానఁ బాము కఱచెన్ భుజగమ్మును జంపినామ, యె
క్కుడు విసమిందు పాయునటె కోసికొనన్ వలెఁ గాక దుష్టమౌ
నొడలున నా విసంబు మఱియుం దనువందునఁ బ్రాకకుండ, దై
త్యుఁడు మడిసెన్ విసం బచటె యన్నది యెక్కుక కట్టుగట్టుగా. 130

ఉ. ఇంతకు నేమియైనయది, యెంతటి తేజుగలాఁడు వాఁడు దు
ర్దాంతుని దైత్యరాజు బవరంబున ఘోరభుజంగ మట్లుగా
దొంతరలైన ప్రాణములు తోడె నటంచును కీర్తి కీర్తియే,
కాంత నతండు తెచ్చె ననఁగా నపకీర్తియు దాని కద్దియే. 131

చ. అసురుఁడు కొంచుఁబోయెఁ దనయాలిని, నాతని యింటనుండె వె
క్కసముగ వత్సరం బతివ కాముకుఁడౌ రఘురాముఁ డంగనన్
గిసరని యెంచకే యెవరికిం దెలియంగను రాక తెచ్చి యో
యి! సదనమందు నుంచికొనియెన్ వినినావె, యటంద్రువో జనుల్.

ఆ. రావణుండు నప్సరఃకాముకుండును బరమధృష్టుఁ డుగ్రభావయుతుఁడు
లజ్జలేదు మఱి బలాత్కార కామాంధుఁ డతివ వత్సరాంత మచటనుండె. 133

ఉ. ఇట్టు లనిశ్చితంబయిన యీ వ్యవహారమునందు రాఘవుం
డెట్టుల స్వీకరింపఁగలఁడీ ధరణీసుత, నయ్యొ! సూర్యునిం

దొట్టి పవిత్రతేజములు తోఁగులువారిన యింట శీలముం
బట్టిన సంశయంబయిన భామినిఁగొంట యయోగ్యమై చనున్. 134

ఉ. ఎవ్వఁడొ దుష్టుఁడొ దనుజుఁ డెత్తుకపోయె నదేమి కర్మమో!
జవ్వని దేమి తప్పనినఁ జిక్కనిమాట యదే వచింతు నా
జవ్వని పూర్వకర్మమని, జవ్వనిభర్తది పూర్వకర్మ, మా
యెవ్వఁడొ కర్మ దీని రచియించెనొ వానిది దోసమంతయున్. 135

చ. చెడుస్థలమందు వానకురిసెన్ జలమయ్యది నేను గ్రొమ్మొయిల్
కడుపున నున్న యప్పటి యకల్మషవృత్తిగలట్టిదాన ని
ప్పుడు నన, నీవు పడ్డ పొలముంబడి మాఱితి వీవు, గంగలోఁ
బడిన జలంబునం గలుగు స్వచ్ఛత యేగతి నీకుఁ గల్గెడిన్. 136

గీ. ఇచట దోసము వీనిదం చెవనినైనఁ గాని పూని నిందింపఁగా రానిచోటు
దోసమిచ్చుటఁగలదంచుఁదూఁచిచూచి నిక్కముగ నిశ్చయింప రానిదగుచోటు.

శా. నన్నుం జూడఁగఁ గోరినా వనుచుఁ గాంతా! నిన్ను రప్పించితిన్
నన్నుం జూడఁగ నేమియున్నయది? యైనన్ స్పష్టమై పొల్చెఁబో
మున్నే భర్తను నీవు భార్యవును, నా పొల్పిప్డు లోపించె, నా
సన్నంబై యొక దైవ మున్నముడి స్రంసంబందగాఁ జేయుచున్.

ఉ. నాగతి యేమికావలయునా నిఁక నీవు స్వతంత్రురాల వే
భోగము లీవు కోరెదవొ పూరుషు వానినిఁ గూర్పఁగల్గెదుం
జేగ గలానిఁ జూచికొని చెందుము, లక్ష్మణుఁడో విభీషణుం
డో గణుతింప సూర్యసుతుఁడో మఱి నీదగు నిష్టమై చనన్. 139

మ. మఱియున్ నీకొకమాట చెప్పవలయున్ మారీచునిం జంపితిన్
హరిణంబయ్యది కాదు లక్ష్మణుఁడు యాథార్థ్యంబు వాచించె ని
ష్ఠురు లాయిద్దఱుఁ గూడఁబల్కికొని దక్షుల్వచ్చి రచ్చోటి క
బ్బుర మా బంగరులేడిఁ గోరెదని నీవున్ వార లెట్లెంచిరో? 140

గీ. అంజనేయుండు లక్ష్మణుం డట్లు తాను మాటలాడుచు నుండంగ మనసులందుఁ
బట్టరానంత దైన కోపంబు పూని యుందురని తెలియును రామచందిరునకు.

క. ఎవఁడో మంత్రించిన గతి నవురా కపిదానవాళి యది స్తంభించెన్
దవిలెడు సముద్రఘోరా రవమును వినరానిదైన రవణిక కలుగన్. 142

వ. అంతఁ బెద్దసేపు జానకీదేవి రామచంద్రునివంకఁ జూచుచు నట్లే నిలుచుండి చివరకు లక్ష్మణునిం గాంచి యిట్లనియె. 143

శా. అంధోబంధము ప్రాణ మున్నపుడు పై నంత్యక్రియల్ సేయు సం
బంధం బుండును మానవావలికి, నీవైనావు నాకిప్డు కా

మాంధ న్నన్నుఁ బరిత్యజించెఁగద నీ యగ్రేసరుం డిట్లు నే
నుం ధాయ్యాదిక మాచరింపు మని నిన్నుం గోర లే దెప్పుడున్. 144

శా. నాకుం బిడ్డలు లేరు, బిడ్డవలె నున్నా వీవు నిన్నాళ్ళు, నా
కై కొంచెమ్మయినట్టి సాయమును జేయంజూడవే నీవు ల
చ్చీ! కాష్ఠంబులు తెచ్చి నాకయి చితిం జేర్పించు, నే నీ దరి
ద్రాకారంబునఁ జచ్చియుం బ్రతికి యౌరా! యొక్క రీతిం దగున్. 145

మ. తెరు వి మ్మన్న నొసంగు నాజనని ధాత్రీదేవి, సత్ప్రేమభా
సుర, పుట్టింటికి బోవనేటికిఁ బ్రపాశూన్యల్ పతిత్యక్తలై
తరుణుల్, వహ్నినిఁ జొత్తు నే, ననలుఁ డంతర్వీధి నన్నూనఁగా
బరువం బెంచునె? సర్వలోకనిబిడజ్వాలామహామూర్తియై. 146

క. మీయన్న నీవు నెఱుఁగుదు వాయన మది నెంత తలఁచు నంతయు, సందే
హాయత్తచిత్త మఱి నీ వాయత్తముచేయు మగ్ని నని యాడంగన్. 147

వ. లక్ష్మణుం డంత దనయన్నవంక కనుజ్ఞార్థమ్ము చూడకయ చితా కల్పనంబు
జేసి యగ్ని ముట్టింప సాగరవీచీసముద్ధూతానిలంబుల నయ్యగ్ని పురపురలాడుచు
నంటుకొంచు ధ్వని చేయుచున్నఁ దచ్ఛిఖానిస్వానంబులో గలిపి శ్రీజానకీదేవి
రామునితో నిట్లనియె. 148

శా. నేనొక్కించుకసేపులోనన మహాగ్నిం జొచ్చుచున్నాను స్వా
మీ! నీయాజ్ఞ వచింతు గొంచెము సమున్నీలద్యశోధామ! దై
వానన్ వచ్చిన దోస మంతయును నావంకన్ నిరూపింతు, నీ
పైనన్ దైవము వంద్రు, నీకుఁ గృపలే దందున్ మఱట్లైనచో. 149

ఉ. మచ్చికఁ జెట్టి యర్థముల మాటల నంటివి నన్ను నీవనన్
వచ్చును నేను నైనఁ బడవచ్చును, బంగరులేడిఁ జూఁడగా
విచ్చిన కంటితో నెడఁద విచ్చెను, విచ్చినగుండెలోపలన్
జొచ్చిన వయ్య రామ! రిపుసూదన! సర్వఋషీంద్రవాంఛలున్. 150

చ. నలినదళాయతాక్షి హరిణంబును గోరెను, గోరినందునన్
జలనిధి దాఁటినా వసురఁ జంపితి వింతటి కీర్తి వచ్చె, ను
జ్జ్వలతరపౌరుషంబునకుఁ బట్టయినాఁడవు, నీవు గుండెలోఁ
గలఁకను మాని చూడు ముపకారము కాదటవే జగత్ప్రభూ! 151

ఉ. ఏ ఋషిభావనామహిమ యేర్పడ నాయెదలోనఁ జొచ్చి నన్
గోరఁగఁజేసె లేడి, నది కోమలనీలపయోదదేహ! నా
కోరిక యిట్టులుండు ననుకొంటకు దానవులోన స్ఫూర్తిగా
నేరను వచ్చు, నీ విదియు నేరవె సర్వఋషీంద్రహృత్స్థితా! 152

చ. ఒకపని మంచిచెడ్డలు సముద్భవమౌ ఫలదృష్టి నిర్ణయం
బు కలుగఁ జూతురు తమోహరణా! దయఁ జూచితేని కో
రికయును నాది నీకు నురరీకృతకీర్తిరమాఫలప్రదం
బకలుషగుప్త శౌర్యబహిరాగతి దివ్యఫలంబు రాఘవా! 153

ఉ. ఆఁడది యింతసేయు ననుటన్నది యున్నదెయంచు నన్ను నా
టాడితి, కైక కోరక మహా ప్రభు! నీవని రాకలేదు, నీ
యాఁడది సీత కోరక మహాసురసంహారణంబు లేద, యా
యాఁడది లేక లేద జగమంచు, నిదంతయు నేన చేసితిన్. 154

ఉ. ఈ పదునాల్గువత్సరము లీవు వనంబులయందు నుండి సీ
తాపతి! నీవు మారవుగదయ్య కిరాతుఁడొ బ్రాహ్మణుండొ కా
నీ పది రెండు మాసముల నేనును మారను లేద, రాఘవ
శ్రీపదచిం తనామృత వశీకృత చిత్తనమర్త్యబుద్ధినై. 155

చ. మిగిలిన వేమొ లోకమును మీ రఘువంశపు గౌరవంబు, న
త్యగణిత విశ్లథీకృత నిరంతర భిన్న విచిత్ర చేతన
త్వగుణ కణానుగం బయి కృతాకృతమైన జగత్తు, తమ్మిపూ
మొగడుపు విచ్చి వచ్చినప్రభుండు విరించియుఁ జాలఁ డిచ్చటన్.

ఉ. ఈ కృతకంబు లోకమున నెవ్వడు చాలును దానిఁగూర్చి నా
దాఁకను గూడ నెందులకుఁ? దత్త్వమహఃపరిణాహమూర్తి నీ
యేకృతి తప్పటంచు వచియింపను జాలుదు? జాలు, స్వామినన్
జేకొనకుండ నిశ్చయము చేసినదెల్ల సమంజసంబగున్. 157

శా. మీ వంశంబును గూర్చి యిచ్చట ద్విధామిశ్రంబుగా నున్న ద
చ్ఛావిర్భూతికిలేదు సంశయము నా యంతఃపవిత్రత్వరే
ఖావైశద్యమునందు దేవతలు సాక్ష్యంబుందురో స్వామి! మీ
రీ వక్రంబగు లోకమందు ముడియై పృథ్వీపతుల్ రాఘవా! 158

చ. నిరతిశయంబుగాఁగఁ గరుణించిన కైకయి నీకు ధారుణీ
ధరునితనంబు మాన్పినది, దానను వేఁకితనంబు పట్టి మీ
భరతుఁడు దాని నిల్పె, నతిదారుణ వృత్తము లోకభీతి ని
ర్భరముగఁ దప్ప దిప్పటికిఁ బద్మదళేక్షణ! నీకు రాజవై. 159

క. ఈ రెండు కారణంబుల తీరిట్టిది వీన మొదటిది నిరాధారం
బారయ రెండవ దనఁగా మీరాజులె యెఱుఁగవలయు మీ లక్ష్యములన్. 160

ఉ. చెట్టది కర్మ యంటి వతసీకుసుమాభశరీర! వేఱ తా
నెట్టిదొ నే నెఱుంగ నది యిట్లనరా దనకుండ నాడితిం
బట్టిని లక్ష్మణున్ దిరిగివచ్చిన దన్నది యింత గట్టిగాఁ
గొట్టు నటంచుఁ గర్మయనుకో నయితిన్ జనకాత్మజాప్రభూ! 161

చ. ఒకటి వియోగబాధ, మఱియుం బెనుగొండల నిత్యవాసమున్
ప్రకటితమైన యట్టి కులభావమునందున మచ్చ యన్న దీ
వికృతియు, వార్ధిఁ గట్టుటయు, వెక్కసమై చను దైత్యరాట్కృదం
బకహరణంబు, డస్సితిని మద్హృదయేశ్వర నీవు రాఘవా! 162

మ. ఇనవంశేందు! మనస్సు లోపల మనస్సేలేదు నీకందు, నీ
కొనరన్ నిక్కముగా మనస్సున మనస్సున్నన్ ధరాజాత నే
మనినా వెవ్వరినో వరింపుమనియా? యయ్యయ్యొ! యావేరి పే
ర్లనినా, వెవ్వరుగానినవ్వరఁటవే రామా! జగన్మోహనా! 163

చ. మనసున నింత యుంచికొని మారుతితోడన యుంగరంబు పం
చినయది గుర్తు చిత్రము రచించిన నీయెదలోని చాటెఱుం
గని యది, యిర్వదేండ్లు నినుఁగాంతుని గాఁగను నమ్మి సంస్మృతిం
బొనరిచి నిన్ను నేనెఱుఁగబోవని నా తెలివిన్ హసించెదన్. 164

ఉ. నీ పొనరించుదాన నొక నీతియు నున్నది నే నెఱింగినన్
నీ పొనరింపఁబోవు పని, నే మరణించియ యుందు, దేనికై
యా పదిశీర్షముల్ కలిగినట్టి మహాసురు నీవు చంపనౌ
నీ పదిదిక్కులన్ యశ మదెట్టుల దక్కును నీకు మత్పతీ! 165

శా. ఆమిక్షాకృతి విచ్చిపోదు రనసూయారుంధతుల్ గాని లో
పాముద్రాసతిగాని నీ విటుల భూపాలా! మదిన్ నమ్మవే
నీ, మోహాంధ పటంచు ధూర్జటి హిమానీశైలకన్యామణిం
దా మాటాడునె? నీవు పల్కెదవుపో ధాత్రీసతీకన్యకన్. 166

ఉ. అప్పు డరుంధతీసతియు నంతిపురంబును నింక ద్రొక్కనం
చొప్పమి లేచిపోయె విపినోర్వికి నేనను వచ్చు టెంచుచున్
జెప్పకు మింటి కేగి యిది, సీతయు నగ్నినిఁ జొచ్చె నేను బో
నప్పుడె యంచుఁ జెప్పిన మహాప్రభు! దోసము మాసిపోయెడున్. 167

శా. ఆ యా మౌనులయిండ్లకుం జనకుమయ్యా! నీవయోధ్యంజనన్
ధ్యేయాకారలు వారిగేహినులు భక్తింబొల్చు నన్నీ గతిం
జేయన్ నీవును గోప మూనెదరుసూ! నేమంబు కాదద్ది నీ
వా యా మౌనులయిండ్లకుం జనకుమయ్యా! నీవయోధ్యంజనన్. 168

శా. ఆవేళన్ వనిఁ జేరునప్పుడు ప్రసంగానీతమై చెప్పగా
సావిత్రీకథ, నేను నీ మరణవాంఛాబుద్ధి నైనట్లుగా
నీ వాడన్ ప్రభు నేన చత్తునని యంటిన్ నిక్కమట్లయ్యె నీ
వీవే కారణ మౌట దానికినిఁ బండెన్ మత్తపం బంతయున్. 169

ఉ. నాపయి రామచంద్ర! రఘునాయక! మత్పతి! నీకు నెందుకో
కోపము వచ్చె నద్ది యిదిగో పది యర్లితి వంశగౌరవ

క్షేమముగాఁగ మచ్చ యని చెప్పితి, నచ్చట నింతకంటెఁ దీ
వ్రాపద యున్నదయ్య రఘువంశము నందునఁ గోప మేటికిన్. 170

శా. నన్నున్ వీడి మఱీవు వేఱయిన కాంతం బొంద వప్పున్ గులో
త్పన్నంబై చనుఁ, గైకకంటెను భవత్సంపాదితంబై సమా
సన్నంబై చను పెద్దయెగ్గు రఘువంశంబందు, లోకాగ్నికిన్
సాన్నాయ్యంబగు నూహ లెత్తెదు భవిష్యత్కాలసంసూచిగా.

గీ. భరతుఁ డొసఁగిన ధర ధర్మపత్ని ప్రక్క లేక యేలెదు నర్హత లేదు నీకు
నరపతివికాక నన్నుఁగొనంగవచ్చు నుభయతోభ్రష్టతం బొందు చుంటి రామ!

మ. విమలోషర్బుధచండమూర్తికిని నైవేద్యంబు కాఁబోవు నే
నమరం జెప్పినఁ దప్పు లే దొక రహస్యం బద్ది, మున్నున్నదీ
ప్తమతుల్ మౌనులభార్య లాడినది యోపద్మాక్ష! నేన్ నీవు దీ
పము, నేవర్తిని, నీవు వహ్ని, వవినాభావంబు సంధిల్లఁగన్. 173

క. మన మిద్దఱమును నొక రొకరిని విడి యుండగనువచ్చు శ్రీపతి! లోకం
బునకై యీ కలయిక నీవును లోకమునందుఁ గరుణ పూనవు స్వామీ! 174

గీ. అగ్ని మండుచు నున్నది యారిపోక ముందు నే దానిలోనికిఁ బోవవలయుఁ
జివరి కొకమాట నీకును జెప్పవలయుఁ దెలియఁజాలరు దీనిని దేవతలును. 175

క. ఇరువురము నొక్క వెలుఁగునఁ జెఱుసగమును దీని నెఱుఁగు శివుఁ డొకరుండే
పురుషుఁడ వీ వైతివి నే గరితనుగా నైతిఁ బ్రాణకాంతా! మఱియున్. 176

గీ. అచట చూచుచు నున్నట్టి యందఱకును జెలువ యే మని చెప్పెనో తెలియలేద
చాది చూచిరి నట నుర్వీజాత నచట యుర్వీజాత యున్నట్లుగా నున్నదాని.

ఉ. మారుతి లక్ష్మణుండును క్షమాసుతఁ బూర్వము చూచినట్టివా
రా రుచిరాంగి చెప్పినది యంతయు నర్థము చేసికొన్న వా
రీ రచనంబు సర్వము మహీయ మతీతమనస్కమై జనం
బేరును రామునందు వహియింపరు తొల్తఁ దలంచు దోసమున్.

వ. నిర్భీకవలె స్వాధీనపతికవలెఁ బురస్కారభావయుతవలె, మత్తగజ మంథరసుం
దరగమనంబున నగ్నికడకు నడచి యగ్నిం బ్రవేశించిన. 179

క. హాహాకారంబులతో వైహాయసవీధి యెల్ల వనరెన్ దనరెన్
స్వాహాపతి యంత ద్రిజగతీహితప్రౌఢుఁడై ధృతిక్లిష్టుండై. 180

ఉ. సీతయుఁ జెప్పుచుండ రఘుశేఖరు డొక్కొకయప్డు దుఃఖమున్
ప్రీతియుఁ గోపమున్ మఱియుఁ బ్రేమయు నచ్చెరు వింతలోనఁ దా
నై తనుఁదా నెఱింగికొనునట్టుల విస్మృతి గాంచునట్టులన్
హ్రీతుఁడు పాల్పెలోనఁ బొలయించుచునున్న సమాధినందుచున్.

ఉ. దేవతలై రమామదవతీవ్రతతీ మధుకృత్కుమారకా!
దైవతలోకకార్య చరితవ్రత! నిత్యదశావతారధా
రావిదితాఖిలోత్తమ పురాణకథాకమనీయమూర్తి దే
వావలి కంటకాపనయనా! రఘువంశపయోధిచంద్రమా! 1

మధ్యాక్కఱలు.
అన్నది యాలస్యముగను నవనిరాజ్యము వీడి యటవి
చన్నది తమ్మునితోడ జానకీసతితోడ నిడుమ
లన్నింటి గన్నది కడలియందున నడ్డకట్ట తగఁ
బన్ని, రక్కసిఁ జంపినదియు బరమమౌ భవదీయకరుణ. 183

ముడివస్తువు జగత్తు వేదములు యజ్ఞములు దేవతలును
కడువడిఁ గర్మలు ఫలముగా విరక్తమగు చిత్తమ్ము
ముడి విడి మూలమౌ ద్రవ్యముగ నయి మోక్షమ్ము గనుట
తొడి నింత పన్నిన దొరవు దొరలకు దొరవు మాస్వామి! 184

నీ పన్నిన విధంబు తెలియ నీవుగా నేర్తువు గాని
యా పన్నగడలోని మాయ యందు మున్నాడు దుర్ధిషణు
లే పెఱలకు నౌను దెలియ, సృష్టించి తింద్రియావలిని
నా పైని మనసును, నిన్ను నది చాలు నవనికి దింప. 185

కదలిక యఱు నొక్క తెలివికడలి సంకల్పంబు గాఁగఁ
గదలిక గలిగి హిరణ్యగర్భుండుగా రూపుఁ దాల్చి
కదలికలో శక్తి యనుచుఁ గలిమి నా కలిమితో సప్త
పది యయి సప్తజగత్ప్రభావిడంబనఁ దాల్చినావు. 186

సరసిజభవుఁ డిట్టు లనియెఁ జరణాంబుజమ్ములు వేయి
మఱి నయనమ్ములు వేయి మహియెల్ల మలఁగించుకొంచుఁ
బరఁగ మిగిలి యంగుళములు పదిగ సర్వపురుషుఁ డౌచు
పరమపదం బైన నిన్ను బ్రణుతింతుఁ బ్రద్యుమ్నమూర్తి. 187

సిరియును బార్వతి వాణి సేవింప క్షితియెల్ల మన్ను
చరయ వికుంఠధామమున యందున నవపాయిని యగు
సిరితో వసించుచు మఱియు క్షితికి వేంచేసిన యపుడు
సిరితోడ వచ్చి రక్కసుల సేన శిక్షింతువు నీవు. 188

వెలఁగి యింద్రుం డనె సూక్ష్మచిదచిద్విశిష్ట వేషమున
నలువు నుపాదానకారణము సమానతము సంకల్ప
కలితవేషమున నిమిత్తకారణఘనము కాలాది
చలిత మంతర్యామి మూర్తిఁ జనెదవు సహకారిగాఁగ. 189

తగ గరుడానంత నవపతాకా వితానగోపురము
మిగిలి యైరమ్మదీయము నమృతసరో మృదుభూమి కెలన

నగవడునట్టి సోమసవనాశ్వత్థ మలరించు నీడ
నొగి నైదువందలమంది యొప్ప గొల్చుండి యచ్చరలు. 190

సితమణిమంటపవీథి జెలువొప్ప శేషపర్యంక
వితతమై విమలాదు లెల్ల వీవఁగా వింజామరములు
క్షితి రమా నీలలు కెలన సేవింప శ్రీశంఖచక్ర
ధృతినుండు శ్రీహరి నిన్నుఁ దెలఁతు వర్ధితజగద్ధర్మ! 191

వువ్వగా జాబిల్లి సిగను ముద్దు ప్రభువు నిట్టులనియె
మువ్వాకలైన సంకల్పముగ శక్తి ముప్పేట యయిన
యువ్వసుధన్ నీవుగాఁ ద్రయీరక్ష నెసఁగింతు రామ
క్రువ్విలి ధర్మగుణంబు కోదండకోటి శ్రీరామ! 192

దశరథ సుతుఁడవు నేటి తనువునఁ దరణివంశమున
శిశువవు మిథిలాన్వయమున శ్రీదేవి సీత జన్మించె
విశదమ్ము చేసితి వంశవీరత, పృథివీ తనూజ
విశదక్రియాశక్తి, లోకవిధముగా వెలయింపఁబోకు. 193

జనకుఁడు దశరథరాజు చలితపక్ష్మములగాఁ జూచు
వినయవచ్ఛ్రీ రామ నేత్రవీథిఁ గన్పించె దైవముగ
తనతొడ నెక్కించుకొనియెఁ దనయుని దశరథరాజు
తనబిడ్డయగుటకు స్వామి, తనలోనఁ దాఁ బొంగులగుచు. 194

శా. అంతన్ జూచు జనాక్షిగోళములయం దావిర్భవించెన్ శిఖా
వంతంబైన యుషర్బుధంబున మహోజ్వాలావిభక్తంబుగా
వింతై సీత ప్రవేశమందిన చితావీథ్యుద్గతిన్ రాఘవ
ప్రాంతంబందున రెండువహ్నులుగ సంభ్రాంతుల్ కపుల్ రాక్షసుల్.

వ. మఱియు నొక్కజ్వాల యరుణవర్ణుండు నరుణసటాకిరీటుండు నరుణాక్షుండునై పురుషాకృతి వహించి రెండవజ్వాల సముదయవసంత వేళాప్రముదిత నిరంత కిసలయమధురిత నవారుణాంగక యైన జానకీదేవిగాఁ గనుపించి నంత, నగ్నిదేవుండు శ్రీరామచంద్రునితో నిట్లనియె. 196

ఉ. ప్రాణపతీ! యనింధనమహోగ్నివి నీవయి నీవ యాఱిపో
వేను జగత్త్రయానలమ సేంధనవహ్నిన యాఱిపోదు, నా
లోనను నీవు చొచ్చినను లోకములెల్లఁ జెడున్, జగత్ప్రభూ!
నే నిట నాఱియుందు నవనీసుత నన్ గృప జూడకున్నచో. 197

శా. కొంపల్ కాల్చె మరుత్తనూభవుఁడు లాంగూలంబున న్నిప్పుము
ట్టింపన్ రక్కసితేఁ డనుష్ణుఁడ నరేటిన్ సాము సామైతి ము
క్కింపై యా యనలాజ్ఞ యిప్ప వనితాకృత్యుగ్రతన్ నన్ బ్రవే
శింపన్, జాలని బర్వు నెత్తక కటాక్షింపంగదే రాఘవా! 198

ఆ. నీసగమ్ము నేనునీకు నర్పించితి నను క్షమింపుమయ్య నాథనాథ!
యనుచు నగ్నిదేవుఁ డంతర్హితుండైన యొకతె సీత నిలచియుండె నచట. 199

ఉ. వహ్నిని జొచ్చి యే కమురువాసన కల్గకయుండ మిట్టమ
ధ్యాహ్నపువేళ, నాతపము లగ్నులు క్రుమ్మెడు వేళ, జ్వాలికా
వహ్నులతిగాఁగఁ గట్టిన సొబంగగు చీరసొబంగు మాయకన్
జాహ్నవికంటెఁ బావనత చాలిన పావనశీల కావలెన్. 200

శా. ఐనన్ రామునిమానసం బెఱుఁగ కా యల్లందఱన్ జూచువా
రై నిల్వన్ రఘువంశశేఖరుని యాస్యం బెల్లఁ బుష్పించి సీ
తానారిం గని నవ్వుఁ దేనియలఁ గోదండంబు నందీయఁగా
దానిన్ గైకొనె సీత నవ్వకయ నేత్రప్రస్ఫురత్కోపయై. 201

గీ. జయజయనినాద బధిరితాశాచయంబు గాఁగ సహజమౌ నంధత క్రమ్ముకొనఁగ
వృద్ధమయ్యెనుదివసంబు వెలుఁగుపిండు మూసికొనివచ్చుతమసుచే ముడుతలుపడ.

సీ. మృతరాక్షసాధిప క్షతజవాహిను లెల్ల వెసఁ బశ్చిమపుదెసఁ బేరుకొనియె
పదునాల్గునాళ్ళలోపల నూతనకులాయములు కట్టికొన్న పక్షులును మలఁగె
యామినీముఖము భర్త్రాక్షేపమునఁజేసి కోపభావము నంది గోరగించె
నంతంతఁ జినుకుదు నన్నట్టి యొకచిన్న నల్లమబ్బు విలాసనాట్య మాడె
గీ. చీఁకటులురాకమును వియత్సీమయందుఁ దొందరగఁదోచె నొకతార దూరమందు
కోటితారకల్ పొడిచెను క్షోణియందు బ్రదికి యున్నట్టి వానరేశ్వరుల కనులు.

సీ. వియదగ్రవాహినీ వీచికాడిండీర సంబాధక పృషత్కదంబకములు
రఘురామవిజయ సంరబ్ధనందనవనీ పారిజాతక శిఖాకోరకములు
జానకీరఘురామ సంయోగపరితృప్తి నీచైఃపత ద్వియల్లోచనములు
ప్రభుమహావిజయ విశ్వత్రయీపాఠక సందీపితబ్రహ్మబిందుకములు
గీ. నూత్న సౌజన్యకృద్ధరానుకృతినాట్య పరమరేఖాచల ద్విష్ణుపదవిలంబి
మాలికాక్లప్తకింకిణీజాలకములు శారకాంతులు విరఁజిమ్మె దారకములు. 204

సీ. నిర్ఘాతరాక్షసానేక కళేబరఖాది యాదోనాథగర్జనములు
దశకంధర ప్రయుక్త నిరస్త్ర ముసలగదాది బాధాలుఠద్రోదనములు
కపిచమూకంఠనిర్గత రవస్పర్ధాళు దోదూయమానాంబు ధూననములు
జలజాప్తవంశ్య శిక్షామహానలభీతి కలితవేలాతటాక్రందనములు
గీ. సర్వతఃప్రాపితోర్ధ్వ ప్రసారణములు యామినీకామినీహరిణాంకకృతన
భోమిధోనర్మభాషణ ముర్మురములు గునుఁగులయితోచెను సముద్రఘోషణములు.

సీ. సీత యెక్కిన మహోచితి కాష్ఠములు పండి కుమిలి యంతంతఁ బొన్గుపడుచుండ
క్ష్మాసుతారాఘ వైకాంతభంగ మని కీశాధిపుల్ గుసగుస లాడుచుండ

ఉబుసుపోక లతాంగి నుడికించి యెడఁబాటు గొని చక్రవాకంబు కూయుచుండ
దవ్వున రాక్షసాంతఃపురంబున నుండి గానంబు లేడ్పులు కలసిరాఁగ
గీ. వెలిఁగడలి గాలి యీలలు వేసికొంచు మునరి గుమ్మము దగ్గర మ్రోసికొంచు
జుణిఁగివంచలయందునగొణిగికొనఁగ మధురయామినిప్రథమయామమ్ము కడచె.

మ. ధరణీజాతయు స్వామిమాటకు సమాధానంబు చెప్పన్ మనో
హరుఁడౌ స్వామి విభీషణార్పితమణీవ్యాకీర్ణ దీపాంశుసం
భరమై తన్నును గాంచుచుండె ననుచున్ వైదేహి కన్గ్రీవలం
దెఱుఁగున్ జూడదుస్వామివంక నయనహ్రీబాష్పసంబాధమై.

ఉ. అక్కఱలేనిదే యడుగు నయ్యది యియ్యది తేను రాముఁడా
చక్కెరబోఁడి లేచి యవి స్వామికిఁ దెచ్చి యొసంగు, నిచ్చుచో
నక్కరమున్ స్పృశింపను బ్రయత్నము చేయునుస్వామి సీతయున్
మిక్కిలి తాఁకకుండ విరమించి స్వశయ్యను జేరి వ్రాలెడున్.

శా. ఈమాత్రంబున కగ్నిదేవుఁడును దా నేలా నినుం దెచ్చి సం
ధ్యాముగ్ధాకృతి వేడికొంచు బలవంతం బొప్ప ని న్నిచ్చె నిం
దేమో కాగిన జున్నుపాలవలె నీ విట్లుంటి వన్నం ద్రపా
శ్రీమన్మోహనమూర్తి జానకి వచించెన్ సాశ్రుధారాప్లుతిన్. 209

మ. చెడి పుట్టింటికిఁ బోదురే యువతులున్, క్షిత్యంబ నాకింత తా
విడు మన్నన్ దయనిచ్చి యుండునుగదా! యేలంచు వహ్నింజొరం
బడఁగా, మీరును గూడఁబల్కి కొని నావంకన్ విరోధించి నా
రడఁగంగా నవమానవహ్నిఁబడి, నే నా వహ్ని, జాకుండఁగన్.

మ. అనినన్ శ్రీరఘురామమూర్తి యనె బాలా! యగ్ని నిన్ దాకఁ జా
లను లేదంచు నెఢందలో నెఱుఁగ నేలా! వహ్నియున్ వాయుసూ
నుని పుచ్ఛంబున నంటుకోదనిన నేనుం దాని భావింప కీ
వును భావింపక యెట్లు చెప్పడునె యో పుల్లాంబుజాక్షేక్షణా!

వ. అనిన సీతాదేవి. 212

చ. తరణికులంబు కోడ లవుదాని కయోగ్యను ధారుణీశ్వరుల్
తరణికులంబు, మైథిలులు తత్త్వవిచారణ చేయు బ్రాహ్మణుల్
ధరణితనూజ కూఁతు రవుదానికి దోసము లే దటన్న ని
వ్వెఱపడి రామమూర్తి పృథివీసుత చేతులు పూనెఁ దప్పగా. 213

వ. అంత శ్రీరామచంద్రుండు జానకిం బ్రసన్నురాలిం జేసికొనవలసిన స్థితి నుండి పాసి యామెచే ననుగ్రహింపఁబడవలసిన స్థితికి వచ్చి యొకరమణీయవేళా వికసితానుకూలతానుకూల హేలాకుం డయిన స్వామితో సీత యిట్లనియె. 214

ఉ. మాండవి నాదుచెల్లెలు శ్రమంపడుచున్న దయోధ్యలోన, నీ
తం డిటనుండె నూర్మిళయుఁ దా నట నుండెను, దూర్పునందుసూ
ర్యుం డుదయింపఁబోవునని యూఁటెను మిన్నున వేఁగుచుక్క, ద
క్షుండవు దీక్షితుండవు విశుద్ధధరాఖిలధర్మవార్నిధీ! 215

మ. చలిగాలుల్ చనుదెంచె సాగరతటీసంచారడిండీరశీ
తలగోళంబులు బిళ్ళగాఁ బగిలి సద్యస్స్వీకృతాకాశముల్
జలముల్ చల్లన చిమ్ము టబ్బురమె! భాస్వత్సిక్తతీరావనీ
తలమే చల్లన తెల్లఁ బెల్లుమియఁ బ్రాతర్భా గవశ్యాయమై. 216

చ. ఫల మఱి రెండు రెంటినిఁ బ్రజాపతి సృష్టినిఁ జేసెఁ బాములం
బులుఁగులఁ దొల్త, బాములవి భూమిని రంధ్రములందు దూరి జి
హ్వాలను వెలార్చెడున్ విసము, పక్షులు మిన్నున సంచరించుచున్
గలమృదునాద గానములుగా గగనంబున వేఁగు చెప్పెడున్. 217

చ. తొలి తెలిప్రొద్దు వేడికొలఁదుల్ చిఱుకౌఁగిళు లూనఁగా ధరా
తలమున కైనఁ దొట్టతొలి తద్బృహసూక్ష్మతరోష్ణరేఖికల్
తెలియునొ హేతువున్ ఫలము తీర్చినవొ క్రమమొప్పఁగా హతా
ద్విలసన మొక్కఁడే తెలియు విస్ఫుటలింగగుణజ్ఞ దృష్టికిన్. 218

చ. పరువడి నింద్రజిద్ధతుల వానరవీరుల నెల్ల నోషధీ
గిరి కొనితెచ్చి హన్మ బ్రదికించెన, యాపయి నెందరో మహా
సురులును రావణుండు కపిశూరుల నెందఱ నైనఁగాని చం
పిరి, శవరాజియెల్లఁ బుడమిం బడియుండిన విన్నినాళ్లుగా. 219

ఉ. ఏయమృతంబు వానకురియించెనొ యింద్రుఁడు రాత్రియందుఁదా
మా యఖిలంబులౌ శవము లాస్యములందునఁ బెద్దనవ్వులుం
గాయములందుఁ బుష్టియును గల్గఁగ గంతులు వేయుచుండగాఁ
బ్రేయములైన వౌ వరుస పిల్పుల నందఱు కౌఁగిలించుచున్. 220

చ. తనదగు స్వప్నమందునను దైవతరాజును గానిపించి యి
చ్చిన వర మిట్లుగాఁగ దరిసించిన రాముఁడు సీతతోఁడ జె
ప్పెను పృథివీసుతాహృదయవీథిక మాత్రము నొక్క మారుతిం
గనఁ గపిజాతి నందఱను గాంచినయట్లుగఁ దోచుచుండెడిన్. 221

వ. అంత విభీషణుండు వందకావడులతో వచ్చి వానిని దింపించి శ్రీరామచంద్ర
దర్శనంబుచేసి జయముచెప్పి యిట్లనియె. 222

క. నిన్నటి సాయంతనమునకు న్నియమము చెల్లె నీకు క్షోణీతనయా
హృన్నలిన పత్రపరిమళ సన్నద్ధ దిశాంతచారి షట్పదనయనా! 223

శా. నానావస్త్రములున్ మణిప్రతతులున్ స్నానాంగ రాగంబులున్
తేనై నీకయి వేచియున్న యవి వర్ధిష్ణ్వచ్ఛకీర్త్యంక! మే

మైనన్ మేడల చాలులం దునికి భోగాధినమౌ మన్కి, నీ
వైనన్ మాదగు భోగ హేతువవుకట్టా! గుల్మకోణంబులన్. 224

ఉ. సీతయు రెండు స్నానములు చేసెను వారి మహానలంబునన్
గ్రీతుఁడ నీకుఁ నాజ్ఞ పరికించెద, నాదగు వేలయందు సు
ప్రీతుఁడవౌచు నీవరుగఁ బ్రీతుల యొదురు సర్వదేవతా
వ్రాతము, సర్వదేవతలు రాక్షసునందునఁ బ్రీతులౌటయున్. 225

క. ఓ వల్లభ! చిత్రముగా నీ విచ్చిన యట్టిదాని నీకిచ్చుట మ
త్సేవాదైన్యము కరుణా భావంబునఁ జూడకున్నఁ బాటించునదే? 226

మ. అనినన్ రాముఁడు నవ్వి, మీవినయభాగ్యంబెంతదో! మీరు సే
సిన మేల్సెప్పరుఁ గొప్పసెప్పెదరు నాసేతన్, మఱట్లయ్యు నే
నును నాదీక్ష యయోధ్య చేరుదనుకన్ నూల్కొందు, సాకేతమం
దున దీక్షావిరమంబు చేసెదను నేనున్ దైత్యరాజ్యేశ్వరా! 227

శా. సుగ్రీవుండును నీవు నిద్దఱును నా సూరెల్ విడంబింపఁ గం
బుగ్రీవాజయమున్ గడించితిని వే పూజింపు నీమిత్రునిన్
సుగ్రీవున్ సతిఁ బాసియున్నతని విచ్చేఁదెచ్చి యున్నట్టి ద్ర
వ్యగ్రామంబున నంగరాగమణిమాల్యాదుల్ సమర్పించుచున్. 228

చ. భరతుఁడు నెత్తిపైఁ గొనిన పాదుక లౌచును గావిగుడ్డలై
యరయఁగ మఱ్ఱిపా ల్పులిమినట్టి శిరోరుహపాళియై తనూ
భరముగఁ జేతులారఁ దనపట్టిన నావ్రత మైనవాఁడు వ
త్సరము తుదళ్ళు నాయెదురుదారులు చూచుచునుండు నచ్చటన్. 229

క. అతఁ డచట జటాధారియు నితఁ డిట మణ్యంగ రాగకృత్యతిభోగా
న్వితమతియునయ్యె!మిత్రమ!కృతజ్ఞతయటన్న గుణముమృత్స్నామయమై. 230

శా. అయ్యో! రాక్షసరాజ! నాదగు నయోధ్యావార్త చిత్రంబు, కై
కేయ్యాజ్ఞాధృతి నేను వీడితిని సాకేతంబు, మా వెంబడిం
ద్రయ్యధ్వంబుగ వచ్చె లక్ష్మణుఁడు ముక్తగ్రస్తమై ధాత్రి, సం
దియ్యంజూడఁడు కైకయీసుతుఁడు నందిగ్రామ మందుండుచున్. 231

చ. ప్రిదిలినగుండెయై కదలి ఱెక్కలుకట్టుక యందుఁబోయి వ్రా
లుద మనునంత తొందరయు లోఁగొను, త్రోవయు మేమెఱింగిన
ట్టిదియ, మునుల్ దయాత్ములు ఘటింపరుజాగు, నయోధ్యయెప్పుచూ
చెద మనిపించుచున్నయది, చెప్పరు సీతయు లక్ష్మణుండునున్. 232

చ. అనిన విభీషణుండును మహాద్భుతమోహనచిత్తవృత్తి యీ
మన సిటు లంచు నెట్లనఁగ మానిసి యన్నను మానిసే, మఱిన్

దనుజవిరోధి యన్న యెడఁ దానదియే రఘుమూర్తి, మీరునుం
జనగ నయోధ్య యా పవలెచాలు నటన్న యుపాయమొప్పెడిన్. 233

సీ. మును విశ్వకర్మ చేసినది కుబేరుని వశమందు నున్నది వానిఁ గెల్చి
దశకంధరుండు పంతమునఁ దెచ్చినయది యెంద ఱెక్కినసైన నింక నొక్క
నికిఁ జోటు కలయది నింగిలో వాయువు కంటె వేగముగఁ బోఁగలిగినదియు
ఘనకింకిణీపతాకావితానములతోఁ దరలివచ్చెడు నింద్రుపురమువోని
గీ. దేడు నంతస్తులున్నది యెచటి కచటి కలరు సోపానములు కల్గినదియుఁ బుష్ప
కంబనువిమానమున్నది కడు నయోధ్య యొకదినములోన మిమ్ముఁదీసికొనిపోవు.

ఉ. ఈ విధి దైత్యరాజు వచియింపఁగ రాఘవుఁ డాత్మలోపలన్
దేవతలున్ సురద్విషులు దివ్యము లిట్టివి చేసికొంద్రు లో
కావలిమీఁద బిట్టు నధికారముకై యనియెంచ దానిపైఁ
బోవుటకంటెఁ జూచుటకుఁ బుట్టెను తొందర భూమిజాతకున్. 235

వ. విభీషణుండు తెప్పింతునన్న రాముండు మున్ను సుగ్రీవు నర్చింపుమన్న దైత్య
రాజు వానరరాజు శ్రీరామచంద్రు నర్చించినట్లర్చించి స్వామి! మఱియేమి
చేయుదు నన, నీ వానరులంద ఱేమి కోరి రన్నిట్లనుసరించి రన, విభీష
ణుండు. 236

ఉ. వేలుపువీండ్లు చూఱఁగొని వెక్కసపాటున రావణుండు హే
మాలిని దెచ్చెఁ గోశముల యందున మూల్గుచు నున్నవాని దృ
ఙ్మీలనమంతలో నపగమింపఁగ జేసెను వాని నన్నిటిన్
జ్వాలలు నాఱినట్లు పరువం బఱి కాష్ఠము లెల్లఁ గాలినన్. 237

చ. మఱియు విభీషణుండు హనుమంతుని కొక్కని కీయలేద యం
దఱును విభూషితాంగులయి నాట్యముసేయ విభీషణుండునుం
గరువలిపట్టియున్ నిలువగాఁ గని రిద్దఱు సర్వసైన్యమున్
బరువడి మేఘనాదశరపాతితమై పడినట్టి సైన్యమున్. 238

మ. తగ వీరందఱుఁ గొండలందునను గాంతారమ్ములం దిట్టు లే
గఁగ నష్టాపద భూషితాంగులయి తత్కాంతారయాతు ల్జనుల్
మొగి యిభూషణవాంఛ వీరిఁజెనకంబో నేమియో నయ్యో! శౌ
ర్యగురుల్ వీరలు ప్రాంతపట్టణ జనప్రాణాగ్ని రూపంబులై. 239

సీ. ఘనపతాకలతోడ గగనమ్ము తెరలుగాఁ దెరలుగా గాలిలోఁ దీర్చికొంచు
కనకకింకిణులతో గగనమ్ము సిడులుగా సిడులుగా సడులలోఁ జిమ్ముకొంచు
చనుదెంచి యంత భాస్వరముగా క్షితికని డిగె మింటియింటి మండిగమువోని
కడు వీఁపుపైఁగాక కడుపులోపలికి నెక్కంగ వీలయినట్టి గరుడివోని
గీ. బ్రహ్మరాణి మోజుపడి కట్టుకొన్నట్టి బొమ్మరిల్లువోని పుష్పకమ్ము
రజత కనకమయము గిజిగానిగూడునా మణులు పొదిగియున్న మాద్రిసాఁగ. 240

ఉ. బ్రాఁతిఁగ దైత్యరాజు కొనివచ్చినదిం దను దీనిమీఁద, నా
సీతకు గుర్తు పట్టుటకుఁ జేతము చాలకపోయె నప్డు దుః
ఖాతిశయంబునం దెలియదాయెన యుద్దియ యద్దియైననున్
సీత కయోధ్య కేగుటకుఁ జేతము చెల్లునె దీని నెక్కఁగా. 241

వ. అంత శ్రీరామచంద్రుండు ప్రయాణోన్ముఖుండై యందఱకును వీడ్కోళ్ళు నెఱపుచుండగా నందఱు నవనత శిరస్కులై మాట పలుకు లేకయుండ. 242

గీ. సరయు వెట్టులుండు సాకేత మెట్లుండు కడుపులందువీరిఁ గన్నయట్టి
తల్లు లెట్టులుంద్రు తమ్ముం డెటులనుండు నవని యింత వలదఁటన్నవాడు?

శా. నారల్ గట్టి జటల్ ధరించి నయనానందాభిరాముండు చూ
డా రారాజ దుదారకాంచనకిరీటం బంగదంబుల్ మణుల్
హారంబుల్ కనకాంబరంబు లయి యే యందంబు చిందించుఁ జ
క్షూరాజీవము లందు బ్రహ్మయుదయించుంబో శతానందుఁడై.

ఆ. ప్రభువు రామమూర్తి పట్టాభిషేకం బయోధ్యలోన జరుగుచుండు నటవె!
రెండుసార్లు చచ్చి రెండుసార్లు బ్రదికి యేగకుండ బ్రదుకు టేల యనుచు. 245

చ. అమృతపువాన లెందులకు? నౌషధపర్వతముల్ మఱేల? స్వా
మి మఱి యయోధ్యగొంచుఁజన మేఁకొనకుండిన, నింద చచ్చిపో
దుము, తన చన్న యాపయిన దూఁకుద మందఱమిందు నబ్ధిలో
నమృతపువాన లెందులకు నౌషధపర్వముల్ మఱేటికిన్. 246

శా. గోలాంగూలపతుల్ విభీషణుఁడు తక్కల్ శీర్షముల్ వాల్చ వీ
డ్కో లెవ్వారికిఁ జెప్పటో దెలియలేఁడున్ స్వామి, తానిట్లనెన్
మేలౌఁ బుష్పక మెక్కఁ డట్లయినచో మీరందఱున్, బుష్పకం
బౌలే యెందఱనైనఁ బట్టుననెఁగా యన్నం గపుల్ రాక్షసుల్.

వ. అంత ద్రవ్విన గోడక్రింది చీమలపుట్ట బయలుదేరినట్లు వారందరు విమానం బెక్కనఁ బైయంతస్తున జానకీరాములును గ్రింది యంతస్తున సుగ్రీవాంగద లక్ష్మణవిభీషణాంజనేయ జాంబవదాదులును గ్రిందియంతస్తులఁ దక్కిన వారందఱు నెక్కఁగా విమానం బేటవాలుగా లేచి క్రింది భూభాగము సగము నేలయు సగము సాగరమైన మింటనిలువ, శ్రీరామచంద్రుండు జానకీదేవితో నిట్లనియె. 248

గీ. నెలత! సృష్టికి దొలుతన నేల సగము నీరము సగమ్ముగా నయి నెగడినట్లు
పైని మనమిద్దఱమునున్న పగిదిగాఁగ కానుపించుచున్నది కాదె యనుచు.

ఉ. పట్టణమందు నొక్కెడ నివాసము చేయుచు నాల్గువీధులం
జుట్టి చరించి యెల్లెడలఁ జూచిన చూపది వేఱు, గాలిలో

బుట్టను లేచి క్రింద నలుమూలలు చూచిన చూపువేయు, త్రో
వెట్టిన జీవుండున్ వదలిపెట్టిన దేహము చూచినట్లుగన్. 250

మ. ఉవిదా! వార్నిధి నీరమెఱ్ఱవడినట్లుండెం జుమీ! సర్వదా
నవరక్తంబున మిశ్రితంబయి యుదన్వత్స్వామి మైచాయ పె
క్కువ యైనట్లుగ, నీ వటన్నను మహాగోదావరీదేవి మ
క్కువకుం దత్పతి మేని క్రొత్తజిగులై కూరెన్ ఫలం బన్నటుల్. 251

శా. నిన్నున్ మిక్కిలి గష్టపెట్టితిని దన్వీ! వహ్ని దూఁకించితిన్
నిన్నుం బ్రాణముకంటెఁ బ్రాణముగ మన్నింతున్ యథార్థంబుగా
నన్నా! యేగతి వీని దాఁటుటని నీకై వార్ధిఁ జాపాంతమం
దు న్నీరంధ్రముగాఁగ గొట్టితిని నేనుం బంధుతం జూడకన్. 252

వ. అప్పు డాయన పాపము మిక్కిలి డస్సిపోయి కావేరీ భాగీరథీ సహితుం డయి
వచ్చి చెప్పికొనియె, నపుడక్కగారు చాలనిష్ఠురముగా మాటాడినది సుమీ
యనిన సీతాదేవి యిట్లనియె. 253

మ. చనవున్ నిల్పునా లేదా మీరు వనవాసం బీగతిన్ నిస్తరిం
చిన నాదేవికి మ్రొక్కుకొంటిని గటాక్షింపంగ, రెట్టింపు తీ
ర్పను నౌనా, రఘురామమూర్తి, మధుధారాస్విన్నపుష్పంధయా
ర్ద్రనతోద్య ద్గురుదంత మోహన లసద్రాజీవపుల్లేక్షణా!

క. నీమనసు కష్టపెట్టితిఁ జానా! యిప్పటికి నన్ను క్షమియించితివాన్
భూమీతనూజ నూచీ సీమాంతముగాఁగ జూచె శ్రీరఘురామున్. 255

చ. మఱియును రామచంద్రుఁడనె మానిని! రావణుశీర్షముల్ మఱిన్
మఱి మొలవంగఁ జొచ్చినవి, మానెను బాణములేయ నాతఁ డ
బ్బురముగ వాని మేన బడిఁ బుట్టుచునుండె గదల్ మహాసులున్
బరశులు పట్టిసంబులును బాణము లాతఁడు పోవునంతకున్. 256

మ. తెలివా! రావణుగూర్చి ప్రశ్న లసమాధేయంబులై యున్న వ
బ్బురమై యప్పుడె ఋశ్యమూక మిదివో పున్నాగవేణీ! సుబం
ధురమై శైలగుహోగ్రసీవ్రజలబిందుల్ చేతులన్ నిప్పఁగాఁ
గురిసెన్ ద్వద్విరహాగ్ని తప్పునకు నాకున్నమ్మెదో నమ్మవో. 257

గీ. అనిన జానకి స్వామి నీ కగ్నికాని దగ్నియైనది, యచట నా కగ్నియైన
దగ్ని కాలేద, కిష్కింధయైన నిచట నాఁగ కుండఁగ చనుట మర్యాదకాదు.

ఉ. తారనుగూర్చి చెప్పెదరు ధారణి నీతివిశారదత్వ రే
ఖారమణీయబుద్ధి యని కంజదళేక్షణ యందకత్తె యం

చా రవిసూతి కెంతొ ప్రియురాలని, చూడఁగ నింత స్నేహితుల్
మీరును మీరు, కావలదె మీగృహిణుల్ సయితమ్ముమిత్రముల్. 259

వ. అంత విమానంబు కిష్కింధలో దిగిన వానరు లందఱు దిగి సుగ్రీవాంగదులు రామునివంకఁ గృతజ్ఞదృష్టులు పఱపిన రాముండు సీతవంకఁ జేయి చూపించిన, వారు జానకీచరణాంబుజనిహిత నేత్రులై, జానకీదేవి యంతిపురికి నడచిపోయి తారారుమలచేత నమస్కృతయై వారిం గౌఁగిలించుకొని వారిని బయలుదేరఁదీసి పురవీధుల వెంట వానర వానరీశిశుచేష్టాదర్శనంబును నయనోత్సవ వినోదంబుఁ గాంచుచు మఱలఁ బుష్పకం బెక్కి తారారుమలఁ దనవద్దనే యుండుఁ డని పోవుచుండగా. 260

ఉ. దేవి మహత్త్వమే తెలియు ధీనిధులైన కపీంద్రజాతికిన్
దేవి దయావిశేషము నదీనతఁ గాంచిరి సర్వవానరుల్
దేవియు నుండె నింక నతిథిక్రియ లోపములే దయోధ్యలో
దేవి నిమేషమాత్ర రఘుదేవుని కన్నను మించిపోవఁగన్. 261

గీ. మొదటినుండియు నెడఁద నంగదున కుర్వి గర్భ మనఁ బట్టరానంత గౌరవంబు
నిప్పు డాతని గుండెలో నేమి సీత యేమి సీత రాఘవుని పై యెత్తుమనిసి. 262

వ. మఱి కొంతదవ్వు చనినంత శ్రీరామచంద్రుం డిట్లనియె. 263

చ. ఇచటఁ గబంధసాధు వుదయింపఁగఁ జేసెను గోస్తనీ మఱి
మ్లుచమగు సూర్యసూతికథ లోచనసుందరమూర్తి వాయుసూ
తి చెలువు గూర్చెఁ జేసి యతిదివ్యము భోగివచోతిశాయి వా
గ్రచనము, పొల్చు నీస్థలము రాఘవజైత్రకథానిదానమై. 264

శా. అంతన్ వీచెడు గాలి మాఱినది దేహంబందున న్నిర్వృతి
ప్రాంతంబై చను స్పర్శ యొౘు పవనవ్యాపార మేపారఁగన్
కాంతల్ ముచ్వురు షక్ష్మసంచలనసంకర్షంబుగా నొక్క దుః
ఖాంతంబౌ ననుభూతి పొందఁ బలియిట్లాడెన్ జలన్నేత్రుఁడై. 265

మ. ఇవి పంపాపవమానముల్ శిశిరసాహిత్యంబు లంభోజర
మ్యవనీ మంజులవాసనాలహరికా మాలాపరిస్తీర్ణ సూ
క్ష్మవిధాస్పర్శమనోహరంబులు మతంగర్షీంద్ర దీవ్యత్తప
స్సువిశాలంబులు మద్వియోగదహనక్షోదిష్టసంచారముల్. 266

ఉ. ఓసి! మనోజ్ఞనీరదనవోదయకాల వియద్విలంబమా
నాసితవారివాహ నివహోనతకైశిక! యింద సువ్వె పం
పాసరసీతటీ కుసుమవాటుల బోయెత వృద్ధురాలు నా
తో సరసంబు లాడినది తొయ్యలి! ని న్మది విస్మరింపఁగన్. 267

గీ. అనినఁ జేతులు జోడించి యవనిజాత ధ్యానమీలితలోచన యయ్యె నతివ
రుమయుఁ దారయు నున్మనీ విమలభావ పదము తెలియనిదాని సంస్పర్శ నంద

మ. చినదూరంబున యందుఁ బంచవటి వచ్చెన్ బుష్పకం బంత డి
గ్గిన య మ్మువ్వుర నంగణమ్మునకు దూఁకెన్ లక్ష్మణుం డంబుజే
క్షణ ధాత్రీసుతయుం బ్రదక్షిణముగా సంచారముం జేసి యే
గెను శాలాంతరభూమి కంతటన సాఁగెం బుష్పకక్ష్మాస్థలిన్. 269

ఉ. లోనికి జన్న పృథ్విజ విలోకనలోకజయప్రగల్భప్ర
జ్ఞానిధి, సింహయాన, వికసన్నవలోచనపుండరీక, ర
క్షోనివసంబునం దగడు సొచ్చిన శీర్ణతనూప్రబంధసం
ధ్యానవవహ్నికావిరచితాకృతి, యాకృతిమత్ప్రతిజ్ఞయున్. 270

చ. వెలికిని వచ్చు జానకియుఁ బిన్నవయస్సుది, మందయాన, మం
జులతరమూర్తియై యడవిఁ జొచ్చిన యంతిపురంబు కన్య, దే
హలలిత సౌకుమార్యపరమావధి, రాఘవబాహులగ్న, య
ల్లలనయి వీచుగాలిఁ గదలాడెడు క్రౌంజిపురాకుబోడియున్. 271

క. అందఱు నివ్వెఱవోయిరి యందఱు నాశ్చర్యపడిరి యందఱు దుఃఖం
బందిరి రావణుఁ డెంతటి చిందరపఱచెను లతాంగి చిత్తం బంచున్. 272

మ. పెడఁగా నేగుచు నుండఁబుష్పకము పృథ్వీజాత, యోస్వామి! య
య్యెడగా నున్నది యత్రియాశ్రమము నానేమందు, వందేఁగఁగా
నడరున్ నీదయినట్టి చిత్త మనసూయాదేవి నిన్ గాంచ నే
ర్పడు, నట్లే యనెస్వామి, పుష్పకము నధ్వం బందునం జీలఁగన్. 273

చ. అది యొక పేదయాశ్రమము నచ్చటికిం డిగినారు కోట్ల మం
ది దితిజులున్ గపుల్ మునియు నిర్భరవార్ధకమూర్తి మౌనిభా
ర్య దరనిమీలితాక్షి శిథిలాంగక, రాముఁడు సీత వచ్చిరం
చుదితముదంబుధుల్ పొడిచి రుల్లలదూర్మినితాంతహస్తులై. 274

ఉ. రాముఁడు లక్ష్మణుండు మునిరాజును ముంగిటఁ గూడియుండగాఁ
గోమలి సీత దూరమునఁ గోమలమల్లిక లల్లుకొన్న యు
ద్దామకుడుంగ ధారుణికిఁ దా ననసూయను గాంచుఁబోయి యే
వో మనలించి గౌరవమ్మృదూక్తులు తచ్చరణంబు లొత్తుచున్. 275

ఉ. నీవు నొసంగినప్డు కరుణించితి వం చనిపించెఁ గాని త
ల్లీ! వర మద్ది నీది మసలెం బరిణామవిషాదగాథగా
నా విభు కన్నుదోయికిని నాకసతీనిభమూర్తి నౌటయే
యేవము కల్గజేసినది యేచిన యొక్క దురంతవేళకున్. 276

గీ. ఆ సముద్రంబు లోతల నసురకలఁడు రావణుండని పదితలల్ రక్కసుండు
పదితలలుకావు వానికి వందతలలు మఱియు నొకతల యున్నదే వరమజనని.

మ. కడు మారీచుఁడు వానిప్రెగ్గడయు బంగారపు లేడౌచురాన్
వెడఁగై కోరితి, రాక్షసాధముఁడు త్రవ్వెన్ గోయి, యాగోతిలోఁ
బడితిన్, రజ్జులఁ దోడికొంచుఁ జనె నంబా! పంక్తికంఠుండు నన్
బిడియేన్గుం బలె, దానితోడ మొదలుంబెట్టెన్ మదాపత్తతుల్.

మ. సరగన్ డిగ్గిరి వానరుల్ శతసహస్రంబుల్ విమానంబు, వా
రరుదై సైన్యముగాఁగ వార్థిఁ జని సంహారంబు గావించె నా
శరలోకేశుని, వానియింటను నివాసంబుంటి నేనంట వ
త్సర, మే మాడెనటంచుఁ జెప్పను! జుగుప్సావార్ధులాడెంజుమీ. 279

చ. అన ననసూయ నేత్రముల నర్థము వ్రాలిన ఱెప్పలెత్తికొం
చును దనకాళ్ళ నొత్తికొనుచున్ ముడినారలు తూలిపోవుచున్
గునగునపోయి రాఘవునిఁ గోపమునం గనుచుండ రాముఁడున్
మనసున భీతిఁజెందె ఋషిమానిని యేమనునో! యటంచెదన్. 280

చ. ఋషిసతియున్ మఱల్చికొని యేగె గిరుక్కునఁ దిర్గి లోనికిన్
హృషితుఁడు మౌనియిట్లనియె, వృద్ధత, వృద్ధత, రామచంద్ర! పౌ
రుషమును క్షత్రియావలియెఱుంగును, స్త్రీలును నేర్తురే? ధురా
కషణము పొందు గుండియకుఁ గల్గునొకో వెనుముందు చూచుటల్. 281

వ. అంత నందఱు బోయి విమానమెక్కిన నది బయలుదేరఁబోవు వేళ దూరాన
ననసూయాదేవి నడచుచు వచ్చుచుంటఁ జూచి శ్రీరామచంద్రుం డాపిన,
నామె నడచివచ్చి శ్రమంపడుచు మెట్లెక్కి రెండు ఫలంబులు సీత చేతిలో నిడి
దిగిపోవుచుండ సీత యా ఫలంబులు రామునిచేతి కిచ్చి యామె మెట్లుదించి
తిరిగిరా విమానంబు సాగి చనఁజొచ్చె. 283

ఉ. అపయి రామమూర్తి జనకాత్మజ మానసమందు బిట్టు సం
తాపము నందుచుండె నని దాని నిరస్తము సేయు నూహలుం
బ్రోపుగఁ బుష్పకం బిరుకుపుంతలఁ బర్వతసానుభూములం
దాపగలన్ మలంగునెడ లందున నంబుదగర్భ వీథులన్. 283

ఉ. చోపుచు నెత్తునుండి దిగుచుం గుదిలిం పగువేళ దీర్ఘ బా
హోపరిరంభణంబుగ, నగాగ్రము లెక్కుచు నేటవాలుగా
నై పయనించువేళ మృదులాంసమునందున బాహుయష్టి కా
వ్యాపృతిగాఁగ, నొడ్డిగిల నానిన మై మెయిగాఁగ రాచుచున్. 284

క. తొడ తొడతో నొరయించుచు నడరునఁ గాల్కాలు నెఱుఁగన ట్లదుముచునున్
వడి గాలిఁ దొలఁగు వయ్యెద నిడి షరిగా నెడఁద, నేమి యెఱుఁగనియట్టుల్.

ఆ. భార్య కానువచ్చుఁ బసిబిడ్డ కావచ్చు సహజమైన ప్రేమ సొగవచ్చు
కామభావ మైనఁగడఁగి కావచ్చున యిప్పు డిద్దియనుచు నెఱుఁగ రాక. 286

చ. హరిధనురంతరంబున రయంబున వేగుచునుండెఁ బుష్పకం
బరుణ పిశంగ పింజిర సితాసిత శార మనోజ్ఞ దేహభా
స్వరముగఁ బొల్చు నీ మొగ ముషశ్చలదార్ద్రి మధుస్ఫురద్గరు
ద్భర నవషట్పదీచరణ బంధురసుందరపంకజాననా! 287

ఉ. ఈకెలనన్ మహీధరము లెంతయు యెత్తయిత్రాఁచు లేమొ నా
దూఁకుచునుండెఁ గ్రిందికిని దోఁగులు రాచి విమాన మేగఁగా
శీకరపంక్తిలోపలికిఁ జిందెడు మబ్బులలోఁ బ్రయాణమై
యో కమనీయ వార్షుక నవోదధరోదరసారవేణికా! 288

ఉ. ఈ దెస నెల్ల మబ్బులయి యియ్యది ధారుణియంచు నెంచఁగా
వే దిగుచుండెఁ బుష్పకము విస్ఫుటమై చను లోయలో, విమా
నోదరపూర్ణమై సితకణోజ్జ్వలమేఘము కానిపింపకన్
బైదలి! యొక్కరొక్కరము, వస్త్రములుం దడిముద్దలై చనన్.

చ. తనరఁగ నింతసైన్యమును దామరసేక్షణ క్రీడగాఁగ మో
హనగతి యొంచు రావణమహోజలరాశిని ముంచి లేవనె
త్తినగతిఁ జేసెఁ బుష్పకము, తెమ్మెర లెండపొరల్ ఘటిల్లి యా
రెను వలివంబు నీది కబరీఘటితాత్రిసతీకృత స్రజా! 290

చ. ఉరవడి మబ్బుజీబు లెడ మున్నది లేనిది యేర్పరింపమిన్
గిరికొనయందుఁ గఱ్ఱుమని గీసుకపోయిన నిస్వనంబు ని
ర్భర కపిదైత్యయుద్ధమున వానరవీరుల సింహనాద మం
బరమును నేర్చికో నయిన మాదిరిఁ దోచె విభీతలోచనా! 291

మ. అచటన్ ఘానలు నెండ లిచ్చుట సుదూరాయాతమై సుంతలోఁ
బ్రచల త్పుష్పక, మబ్జకేసరలసద్రజ్ఞాకృతాకేకరా!
రుచిమద్బాహువు వాయుసూతియు సమారోహించె దీనిన్ సద్వృ
గ్రచనాకౌశలుఁ డబ్బురం బగుఁగదా! ప్రాణవ్రతానేశ్వరీ! 292

ఉ. మంజరితాతపంబులు విమానమునం జెరలాడు, వస్త్రముల్
పింజెలయందు నారవు విభిన్ననవాంజనపక్ష్మలచ్ఛవీ!
సంజలయెఱ్ఱనల్ ముదిరి సంపుటితం బయినట్లు తోఁచెడిన్
మంజిడి కింశుకీవనసుమాళి యస్పృగ్బలి మోయుచున్నటుల్. 293

ఉ. ఇక్కటిలంపు టోర్పడకనే గురుతించుచుఁ బోవుఁ బుష్పకం
బక్కట త్రోవతప్పదు నటంచు భయంపడు నేమొ? యేటి కి
ర్పిక్కను నూదికొండలను రాచుక ప్రీలుదు నన్న భీతియో!
నిక్కము కంటి కింత కమనీయత చొప్పదు చోటు లొప్పనే. 294

చ. బయటికి నింత సేపటికిఁ బడ్డది పుష్పక మింతసూటిగా
రయమిది యింతనాఁ బలుకరాని విధంబుగఁ బోవు, గుండెలో
భయమగునట్లు కన్నులును బైరులు క్రమ్మెడునట్లు, దేవతా
లయములఁ బట్టణంబుల, బొలాలను ధారుణి వర్ణచిత్రమై. 295

శా. నా చిన్నప్పుడు గాధిసూతియుఁ బురాణంబౌ కథం జెప్పెనే
ప్రాచీనల్ కుశనాభుకూఁతులను గోపం బందుచున్ వాయువుం
గ్రాఁచెన్ వారి యొడళ్ళు కుంచి కుఱచల్‌గాఁ నట్టులేయిప్పుడుం
దోఁచున్ బిట్టు కుదింపఁబడ్డపురముల్ తోటల్ పొలాల్ చెర్వులున్.

సీ. దూఁకి పుష్పకమును దుసికిలించుకపోయి యలవోక మెరమెర లాడుకొంచు
ప్రతిబింబమయి కాచఫలకంబులందున నక్షుల మిరమిర లాడుకొంచు
వట్టి యాకాశనిర్భరమహోణు సముద్ర మందున మిటమిట లాడుకొంచు
నాతపోష్ణ్యము తొలియంతస్తునందు దేహమ్మునఁ జిటచిటలాడుకొంచు
గీ. చిమ్మ కరగించుకొని రోదసీకటాహమునను బోసిన సీసమో యనఁగఁ బొలిచె
పలుచనివియుఁ జిక్కనివి యెండలు శ్రవోవిటంకపరిలీన రత్నతాటంకయుగళ!

ఉ. ఇచ్చట గాలిలేదు జనియించిన దింతటిగాలి యెట్టులో
యెచ్చట వేగహేతుకమునై జనియించున యచ్చటచ్చటే
కచ్చుకొనంగ వేగమును గాలియు రెండును హేతుకార్యముల్
క్రచ్చర వీలుగాఁ గదలికం గన మిన్నొకఁ డుండఁగావలెన్. 298

సీ. దూరభూభ్రంబున నారగ్వధకుజాళిఁ జివురాకులను గదల్చినది లేదు
అనుక రత్నగవాక్షంబునందు గూర్చున్న నీవగు ముంగురుల్ కదల్చు
మొదల్ తుదల్ లేని చదలున నెచ్చట నెందుకు పుట్టునో యెఱుగఁరాదు
నీ ముంగురులయందు నెఱయునో పయ్యెద కదలిక నుండి నిర్గతము నగునొ
గీ. ఈ మిలద్వాయువీచి తా నెచటఁ బుట్టు క్రమపవమాన చలితాలకా! ప్రకంపి
తానిల విధూతచేలాంచలా! వియత్ప్రమాణకృతమధ్య! ప్రాణసంపన్నమూర్తి!

మ. అనినన్ జానకి చిత్రచిత్రముగ నేలా పిల్తు నన్ స్వామి! నే
మను నీపైఁ గినుకన్ వహించితినినా నూల్కొన్న భావంబునన్,
ముని కాంతామణి యేమిగాఁ బలుకునాఁ బుట్టెన్ మదింభీతి, యా
ర్తుని నిన్నున్ బ్రభు! గోరుచుట్టుపయినన్ రోకంటిపోటన్నటుల్. 300

క. నిన్నన్నది యెక్కటియును నన్నన్నది వేఱొ రామనారాయణ! నీ
పన్నాళికవు దాసిని నన్నున్ మఱువకువె ప్రాణనాథా యనుచున్. 301

మ. అదిగో ఉల్ల కనంబడుంజుమి మహాన్యగ్రోధ మే మర్త్రికిన్
బదునాల్గేడులు దీని వీఁగి బయటం బడ్డన్ బలుల్ మ్రొక్కితిన్
మదిరల్ పాల్పులలంబులన్ యమునకున్ మందాకినీదేవి కి
చ్చెద నంటిన్, రఘురామచంద్ర! కరుణం జెల్లింపవే మ్రొక్కులన్. 302

ఉ. ఓ వటరాజ! నీకరుణయున్నది రాముఁడు నేను లక్ష్మణుం
డీ విలయంబు నింత తరియించితి, మింక నయోధ్య కేగినం
దా వసుధేశుఁ డౌనుజుమి తామరసాక్షుఁడు రామమూర్తి, స
ద్ధీవిధి రెండు రెట్లుగను దీర్చెద మ్రొక్కు లనుగ్రహింపవే. 303

ఉ. నీవును సృష్టి కాదివి మునిప్రచయాధికపుణ్యమూర్తి! యే
జీవున కన్ననున్ మొదటిజీవివి నీవు మహావటేంద్ర! వృ
ద్ధావలిసేవకన్నఁ గలదయ్య మహాసుకృతంబు, దీర్ఘశా
ఖావిలస చ్ఛిఫా వియదఖండ ధరాపరిషంగతాకృతీ! 304

ఉ. ఓ జగదేకకార్ముకకళోగ్ర మహావటమూర్తి! రామచం
ద్రా! జగతీనిరంతనవధర్మపరిస్ఫురితాకృతీ! భర
ద్వాజమునీంద్రు నాశ్రమము తావిది, యిందు నివేమి సౌధముల్
గాజరులున్ లతాతరులు కంటికిఁగన్పడరావు రాఘవా! 305

మ. అనినన్ రాఘవుఁ డిట్లు వల్కె నవముగ్ధా! యమ్మహామౌని నీ
వును నేనుం జనుదెంచు చుంటి మనుచుం బొల్పించె నీ సౌధముల్
మునిపాదాంబుజ కర్ణికాకృతిగ సంయోజింతు నస్మజ్జటన్
వనితా! నీవును సంఘటింపు మధుకృత్పక్షాభమౌ కైశికన్. 306

మ. మనయాతిథ్యము కోసమై ముని మహామంత్రావిరారూఢి కో
ట్లను మించన్ మన మింతమందిమిని బాలా! యింతసౌధాళి తీ
ర్చెనుసూ! పుష్పకమున్ డిగందొడఁగెఁ, బారీస్వచ్ఛ ధారావినూ
తనహీరాంచిత హారసంచితగళాఢ స్సంచరల్లోచనా! 307

చ. ఒక దినమెల్ల బట్టినది యొక్కఁడు నొక్కడు నేగి మౌనినా
యక చరణాంబుజాతముల యందున మ్రొక్కుచు రాఁగ నేరి యే
రికి నెదియెద్ది సౌధ మమరించెనొ వారును వారు దానిదా
నికిఁ జన నాంజనేయుఁడు మునింగన నేగి నమస్కరించినన్. 308

మ. మునియున్ మారుతి గౌఁగలించుకొని సమ్మోదంబునం బల్కె నం
తన, యబ్ధిన్ విపదబ్ధి దాఁటితివినిన్ దాటించి తన్నన్ మహా
ముని! యష్టప్పుడు మీరు మీర్మునులు నంభోయానపాత్రీకృతా
త్మనితాంతోగ్ర తపశ్ఛటావితతిఁ బంపన్ నేను గుర్తించితిన్. 309

సీ. క్షితిజాతకును బ్రతీచిదేవి కేలుదో యిం దీసి పోసిన యెఱ్ఱనీళ్ళు
చనుదెంచు స్వామికి స్వాగతి నెఱప సత్సతి పూనినట్టి మందారమాల
రామార్థకృత ప్రతీక్షాముగ్ధ భరత తపస్తీవ్రవహ్ని సంబంధదీప్తి
ఉగ్రరక్షః ప్రేతకోపశమార్థ సంపన్నాస్పృగార్ద్రి మహోన్నరాశి

గీ. గతమహోహవ దైతేయకపిజగద్వినిర్గత మహోత్క్రుధా సమానీతపిండ
మనఁగ సాయంప్రకాశ సంధ్యారుణిమము లరుగుదెంచెను మున్యాశ్రమాంతరంబు.

గీ. నిశిచనె నుషస్సువచ్చెఁ బండినది మొక్క జొన్నచేను విధానఁ బీచులును బొట్ట
లాకులును రేకులుగను బ్రాచ్యమగుపాలము బిలబిలనివచ్చెఁ బక్షులకలకలములు.

శా. శ్రీరాముంగని మౌని యిట్లనెఁ దపోదృష్టిన్ భవత్సర్వ కాం
తారావాసకథా ప్రపంచమును సందర్శించితిన్ రాఘవా!
నీరాకన్ మదిఁ గోరుచున్ భరతుడున్ నిర్వ్యాజదీవ్యత్తపో
ధారాశ్యామల పద్మకోరకతనుత్వంబై ప్రతీక్షించెడున్. 312

వ. అనిన శ్రీరామచంద్రుండు మారుతిం బిలిచి యిట్లనియె. 313

శా. వ్యగ్రాత్ముండయి కైకయీసుతుఁ డయోధ్యాపుణ్యస్వామీవస్థ నం
దిగ్రామంబున గావిగుడ్డలు జటల్ దీపింప నన్ వేచు, దూ
తాగ్రీయుండవు పోయి చూడఁగదవయ్యా! చెప్పునారాకయున్
సుగ్రీవాదుల రాక వానికి మరుత్పూతీ! నుతవ్యాప్తీ! 314

మ. పదునాల్గేడులు పూర్తియైన దినముల్ పాలింతు నీకోసమై
యది నీధారుణివచ్చి కైకొను మయోధ్యానాథ! నేఁ బోనిచో
నది తానే పతియై వహించునని లో నాలోచనం జేయరా
నిదిసూ, నాదగుధర్మచింతన, మహోగ్నింజొత్తు నిక్కంబుగా. 315

వ. అనినాఁ డాతడు నీవుపోయినారాక చెప్పిరమ్మనా నాంజనేయుండు పంచజ
నబ్రాహ్మణ రూపంబున నేగి తత్రావతర్వేళా వియన్నూతనాతిథిభూత బాల
నీలాంబుదంబుల నీడలయందు నీలాంబరముల పూలు పూఁచిన పూఁదోటవో
నిది, లేఁతగులాబిచీర లారఁబట్టి నది వెలుంగు చూచి, యటకేగి, జటాధిరా
ముండు వల్కలధారి యొకండు రాజపురుషధారులచేఁ బరివేష్టింపఁబడి యగ్ని
ప్రవేశంబు సేయఁ బోవుటఁ గని. 316

ఆ. ధరణిదేవి కన్య దశరథసూనుండు రామమూర్తి యనలరాశిఁ ద్రోచె
దానికిన్ ఫలంబు తానే మహోగ్నిలో నుఱుకుచుండె నన్న యూహతోచి. 317

గీ. రూపసంవాదమున కచ్చెరువడి యుల్ల మిన్నుడిగి యిట్టులనె సముస్మిల దమృత
సారణీ ధోరణీ పరిస్ఫార విమల మధురవాణీధునీ కాశమానపణితి. 318

క. కరుణాభరణాయిత ధీ పరముండు శ్రీరామమూర్తి వనవాసంబుం
జరిపి పదునాలుఁగేడులు మరలి భరద్వాజు నాశ్రమంబున వచ్చెన్. 319

ఉ. పంపెను నన్ను వేగఁజని వహ్నినిఁ జొచ్చెడు నట్టివాని వా
రింపు మటంచు నన్ బలికి శ్రీరఘురాముఁడు జొటజూటినై
లింపధునీ సరోజవిమలీకృత మాధురుఖరీ నిపానపా
రంపరిఁ జొక్కు షట్పదధురామృదురావము లేచుమాటలన్. 320

చ. మఱి నవపారిజాత సుకుమారుఁడు సువ్రతమూర్తి కైకయీ
సుతుఁడును నాకునై యెదురుచూచుచు నుండును బోయినాడునా
నతిగొని తన్మనః కమలనాళము నిక్కిన నేత్రవారిజో
ద్గత మధుబిందుపాన చరితార్థత నా ప్రతిగాఁగ బొందుమీ! 321

చ. అయయొ! యదెవ్వఁడేన్ బ్రణిధి నంపను వీల్పడనంత దవ్వు సం
దియమును దీరి నే బయలుదేరి సమాగతుఁడౌదు నన్నదిన్
నయముగ రెండుమూఁడగు దినాలకుఁ బూర్వము నిశ్చితంబుగా
నయినది నీవుపోయి విరహాతురు నాతని సేదదేర్చుమా! 322

చ. అతనికి ధారుణీవహన మక్కఱలేదు మఱిన్ హుతాశనా
శ్రితముగఁ జేయు దేహము భరింపక పోయిన నేను ధాత్రి, నీ
క్షితియును నేను బూనుటది, నేగి వహించెద నేని వాఁడసం
గతమగు, నట్టు లెన్నడును గా, దతనిం గని చెప్పు మం చనెన్. 323

చ. శ్రవణసుఖంబుగా జరుగు సామనినాదమొ, వాయువీచికా
భవమగు దవ్వునచ్చరలు పాడిన గీతివిరావమో, పురా
భవమున విన్న పావనప్రబంధకథాంశ మొకండు సంస్మృతిం
దవులుచు నున్నదో యనిన దానిని సుస్వరరమ్యశారదన్. 324

శా. వించుం గైకయిబిడ్డ దీప్తనయనావిర్భూత బాష్పచ్ఛటా
సంచారమ్ములు దోసిటం గొనిన పుష్పశ్రేణిలోఁ దేనెలై
వంచారించిన కంఠశంఖమున నిస్వానంబు రాన్ జైత్రయా
త్రాంచచ్ఛ్రీమధుసూదనాస్య పవమానాపూర్ణమైనట్టులన్. 325

క. వందేండ్లకైన జీవుఁడు పొందున్ సుఖలేశ మన్న పోల్కి వినఁబడున్
సందీప్త మధురహృదయ స్పందన కారణ కథాప్రపంచము చెవులన్. 326

ఉ. ఇంతటి పాండితీమహిమ యింతటి సుస్వరకంఠనిస్వనం
బింతటి భావవిస్ఫుటమహీయము వాణియుఁ, జారితార్థ్యవృ
త్తాంతము దౌత్యమందున, మహాత్ముఁడ వెవ్వఁడ వీవు? నీదు దై
త్యాంతకుడైన యాతని సమాగమ మెట్టులఁగల్గెఁ జెప్పుమీ! 327

మ. అన ని ట్లాడఁ దొడంగె మారుతి, విదేహాధీశపుత్రీవియు
క్తుని శ్రీరాముని దవ్వునం దటవులన్ గోదండతాళోగ్రచం
డుని సుగ్రీవుఁడు మర్త్యభుండు కని చండుండైన యా వాలి పం
చెనొ యేమో కని రమ్మటంచు ననుఁబంచెన్ రామునిన్ లక్ష్మణున్.

గీ. వాలి తమ్ముని సుగ్రీవుఁ బాఱఁదోలె నతని భార్యామణిన్ రుమ నపహరించి
ద్రోహి మారీచు హేమరురూకరించి రావణుఁడు దొంగిలించె ధరాతనూజ. 329

క. ఇద్దఱు వియుక్త రాజ్యులు నిద్దఱు భార్యావియుక్తు లిద్దఱు సఖులై
యద్దరి వాలియుఁ జచ్చిన నిద్దరి రావణుఁడుఁ జచ్చె హ్రీపరిహీణుల్. 330

మ. ఎచటం జానకి డాచెనో తెలియదాయెన్ రావణుం డబ్ధులున్
సిచయంబై చను ధాత్రియెల్ల వెదకించెన్ స్వామి సుగ్రీవుఁడు
గ్రచమూయుక్తుఁడు వానరుల్ దశదిశల్ గాలింపగా నంగదుం
డుచనెన్ వాలిసుతుండు దక్షిణము నేనుం గొందఱున్ వెంటఁబో. 331

శా. నేనున్ దూకితి వందవారినిధిఁ గంటిన్ జానకిన్ లంకలోఁ
గానన్రాని మహస్సుఁ గోపమున లంకన్ నిప్పు ముట్టించితిన్
నేనన్నన్ రఘురామమూర్తి దయపూనెన్, నేటి కద్దాన సీ
తానాథుండును బంపె నీకడకు వార్తాసారణీధోరణిన్. 332

మ. అనినం గైకయిబిడ్డ వానరుఁడవా? యన్న న్మరుత్సూతి యం
జన య న్నచ్చర వానరాంగనయుఁగా జన్మించె నే నామె నం
దనుఁడన్ వాయుసుతుండ నొజ్జయగుమార్తాండుండు నాకుం, దివిం
జని నే నాయనతోఁ బఠించితిని శాస్త్రంబుల్ చతుర్వేదముల్.

చ. భరతుఁడు లోచనాంతపరిపాండురకాంతుల నాంజనేయు పిం
జరతనుయష్టిఁ గౌఁగిలినిఁ జాదినయట్లుగఁ జూచి నీవు ని
ర్భరుఁడవు నాయెదం గలవు వందలు ప్రశ్నలు కాని రామచం
ద్రరుచిరపాదవారిరుహ దర్శనవాంఛ యతిక్రమించెడున్. 334

ఉ. నీవు బుజాన నెత్తికొని నిర్భరవానరసేన నక్కటా
యా విలయాంబురాశిపయి నట్టిటు మోసితివో మహాత్ముఁడై
యో వినతాతనూజ పరమోజ్జ్వలవేగ కపిప్రభాకరా!
నీ వొకరుండు కల్గినది నీరజనేత్రుని గెల్పు హేతువై. 335

వ. అనిన నాంజనేయుం డట్లుకాదయ్యా నలుం డను మహాకపి పితృదత్తవరంబున నీళ్ళపై రాళ్ళు తేలింపఁ గలవాఁడు సాగరంబున సేతువు నిర్మించె, దానిపై నందఱ మేగితిమి. రావణవధానంతరము నతని యపరసంస్కారములు పూర్తియైన తరువాత మూన్నాళ్ళ క్రింద బయలుదేరి వచ్చితి మన భరతుండు.

శా. మూన్నాళ్ళైన దటయ్య వచ్చుటకహో, మూన్నాళ్ళు మాత్రం బదే
లన్నా! నీబుజమెక్కి ముప్వురును రా నన్నన్ మరుత్సూతి, మీ
యన్నన్ నీవు నెఱుంగు దాయనయు నీపై యీపనిం జేయుమం
చు న్నోరెత్తి మఱెప్పుడే నడుగునా శూరాగ్రణీ! వేనినేన్. 337

ఉ. రాజు విభీషణుం డిపుడు రావణుతమ్ముఁడు దైత్యధాత్రికిన్
రాజయి రావణుండు సమరంబున గెల్చి కుబేరు దివ్యశం
పాజిరమైన పుష్పకవిమానము గైకొని దానిఁ దెచ్చినన్
రాజు విభీషణుండు రఘురాముఁడు వచ్చెను సర్వసేనతో. 338

ఉ. అన్నకుఁ జెప్పఁగా ఫలితమన్నది లేక విభీషణుండు వ
చ్చె న్నలినాక్షుఁడైన రఘుశేఖరు పాదసరోరుహంబు చే

ర న్నలినాక్షుఁ డయ్యసురరాజ్యము వాని కొసంగె, నాతఁడా
సన్నము చేసెఁ బుష్పకము స్వామి ప్రయాణము చేసె దానిపై.

వ. ఇవుడు లక్ష్మణ విభీషణులును రామసుగ్రీవులును మైమై నుందురు. 340

ఉ. నే నొకరుండ సీత పదనీరజసంతతభావనామతిన్
దానవు నింట నుండెనని తామరసేక్షణ యొక్క యేఁడు ప్ర
జ్ఞానిధి రామచంద్రుడును సాధ్విని వహ్నినిఁ జొన్పె వహ్నియున్
జానకివహ్నిఁ దట్టుకొనజాలక యామెను నిర్వమించెనాన్. 341

చ. భరతుఁడు లోచనస్ఫురిత బాష్పనవాంబుకణాభిరాముఁడై
పరమకపీ! హృదంతరవిభాసితకోమలభావ మొండు నీ
గురుకరుణావిశేషమునఁ గోరిన రూపము తాల్చె, ధాత్రియున్
ధరణిజఁ గన్నదో మఱియు ధాత్రితనూజయె ధాత్రిఁ గన్నదో. 342

శా. కైకేయీసముపజ్ఞ మియ్యది జగత్కల్యాణగాథాప్రవా
హాకారంబయి పొల్చు రామకథ యాహా నీవు నీవంచు ని
ర్నీకులో వారలు వారలంచును నిరూపింపంబడెన్ ధాత్రికిన్
కాకన్ గోసలరాజులన్ మిగులు నొక్కండై జగన్నాథుఁడున్.

గీ. జీవలోక మ్మిదింకిఁ బుష్పించె నసుము ధ్యేయమూర్తులుగా మీరు తీర్చినారు
ముప్వురును బ్రహ్మచైతన్య పూర్ణమధువు లవతరింప నైరమ్మదీయప్రాదాళి. 344

చ. మది రఘురామచంద్రునకు క్ష్మాసుత యగ్నినిఁ జొచ్చునన్న భీ
యొదవదు నేను జొత్తునని యుల్లమునందున భీతి గల్గె నే
ర్చెదవును రెండు దూత్యములు చేసినవాఁడవు నీవు భేదమున్
విదితము గాఁగ నల్ల రఘువీరుని లోయెదలో రహస్యమున్. 345

ఉ. రాముఁడు జ్యేష్ఠుఁడే నతని రాజ్యము దొంగిలరా దటన్న భీ
నామది నుండె లౌకికము న్యాయము కాదనుభీతి, యిప్ప డే
దో మహితానుభావ మొకఁడూగుచునున్నది యాత్మలోన నా
రాముఁడు కాఁడు నిక్కముగ రాముఁడు సీతయుకాదు సీతయున్.

గీ. అంత మంత్రులు వెంటరా ననిలసూతి పరమసఖుఁ డయి తోడన బయలుదేర
వేగరుల నయోధ్యకునుబంపించి తానుభరతుఁడు ఋషీంద్రువాటికిబయలుదేరె.

సీ. తర్పణవేళ శ్రుతంబైనఁ బితృదేవతా దర్శనమున నుద్భ్రాంతి కలిగె
వినినంతలో బుద్ధి విమలమై యేపారె సన్న్యస్తశస్త్రాస్త్రసంచయమున
నొగిహాత్రచ్యుతమైన నుబుకుగుండియను నంగడిలోన జారెఁ దక్కొడయుఁ జేత
నెవ్వరో చెప్పిన నెత్తిన కశయుగా సారథి చిత్రభాస్వరతఁ గాంచె

గీ. మిలదమృతవాక్యధోరణి మేఁతమాని విశదముగ వినుచుండెను బశుగణంబు
రాఘవుఁడు భరద్వాజు నాశ్రమము తిరిగి వచ్చెనన్న దయోధ్యలోఁ జొచ్చినంత.

ఉ. ముప్వురు రాణులుం గనుల బోరన నీరము జార నేడ్వఁగా
దవ్వున నున్న సేవకుని దండము హస్తమునుండి జారఁగా
సవ్వడి యింతలేక పరిచారిక బొమ్మవలెన్ నిలంబడన్
మవ్వపువార్త యంతిపురి మధ్యమునం బ్రసరించె మంత్రమై. 349

క. ఊరెల్లను గదలి బయల్దేరె భరద్వాజు నుటజదేశము శబ్దాం
భోరాశియైనది యయో ధ్యారాజితగగనపథ మతంద్రాళువుగా. 350

ఉ. కోసలముల్ రఘూత్తముని కోసముగా శివరాత్రులున్న వా
యాసముమాని సంజ దివిజాలయ మేగెడునట్లుగా నయో
ధ్యాసముపాత్తమై వెడలె నచ్చట, నచ్చటఁజేరి తీర్థయా
త్రాసముపేత భక్తజనతామయ శైవలినీ ప్రవాహమై. 351

సీ. కనకాంబరములు నుగ్రమయూఖ మణిభూషణమ్ములుఁ జూడ వానరచయంబు
ఘోరాననమ్ములు కుటిలదంతంబులు నరయ మర్యాదా క్రియాచరణము
సింహనాదంబు లాశ్రితరామనామముల్ చన రౌద్రశాంత రసాశ్రయములు
గగనపుష్పములు శాఖాచంక్రమణములు ప్రస్తుతార్థాక్షేపభావ ఫణితి
గీ. యలభరద్వాజముని తపఃప్రాప్తమైన ఫలసమృద్ధి రాఘవ వనీవాసజాత
ఫలసమృద్ధి వృక్షంబులపంట యగుచు నందె నానంద మయ్యయోధ్యాజనంబు.

చ. భరతుఁడు మారుతిం గలిసి వచ్చుచునుండినఁ జూచి సర్వా
నరులును రాముఁడంచును మనంబున నెంచుచు డిగ్గి వృక్షముల్
మరియుఁ బునఃపునఃకృతనమస్కృతులౌచును దవ్వునన్ ధనుః
పరముని రాముఁగాంచి కడుభ్రాంతి వహింతురు చిత్రవృత్తులై. 353

చ. మఱియును రామభక్తులయి మానవ దానవ వానరావళుల్
మఱియును నొక్క రొక్కరిని మన్ననచేయుచుఁ బల్కరించుచున్
మఱియును బండ్లొసంగుచును మాటల నాడుచుఁ జెల్మి సేయుచున్
మఱచిరి జాతి భేదములు మానవ దానవ వానరావళుల్. 354

గీ. హరులు దోశ్శాలులని యయోధ్యాప్రజలకుఁ గడు మనస్సుల లోపల గౌరవంబు
నలయయోధ్యాప్రజలు నయోధ్యాప్రజలని కపులకును నాత్మలందునగౌరవంబు.

చ. హరికథితోగ్ర రాఘవ మహాసుర యుద్ధవిచిత్రఘట్ట సుం
దరకథనంబు లట్టులె వినం బ్రియమెంతురు కోసలప్రజల్
మరి కథనాభిలాష మెద మానఁగఁజాలరు వానరేశ్వరుల్
పరమసఖుల్ విభిన్నరసభావ సమాకలితార్ద్రమానసుల్. 356

గీ. అన్న పాదాభివందనం బాచరింప భరతుఁడును వానిఁ గౌఁగలింపంగ నన్న యొండొరుల మేనులుం జేతు లొరసికొంచుఁ గ్రమసంవాహనామనోజ్ఞత వహించె.

గీ. తొలిసముద్వేగసంయోగములును గడచి పైనసంయోగశాంతభావములు మసల నమృతనిష్యంద మందహాసనముల నొక్క రొక రభిషేకించుచున్నవేళ. 358

శా. సీతారాముల పాదపద్మములనుం జేర్చన్ దలన్ గైకయీ
సూతిన్ శ్రీరఘురామచంద్రుఁడును భిక్షూ! సేమమా? యన్న నా
నీతంబౌ మృదుహాస మాననమునన్ స్నిగ్ధాభిరామంబుగా
సీతాదేవియుఁ బ్రేమ నాతని తలం జేర్చం గరాంభోజమున్. 359

చ. భరతుఁడు లక్ష్మణుండు మతిభాసి పరస్పర గౌరవంబులన్
పరమ సహోదరత్వ పరిపాలితభావనఁ గౌఁగిలింప న
ట్టురముగఁజూచుచుం గపిసమూహము నన్నయుఁ దమ్ములిట్లు ము
వ్వురు వనవాసముం జరుపఁబోయిరొ! ముువ్వురు తిర్గి వచ్చిరో? 360

వ. అంచు శత్రుఘ్నుండు ముువ్వురన్నలకు వదినెగారికిఁ గ్రమముగా నమస్కరించు చుండ సౌమిత్రి తమ్ముని చిబుకంబు నంట నతండు తలయెత్తి యన్నవంకఁ జూడ సౌమిత్రి తన నేత్రాంతర సుదర్శనాంశువులు తమ్ముని యాత్మలో నిక్షేపించె. 361

ఉ. అంతట దాశరాజు గుహుఁడాతని వెంబడి నొక్క సేవకుం
డంతట నంతటన్ భయమునందుచు రా బిడియంపుమూర్తియై
యంతికదేశముం దరియ నంబుజనేత్రుఁడు రమ్మటంచు నే
త్రాంతర వారిజాహిత సితాసిత దీప్తులవెల్లఁ జెర్మియై. 362

మ. గుహ! నీ దారుచయంబు ధూర్జటి జటాకోటీర శైవాలినీ
వహమై ధూర్వహ మౌచునున్నదియెనా, స్వామీ! భవద్భృత్య లే
రుహబంధూష్ణకరాభిమర్శముగ నేఁడున్ మోయుచుండంగ ధూ
ర్వహమై సాగునటన్న స్వామి యితఁ డెవ్వాఁడన్న వైదేహియున్.

ఆ. పురమునందుఁ బసుపుముద్ద యటంచును నన్నుఁ బాఱిపోయినాఁడు వీఁడ నంగ రామమూర్తి నాకంటెఁ దెలివిగలాఁడు వీఁడటంచు గోడియాడె. 360

వ. అంత భరతుని కనుసన్న నర్థమంత్రి యా ధీవరునకుఁ బైఁడిముద్ద యీయఁబోఁగా వాఁడు లజ్జవడిన, గుహుండు భయంబులేదు రాజానుగ్రహము స్వీకరింపుమన, నతండు దానిని స్వీకరించె. 365

సీ. రవిబింబములయంచు రహిమించు నిరుదెసల్ చెలఁగ హేమాంబరోష్ణీష మొప్ప
నడుమునఁ గూర్పాస మిడియ బిగించి కట్టినయట్టి పట్టుధట్టీ సెలంగ
జమిరెడు తెల్లమీసాల బక్క కపోలమున వెంద్రుకలు పొడిపొడిగ నెగురఁ
దెల్లని కనుబొమల్ దీధిత వియ్యమం దిన దీప్తనేత్ర కాంతియు నెసంగ

గీ. కనకవలయంబు తుది మణికట్టునందు జారు కూర్పాసమునయందు జరుగుచుండ
నల్లనల్లన యేతెంచు నట్టి మంత్రిశేఖరుం గాంచుచున్ రఘుశేఖరుండు. 366

ఆ. లేచి యెదురుపోయి లీలామనోజ్ఞహాసంబుగాఁగ నగ్ని సాత్కృతుఁడవు
కావు నీవు కానఁగడచి వచ్చితి నేను నాకు నింక బండి నడవు మీవు. 367

ఉ. తా రమణీయవాక్యముగఁ దాత! సుమంత్ర! నిజంబు నీవు నా
సారథివంచుఁ జెప్పెదరు స్వర్గమునందునఁ గూడ, దైత్యసం
హారము వేళ నారథము మాతలి తోలె, నతండు చెప్పె, నీ
కోరిక యద్ది, నాదయిన కోరికయున్ మఱి యద్దియే సుమీ. 368

వ. అనుచుండ సుమంత్రుని నేత్రంబులు జలాపూర్ణంబు లగుచుండ రాముం
డాయనం గౌఁగిలించి కొనిపోయి తనవద్దఁగూర్చుండంబెట్టికొనఁ దక్కిన మంత్రు
లెల్లరుఁ గ్రమముగా వచ్చి నమస్కరింప రాముం డందఱును గుశలప్రశ్న
లడుగుచుండ. 369

ఉ. కర్శనకాల మెల్ల వెనుకం బడినట్లు ద్విధా త్రిమార్గగా
దర్శన మయ్యె రామునకుఁ దల్లులు ముగ్గురు గంగయొద్దనన్
దర్శనమీయు, వారి పదతామరసంబుల జాటజూటికా
మర్శనమొప్ప మ్రొక్కి రట క్ష్మాసుత రాముఁడు లక్ష్మణుండునున్.

శా. ఆ కన్నీళ్ళులు కౌగిలింతలును మూర్ధాఘ్రాణముల్ దేహమ
ర్శా కంపాంగుళిహస్తపద్మములు పిత్రాలాపముల్ పూర్వక్ష
ప్తాకోభద్రముగాఁగ నున్నదియొ లేదో వస్తు వన్నట్లుగా
నై కైఁదాఁకుట లొప్పఁ దల్లులు విచిత్రానందపాత్రంబులై. 371

చ. పుణికిన చెక్కిళుల్ వ్రతము పూరితిచేసిన మోదలోచనాం
గణ ఘృణిరంగవల్లులుగఁ గౌఁగిటబూని మఱింం గుమారు ల
క్ష్మణుని సుమిత్ర మైఁదడవి, కైఁగని, దండను రంగనాథు తో
రణ మది భద్రమై యునికి రంజితతృప్తమనస్క యౌచునున్. 372

ఉ. కైకయి సీతఁ గౌఁగిటికిఁ గైకొని యోసి యనుంగ! నీవుగాఁ
గైకొని యావనీచయనికామ నివాసభరం బిదెల్లనున్
లోకము నన్నుఁ దిట్టుటఁ దలోదరి! మార్చితి, కైక పంపెనే
కాక దశాననాదివధ కల్గనె యన్న ప్రశంసలోనికిన్. 373

వ. అంత మైథిలీకైకేయుల యన్యోన్యతయుఁ బరస్పరానుగంబును గలసి చరిం
చుటయుఁ జూచి జనంబు నివ్వెరబోవుచుండ. 374

క. ధరణీసుతఁ గన్గొనగా నరుంధతియు వచ్చుచుండె ననువార్తయు రా
శరవేగ చలితపత్రక సరోజనయనుండు రామచంద్రుం డనియెన్. 375

మ. మిథిలానాధకుమారి! నీకరుణ యున్మీలింపవే, తత్తపః
పృథుతేజఃఖనితో వచింపకువె తచ్ఛ్రేయోనిధానంబుతో,
నధరంబుం గదలింప కేగె ననసూయాదేవి, యీదేవి స్వా
ర్థధువౌ సర్వపతివ్రతానిలయ తేజస్స్ఫారవార్యాహమై. 376

గీ. అనిన జానకి పతి వామహస్త మూని మృదుల సంవాహనము చేసె హృదయమధుర
యంతలోన నరుంధతి యరుగుదెంచె నందఱును నామె చరణంబులందు వ్రాల.

ఉ. శీలవతీజగ త్పరమశేఖరితోగ్రతపోనిధానమా!
పాలితివాక్యతం దిరిగి వచ్చితి మమ్మ మహాసురోగ్రజం
బాలనదుల్ తరించి పరిపాలిత భక్తజనా! సనాతనీ!
వ్రాలితి నీపదాబ్జములపైని తపోగ్ని ననుం గ్రహింపవే. 378

ఆ. కోర్కి కొలఁది మీకుఁ గోడంట్రికము సేయఁ దిరిగివచ్చినాను దేవతాక్ష
తి! తపోగ్ని! మీరు గృపచేతఁ బాలింపుఁ డమ్మ నన్ను సత్కృపాబ్ధు లగుచు.

వ. చరణంబుల వ్రాలిన జానకీదేవి నరుంధతిలేవనెత్తి, తపోగ్నియు నింధనాగ్నియు లోకాగ్నియు నని యుత్తమమధ్యమాధమమ్ములు మూఁడగ్ను లధమాగ్ని కధి కారిలేఁడు , నీకు సర్వతోరక్ష యగుఁ గాకయని ప్రత్యవాయభీతిఁదిరిగిచనిన, నందఱుఁ బుష్పకంబుపై నయోధ్యకు బయలుదేరిన. 380

సీ. పీయూరిజనముల నాయూర దిగుఁడన్న దిగ రయోధ్యకును నేతెంతు మంచు
నంద రయోధ్యలో నవతరించినయంత నలుబదియేండ్ల క్రిందట మహోశ్వ
మేధంబునంబోలె వీధులన్నియును జనాళితోఁ గిటగిట లాడిపోయె
నొక మహానంద మహోదధి వోలిక కెరటమ్ము లట్లు లూగిరి జనంబు
గీ. మూఁడు పట్టణములు ముప్పదివేల గ్రామములు సేతుశీత మహీధరాంత
శైలకాననములు సాకేతమునయందు నిఱుకుకొనుచుచుండి యిఱుకుపడరు.

శా. చెల్లెంద్రుఁన్ ధరణీకుమారికను దర్శింపంగ నేతెంచుచున్
జెల్లింపం దొలిగౌరవమ్ములను దాక్షిణ్యైకవారాశి సం
ఫుల్లాబ్జేక్షణ సీత కౌఁగిళులలోఁ బూనెన్ బరివ్రశ్నలన్
దల్లీతండ్రుల వార్తలం దెలిసి మోదంబందె లోనెంతయున్. 382

క. అనసూయ క్రుచ్చి యిచ్చిన ననదండలు వారికిచ్చె ననబోడి ధరా
తనయ, కనకంపుహరిణము కొనితెచ్చినమణులు పుణికికొనియిచ్చినటుల్. 383

గీ. ఊర్మిళాసౌధములయందు నొక్కనాఁడు సరస సంగీతనాట్య సుస్వనము లొలసె
నల గవాక్షంబులందుండి యరుగుదెంచెఁ గడు నవాగురుధూపరేఖలును బోలె.

ఉ. రాజిత పద్మబంధుకుల రాజకుమార మనోజ్ఞ వేషుఁడై
భ్రాజితమూర్తి మత్తగజరాజు విధంబున గాలిచేతఁ జా

డాజట లెంత తైలపుఁగడంకకు లొంగక లేచుచుండె హే
లాజితమన్మథుం డగుచు లక్ష్మణుఁ డేగెఁ దదీయసౌధముల్. 385

ఉ. ఊర్మిళవౌదు మోహ మనునూర్మి నొసంగెదు నెందుగుండెలోఁ
గూర్మి సృజించుచుంటి వనఁ గోమలి యిట్లనె, నంతయన్న కే
కూర్మి సృజింపఁగాఁబడిన కొండికవారికిఁ గల్గుటబ్రమా!
ధర్మముగాక మీయెదలఁ దాల్తురె కూర్ములు మీరు రాఘవుల్.

శా. చానా! యీపదునాలుగేండ్లును బ్రతీక్షాయోగముం బూనఁగా
నై నేనుంటి ననంగ లక్ష్మణుఁడు, హేమాంభోజపత్రాక్షి స్వా
మీ! నీకోసము నేను నాకొఱకు నీవిట్లుంటి మానందవా
ర్లీనాకరము రామచంద్రపదనాళీకాంత భృంగంబులై. 387

క. అన నొక్కరొకరు కౌఁగిఁటఁ గొని పరిమళగానమృదునికుంజములన్ ని
స్వనరహిత భృంగ భృంగీ సునిహితమూర్తుల విధానఁ జొక్కిరి యెదలన్. 388

గీ. పాదుకాదేవతాపూజఁ బ్రత్యహంబు సలుపుచుండఁగఁ బతి దానిసాధనము ల
మర్చుచుండుటయే నియమంబుగాఁగ నడచె మాండవి యీ పదునాలుగేండ్లు.

గీ. భరతుఁ డగ్నిప్రవేశ సంభరితభావుఁ డైన నాతనితోఁ దాను నగ్గిఁజొఱఁగఁ
గడఁగు నామెను బిట్టు ప్రెగ్గడలు నంత గడిపినా రయోధ్యకు నత్తగార్ల కడకు.

శా. వచ్చెన్ రాముఁడు, వచ్చి రాముడు భరద్వాజాశ్రమంబందునన్
బుచ్చెన్ వార్త యయోధ్యయెల్ల గదలెన్, బూఁబోండ్లుకోడండ్రు తా
రచ్చో నేగఁగ నత్త లీయఁగను లే దంగీకృతిన్ మూవు రు
ద్యచ్ఛాంపేయ పిశంగలోచన లయోధ్యాకాశముంజూచుచో. 391

గీ. పొలిచె నేన్గు తమ్మిమొగ్గ మిన్నునయందు నేలకొరిగి రేకపాళి విచ్చి
పచ్చ బంభరములు పదికోట్లు సాకేత మందు జుమ్ము జుమ్మమంచుఁ దిరుగ.

క. నిక్కు నవాగురురేఖల నక్కుల సౌధముల మల్లియల క్రొంబొదలై
పొక్కెడు కన్నుల మాండవి ప్రుక్కిన యెదతోడ గడపఁ జూచుచునుండెన్.

శా. లజ్జాముగ్ధముఖారవిందుఁ డయి హేలామోహనాకారుఁడై
హృజ్జాతాభినవాసమేషు శరవర్షిన్ భావనారూప సం
పజ్జీమూతము నత్తుకొన్న కనుబొమ్మల్ గాఁగనై నిల్చె మై
యుజ్జీవింగఁ గైకయీసుతుఁడు నోహో మాండవీదేహళిన్. 394

గీ. అరయ దేశాంతరం బేగి యరుగుదెంచె సరయ లోకాంతరం బేగి యరుగుదెంచె
నట్టి పతికౌఁగిటన్ సుఖమందె మూఁడు రెట్లుగా దేశ లోకాల మెట్లు దిగుచు.

వ. అంత శ్రీరామచంద్రునిచేత సమభ్యనుజ్ఞాతంబైన భరతుని ప్రార్థనంబుపొంటె శ్రీరామచంద్ర పట్టాభిషేకంబు నిర్ణయింపఁబడఁగా.

సీ. పనియున్న వారికిఁ బనియుండె లేనివారికి లేదు లేని వారికినిఁ బెద్ద
పనియున్న యట్టులఁ జనుచుండుఁ రిట్టట్టు తమతోన జరుగు సర్వ మనినట్టు
లశ్వమేధంబు పట్టాభిషేకంబును నప్పు డన్నము కోరి రఖిలజనులు
నిపుడు ఫలాకాంక్ష నెసఁగు సర్వజనంబు రామ మహోవృక్షరాజఫలము
గీ. చివురు లెండ నీడ లవిసిన మొయిళులు నొందు విరుగు శ్యామలోదకంబు
మంచు దమ్ము దినుసు మాఁగును జలికిని నెసఁగు నలువు సర్వఋతుఫలంబు.

గీ. వడి సముద్రాల నెగిరిరి కడలు చూచి రఖిలసాగర నదుల నీ రాహరింప
లెక్కయే కీశవీరావళికి రఘుకుల కైరవాప్త పట్టాభిషేకంబువేళ. 398

ఉ. కోరి వశిష్ఠహస్తగతకుంభ సముద్రనదీమహాంబువుల్
ధారగ రామమూర్ధకలితాల్పజటాగుహలన్ స్రవింపఁ జూ
డారతి నీలలోహిత జటావనులందునఁ జొచ్చుచున్న భా
గీరథినాఁ జనెన్ గృతయుగీనము ధర్మము వాస్స్వరూపమై. 399

సీ. అబ్జబాంధవ మండలాంతరంబున నుండి దిగివచ్చినది కరండిత మహస్సు
తొలి విరించి వినిర్మిత లసత్కిరీటాది మహితానుభావుఁడౌ మనువు తోఁచె
తొలిజీవులు సనాతనులు విభీషణముఖ్యు లతితరధ్యేయరూపాది యయ్యె
నయన మార్గాంత దృశ్యాసిత సౌదామనీమయ ప్రాదమధ్యనీరజంబు.
గీ. పరమమాణిక్యకేయూరవంతుఁడగుచు మకరకుండల మణిమయమకుటుఁ డగుచు
లలితవక్షస్స్థలీ వినీలమణి యగుచు శ్రీరఘుస్వామి పట్టాభిషిక్తుఁ డయ్యె 400

సీ. పుడమియనుఁగుకన్య తొడమీఁద గూర్చుండఁ గరమునఁ గ్రొందమ్మివిరి గ్రహించి
తమ్ములు మువ్వు రిద్దరి నద్దరిన్ గొల్వ వెండికజ్జులును సీవిరులు పూని
ముకుళిత హస్తపద్మండు కూర్చుండగా నంజనీసూతి పాదాంతికమునఁ
బంచాయతన ముండి ప్రభు వంజనీసూతి తనలోన సంలీనతను భజింప
గీ. శ్రీ వశిష్ఠాదు లెల్ల విచ్చిన విలోచనములఁ బరిచితధ్యానసంతతి వహించి
నలినహితునాటి సింహాసనంబునందు శ్రీరఘుస్వామి పట్టాభిషిక్తుఁడయ్యె. 401

వ. అంత జానకీదేవి కెలనఁ గూర్చుండ లక్ష్మణ భరత శత్రుఘ్నులు సముచితాసనంబుల నుండ శ్రీరామచంద్రుండు జాంబవత్సుగ్రీవాంగద విభీషణ నల నీల మైంద ద్వివిద సుషేణ దధిముఖాదుల కెల్లరకుఁ గనకాంబరమ్ములు మణిభూషణంబులు ముక్తాహారంబులాది నాత్మప్తి నొసంగి రాజ్యంబు నందలి వృద్ధులకు నధికారులకు ప్రకృతులకు ననేక బహుమానంబు లిచ్చి వేదపఠన వీణాగాన నాట్యములచేత సంతోషించి. 402

చ. కనిన మరుత్తనూజునకు కానుక లీయనె లేదటన్న ల
క్ష్మణునకు నీయ లేదనిన స్వామికిఁ దమ్ముఁ డతండటన్న నీ
యనయును దమ్ముఁడే యనినయట్టుల స్వామియుఁ జూచునన్నఁ ద
మ్మునివలె నేల, తానువలెఁబొల్చునఁ జూచు నటన్న మాటలై.

క. తనర సభ పూర్తి యైనను జనములు కదలరు మఱంత జానకి సితలో
చన శితయోజన నితిభాజన మారుతివంకఁ గంచు స్వామిం గంచున్. 404

క. తన మెడలోపలి హారంబును మారుతిఁ గాంచె రామమూర్తిం గాంచెన్
వనజనయను నయనవనజ మినకరసంస్పర్శఁ బోలె నెసకము గాంచెన్. 405

సీ. జనకభూమిపతి దశరథభూమిపతియుఁ గలిసి చేయించిన కనకమయము
ముప్వురురాణులు మూఁడుమూళ్ళగ గూళ్ళమలయించిచేసినమణిమయమ్ము
చెల్లెండ్రు ముప్వురు జిగినీల రాళ్ళిచ్చి నెఱి మధ్యఁ బొదుగు మాణిక్యమయము
రాముండు కొక్కెముల్ రా జాలరుగ వ్రేల కోమలింపించు ముక్తామయంబు
గీ. అసుర కొనిపోయి నప్పుడునైన గళము నందు నెడపని ప్రేమమయంబు హార
మాంజనేయుని కంఠము నందు నుంచె జానకీదేవి పరమవాత్సల్యమూర్తి. 406

వ. అంత సభయంతయు జయజయ మరుత్తనూజ విదేహరాజతనూజ జయజయ దశరథరాట్తనూజ యంచు నఱచుచు సభ నుండి లేచి నిష్క్రమించిన జనులకు నాంజనేయుఁడన్నచోఁ గల గౌరవాభిమానములకు సీతా రామ లక్ష్మణు లెంతయో సంతసించిరి. తరువాత నెల తిరుగక మున్న సీత గంగా యమునా న్యగ్రోధమ్ముల మ్రొక్కుల సెల్లించె, నెలనాళ్ళ మహోత్సవంబులు జరిగె, నంత శ్రీరామ చంద్రుడు లక్ష్మణునకు యౌవరాజ్యమిత్తు నన నతఁ డంగీకరింపమి భరతుని యువరాజుం జేసి శత్రుఘ్నుని సర్వసేనాపతిఁజేసె. మఱియు సుగ్రీవవిభీషణులకును జాంబవదంగదాది సర్వసేనాపతులకు, గానుక లిచ్చి నూత్నాంబరము లిచ్చి కోరిన వన్నియునిచ్చి వేరిని వారి యిండ్లకు బంపె నంత సీతారాముల జీవిత మను సంవత్సరకాలంబున శరత్కాలంబు ప్రాపించి. 407

సీ. జనములయొక్క రక్షాసాధువు లెడంద లందు లేయెండలు కందళింప
సీతామహాదేవి చేతోవియద్వీధి నమృతమధుజ్యోత్స్న లందగింపఁ
ధర్మాభిరతులైన ధారణీ ప్రజలందు ననఘసస్యంబులు నవఘళింప
నన్యోన్యగౌరవాభ్యర్చనారూపమై ధర సన్నగాలులు తుఱగలింప
గీ. నొరయు నాపదలను నొండువిరిగిపోయి సారమతులూహవాహినుల్ తేరుకొనఁగ
మొగి శరద్వేళ శాశ్వతమ్ముగను నిల్చె రామచంద్ర మహాస్వామి రాజ్యమందు.

ఉ. ఈగతి రామచంద్రుఁడు మహీతలముం బదివేలయేండు ల
ద్దాగతి నేలుచుండఁగను ధారణియందున రామరాజ్య మం
చాగతి సర్వకాలమున యందుఁ బ్రశస్తి సముద్భవించెఁ గా
లాగురుధూమరేఖ సితమై దెసలందున వ్యాప్తి గన్నటుల్. 409

ఉ. ధాత్రిజనుల్ ధరాపతిని దైవముగాఁ గనుచుండ్రు రిక్థచా
రిత్రు లయోధ్యలోఁ బ్రజలు, శ్రీపతి రాముని బ్రహ్మవస్తువున్
ధాత్రిపతిం బురాత్తసుకృతంబునఁ బొంది సధర్ములై యిహా
ముత్రఫలంబులం గనిరి పున్నెముగానిపథం బెఱుంగకన్. 410

వ. ఇట్లు విశ్వనాథవంశ్యుండు శ్రీపార్వతీశోభనాద్రిగర్భంబు సత్యనారాయణ
ధేయుండు జగదనిత్యత్వభావనానిరతుండు నిరంతరదైవచింతనాపరుండు
మాయణకల్పవృక్ష మను నిమ్మహాకావ్యంబు యుద్ధకాండంబు పూర్తిచే

శా. సద్యోనిర్గత మైన సర్వకవితాసంభారమున్ నీకు నై
వేద్యం బిచ్చితి రామచంద్ర! ప్రభువా! విశ్వాసముం బూనవే
యాద్యంబై చను జీవలక్షణము సంహారంబు గావింపవే
హృద్యంబై చను నీదు తేజమును పారింపంగదే గుండియన్.

ఉ. నీలగళా! రఘూత్తముఁడు నీవును నిద్దఱు కానియట్లుగా
నోలి భజించితిన్ మఱియు నున్నదినంబులు నట్లె చేసెదన్
వ్రాలెదు మేను దాఁక నభవా! బ్రదుకైన వికారభావనా
జాలము తప్పకున్నఁ దుదిజన్మగఁ జేయుము దీని ధూర్జటీ!

గీ. లేని కోపంబు వీరికై పూనుచుండి లేని కామమ్ము వీరికై పూనుచుఁ
కృతకమయ్యెన యీ బ్రదుకెల్ల వల్లరీమనోజ్ఞ జటా శశభృచ్ఛలాటు!

చ. కల వొక కొన్ని వేళలు నికామభవత్పదచింతనానలో
జ్జ్వలితశిఖాసనాథములు స్వామి! ననున్ మృతిఁబొంద నీవె యు
జ్జ్వల మగు తన్నిమేషమున జన్మ యికొక్కఁడు లేకయుండ వి
హ్వల కరణాభితప్త మయినట్టి జనుస్సులు చాలు ధూర్జటీ!

పృథ్వి
నిరుద్ధ జగదర్ణ వోన్మథన నిర్గతోగ్రానల
ప్రరూఢ పరితశ్శిఖావలయు బద్ధకంఠస్థలీ!
సరోజశరదుష్క్రియా దమనజాత రోషోజ్జ్వల
న్నిరూఢ పరతశ్శిఖావలయనేత్ర ఫాలస్థలీ!

మంగళమహాశ్రీ.

చిత్తజతనూభసిత శేఖరితరేణుపరిశీర్ణ నిచయ స్నపితభావా!
మత్తగజదైత్య గళమంథరనవాస్రగతిమంజుల తనూకలితహేలా!
వృత్తదళముక్తితరు విస్ఫుటితభక్తిఫల విద్యుతిత మోదరసరూపా!
ప్రాత్తనిజధర్మచయరక్త జనతాకృతిపరంపరిత మంగళమహాశ్రీ.



ఓం త త్స త్.